# కదంబం

( రచయిత్రుల కథల సంకలనం)






సఖ్యసాహితి ప్రచురణ
హైదరాబాదు.

# కదంబం

రచయిత్రుల కథల సంకలనం

సఖ్య సాహితి మొదటి ప్రచురణ

మార్చి 1996 

**వెల : రూ.48/-**

ముఖ చిత్రం : **శీలా వీర్రాజు గారు**

**Sole Distributors :**
**Navodaya Book House**
Opp. Arya Samaj Mandir,
Kachiguda X Roads,
Hyderabad - 500 027.

**Typesetting & Printing :**
*Ajay Prints*,
2-1-388/3, Opp. Fever Hospital,
Beside Suman Chit Fund,
Nallakunta, Hyderabad - 500 044.
Phone : 66 33 00

# మా మాట

ఒక ఆశయం సిద్ధించాలంటే - తగినంత స్పందన, ప్రేరణ కలిగి నప్పుడే - అది సాధ్యమవుతుంది!

ఈనాడు సాహిత్యం సమాజం పైన బలమైన ప్రభావం చూపుతోంది. కనుక సాహిత్యం సమాజంలోని మంచి చెడులను, కళ్ళకి కట్టినట్టు చూపే దర్పణం అని చెప్పాలి. మంచిని పెంచి సమాజ శ్రేయస్సుకు దోహదం చేసేది సాహిత్యం!

ఇటీవల రచయిత్రులలో కలిగిన ఇటువంటి ప్రేరణ, స్పందన వలన ''సఖ్యసాహితి'' ఆవిర్భవించింది! ఇది తెలుగు రచయిత్రుల సంస్థ!

రచయిత్రులంతా సంఘటితులై ఒక వ్యక్తిగా కాక సమిష్టిగా కృషి చేయాలని అనేక ఉత్తమాశయాలను ప్రోది చేసి, ''సఖ్యసాహితి'' సంస్థని స్థాపించాం! తద్వారా తమ సంకల్పాలకు పునాదులు వేసి, ఆ పునాదులపై బంగారుభవితవ్యం నిలపాలనీ సాహిత్యం పచ్చగా బ్రతకాలన్నదే ''సఖ్యసాహితి'' ఆశయం!

సంస్థ స్థాపించి నప్పటి నుండి ఎన్నో కార్యక్రమాలు నిర్వహించి సాహితీ సమావేశాలను, ఇష్టాగోష్ఠి, చర్చా కార్య క్రమాలను విజయవంతంగా నిర్వహించాం! ఈ పరంపరలో ఒక అధ్యాయం పుస్తక ప్రచురణ.

ఇదిగో ఇప్పుడు ఆ అధ్యాయం తెరచి చూపిస్తున్నాం ఎందరో రచయిత్రులంతా కలసి తమ తమ రచనల్ని సంఘటిత పరచి, ఆ తరం నుంచి ఈ తరం వరకు ఉన్న రచయిత్రుల రచనల మేలు కలియక ఇది. అనేక కోణాలనుండి ఎన్నోరాగాలాపనలతో, విభిన్న దృక్పథాలను, విప్పిచూపించే ఈ కథా సంపుటి తెలుగు పాఠకులకు అందిస్తున్నాం!

ఈ అపూర్వ సమ్మేళనం నవరసాల కలయిక, నవరాగాల మేళవిక! సమాజంలోని పరిస్థితులు, మారుతున్న విలువలు, ఎదుర్కొంటున్న సమస్యలు, ఎన్నో ఎన్నో కలబోసిన కథామాల ఇది! సాహితి వేదిక యైన సఖ్యసాహితి అందిస్తున్న కరదీపిక ఇది. ఈ వెలుగు రేఖ నిరంతరంగా సాగి ప్రజ్వలిస్తుందని మా ఆకాంక్ష. అందుకే అందిస్తున్నాం పాఠకులకు ఈ అమూల్య అక్షర తూణీరం.

సఖ్యసాహితి

తెలుగు రచయిత్రుల సంఘం.

# విషయ సూచిక



# సత్ - చిత్ - ఆనంద్

డా. వాసిరెడ్డి సీతాదేవి

అది సంధ్యాసమయం

శంకరానందులవారి ఆశ్రమం

ఆకాశం నుండి నీలి వర్ణం, అశ్వత్థ, నారికేళ, వటవృక్ష శాఖలను చీల్చుకుంటూ కిందకు జాలువారుతోంది.

ఎంతోకాలంగా అక్కడ జరిగే పాపపుణ్యాలకు మౌనసాక్షుల్లా నిలిచివున్నాయి ఆవృక్షాలు.

విశాలమైన ఆవరణ, రెల్లుగడ్డితో కప్పిన కుటీరాలు దాదాపు ముప్పయ్ వరకూ వుంటాయి. ప్రతి కుటీరం మీదకూ పూలతీగెలు పాకిఉన్నాయి.

ఆ కుటీరాలకు పెడగా, పూల మొక్కల మధ్యగా వున్న భవనం శంకరానంద స్వామి వారిది. అది ఆలయ ఆకారంలో ఉంది. దాని పేరు ఆనంద నిలయం. ఆ భవనానికి ఇరుపక్కలా, అదే ఆకారంలో రెండు చిన్న భవనాలు ఉన్నాయి. అవి రెండూ ఒకే సైజులో కవలపిల్లల్లా వున్నాయి. వాటిలో శంకరానందుల వారి ప్రియశిష్యులు చిదానందులూ, సదానందులూ ఉంటున్నారు.

సదానందులవారు, పూర్వాశ్రమంలో ధనిక భూస్వామి. సంతానం లేదు. భార్య చనిపోయింది. సంతాన యోగం లేదని డాక్టర్లు చెప్పారు. గుంట దగ్గర నక్కలా తన చావుకు ఎదురు చూస్తూకూర్చున్న దాయాదులకు బుద్ధి చెప్పాలనుకొన్నాడు. మొత్తం ఆస్తి దానధర్మాలకు ఉపయోగించి తను సన్యాసం పుచ్చుకొన్నాడు. శంకరానందుల స్వామివారి ఆశ్రమం చేరుకున్నాడు.

చిదానందుల వారు గత చరిత్రలో ఒక మిల్లు యజమాని. పెద్ద కుటుంబానికి వారసుడు. వ్యాపారంలో కొంత నష్టం వచ్చింది. ఐ.పి. పెట్టేసి, మిగిలిన ఆస్తిపాస్తులు భార్యాబిడ్డలకు అప్పగించి ఆశ్రమ జీవితాన్ని ఆశ్రయించాడు.

సదానందుల వారికీ, చిదానందుల వారికీ కూడా ప్రియ శిష్యులు ఉన్నారు. ఒకడి పేరు సత్తు. సదానందుల వారి ప్రియ శిష్యుడు. మరొకడి పేరు చిత్తు. చిదానందుల వారి ప్రియతమ శిష్యుడు. వారికి ఆ పేర్లు సాక్షాత్తు శంకరానంద స్వాములవారే పెట్టారు. వారిద్దరూ తమతమ గురువుల భవనాల్లోనే వుంటూ వారి సేవలు చేసుకుంటున్నారు.

ఆ రోజున

ఆ సాయంసమయాన

శంకరానందస్వామివారి దర్శనార్థం వడ్రంగి మల్లయ్య ఆశ్రమానికి వచ్చాడు.

వస్తూ వస్తూ తన పనితనమంతా ఉపయోగించి నగిషీలు చెక్కి తయారు చేసిన పావుకోళ్లు రెండు జతలు పట్టుకొచ్చాడు. వాటిని స్వామి వారికి సమర్పించి తరించాలనేది తన చిరకాల వాంఛ అని చెప్పాడు. ఆవాంఛను నెరవేర్చుకోవడానికే వచ్చానని చెప్పాడు. కాని మల్లయ్యకు స్వామివారి దర్శనభాగ్యం లభించనేలేదు. మనసు చిన్నబుచ్చుకున్నాడు. సత్తూ, చిత్తూ పోటీలు పడి అతడిని ఓదార్చారు. ఆయన తర్వాత ఆయనంతటివారు, ఒకరు కాదు, ఇద్దరున్నారని తెలుసుకుని ఊరట చెందాడు వడ్రంగి మల్లయ్య.

ఆమాటకొస్తే స్వామివారి దర్శనం ఎల్లవేళలా అందరికీ లభించదని తెలుసుకున్నాడు.

తపోనిష్ఠా గరిష్ఠులైన శంకరానందుల వారి దర్శనం సామాన్యులకు దుర్లభం. సంవత్సరంలో ఒక్కరోజు మాత్రమే, భక్తకోటికీ, పామరజనానికీ, శిష్యగణానికీ దర్శనం లభిస్తుంది. కానీ గత మూడేళ్లగా ఆదర్శనం కూడా లభించడం లేదు. కారణం ఎవరికీ తెలియదు.

ఆపరమ రహస్యం ఆయన ప్రియశిష్యులైన సదానందులకూ చిదానందులకూ తప్ప మరో ప్రాణికి తెలియదని ఆశ్రమ వాసుల అభిప్రాయం.

శంకరానందస్వామి వీరిద్దర్నీ ఉప పీఠాధిపతులుగా అంగీకరించారు. కాని వీరిద్దరిలో తన పీఠాన్ని అధిష్ఠించే అర్హత ఎవరికి వుందో వారింకా నిర్ధారించుకోలేదు.

కాషాయవస్త్రాల్లో యువకులు, వృద్ధులు, గడ్డాలు జడలు కట్టిన జుట్టులు, పెరిగిన గోళ్లు దర్భలు, విభూతి, పురాణపఠనం, వేదఘోష, పులిచర్మాలు, జింకపిల్లలు, పక్షుల కలకలారావాలు, సందర్శకుల సందడి ఇదీ ఆశ్రమ వాతావరణం.

అహాన్ని చంపుకొని, ఐహికాన్ని ఆముష్మికం కోసం త్యజించి, నశ్వర శరీరాన్ని పరమాత్మ సేవకు అంకితం చేసి సదానందులూ, చిదానందులూ ఆశ్రమవాసుల అంతరంగాలను దోచుకున్నారు.

శంకరానందస్వామి వారి మహాసమాధి తర్వాత ఆ పీఠాన్ని అధిష్ఠించే అర్హత ఆ ఇద్దరిలో ఎవరికి ఉంది అనేది ఇటీవల ఆశ్రమ వాసుల్లో తలెత్తిన పెద్ద ప్రశ్న. కాని ఆమాటపైకి అనే సాహసం ఎవరిలోనూ లేదు.

మూడేళ్లగా శంకరానందుల దర్శనం లేదు. కారణం తెలియదు. ఆశ్రమాన్ని దర్శించడానికి విచ్చేసిన భక్తులు వీరిద్దరిలో ఎవరిపాదపూజ చేసి తరించాలో అర్థంకాక అయోమయంలో పడిపోతున్నారు.

సందర్శకులలో బయలుదేరిన ఈ సందేహం ఆశ్రమవాసుల మనసుల్లో ప్రవేశించి పురుగులా తొలచసాగింది.

ఆశ్రమ జీవితంలో అలజడి బయలు దేరింది. గుసగుసలు ప్రారంభం అయ్యాయి. ఆవాతావరణం ఆశ్రమవాసుల మనసులను అశాంతికి గురిచేస్తున్నది.

శ్రీశ్రీసదానందులవారూ, చిదానందులవారూ మాత్రం ఈతుచ్ఛమైన కోరికలకు అతీతంగా నిర్వికారంగా, ప్రశాంతంగా ఉంటున్నారు.

శంకరానందులవారి పీఠాన్ని ఆక్రమించుకొనే అధికారం సదానందులవారిదేనని కొందరంటే, కాదు చిదానందులవారిదేనని మరి కొందరు అంటున్నారు. పాదపూజ స్వీకరించే అర్హత సదానందులకే ఉందని సత్తు అభిప్రాయపడితే, కాదు ఆ అర్హత చిదానందులవారికే వుందని చిత్తు అభిప్రాయపడుతున్నాడు.

చివరకు ఈ అభిప్రాయ బేధాలు, వాదోపవాదాల రూపం ధరించాయి. అది అంతటితో ఆగలేదు. చూస్తుండగానే ఆశ్రమం నిలువునా రెండుగా చీలిపోయింది.

ఆశ్రమ వాతావరణం ఆముష్మిక వైరంతో కలుషితం అయిపోయింది. లుకలుకలు బయలు దేరాయి.

సదానందులవారి అనుచరులకు, వారి ప్రియశిష్యుడు సత్తు సారధ్యం వహించాడు.

అలాగే చిదానందుల వారి శిష్యగణానికి చిత్తు నాయకత్వం వహించాడు.

శ్రీశ్రీ శంకరానందస్వామివారు తమ తదనంతరం తమ పీఠం సదానందుల వారికే సంక్రమించాలని అభిప్రాయపడ్డారనీ, ఆ రహస్యాన్ని అప్పటికే ఆయన తమ గురువుగారి చెవిలో ఊదారనీ సత్తు బహిరంగంగానే ప్రచారం ప్రారంభించాడు.

అది విన్న చిత్తుకు చిర్రెత్తుకొచ్చింది. అతడూ తక్కువేమీ తినలేదు.య తమ గురువుగారైన చిదానందుల వారే ఆ పీఠానికి అర్హులనీ, వారికే ఆ పీఠం ఇవ్వడానికి నిర్ణయం తీసుకున్నామనీ తన ముందే తమ గురువుగారితో సాక్షాత్తూ శివానందుల వారే చెప్పినట్టు ప్రచారం సాగించాడు.

ఇరు పక్షాల ప్రచారం ఊపు అందుకుంది.

దీంతో ఆశ్రమ సందర్శకులు ఇరుకులో పడిపోతున్నారు.

ఇద్దరిలో ఎవరికి పాదపూజ చెయ్యాలో నిర్ణయించుకోలేక సతమత పడిపోతున్నారు.

సత్తు, చిత్తుల బాధ భరించలేక కొందరు ఎవరికీ పూజ చెయ్యకుండానే తిరిగిపోతున్నారు.

కొందరు ఇంతదాకా వచ్చాక "ఏ పుట్టలో ఏ పాము వుందో ఎందుకైనా మంచిది" అని భావించి ఇద్దరికీ పాదపూజలు చేసి తేలికపడిన మనసులతో తిరిగి వెళ్తున్నారు.

ఏది ఏమైనా ఆశ్రమ వాతావరణం గాడిపొయ్యిలా కుమలకపోయినా మురుగుగుంటలా లోలోపలే కుళ్ళిపోతున్నది.

ఈ పరిస్థితుల్లో వచ్చాడు వడ్రంగి మల్లయ్య పావుకోళ్ళ జతలు తీసుకొని ఆశ్రమానికి. శంకరానంద స్వాములవారి పాదధూళి స్వీకరించి జన్మరాహిత్యం

పొందాలనే గంపెడాశతో వచ్చాడు. ఆ ఆశ నిరాశే అయిందని బోలెడంత బాధపడిపోయాడు. స్వామివారి దర్శన భాగ్యం లభించినందులకు కన్నీళ్ల పర్యంతం అయ్యాడు.

బాధపడిపోతున్న మల్లయ్యను సత్తూ, చిత్తూ పోటీలుపడి ఓదార్చారు. "మా గురువుల పాదపూజ చేసుకొని కైవల్యం పొందండి" అన్నాడు సత్తు. "మా గురువుల పాదధూళి స్వీకరించి జన్మరాహిత్యం పొందవయ్యా, మల్లయ్యా" అన్నాడు చిత్తు.

ఆయన తర్వాత, ఆయనంతటివారు ఒకరుకాదు ఇద్దరు ఉన్నారని తెలుసుకొని ఊరట చెందాడు వడ్రంగి మల్లయ్య.

తమ తమ ప్రియశిష్యులు వెంటరాగా సదానందుల వారూ, చిదానందులవారూ భక్తుల పూజలు స్వీకరించడానికి ప్రార్థనా మందిరానికి విజయం చేశారు.

ఇద్దరూ పక్కపక్కనే ఉన్న ఉన్నత ఆసనాల మీద ఆసీనులయ్యారు.

సదానందుల వారు భక్తకోటిని సంబోధించి అన్నారు :- "భక్తులారా! సామాన్య మానవుడికి మహామాయను జయించడం సాధ్యమయ్యేపని కాదు. అందుకు కఠోర సాధనా, దీక్షా కావాలి. ఈ శరీరం నవరంధ్రాలతో కూడిన తుచ్ఛమైన తోలుతిత్తి. ఐహిక వాంఛలకు దూరంగా వుండాలి. ఈర్ష్యాద్వేషాలకూ, సుఖదుఃఖాలకు అతీతంగా వుండాలి. అప్పుడే పశుప్రాయుడైన మానవుడి ఆత్మ, తనను చుట్టి వేసిన మహామాయ నుంచి విముక్తి పొందగలుగుతుంది. విముక్తమైన ఆత్మ, ఆ సత్ - చిత్ - ఆనంద స్వరూపుడైన భగవంతుడి సాన్నిధ్యాన్ని చేరుతుంది. ఐహిక సుఖాలనుంచి విముక్తమైన ఆత్మకు ఆముష్మిక పరమానందం లభిస్తుంది. అందుకే ముందుగా ఈ తుచ్ఛమైన వాంఛలనూ, ఈర్ష్యాద్వేషాలనూ జయించాలి." అంటూ అనర్గళంగా అర్థగంట ఆత్మ, పరమాత్మల గురించి బోధించారు.

ఆ బోధ పూర్తి అయీ, కాకుండానే చిదానందుల వారు అందుకొన్నారు :- "భక్తజనులారా! ఐహిక ప్రలోభాలకు లొంగకూడదు. అన్నింటికంటే భయంకరమైన ప్రలోభం స్త్రీ శరీరం. ఆ శరీరం ఒక పాపకూపం. ఆ కూపంలో ఒకసారి పడితే మళ్లీ పైకి రావడం అసాధ్యం. స్త్రీ శరారం కాముని నివాసం. ఆమె కళ్లల్లో విషం ఉంది. మాదక పదార్థం వుంది. ఆమె చూపుల్లో కోడె నాగులు ఉన్నాయి. వాటి కాటుకు దూరంగా వుండండి. అప్పుడే మీ ఆత్మ పవిత్రంగా వుంటుంది. పాపం అంటని ఆత్మ పరమాత్మ స్వరూపం. సచ్చిదానంద స్వరూపం. స్త్రీ శరీర ఆకర్షణలో పడి మీ ఆత్మను అపవిత్రం చేసుకోకండి. అది గ్రహించిన మా గురువులు ఈ ఆశ్రమంలో స్త్రీలకు స్థానం కల్పించలేదు." అంటూ స్త్రీ శరీరం ఎంత మురికి కూపమో వివరించి బోధించారు సదానందులవారు.

అంత వరకు భక్తుల మధ్య కూర్చుని గురువుల బోధల్ని ఏకాగ్రతతో విన్న వడ్రంగి మల్లయ్య లేచివచ్చి గురువుల ముందు ముకిళిత హస్తాలతో నిలబడ్డాడు.

గురువులిద్దరూ త్రుళ్లిపడ్డట్టుయి అతడ్నే కన్నార్పకుండా చూడసాగారు. ఏదోగుర్తు చేసుకోవడానికి ప్రయత్నించసాగారు.

ఇదేమీ గమనించని మల్లయ్య "స్వాములూ! ఈ భక్తుడు సమర్పించుకుంటున్న ఈ చిరుకానుకల్ని స్వీకరించి నన్ను తరింప చెయ్యండి." అని రెండు జతల పావుకోళ్లు వారిముందు వుంచి వెనుతిరిగి వెళ్ళిపోయాడు.

గురువులిద్దరూ తమతమ ఆలోచనల్లో వుండి అతడ్ని ఆశీర్వదించడం మర్చిపోయారు. అతడు వెళ్ళిపోగానే ఒకరి మొహంలోకి ఒకరు చూసుకున్నారు. ఇద్దరి ముఖాల్లో ఒకటే ప్రశ్న! పెద్దప్రశ్న!

మల్లయ్య సమర్పించిన పావుకోళ్లు శిష్యులతోపాటు గురువులను కూడా అమితంగా ఆకర్షించాయి. రంభనైనా చూచి చలించని ముని ముచ్చుల మనసులు ఆ పావుకోళ్లను చూచి చలించాయి.

ముందుగా సదానందులవారు ఆసనం దిగినవారై గంభీరంగా ముందుకువచ్చి పావుకోళ్లలో ఒక జత ధరించారు. సత్తూ మొదలుగాగల శిష్యపరమాణువులు వెంటనడవగా "రాజు వెడలె - రవితేజములలరగ" అన్నట్టు పావుకోళ్ళు లయబద్ధంగా టకటక శబ్దం చేస్తుంటే చిద్విలాసంగా చిరునవ్వులు విసురుతూ తమ కుటీరంకేసి నడిచారు సదానందులవారు.

చిదానందులు ఆసనం దిగారు. చిత్తు అప్పటికే రెండో జత పావుకోళ్లు తుడిచిపట్టుకొని సిద్ధంగా నిలబడిఉన్నాడు. గురువుగారి పాదాలకు స్వయంగా పావుకోళ్లు తొడిగాడు. చిదానందులు శిష్యగణం వెంటరాగా చిరునవ్వులు చిందిస్తూ ముందుకు అడుగులు వేశారు.

నాలుగు అడుగులు వేశారోలేదో చిదానందులవారు బిళ్లబీటుగా విరుచుకు పడిపోయారు. శిష్యులు అవాక్కయి శిలాప్రతిమల్లా నిలబడిపోయారు. చిత్తు తన మూర్ఖ తాను తెలుసుకున్నవాడై చివుక్కున గురువుగారి పక్కన కూలబడ్డాడు. అప్పటికే చిదానందులు లేచి కూర్చున్నారు పాదం పట్టుకొని. చిత్తు గురువుగారి పాదాల్ని గుండెలకు ఆనించుకొని నిమరసాగాడు. శిష్యగణం చుట్టూచేరి సపర్యలు చెయ్యసాగారు.

ఆయన అలాపడడం చూసిన సదానందుని శిష్యులు కొందరు ముసిముసిగా నవ్వుకుంటూ వెళ్ళడం, చిదానందుల వారి శిష్యపరమాణువుల్లో కొందరు చూశారు. కసిగా పెదవులు కొరుక్కున్నారు.

అసలు ఇంతకూ ఏం జరిగిందంటే - చిదానందులవారి ఎడం పాదం కింది పావుకోడు బెడిసి పక్కకు తప్పుకోవడంతో పాదం మడత పడింది. ఒక్కసారిగా విరుచుకు పడిపోయారు.

ఆ రెండో రోజున -

కిందటి రోజు జరిగిన అవమానంతో దహించుకు పోతున్న చిదానందులవారు ముందుగా లేచి పావుకోళ్లు ధరించి శిష్యగణం వెంటరాగా పావుకోళ్లు టకటకలాడించుకుంటూ పెద్ద పెద్ద అంగలు వేస్తూ తమ కుటీరంకేసి వెళ్ళిపోయారు.

అలా వెళ్తున్న చిదానందుల్ని సదానందులు జాలిగా చూశాడు. సదానందులు ఆసనం దిగి పావుకోళ్లు ధరించి శిష్యులకేసి చూస్తూ చిద్విలాసంగా నవ్వారు. ముందుకు

రెండడుగులు వేశాడో లేదో జర్రున జారి వెల్లికిలా పడిపోయాడు. ఎడంకాలు పావుకోడు ఎగిరి అల్లంత దూరంలో పోయిపడింది.

"ఇంకానయం ఎవరికీ తగల్లేదు" అనుకున్నారు పావుకోడు దెబ్బతప్పించుకున్న శిష్యులు.

చిదానందుల కంటే సదానందుల స్థూలకాయుడు. వెంటనే లేచి కూర్చోలేకపోయాడు. కొద్ది క్షణాలు పడ్డవాడు పడ్డట్టే నేలకరచుకొని వుండి పోయాడు. శిష్యగణం స్థాణువుల్లా నిలబడిపోయారు. సదానందులు లేవడానికి ప్రయత్నించాడు. కాని అతని శరీరం సహకరించలేదు. సత్తు గురువుగార్ని అపురూపంగా పట్టుకొని లేవదీసి కూర్చోబెట్టాడు.

చిదానందులవారి శిష్యులు కొందరు అది చూసి వెకిలిగా నవ్వారు. మరి కొందరు తిరిగి తిరిగి చూస్తూ వెళ్ళారు. అంతేకాదు చిదానందుల వారు కూడా శిష్యులతోపాటు వెనక్కు తిరిగి చూశారు. ఆయన పెదవులమీద హాసరేఖలు కన్పించీ కన్పించనట్టుగా కన్పించాయి. ఆ చిరుదరహాసం విషంపూసిన బాణంలా సదానందుని గుండెకు గుచ్చుకుంది.

దెబ్బతిన్న పులిలా సదానందులు తన కుటీరంలో అటూ ఇటూ తిరుగుతున్నాడు.

సత్తు గురువుగారు వదిలేసిన పావుకోళ్లను తీసుకొని మిగతా శిష్యగణంతో కుటీరంలోకి ప్రవేశించాడు. శిష్యుల్ని చూసిన గురువు పచార్లు ఆపి ఆసనం మీద కూర్చున్నాడు. శిష్యులు గురువుగారి పాదాల ముందు నేలమీద కూర్చున్నారు. తమ గురువుకు జరిగిన అవమానానికి క్రోధం వెళ్లగక్కారు. కొందరైతే ప్రతీకారం చేసితీర్తామని ప్రతిజ్ఞలు చేశారు. సత్తు మాత్రం మౌనంగా కూర్చున్నాడు. ఏదో ఆలోచనరాగా పావుకోళ్లను చేతుల్లోకి తీసుకొని తిప్పి తిప్పి చూశాడు.

"ఇవి మన గురువుగారివి కావు" పెద్దగా అరిచాడు.

"అవునవును" చూడకుండానే మిగతా శిష్యులు సత్తుకు వంతపాడారు.

"ఏవీ! ఇలా ఇవ్వు" సదానందులు సత్తు చేతిలోని పావుకోళ్లు అందుకొని పరిశీలించి చూశాడు.

ఎడంకాలు పావుకోడు మీద బొటనవేలు దగ్గిర వుండేపావు కొంచెం పెడగా ఉంది. అందువల్ల కోడు పక్కకు తప్పుకొంటున్నదనీ, పాదం మడత పడుతున్నదనీ అర్థం అయింది.

"అవును. ఇవి నిన్న నేను ధరించినవి కావు" అన్నారు గురువులు సాలోచనగా.

"అవును స్వామీ! నిన్న వారు ధరించినవి ఇవే. అందుకే నిన్న ఆయన పడిపోయారు."

"పొరపాటున చిదా, నా పావుకోళ్లు వేసుకెళ్ళినట్టున్నాడు" ఆలోచిస్తూ అన్నాడు సదానందులు.

"పొరపాటున కాదు గురువుగారూ! కావాలనే చేశారు. అందుకే ముందుగా లేచి వెళ్ళిపోయారు. నిన్న జరిగిన దానికి ప్రతీకారంగా ఇవ్వాళ ఆపని చేశారు. మిమ్మల్ని చూసి ఎలా నవ్వారో చూశారుగా! అసలు ఈ జిత్తులన్నీ ఆ చిత్తుగాడివే!"

"కావాలనే చేశాడంటావా సత్తూ!" అవునని మనసు చెబుతున్నా అడిగాడు సదానందులు.

"అవును గురూజీ! ఇంకా సందేహం ఎందుకు? అది కావాలని చేసిన పనే! పావుకోళ్లు టకటకలాడించుకుంటూ ఎలా నడిచి వెళ్ళారో చూశారుగా! నిన్న పడిపోయినవాడు అంత ధైర్యంగా నడవడం .... "

"ఆ గురువులు మిమ్మల్ని కావాలనే అవమానపర్చారు మోసంతో. చూస్తుండండి ప్రతీకారం ఎలా తీర్చుకుంటామో" అని శిష్యుల కంఠాలు ఒక్కసారిగా పలికాయి.

సదానందులవారు తొందరపాటు మంచిది కాదని శిష్యగణాన్ని హెచ్చరించారు.

ఆ రోజునుంచి సదానందులవారు మల్లయ్య ఇచ్చిన పావుకోళ్లను వాడలేదు.

చిదానందులు మాత్రం పావుకోళ్లను టకటకలాడించుకుంటూ తిరుగుతున్నారు. ఆ పావుకోళ్ల టకటకలు సదానందుల శిష్యుల తలల మీద సుత్తి దెబ్బల్లా పడుతున్నాయి.

చిత్తు సత్తుకేసి విజయగర్వంతో చూస్తూ భుజాలు ఎగరేసుకుంటూ తిరుగుతున్నాడు. సత్తుకు అరికాలు మంట నెత్తికి పాకుతున్నది. గురువులు మాత్రం ఏమీ జరగనట్టే నిర్వికారంగా ఉన్నారు.

రోజూ ప్రార్థనా మందిరంలో పక్కపక్క ఆసనాలను అధిష్టించి పాదపూజలు అందుకుంటున్నారు.

ఆరోజు కొత్త పావుకోళ్లు ధరించి శిష్యగణంతో ప్రార్థనా మందిరానికి బయలు దేరారు చిదానందులవారు. కుటీరం దాటి రెండడుగులు వేశాడో లేదో మళ్లీ ఎడంకాలి పావుకోడు పక్కకు తప్పుకుంది. అంతే! విరుచుకు పడిపోయాడు. మడం బెణికింది. పాదపూజకు అతికష్టం మీద శిష్యుల భుజాల మీద చేతులు వేసి నడిచి వెళ్ళారు కుంటుకుంటూ.

ఇంతకూ ఏంజరిగిందయ్యా అంటే -

ముందు రోజు రాత్రి అందరూ గాఢ నిద్రలో ఉన్న సమయం చూసి సత్తు చిదానందుల ఆశ్రమంలోకి పిల్లిలా జొరబడ్డాడు. పావుకోళ్లు మార్చాడు.

బెణికిన పాదం సలుపుతూ వుంటే, చిదానందులు అశాంతిగా ఆసనం మీద కూర్చొని వున్నాడు. కొత్తపావుకోళ్లు టకటకలాడించుకుంటూ చిరునవ్వులు చిందిస్తూ పాదపూజకు విచ్చేసిన సదానందుల్ని చూడగానే చిదానందుల ముఖం మసిపూసినట్టుగా నల్లబడింది. ఏంజరిగిందో గ్రహించాడు. వారి శిష్యపరమాణువుల తలలు అవమాన భారంతో వంగిపోయాయి.

చిత్తుకైతే మెడకాయ మీది తలకాయ ఎగిరిపోయినట్టే ఉంది.

సత్తు ఆనందం పట్టలేకుండా ఉన్నాడు. గురువుగారు పావుకోళ్లు వదలగానే ఒళ్లో పెట్టుకొని కూర్చున్నాడు.

గురువుగారు ఆసనందిగగానే పరిగెత్తుకెళ్ళి స్వయంగా వారి పాదాలకు తొడిగాడు.

అదిచూస్తున్న చిత్తు గుండెల్లో తాటాకుల మంటలు నాలుకలు చూచాయి.

కొన్ని రోజులు గడిచాయి.

ఇరుపక్షాల మధ్యా ఆముష్మిక వైరం విజృంభించింది.

సత్తు గురువుగారి పావుకోళ్లను కనిపెట్టుకొని వుంటున్నాడు. వాటిని క్షణం వదలడం లేదు. చిత్తు అవకాశం కోసం పొంచివున్నాడనే విషయం గ్రహించాడు సత్తు.

సత్తు వ్యవహారం చిదానందుల శిష్యులకు. ప్పుండును కెలికి కారం కూరినట్టుగా ఉంది.

ప్రశాంత తటాకం లాంటి ఆశ్రమ వాతావరణం చూస్తుండగానే అగ్నిగుండంలా మారిపోయింది. ఆ అగ్ని చల్లారకుండా ఇరుపక్షాలూ ప్రయత్నిస్తూనే ఉన్నారు. ఏదో రూపంలో ఇంధనం, సమిధలూ ఆ అగ్నికి అందిస్తూనే ఉన్నారు.

ఇరుపక్షాలవారూ ఈర్ష్యాద్వేషాలతో రగిలిపోయారు. వారి కళ్ళల్లో తేళ్లు అశాంతిగా కొండేలు ఎత్తుకొని తిరుగుతున్నాయి.

గుండెల్లో విషనాగులు బుసలు కొడ్తున్నాయి.

ఒకరోజు సత్తుగాడి పట్టు కేపీనం మాయం అయింది.

అది ఎవరి పని అయివుంటుందో గ్రహించాడు సత్తు.

ఆ సాయంకాలం ప్రార్థన ముగిశాక, తన కుటీరానికి తిరిగి వస్తున్న సత్తు రావిచెట్టు దగ్గర ఏదో చేస్తున్న చిత్తును చూసి ఆగాడు. రావి చెట్టు తొర్రలో దేన్నో కుక్కుతున్నట్టు అన్పించి ముందుకు వెళ్ళాడు. తీరా చూస్తే అది తన పట్టు కేపీనమేనని గ్రహించాడు సత్తు.

అంతే! చిరుతపులిలా చిత్తు మీదకు లంఘించాడు.

మోకాళ్ల వరకూ వున్న చిత్తు ధోవతిని లాగాడు. సర్రున చింపాడు అడ్డంగా. ముక్కలు ముక్కలుగాచించి అవతలకు పారేశాడు.

చిత్తు సత్తు ధోవతిలాగి, ఉండగా చుట్టి దూరంగా పొదల మీదకు విసిరేశాడు.

ఇద్దరూ కలబడ్డారు.

సత్తు చిత్తుకంటే బలంగా, పుష్టిగా వుంటాడు.

సత్తుగాడి దెబ్బలకు చిత్తుగాడు, చిత్తుగా చిత్తయిపోయిడు. చిత్తుగాడిని వెల్లకిలా పడేసి గుండెలమీద కూర్చొని పీకపట్టుకున్నాడు సత్తుగాడు.

చిత్తు కాళ్లూ చేతులూ ఆడిస్తూ 'కీచు కీచు'మని అరుస్తున్నాడు.

ఎటునుంచి వచ్చారో ఎక్కడినుంచి వచ్చారో రంగ ప్రవేశం చేశారు చిదానందులవారు. తన ప్రియ శిష్యుడిపై జరుగుతున్న దౌర్జన్యం కళ్ళారా చూశారు. సహించలేకపోయారు.

చేతిలో వున్న కమండలంతో సత్తు కణతలమీద బలంకొద్దీ బాధాడు చిదానందుడు.

అంతే! కెవ్వున అరిచి గింగిరాలు తిరిగి నేలకు కరుచుకు పోయాడు సత్తు.

చేతిలో తాటిమట్ట పట్టుకొని అప్పుడే రంగంలో ప్రవేశించిన సదానందుడు ఆదారుణ దృశ్యం చూశాడు. ఉగ్రరూపం ధరించాడు. తాటిమట్టతో చిత్తును చితకబాదాడు. స్పృహపోయేదాక కొడుతూనే వున్నాడు.

సత్తూ,చిత్తూ పక్కపక్కపడి ఉన్నారు.

ఇరువర్గాల శిష్యగణం బరిలోకి దిగింది.

చేతికి అందిన ఆయుధాలతో తలపడ్డారు.

అతిపవిత్రమైన ఆ ఆశ్రమ వాటికలో అశ్వత్థ వటవృక్షాల కిందగా రక్తపుటేరు ప్రవహిస్తోంది.

వెండివెన్నెల వెలుగులో ఎర్రటి మానవరక్తం వింతగా మెరుస్తోంది.

వాతావరణమంతా ఆహాకారాలతో భీతి కొలుపుతున్నది.

ఆ ఘోరకలిని చూడలేనట్టుగా చందమామ మబ్బుల చాటున ముఖం దాచుకున్నాడు.

ఎర్రటి రక్తంతో స్నానించిన నాలుగు పావుకోళ్లు నిర్లిప్తంగా, నిర్వికారంగా ఆకాశం కేసి చూస్తున్నాయి.

తెల్లవారి ఆశ్రమంలో కాషాయ వస్త్రాలకంటే ఖాకీ వస్త్రాలే ఎక్కువగా కన్పించాయి.

తెల్లవారేసరికే చిదానందులూ, సదానందులూ ఆశ్రమం నుంచి పరారయ్యారు.

అంతేకాదు పావుకోళ్లను సమర్పించిన వడ్రంగి మల్లయ్యకానీ, ఆ ఆశ్రమ వ్యవస్థాపకులైన శంకరానందులవారు గానీ మళ్లీ ఆ ప్రాంతాలలో కన్పించలేదు.

**(ఇండియాటుడే 21-8-94)**

# అయ్యొచ్చేడు!

ఐ.వి.యస్. అచ్యుతవల్లి

"ఆరుగంటల బస్సెల్లి పోనాది! ఇంకా మీ అయ్య దిగబడలేదేటి?" అంది నర్సమ్మ కూతురు అచ్చాలుతో. సంజవెలుగులు చీకట్లోకి ముసురుకుంటున్నవేళ గుడిసె ముందటి అరుగు మీద దిగాలుగా రోడ్డు వేంపు చూస్తూ కూర్చుంది.

రోడ్డుకి దిగువగా బాగా పల్లంగా వున్న మైదానంలో వున్నాయి వాళ్ల తాటాకుల ఇళ్లు. రోడ్డు మీద బస్సులు ఆపుతారు. "అంకంపల్లి రోడ్డు" అంటూ అరచి బస్సు తలుపు మీద దబదబబాదుతాడు కండక్టరు. అంకంపల్లి అరమైలు వున్నదనగా సిమెంటు రోడ్డు కటూ ఇటూ అయిదారు గజాల చుట్టుకొలతగల మానులతో గంగరావి చెట్లూ అవిసె చెట్లూ వున్నాయి. అంకంపల్లి రోడ్డు వచ్చేసరికి చల్లగా పచ్చటి పెళ్లిపందిరి క్రిందకు వచ్చినట్లు వుంటుంది బస్సులో వున్నవాళ్లకి. "నువ్వు దిగాలుపడబాకే అమ్మా! నాకూ గుబులు మొదలైతంది." అంది అచ్చాలు. దానికి పదహారేళ్లుంటాయి. క్రితం సంవత్సరం పెద్దది అయింది. దానికి కాపురానికి పంపటం కోసరం నర్సమ్మ భర్త యాదాయి రెండు సంవత్సరాలనించీ కష్టపడి డబ్బులు కూడపెడుతున్నాడు.

"గుట్టమీది నమ్మక్క అత్తారింటికి చీనారేకు పెట్టి అట్టుకెళ్లింది. ఆకుపచ్చాటి రంగు. పెట్టెమూత మీద గులాబిపూవు వుంది. అయ్యా! నాకోటి అట్టుకురా!" అనేది లచ్చాలు. "పెట్టెడు బట్టలున్నాయేటి నీకు! పెట్టె కొనాల్నంటె నలబయి ముప్పయి రూపాయలుండాల. అయ్యేట్టి చీనామిఠాయి పంపిస్తే అత్తంటికాడ ఘనంగా వుంటాది. రెండీశలు మిఠాయ కొనాలి. బెల్లంది బాగోదు. చీనా పనద్దార మిఠాయే బాగుంటాది. కంటికి జబరుగా ఆనుతాది" అనేది నర్సమ్మ. నర్సమ్మకి అచ్చాలు పెద్దకూతురు. దాని తర్వాత అయిదారుగురు పిల్లలు పుట్టి అక్కరకు రాకుండాపోయేరు. కడసారికి ఇద్దరు మగపిల్లలు మిగిలారు. వెంకటయ్య. చీనయ్య. "మిఠాయే కొనిద్దారి" అనేవాడు యాదాయి.

"అయ్యోవ్! నాను పెట్టె లేకుండా అత్తారి గడప ఎక్కేదిలేదు. నాదిరేసులన్నీ పెట్టెలోఎట్టుకుని తాళమేసుకోవాల. నాకూల్డబ్బులన్నీ డిబ్బీపిడతలో దాపెట్టినాను. అయిపెట్టినా పెట్టెకొనాల!" అనేది అచ్చాలు.

"రెండు చీరలు జాకిట్టు ముక్కలు నాలుగు. అల్లుడికి జామారు. చొక్కాయి గుడ్డ. రెండు తువ్వాళ్లు కొనాల. మొదటిసారి కూతుర్ని అంపకం పెట్టేటప్పుడు దరిజాగా కనపడాల. లేకపోత్తే పిల్లదాయిని నీరసంగా చూత్తారు" అనేవాడు యాదాయి. ఎకరం పొలం కౌలుకి తీసుకున్నాడు. తన పొలంపని కాక ఇతరత్రా కూలికి కూడా వెళ్లేవాడు. నర్సమ్మ, అచ్చాలు కూడా ఊడుపులప్పుడు కోతలప్పుడు కుప్ప నూర్పిళ్ళకు కూలి పనులకు వెళ్లేవారు. ఆ డబ్బులన్నీ మట్టి పిడతలో వేసి దాచవారు.

"కూతుర్ని అంపకం పెట్టేదెప్పుడు! గేదెదూడలా ఎదిగిపోతోంది!" అని దగ్గరి వాళ్లు హాస్యాలాడేవాళ్ళు. "ఏదో అన్ని జాగరత చేస్తున్నాము. నాలుగు డబ్బులు కూడేక పొలిం వెళ్ళి అన్ని కొనుక్కొచ్చి అంపకం పెట్టిస్తాను" అనేవాడు యాదాయి. ఒకరోజు రుసరుసలాడుతూ వచ్చింది నర్సమ్మ(వియ్యపురాలు) ఈరకత్తెవేరమ్మ! "ఏమల్లా! ఈడేరిన పిల్లదాయిని ఇళ్లల్లు కూకుండబెట్టుకున్నారు. తేరగా దాని కూలి డబ్బులన్ని మూటకట్టేదామనా! మీ అల్లుడు ఈకోతల్లోనయినా ఆడిబారియని అంపకం పెట్టకపోతే ఇంక విసయం పెద్దల్లో పెట్టెస్తానంటున్నాడు. ఆడు అటూఇటూ ఏమన్నా సేయితాలు చేసేడంటే మాము జబాబుదారీలము కాము. కోడెదూడ లాగున్నాడు మరి" అని ఎగిరింది వీరమ్మ! కోడలు కూలి డబ్బులు వీళ్ల ఖర్చుపెట్టేస్తున్నారని వీరమ్మ బాధ!

"ఈరమ్మప్పా! మన కుటుంబాలలో విసయాలు నీకు తెలనివి ఏమున్నాయప్పా! పిల్ల అదని ఇదని ముచ్చటపడుతున్నది. దానికి సొమ్ము జతచేస్తున్నాము. నాలుగు సరుకులు అమరగానే తీసుకువత్తాము" మరియాదగా అన్నాడు యాదయ్య. "కోతలు మొదలవకముంద మాకోడలు మా యింటికి రావాలి! మీరు చేయించే సరుకు సప్పరా మాకేమీ అక్కర్లేదు" అని ధాంధూం అంటూ ఎగిరెగిరిపడుతూ వెల్లింది వీరమ్మ. అప్పట్నించీ యాదాయి నర్సమ్మ రెక్కలు ముక్కలు చేసుకున్నారు. రెండు మేక పిల్లలుంటే వాటిని అమ్మారు. మట్టి పిడతలు పగులకొట్టేరు. అడుగు బడుగూ అన్నీ కలిపి నాలుగొందల యాభయి రూపాయిలు అయినాయి.

"పొలింలో ప్రతి సరుకు రెట్టింపు ధరలు చెబ్తారు. మావయ్యా! బస్తీపోదాం నడు. అన్నీ కొనుక్కొని రావచ్చును." అన్నాడు సీతయ్య కొడుకు అప్పలనర్సిమ్మ."రానూపోనూ పుంజీడు రూపాయిలు అయిపోతాయి బస్సు చార్జీలు!" అన్నాడు సీతయ్య.

"చారిజీలు అవితేమటుకేం! సరుకు నికార్సయినది దొరుకుతాది. ఉదయాన్నే ఎళ్లి మాపిటికి వచ్చేయొచ్చును" అన్నాడు నర్సిమ్మ.

"నీకు బస్తీ బాగా తెలుసురయ్యా! మామావయ్యని జాగరతగా తోలుకెళ్లి సరుకులు అన్ని కొనుక్కొనిబేగారండి" అంది నర్సమ్మ.

"మామూ వొత్తమయ్యా! సరదగ తిరిగొద్దారి ఓతూరి" అంటూ ఇంకా ఇద్దరు ఇరుగుపొరుగు యువకులు బయలుదేరారు. బస్తీ పదిమైళ్లుంటుంది. అడ్డతోవన కోసుడు

దూరంలో పాలిం వున్నది. అక్కడ అన్ని సరుకులూ దొరుకుతాయి. వారానికి పదిరోజులకు అంకంపల్లి వాళ్లంతా పాలింకు వెళ్లి సామాన్లు అన్నీ తెచ్చుకుంటూ వుంటారు. నర్సిమ్మ బస్తీలో రెండు మూడేళ్లు రిక్షా బండి తొక్కుకునేవాడు. ఈమధ్య ఆరోగ్యం బాగాలేక తండ్రి వద్దకు వచ్చివుంటున్నాడు. పొలంపనులు చేసుకుంటున్నాడు. యాదాయి తిరుగుమోతూ తాగుబోతూ కాడు. కష్టపడి పని చేసుకుంటాడు. కలోగంజో వున్నదానితో తృప్తిగా బ్రతుకుతూ వుంటాడు. నర్సమ్మ కూడా చాలా సాదాసీదా మనిషి! తొలిరోజు రాత్రికి రాకపోయినా నర్సమ్మ దిగులుపడలేదు. 'వెళ్లక వెళ్లక జన్మకు శివరాత్రిలా బస్తీకి వెళ్లాడు. సిన్మాలేవో చూస్తూ కాలక్షేపం చేసి వుంటాడు!' అనుకొంది. మరునాడు సాయంకాలం బస్సుకు కూడా రాకపోయేసరికి నర్సమ్మకి దిగులు ఎక్కువయింది.

"ఏటి అచ్చిదానా! మీ అయ్య డబ్బుకాని పారేసుకోలేదుగందా!" అంది నర్సమ్మ కళ్లు తుడుచుకుంటూ.

"అట్టా గనబోకే! ఇంకా ఎవురూ రానేదు గందా! నైటుబండికొత్తాడేమో!" అంది అచ్చాలు.

"నైటుబండికిరాడు. సీకట్లో బయలెల్లడు. ఇంక పొద్దుటె రావాల!" అంది. వెంకటు, చీనయ్య గెంతుకుంటూ వచ్చారు. వాళ్ల చేతుల్లో అడుగు పొడుగున్న చెరుకు గడ ముక్కలున్నాయి.

"నాకీరా ఒకటి!" అంది అచ్చాలు. ఇద్దరు చెరిసగం ముక్కలు చేసి తల్లికొకటి అక్కకొకటిఇచ్చేరు.

"ఆరుగంటల బస్సుకి అయ్యరానేదేటే!" అన్నారు వాళ్లు. "మీకు అయ్యో, అయ్యో గోలే పట్టుకున్నాదీ! ఎల్లిన పన్లు చేసుకోకుండా ఎట్టగొత్తాడు!" అని కసిరింది అచ్చాలు. దానికీ మనసులో పీకుతూనే వుంది. ఆకుపచ్చ రంగు సీనారేకు పెట్టెలో తన బట్టలు, డబ్బులు, జడకుచ్చులు, గిల్టునల్లపూసల గొలుసు, పౌడరు డబ్బా పెట్టుకున్నట్లు కల కూడా వచ్చింది.

"ఎల్లిన్నాడే పారొస్తాననాన్నాడు గందా! బోలెడన్ని సరుకులు కొంటానన్నాడు!" అన్నాడు వెంకటు.

"జత ఇత్తడి బిందెలు. చీరీ జాకిట్టు బట్టలు. పనద్దారమిటాయిలు. అర్టిపళ్లగెలా, కొబ్బరికాయిలూ ఇంకా ...."

"మరిగంటె నాకు నిక్కరూ జోబీ చొక్కాయి కొంటానన్నాడు" అన్నాడు వెంకటు.

"బట్టలు నాకూ తీత్తానన్నాడు. సిన్మలోలాంటి "బలీను" తీత్తానన్నాడు. బస్తీలో ఆది రొండ్రూపాయిలట! సీతయ్య తాత చెప్పాడు" అన్నాడు చీనయ్య.

"నాకు గొబ్బిరుండలు కారపూ పెస తెమ్మన్నాను అయ్యను. కొంటానన్నాడు"

"నాకు మైసూరుపాకం జిలాబీ తెమ్మన్నాను. తెస్తాను అన్నాడు." ఇద్దరూ వాళ్ల వాళ్ల కోరికలు తీరబోయే తరుణం కోసం ఎదురుచూస్తున్నారు. చుక్కల్లోంచి నల్లటి ఆకాశం లోంచి పౌర్ణమి వెళ్లిన బహుళ పంచమి చంద్రుడు దొంగలా వస్తున్నాడు. చిన్న బుద్ధి

దీపం వెలిగించి అరుగుమీద పెట్టింది అచ్చాలు. పిల్లలిద్దరూ నులకమంచం గుడిసె ముందుకు లాక్కుని అడ్డం పడ్డారు.

"అమ్మకూడొండనా ఇంక!" అంది అచ్చాలు.

"పొద్దుటి చోడి సంకటి వున్నది. తలొకముద్దా తినండి. నాకు పొయ్యి రాజెయ్య బుద్ధి పుడతలేదు. గుబులు గుబులుగా వుంది." అన్నది నర్సమ్మ.

"సంకటి రెండు ముద్దలే వుంటాదమ్మా! నంజుకోటానికి బెల్లప్పిసరు కూడా నేదు. ఏటి తినమంటావు! కూడువండమ్మా! నువ్వు ఎసట్లో బియ్యం పోసేసరికి అయ్య వొచ్చేస్తాడు చూడు" అని బ్రతిమిలాడింది తల్లిని అచ్చాలు.

"నామణుసు బాగులేదే పిల్లదానా! కూడొండు కూరొండు అని నన్ను మనేద పెట్టబాకు. కావిలిత్తే నువ్వు వండుకో ఆకూడూ కూరాను." అని విసుక్కుంది నర్సమ్మ.

"ఈళ్లెవరూ ఇంటిముకం పట్టలేదు. కూతురా! డబ్బంతా జూదమాడో తాగేసో తగిలెట్టేసుకుని వుంటారు. ఏందారి కూతురా!" అంటూ వొచ్చేడు సీతయ్య.

"మా అయ్య అనుమంటాడుగాదు తాతియ్యా. నాదిరేసులన్నీ పాలెంలోనే కొనేద్దామనుకున్నాడు. అందరూ సావాసంగా వున్నారు గందా అని బస్తీకి వెళ్లాడు. ఏదో ఇబ్బందిలో పడుంటారు అందల ఒకళ్లు. ఆళ్ల గురించి తక్కినోళ్లు కూడా వుండిపోయుంటారు" అంది అచ్చాలు. "పోనీ ఎల్లి ఎతుకుదామన్నా రాకకీ పోకకీ పుంజీడు రూపాయిలన్నా వుండాల. రేలు బవలూ కట్టంబడిన రూపాయిలను ఈ పనికిమాలినోళ్లని ఎతుకులాటకి కరుసు చేయనా అని బాధగా వుండాది. నైటు బండికి రాకపోతే పొద్దుటేల పట్టుబండికి నేభోయొస్తాను కాని దిగులుపడబాకండి. కుశాలుగా వుండండి. ఒక్కడంటె ఒక్కడన్న ఇంటికి తగలడలేదు. పుండాకోరు ఎదవలు!" విసుక్కున్నాడు సీతయ్య. రాత్రి నైటు బండి కూడా చూసేరు వాళ్లు. కాని బస్తీకి వెళ్లిన వాళ్లు రాలేదు. నర్సమ్మకు కళ్లు మూతలు పడలేదు. "సొమ్ముపోతే పోనాది ఆడిపానం సుఖంగా వుండేట్టు చూడు నూకాల్తల్లి! నీకు కోడిని వేత్తాను." అంటూ రాత్రి తెల్లవార్లూ ఆకాశంకేసి చూస్తూ మనసులోనే మొక్కుబడులు పెట్టుకుంటూ జాగారం చేసింది నర్సమ్మ. అచ్చాలుకు తానుకు పనద్దారమిటాయిలు బిందెలనిండా సర్దుతున్నట్లూ, ఆ బిందెల చుట్టూ కాకులు చేరి కావుకావుమంటూ అరుస్తూ మిటాయిలన్నింటినీ ముక్కులతో పొడిచి పొడుంపొడుంచేసి ఇల్లంతా చిందరవందరగా పోసేసినట్లు కలగాసింది. కావుకావుమంటూ కాకుల అరుపులకి తుళ్లిపడి లేచింది అచ్చాలు. మిఠాయిలు, మెరిసే కొత్త ఇత్తడి బిందెలూ లేవు. కాకుల గోలమటుకు చెట్లమీద నించి వినబడుతోంది. భళ్లున తెల్లవారింది. "ఇదంతా కలేనా!" అనుకుంటూ నిబ్బరంగా గుండెలమీద చేయివేసుకుంది అచ్చాలు. కాని గుండెలు దడదడలాడుతున్నాయి.

* * *

"ఏయ్! చెప్పండ్రా లం.కొడకల్లారా! అర్ధరాత్రి బజార్లల్ల ఎందుకు తిరుగుతున్నారు! మీ లీడరెవరు?" బూటు కాళ్లతో యాదాయిని, నర్సిమ్మనీ, మిగిలిన ఇద్దరు యువకులనీ డొక్కలో తన్నసాగారు ఇద్దరు కానిస్టేబుల్స్.

"మాకు లీడరు ఎవురూనేరు బాబియ్యా. పిల్లదానికి అత్తారింటికి అంపకం పెట్టటాకి సరుకులు కొనాలని బస్తీకి వొచ్చాము. కరెంట్ దీపాలల్లో బజారు బాగుంటాదని ఈడు అన్నాడు. బొమ్మ చూస్కొని బజార్లో ఏదన్నా అరుగుమీద తొంగుండి పోదామని చూస్తున్నాం. ఇంతలో పోలీసుబాబులు మా మీద పడ్డారు. మమ్మల్ని వదిలెయ్యండి బావూ! మూడ్రోలాయి పోయింది. ఇళ్లకాడ పెళ్లాంబిడ్డలు బెగిలిపోతారు బావూ!"

"కథలు చెప్తార్రా మీరు! గోచిగుడ్డలు కూడా లేవుమీకు తిన్నగా! నాలుగొందలు అయిదొందలు మొలలో దాచారంటె మీ అబ్బగాడి సొమ్మంట్రా! దొంగనాయాళ్లారా!" మళ్లీ కుళ్ల పొడిచారు. యాదాయి కాళ్లు చేతులు అన్నీ వాచిపోయేయి. 'పల్లెటూరెదవలు బస్తీలు పారొచ్చి బజార్లలో జేబులు కొట్టి డబ్బులు జల్సా చేస్తారు. నాకెరిక కాదనుకున్నార్రా! ఎదవల్లారా!"

"బావు, బావు అట్లనమాకండి. బావు! మేము అంకంపల్లిలో గౌర్నంగా బతుకుతున్నవోళ్లం. దొంగలంకాము. బూవిదున్నుకుని బతికేటోల్లం! పయిస పయిస దాపెట్టి బొట్టికి అత్తోరికి అంపకం పెట్టాలని సరుకులు కొనేటందుకు వొచ్చినాము. ఇదేమీ బస్తీయో! బయలెల్లిన వేళ ఎవురి ముకం చూసామో! మీ పాల బడ్డాము. మూడ్రోలాయి కుళ్లబొడిచేస్తున్నారు. ఏందారిదేముడా!" అంటూ ఏడవసాగాడు యాదాయి.

"నానించీ ఇదంతా వొచ్చింది మావయ్యా. నైటుకి వుండి సిన్మా చూద్దారని లబలబలాడేను. రాంగానే కావిల్సినవి కొనుక్కుని ఎల్లిపోతే ఈళ్లగుట్లో పడుండక పోదుము" అంటూ తన్ను తాను నిందించుకున్నాడు నర్సిమ్మ.

"మన కరమ ఇదంతా! దిమాగ్గా తిరుగుదారని మ్నసం వొచ్చేటేంది! దొంగలనుకుని కొట్లో బడేసి ఈళ్లు వొళ్లు చీరేయటమేంది! మావు యాడా చూళ్లేదు" అంటూ ఏడుస్తున్నారు మిగిలినవాళ్లు.

"మూడ్రోలాయిపోయే! ఇంక మిమ్మల్ని పోనీయండి బావూ! మీకు నమ్మకం లేకపోతే అంకంపల్లి రాండి. మామ ఎసుమంటోల్లమో మీ కెరిక ఐతాది. ఆడోళ్లు లబలబలాడిపోతారు బాబూ!" అంటూ కాళ్లావేళ్లా పడ్డారు యాదాయి, నర్సిమ్మ. కానిస్టేబుల్స్ స్టేషన్ వరండామీదకు పోయి గుజగుజలాడేరు. "మీ గురించిన వివరాలు అన్నీ మా బుక్సులో వుంటాయి. మిమ్మల్ని వదిలెయ్యాలంటే కోర్టు కేసులూ లేకుండా చేయాలంటే మడిసికి వందరూపాయలు చొప్పున ఇచ్చుకోండి. లేకపోతే తాగి ఆడోళ్లని తీసుకుని లాడిజిగుల్లో వున్నారని వ్రాసేస్తారు పైనోళ్లు. ఆళ్ల బుక్కుల్లోకి ఎక్కారంటె చూసుకోండి. బాబులూ! మీ ఫోటోలు తీయించి ఈ కేడీగాళ్లుండే బోరుడుమీద అంటించేస్తారు. మరియాద నిలవాల్నంటే పై వాళ్ల నోటీసుల్లోకి ఎక్కకూడదు. కాస్సేపటికి ఇన్సపెక్టరు వత్తారు. వచ్చి మీ ఇలాకా అడిగారంటే ఏదయినా చెప్పాల్సిన జవాబు నారీ మామీద వుంటుంది" అన్నాడు. ఆ మాత్రం దోవ దొరికినందుకు బ్రహ్మానందపడిపోయేడు అప్పల నర్సిమ్మ.

"మావియ్యా! ఇంటికెళ్లాక అందరం ఇచ్చేత్తాం ముందల నీ దగ్గరున్న డబ్బు ఈళ్ల ఎదాన కొట్టేయి. బయట బడిపోతాం" అన్నాడు. యాదాయికి చేతులు వణికేయి.

"వణికి ఛస్తావేంరా! అబ్బ నాకారిఎదవా! బజార్లు దొబ్బినప్పుడు రాలేదా వణుకు! తీయి డబ్బు సంచి! మళ్లీ మా యముడు వచ్చేడంటే ఇందులో సగంవాడే గుటకాయస్వాహా చేస్తాడు." అంటూ ఒక పోలీసు యాదాయి డొక్కలో ఒక పోటు పొడిచేడు చేతి కర్రతో! అయిదువందలు వాళ్లకి ధారపోసి పల్లెమొగం పట్టారు యాదాయి వాళ్లు.

అయిదు రూపాయిల నోట్లు పది రూపాయిల నోట్లు రెండు రూపాయిల నోట్లు రూపాయి కాయితాలు అన్ని విడివిడిగా చూసి లెఖ్ఖ పెట్టుకుంటున్నారు.

"ఎందరి జేబులు కొట్టారో లమ్డీకొడుకులు. దరిజాగా తిరిగేద్దాం అనుకుంటున్నారు." అన్నాడు ఒక పోలీసు.

"ఈ మధ్య ప్రతి వెధవ అమాయకుడిలా నటించడం మొదలుపెట్టారు. ఈ డబ్బులన్నీ పోగుజేసియే చెట్టు క్రిందో జేరి జూదమాడుకుంటారు. లేకపోతే పీకల దాకా తాగి రోడ్డుకి అడ్డదిడ్డంగా పడటం, ఏ లారీయో మట్టేసిందంటే ఇంక మళ్లీ మనకి సందడి!" అన్నాడు ఇంకొకడు.

"దుక్కముక్కల్లా వున్నారు. వొళ్లు వంచి పని చేసుకోకూడదూ! మూడ్రోజులు తిండి లేకుండా మాడినా నల్లని శానీరాయిలా ఎన్నిదెబ్బలయినా కాసేరు. ఇలగిలాంటోళ్లనే ఆళ్లు పారిటీలలోకి జేరుత్తన్నారు. ఎంత కుళ్లబొడవనీ నోరిప్పరు. జాడ పట్టీయరు. మనపై మొగుళ్లు 'ఎదవల్లారా ఆళ్లచేత ఒక మాటన్నా పలికించలేకపోయార్రా సన్నాసి ఎదవల్లారా! మీ ఆడోళ్లకి ఇడాకులిచ్చేయండి. ఆళ్లన్నా సుకపడతారు' అంటూ దెప్పిపొడుస్తారు. ఈళ్లని గట్టిగా తన్నామనుకో టప్పుమని చచ్చూరుకుంటున్నారు. ఇంక చూసుకో నాయినా! లాకెప్పులో హత్య అంటూ పేపరోళ్లు ఏకేయటం! పోలీసుద్యోగం చేయటం కన్నా పుణుకలు అమ్ముకుంటం నయిం" అన్నాడు ఇంకొకడు.

"ఏదోలే! ఆళ్లకర్మాన్న ఆళ్లు పోయేరు. మనకింత దొరికింది. ఎపుడు ఏపారిటి అయితే మనకేమిటి! జీతంరాళ్లతో ఏదో పై సంపాదన వుటుందనేగా ఉద్యోగం చేయటం!" అన్నాడింకొకడు.

"మా నాయిన హెడు సేసినాడు. అయినంటే వూళ్లంతా గజగజలాడేవారంట! వూరిలో ఎవురు వేట వేసుకున్నా హెడుగారికంటూ మాంసం పంపేరుట. మాంసం, కోడి, చేపలు ఎప్పుడూ కొనుక్కోని ఎరగం. ఇప్పుడో! అందరూ పోలీసులని తిట్టేవోరే కాని గౌర్నంగా చూసి ఆకో, పండో ఇచ్చేవాడే లేడు. మా నాయిన డెబ్బయి రూపాయిల జీతంతో నలుగురక్కయ్యలకి పెళ్లిళ్లు చేసేడు. పాతికేలు పెట్టి డాటా కట్టేడు. మూడు పెళ్లిళ్లు చేసుకున్నాడు. ఇంకా నలబయి ఏళ్ల నడివయసు వాడులా వుంటాడు మా నాయిన."

"నువ్వో! మాపిటికో రేపటికో రాలిపోయేలా వుంటావు. నువ్వు తిన్న మాంసమూ కోళ్లూ చేపలూ ఏసంద్రంలోకి పోయేయిరా! నక్క నాకొడకా!" అన్నాడు ఇంకొకడు. వాళ్లల్లో నవ్వుకొంటున్నారు హాయిగా తీయగా. చాలా హుషారుగా వున్నారు వాళ్లు! ప్రజలు వాళ్లని గౌరవించి తృణమో పణమో భక్తిగా భయంగా ఇవ్వటం మానేశారు. వాళ్లు మటుకు ఏమి చేస్తారు? వాళ్లకీ కుటుంబాలున్నాయి. కాదా మరీ!

* * *

"అయ్యొచ్చేడు! అమ్మొవ్. అయ్యొచ్చేస్తున్నడు." అంటూ వెంకటం, చీనయ్య గోలగోలగా అరవటంతో వూరువూరంతా రోడ్డుమీదకు వచ్చింది. మూడు రోజులు ఇంటికి రాకపోయేసరికి అందరికీ వాళ్లమీదే దృష్టి వుండినాది.

ఆకుపచ్చరంగు చీనారేకు పెట్టి, మిలమిలమెరిసే బంగారంలాంటి రెండు ఇత్తడి బిందెలు, వాటినిండా పనద్దార మిటాయుండలు, చీరలు జాకెటు ముక్కలు, అర్టిపళ్లగెల, కొబ్బరికాయలు -- వాట్లకోసం యాదాయి కుటుంబం కళ్లు విప్పుకుని చూస్తోంది. పొగ చూరి పోయిన కొరకంచు ముక్కల్లా పీచురేగిపోయిన తలతో ఎర్రగా మండుతున్న కళ్లతో దుమ్ముకొట్టుకున్న శరీరంతో చేతులు కాళ్లు వాచిపోయి వున్న యాదాయి తల వూళ్లో వాళ్ల చూపుల్ని ఎదుర్కోలేకపోయాడు.

తాను తాగలేదని జల్సాయి చేయలేదని జూదమాడ లేదనీ తనకే తెలుసును. తాను బజార్లమ్మట తిరిగి సొమ్ము జారవిడుచుకోలేదని తనకే తెలుసును. కాని ఇంతమందికీ తాము పొందిన అవమానము బాధా తిట్లు దెబ్బలూ ఎలా చెప్పుకునేది! ఏమని చెప్పుకునేది!

అందుకే .... అందుకే .... రోడ్డు మీదే కూలబడి రెండు చేతులూ నెత్తిమీద పెట్టుకుని బోరుమని ఏడవసాగేడు యాదాయి. అందరూ వాడి చుట్టూ గుమిగూడారు.

(ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రిక 12-2-88)

# పువ్వులన్నీ శ్రీవారివే

- నాయని కృష్ణకుమారి

కొండ మంచి మనిషి మనస్సులా చల్లగా ఉంది. ఎటుచూచినా పచ్చదనం. చెట్లన్నీ ఆకుల గొడుగులు విప్పి వచ్చేపోయే యాత్రికులకు ఎండ తగలకుండా సేవ చేస్తున్నట్లున్నాయి. సంపెంగ చెట్లు బంగారు రంగు పూలను స్వర్ణాభరణాలుగా అలంకరించుకుని మెరిసి అల్లికల చిక్కదనంతో, చెట్ల తలాడింపుల్లో, అంతా మైమరపు కలిగించే సౌందర్యమే! కొండ చరియల్లో కంటికి కనిపించని అద్భుతశక్తి ఏదో గాలం వేసి తన వైపుకు లాక్కుంటున్న అనుభూతి."ఎక్కడో ఉన్న తనను వెతికి పట్టుకోమని అదృశ్యశక్తి మనల్ని సవాలు చేస్తున్నట్లుగా ఉంటుంది నాకు" అంటుంది లక్ష్మి.

"అదృశ్యశక్తా, మశాణమా! నువ్వో సెంటిమెంటల్ ఫూలువి. నీకెప్పుడూ శక్తి ముక్తి అంటూ ఒకటే గోల! అది కేవలం ప్రకృతి పట్ల మనిషికుండే అంతులేని ఆకర్షణ మాత్రమే" అంటాడు శ్రీధర్. శ్రీధర్ ఒక రకంగా నాస్తికుడు. ఆస్తిక నాస్తిక వాదాలు జరిగేటప్పుడు అతడే పక్షమూ వహించడు. "అసలు దేవుడంటే ఏమిటి? మీరెన్నాయినా చెప్పండి. ఆ ప్రశ్న నాకర్థమేకాదు. అటువంటప్పుడు ఉన్నాడని గానీ లేడనిగానీ నేనెట్లా చెప్పగలను" అంటాడు. అతని మాటలు వింటుంటే లక్ష్మికి ఒక తార్కికుడు మాట్లాడినట్లుంటుంది. దేవుడి ఉనికిని ప్రశ్నిస్తే మాత్రమేం? అతను మంచి మనిషి. ఒకరికి చెరుపు తలపెట్టడు. తనకు చేతనైన సహాయం అవసరమైన వాళ్ళకు అందించే ఆర్ద్రత కలవాడు. దేవుడున్నాడని నిరంతరం పూజలు చేసి ఎదుటి వాళ్ళను కసిరికొట్టే మనుషుల కంటే ఎన్నో రెట్లు ఉన్నతంగా కనిపిస్తాడు. లక్ష్మి బుద్ధి అస్తిత్వం వైపు మొగ్గుతుంటుంది. మనసు మూలల్లో ఎక్కడో దేవుడనే భావన వెలుగు తున్నట్లుంటుంది. అయినా రోజూ ఒక విగ్రహం ముందు దీపం వెలిగించి కాయో, కర్పూరమో అర్పించి, దణ్ణం పెట్టుకునే ఆచారాన్ని ఆవిడ ఎప్పుడూ పాటించలేదు.

"నీదంతా విచిత్రం లక్ష్మీ. దేవుడున్నాడనుకునే దానివి రోజూ పూజెందుకు చెయ్యవ్" అంటాడు శ్రీధర్.

"బహుశ నేను ఎగతాళి చేస్తానని మానేసి ఉంటావ్. అవునా?" అని రెచ్చగొడతాడు.

"ఏమన్నా అనుకో ఒకటి మాత్రం నిజం. దేవుడున్నాడు అనుకున్నందువల్ల నాకు దృఢమైన అండ దండ లభించినట్లుగా ఉంటుంది. నన్ను ఆదుకునే చేతిని చాచుకుని ఎప్పుడూ నా వెనక వెనకే ఆ దేవుడు నడుస్తున్నట్లుగా ఉంటుంది. ఎంతో మనశ్శాంతి చల్లగా నిలువెల్లా విరిసినట్లుగా ఉండటానికి ఆ భావనే కారణమని నా నమ్మకం."

"అటువంటి భావన నీకు కలగడానికి నీ ఆత్మ స్థైర్యం కారణం కావచ్చు కదా!"

"పోనీ నీవు దానికి స్థైర్యమని పేరు పెడ్తే నేను దైవభావన అని పిలుస్తున్నాను. ఇందాక నేను అదృశ్యశక్తి అంటే నీవు ప్రకృతి అన్నట్లే యిది కూడా. పేరులో ఏముంది పోదూ!" అంటూ తేలిగ్గా వాదనను తుంచేస్తుంటుంది లక్ష్మి. ఇటువంటి విషయాల్లో ఆ దంపతులకు ఏకాభిప్రాయం ఎప్పుడూ కుదరదు. పైకి వాదిస్తున్నా లోలోపల ఒకరి అభిప్రాయాలను మరొకరు గౌరవించే పద్ధతిని అవలంబిస్తూనే ఉంటారు.

అట్లా ఒక నాస్తికుడు, ఆస్తికురాలూ ఇద్దరూ కలిసి శ్రీవారి కొండ మీదికి పదిరోజుల పాటు ఉందామని వచ్చేశారు. నగర జీవితంతో విసిగిపోయిన యిద్దరికీ ఈ మార్పు చాలా బాగుంది. లక్ష్మికి తెల్లవారుఝామున దూరంగా లీలగా వినిపించే సుప్రభాత శ్లోకాలూ, ఒళ్ళు నిమిరి సేదతీరుస్తున్నట్లుగా మెల్లమెల్లగా దగ్గర చేరే పిల్లగాలుల హాయలూ, దేవుడి గుడినిండి, బయటికి వ్యాపించే కర్పూర పరిమళచ్ఛాయలూ ఇవన్నీ ఎంతో ఇష్టం. వీటిని అనుభవిస్తున్న వేళలో మనసంతా ఒక అలౌకికానుభూతి నిండి తనను శాంత సరోవరంలో శ్వేత హంసను చేస్తున్న చర్య చాలా యిష్టం. ఆ అనుభవం మళ్ళీ మళ్ళీ కావాలనే ఆవిడ కొండ మీదికి వస్తూ ఉంటుంది. శ్రీధర్ రావడానికి ఒకే ఒక బలీయమైన కారణం ఉంది. నలభైనాలుగు డిగ్రీల వేసవి వేడిమి నుండి పారిపోయి కొండ చల్లదనాన్ని కొల్లగొట్టాలనే అతని రాక.

వాళ్ళిద్దరికీ శంకుమిట్ట కాటేజీలలో ఒక కాటేజీ కేటాయింపబడింది. లక్ష్మి చెల్లెలి భర్తా, ఆయన అన్నదమ్ములూ ఉమ్మడిగా ఒక కాటేజీ నిర్మాణానికి దానమిచ్చారు. వాళ్ళుగానీ, వాళ్ళ ద్వారా వచ్చిన వాళ్ళుగానీ సంవత్సరంలో ఒక నెలరోజులు ఆ కాటేజీలో ఉండే వెసులు బాటుంది. ఇరవైనాలుగ్గంటల్లో కాటేజీ ఖాళీ చెయ్యాలన్న సామాన్య సూత్రం వీరికి వర్తించదు. లక్ష్మి తన చెల్లెలి ద్వారా కొండ మీద పది రోజులపాటు ఉండగలిగే అర్హతను సంపాదించుకుంది.

శంకుమిట్టలో బస ఏర్పడిన యాత్రికులందరికీ ఒక విశ్రామ స్థలం ఉంది. తీర్చిదిద్దిన కాలిబాటలూ, గడ్డి కత్తిరింపులు, పువ్వుల పొదలూ అన్నీ అపారమైన

అందాన్ని చిన్న చిన్న ముక్కలుగా కత్తిరించి ఆ స్థలంలో వెదజల్లినట్లుంటాయి. దానికి నడిబొడ్డున విష్ణుదేవుని శంఖ చక్రాలూ తిరునామమూ లైట్ల వెలుగులో ఎంతో దూరానికి మనోహరంగా కనిపిస్తాయి. ఆ ప్రదేశాన్ని శంకుమిట్ట అనడానికి కారణం కూడా ఆ శంఖమే.

ఎండ వేడిమి నుండీ పని ఒత్తిడి నుండీ, తప్పించుకు వచ్చిన యాత్ర కనుక లక్ష్మి శ్రీధర్ లిద్దరూ రోజూ కొండ మీద అటూ ఇటూ తిరిగి వస్తుండేవారు. ఉచిత బస్సుల్లో ఒక చోటు నుండి మరో చోటుకు పోవడం హాయిగా, గమ్మత్తుగా అనిపించేది. పొద్దున్నే ఫలహారానికొక హోటలైతే మధ్యాహ్నం భోజనాని కొకటీ రాత్రి భోజనానికి మరొకటిగా మంచి హోటళ్ళ వేటలో పడేవారు. సాయంకాలాలు శంకుమిట్ట ఉద్యానంలో గడ్డిపరుపు మీద కూచుని చల్లదనాన్ని అనుభవిస్తూ ఉండేవారు. తమ చుట్టూ కన్నుకోరే రకరకాల పుష్ప విన్యాసాలు. "కాసిని పూలు కోసుకుంటే బాగుండును" అనేది లక్ష్మి సగం స్వగతంలాగా సగం ప్రకాశంలోనూ!

"కొయ్యకూడదు. కొండ మీద పూలన్నీ శ్రీవారివే" అని రొక్కించే వాడు శ్రీధర్. ఆ మాటలే అక్కడక్కడా చిన్న బోర్డుల మీద కూడా వ్రాసి కనపడుతూ ఉండేవి.

"ఇన్ని పువ్వులు ఏం చేసుకుంటాట్ట ఆ శ్రీవారు. ఆడకూతుళ్ళ తలల్లో ఉంటే ఆయన చూపు మెచ్చదా?" అని గొంతు పెంచేది లక్ష్మి. ఏవన్నా చేసుకోనీ ఒంటినిండా దిగేసుకుంటాడు. మధ్యలో నీకెందుకట! అని వాదనను పెంచడానికి చూచేవాడు శ్రీధర్.

"అలంకరించుకున్నాకే, గుళ్ళో నిలువు జీతం కొలువులోకి ఎక్కిపోయాడుగా! ఇంకా ఎందుకో. అది సరే అన్ని పువ్వుల్నీ సొంతం చేసుకుని అన్నీ నావే నంటున్నాడు గానీ, వాటి బరువు బాధ్యతలన్నీ తనవేనా, యేం?" అని లంకించుకుంది లక్ష్మి. ఆవిడ తనతో వాదిస్తుంటే వినడం శ్రీధర్‌కు ఇష్టం. కేవలం వాదనను పెంచడం కోసమే తానూ అడ్డదిడ్డంగా వాదనలోకి దిగుతుంటాడు. పువ్వుల విషయంలో బరువులేమిటి బాధ్యత లేమిటి నీకు పనిలేక బుర్ర సరైన మార్గంలో ప్రయాణించడం లేదు" అని రొక్కించాడు. "కాదు మహానుభావా! ఇవి పువ్వులే అయితే ఈ పువ్వులు మరి వేటికైనా ప్రతీకలు కాకూడదా. ఈ పువ్వులన్నీ నావి అన్నవాడు బహుశా ఈ పువ్వులే ఇక్కడికొచ్చే అసంఖ్యాక భక్తజనమైతే ఈ జనమంతా నా వాళ్ళే అంటాడా? వాళ్ళ మంచిచెడ్డల బాధ్యతల్ని నెత్తిన వేసుకుంటాడా?" "ఏమో వేసుకుంటాడేమో! కాదని నీతో ఏమైనా చెప్పాడా?" శ్రీధర్ కళ్ళు కొంటెతనంతో మెరుస్తున్నయ్.

"సరేలే సంబరం. కొండమీదికొచ్చి అప్పుడే మూడు రోజులు గడిచి పోయినయ్. ఇంతవరకూ నేనాయన మొహమూ, ఆయన నా మొహమూ చూడలేదు. ఇక ఆయన నాకేం చెప్తాడు నేనేం వింటాను?" అని నిరాశను ధ్వనిస్తూ ఊరుకుండి పోయింది లక్ష్మి.

"చూద్దుగానిలే ప్రవాహం లాంటి జనాన్ని చూస్తున్నావుగా. నువ్వో ప్రముఖ వ్యక్తివైఉంటే, వరసలో ఉన్న జనాన్ని నిలిపేసి నీకు దగ్గరుండి దర్శనం చేయించేవారు మరి."

"అవుననుకో ఇంతకూ ఆ నల్లటాయనకు నన్ను చూచే అదృష్టం ఉందో లేదో" అంటూ కొంటెగా సాగదీస్తూ జవాబు చెప్పింది లక్ష్మి. శ్రీధర్ చిన్నగా నవ్వుకున్నాడు. లక్ష్మి ఊహలు మాత్రం ఆ గుళ్ళో ఉన్న నల్లటాయన చుట్టూ తిరగసాగాయి.

నిజంగా ఆయన ఎంత దురదృష్టవంతుడు! రాత్రి పన్నెండు, ఒంటిగంట వరకు ఆర్జిత సేవలంటూ భక్తులాయన్ని ఇబ్బంది పెడుతూనే ఉంటారు. తాను మాత్రం వెలుతురు చొరబడని ఇరుకు స్థలంలో నల్లగా ఇంతయెత్తున నిల్చుని తనకోసం వచ్చే భక్తుల్ని కళ్ళప్పగించి చూస్తూనే ఉంటాడు. దట్టమైన తిరునామాల తెర ఆ చూపుల్ని జనం మీదికి సూటిగా రానీయక పోయినా సరే ఆయన వాళ్ళను చూడక మానడు. భక్తులు ప్రవాహంలాగా సన్నిధికి వచ్చి బరాబరుల బెత్తపు హెచ్చరికలతో దిగులుగా మరలి మరలి వెనక్కు తిరగకా మానరు. ఆయనకదో సంబరం. వాళ్ళకదే సౌభాగ్యం. బహుశా ఈ యుగం అంతరించిపోయినా ఆ ప్రవాహం వట్టిపోదేమో! తర్వాత పెద్ద ఉయ్యాలలో ఉత్సవమూర్తిని నిద్రపొమ్మని ఊపుతారు. రెండు ఊపులు ఊపి తెరలు సర్ది, తలుపులు దగ్గరికి లాగి, సింహద్వారాన్ని కుంచికోలమొన తల్పులతో బంధించి, అంతా తమతమ నిద్రలకు బయలు దేర్తారు. వాళ్ళకీ సేవలన్నీ వంతుల వారి సేవలు! మరి ఆ నల్లటాయనకు! ఆయన కర్మ అంతే. ఒక్క గంట గడుస్తుందో లేదో కుంబకోల మొన తల్పులు మళ్ళీ గరగర మంటాయ్. పొర్లుదండాలు పెట్టేవాళ్ళు, సుప్రభాత సేవలు చేసుకునే వాళ్ళు, అందరూ వచ్చేస్తారు. ఆయన కప్పుకున్న బంగారు దుప్పటిని తన్నేసి, కళ్ళు నులుముకుంటే నామాల నీటుదనం చెదిరిపోతుందేమోనని తిరిగి గర్భగుడిలో నిలువుకాళ్ళ ఉద్యోగానికి సిద్ధమైపోతాడు. ఇంకాసేపు పడుకోమనడానికైనా పెళ్ళాం కొండ దిగువ దూరంగా కొలువు తీరి ఉంటుంది మరి! షరా మామూలే కదా! నిద్రలేని ఆ ముఖం నల్లారాయి. రాళ్ళకు అలసటా చిరాకూ వంటి హార్దికానుభూతులుండవు" ఇట్లా అయోమయపు ఊహల్లో పడి చిక్కుపడ్డ దారపుండలా అయిపోతోంది లక్ష్మి.

దేవస్థానం వారి మైకు నిర్విరామంగా మోగుతోంది. కాసేపు హరికథ, తర్వాత అన్నమాచార్యుల పదగానం, మరికొంతసేపు పురాణ ప్రవచనం, ఒకటేమిటి రకరకాల భక్త మనస్సమాకర్షత విన్యాసాలు.

"ఏవండోయ్ లక్ష్మీదేవిగారూ! ఏ ఊహాలోకంలోకి షికారెళ్ళి పోయారు. లేవండి. కాసేపు గుడి ముందు మెట్లమీద కూచుందాం" అన్నాడు శ్రీధర్. అంతకు ముందంతా మాటకు మాట సమాధానం చెప్పి వాగుడుకాయలాగా కనిపించిన లక్ష్మికేమయింది. ఆవిడంతే. ఉన్నట్లుండి ఏ భావాతీత ధ్యానానికో వెళ్ళిపోతుంది అనుకున్నాడు శ్రీధర్. అతని పిలుపుకు లక్ష్మి అక్కడ నుండి కదిలింది. ఇద్దరూ గుడి ముందు మెట్లమీద కొలువు తీరారు.

"ఈజనం చూడు! వీళ్ళ మనస్సుల్లో ఈవాతావరణానికి సంబంధించిన పవిత్రత తప్ప మరొకటి ఉంటుందంటావా?" అని ప్రశ్నించింది లక్ష్మి. అమ్మయ్య దారిలో పడుతోంది అనుకున్నాడు శ్రీధర్. జవాబు చెప్పే ప్రయత్నం చెయ్యలేదు.

ఉన్నట్లుండి నిర్విరామంగా మోగే మైకు ఆగిపోయింది. కాస్త గరగర శబ్దం చేశాక తిరిగి మొదలైందో గొంతు. "భక్తజనానికి విజ్ఞప్తి. నాలుగేళ్ళపాప తప్పిపోయింది. పేరు సునీత. తలిదండ్రులు ఆళ్ళగడ్డ నుండి స్వామిని సేవించుకోవడానికి వచ్చారు. పాప నీలం రంగు గౌను వేసుకుని ఉంది. బాగా బిగించి వేసిన పిడికెడేసి రెండు జడలు గుండ్రని ముఖం, ఛామనచాయకోరంగు ఎక్కువ. తలిదండ్రుల పేర్లు రాధ, రామస్వామి. పాపకు ర, దలు పలకవు. అమ్మ పేరు లాత అంటుంది. నాన్న పేరు లామస్వామి అంటుంది. ఆచూకి తెలిసిన వారు గుడి ముందున్న దేవస్థానం కార్యాలయంలో తెలియజేయండి. 'నమస్తే'

తు చ తప్పకుండా ప్రతి అక్షరమూ విన్న లక్ష్మికి మనస్సెలాగో అయిపోయింది. పరుగు లాంటి నడకతో మెట్లెక్కి ఆఫీసు రూములో అడుగు పెట్టింది. పాప తలిదండ్రులిద్దరూ అక్కడే ఉన్నారు. దుఃఖం ఆకారం తొల్చినట్లున్న తల్లి సన్నగా రివటలాగా ఉంది. ఎగిరెగిరి పడుతున్న భుజాలు చూస్తే దుఃఖం సముద్రపు అలలు ఆవిణ్ణి ఎడాపెడా తాకుతున్నట్లున్నయ్. భర్త క్షణక్షణానికీ ఊరుకో, ఊరుకో అంటూ ఓదార్చడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు."నా పాప దొరక్కపోతే, నేనీడనే తల పగలగొట్టుకుని చస్తా" అంటూ వెక్కుతోంది ఆవిడ.

"లక్ష్మి పద. మనం వెంకటేశ్వర వృక్ష ప్రసాదానికి పోయి మొక్కలు తెచ్చుకుందామనుకున్నాం కదా" తిరుమల గుర్తుగా మన యింట్లో నాటుకుందాం" అన్నాడు శ్రీధర్. అతడెందుకట్లా మాట్లాడుతున్నాడో గ్రహించింది లక్ష్మి. తన మనస్సుకు ముల్లు గుచ్చుకుంటే అతడు విలవిల్లాడి పోతాడు. మరబొమ్మలాగా ఆవిడ భర్త వెంట నడవసాగింది.

గుడికీ వృక్షప్రసాదానికీ బాగా దూరం. దంపతులిద్దరూ నడక మొదలు పెట్టారు. కళ్యాణ కట్ట, శ్రీ గంధపు చెట్టుకూడలి, బస్సు నిల్దానం అన్నీ దాటారు. వాళ్ళల్లో చలాకీ తనం లేదు. ఇద్దరూ బరువెక్కిన గుండెల్తో, ఎవరిదారిన వారు ఆలోచిస్తున్నారు. లక్ష్మికి అది విచారమో, బుర్ర మొద్దుబారిన తనమో అర్థం కావడం లేదు. పిల్ల దొరక్కపోతే జీవితాంతం ఆ తల్లి దుఃఖాన్ని ఎట్లా భరిస్తుందా అని ఆలోచిస్తుంది. నిజంగానే మెట్లమీద తలబద్దలు కొట్టుకుంటుందా అని చర్చించుకొంటోంది.

కొండమీదేకదా! పాప ఎక్కడికి పోతుంది. దొరుకుతుందిలే అనుకుంటున్నాడు శ్రీధర్. మైకులో అభ్యర్థన ఎడ తెగకుండా వినబడుతూనే ఉంది.

అప్పటిదాకా సన్నగా మైకా పొరలాగా ఉన్న వెలుగు మబ్బుల చాటుకు వెళ్ళిపోయింది. కొన్ని మబ్బు తునకలు తారట్లాడుతున్నయ్. తిరుమల వాతావరణమే అంత! చల్లగా హాయిగా, ఎండ ఉంటే నులివెచ్చగా, మబ్బులతో దోబూచులాడుకుంటూ అందర్నీ ఆనందింపజేసే వాతావరణం. లక్ష్మి కళ్ళు పైకెత్తి, మబ్బుల చర్లాటను చూస్తూ అన్యమనస్కంగా నడుస్తోంది. సరిగ్గా నెత్తి మీద గొడుగు పట్టినట్లుగా ఒక పెద్ద నల్ల మబ్బు! ఉన్నట్లుండి ఆవిడ కళ్ళల్లో ఆశ్చర్యం మెరిసింది. గొంతులో ఉద్వేగం పొంగింది.

"ఇటుచూడు ఆ పెద్ద మబ్బు! గుళ్ళో నిలువు కాళ్ళ కొలువు చేసే ఆ నల్లటాయన లాగా లేడూ?" అన్నది శ్రీధర్‌తో. అందుకు ప్రతిగా గొంతులో మరింత ఉద్వేగాన్ని దట్టించుకున్న శ్రీధర్"లక్ష్మీ అటుచూడు! చిన్నపాప! రెండు జెళ్ళు, నీలం గౌను త్వరగా వచ్చేయ్" అని ముందుకు పరుగు తీశాడు. అయోమయంగా లక్ష్మి శ్రీధర్ వెనక పరిగెత్తింది. అప్పటికే అతడు ఆ పిల్లను పొదివి పట్టుకున్నాడు. బుజ్జగిస్తున్నాడు. "నీ పేరేంటి పాపా!"

"చునీత"

మీ అమ్మ పేరు

"లాత"

నాన్న పేరు

"లామచామి"

ఒక్కదానివే ఇటేక్కడికి పోతున్నావ్.

మా అమ్మ కనిపించట్లేదు. పాప ముఖం రంగులు మారుతోంది. ఏడుపు పైకి తన్నుకొస్తున్నట్లు ముఖరేఖలు కుచించుకు పోతున్నాయ్.

"భయంగా ఉందా?"

"ఎందుకూ? ఈ కొండ చామిది కదా! ఇక్కడ భయం ఉండదంట. మా బేబీ చెప్పింది." ఇదంతా వింటున్న లక్ష్మి మనస్సులో ఉవ్వెత్తున ఎగసిన ఆనందతరంగం, చెమ్మగిల్లిన కళ్ళతో పైకి చూస్తే ఆ నల్లమబ్బు అక్కడే ఉంది.

"బలే చతురుడివే! పువ్వులు ఇవ్వకూడదా అన్నానని ఈ పువ్వును నా చేతుల్లో పెట్టావా? బరువు బాధ్యతల్ని నీ తలమీదికెత్తుకుని ఫలితానికి సంబంధించిన తృప్తితో నా గుండెను నింపేశావు గదయ్యా" అనుకుంది...

మొగ్గలాంటి ఆ నీలిగౌను చిన్నారి రెండు చేతుల్నీ అటూ ఇటూ పట్టుకుని లక్ష్మి శ్రీధర్ లిద్దరూ గుడికి అభిముఖంగా నడవసాగారు. వాళ్ళ మనసులు రెండూ సాయంకాలపు జాజి మొగ్గల్లాగా విరియనారంభించాయి.

# బరిబత్తల బొమ్మ

డా. పి. యశోదా రెడ్డి

రాత్రి దాదాపు పదకొండు గంటలు దాటి ఉంటుంది. హైదరాబాదు నుండి వచ్చే చివరి బస్సు కూడా వచ్చేసింది. అప్పటికే సినిమా మొదటి ఆట వదిలి చాలాసేపైంది. రెండో ఆట ముగియడానికి యింకా వో అరగంటకుపైనే వ్యవధి వుంది. సన్నగా వానతుంపరులు కూడా పడ్తున్నాయి. దాదాపు రోడ్లన్నీ నిర్మానుష్యంగానే కన్పిస్తున్నాయి. ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ అప్పుడప్పుడు వినిపించే ఊరకుక్కల భౌ భౌలు తప్ప మరేజీవి అలికిడీ వినిపించడంలేదు.

మావారు బాగా అలసిపోయారేమో గాఢనిద్రలో వున్నారు. మా ఇద్దరి మధ్యలో మహారాజులా నిద్రపోతున్న మాగారాల బుచ్చమ్మ అంటే మాబుజ్జి నాన్న కలగన్నట్లు లేస్తూ బ్రహ్మాండాన్ని కబళించే ఆకలితో వున్న ఆదిబిక్షువులా'కావురు', 'కావురు' మంటూ గుక్కపట్టి ఏడ్పు అందుకున్నాడు. ఆ ఏడ్పు రహస్యం. వాడి కపుడు ఆత్రం తెలిసిన నేను నిద్రలో కూడా మేల్కొన్న తెలివితో కళ్ళు విప్పకుండానే అటునుండి ఇటు తిరిగి వాడినోటికి కావలసిన అమృత కలశాన్ని అందించాను.

చేపుకుని స్రవించే పాలధారలను 'గుర్రు, గుర్రు' మంటూ, వాళ్ళ నాన్నకు మెలకువ వచ్చేంత చప్పుడు చేస్తూ మింగుతున్నాడు.

'ఏరా! పడుకోనివ్వవా? అంటూ మావారు మగతగా మెసుల్తూ మరో వైపు తిరిగి పడుకున్నారు.

ఇంటి వెనక దొడ్డివైపు ఏదో శబ్దం లీలగా వినిపించినట్లైంది. రాత్రిపూట ఎలకల వేటకు వెళ్ళేపిల్లో? కాక, కుక్కో? అయివుంటుందని సరిపెట్టుకున్నాను. కాదు. ఆ ధ్వని యింతకింతకు పెద్దదౌతూ ప్రస్ఫుటంగా వినిపించడం ప్రారంభమైంది.

ఎవరో? తలుపులు ఆత్రంగా బాదుతున్నారు. ఎవరై వుంటారు? దొంగలా? కాదు ఎవరినో శత్రువులో. రౌడీలో వెనక వైపు నుండి తరుముకు వస్తూవుంటే ప్రాణభయం కొద్దీ పరుగెత్తి 'కాపాడమంటూ' రక్షణకోసం అర్థిస్తున్నట్లుంది ఆ ధ్వని.

ఏమైనా ఈ శబ్దం మాత్రం మామూలుగా లేదు.

"ఏవండీ! మనదిడ్డి తలుపులు ఎవరో చాలా సేపట్నుంచి కొడ్తున్నారు. నన్ను వెళ్లి చూడమంటారా? అంటూ భయం భయంగానే పూర్తిగా మెలుకువ వచ్చీరాని స్థితిలో వున్న మావారిని లేపే ప్రయత్నం చేస్తున్నాను.

అప్పటికే తన 'చిట్టి బొజ్జని' నింపుకుని, పరమయోగిలా ఆనందంగా నిద్రలోకి జారుకున్నాడు మాబుజ్జినాన్న. వాడికి దుప్పటి సర్దికప్పుతూ వుంటే ఇందాకటి శబ్దంలో వేగం, ఆత్రం మరీ రెట్టించింది.

ఇదేదో నేనే చూచివస్తానంటూ లేవబోతూ వుంటే, మావారు కళ్లు నులుపుకుంటూ లేచి "ఆగు,ఎక్కడికి? నేను వెళ్లి చూస్తాన్లే" అంటూ పక్కనే వున్న షర్టు తొడుక్కుని దిడ్డిగుమ్మంవైపునడిచారు.

వారలా వెళ్లిన రెండు మూడు నిమిషాలకే 'శారదా!' అంటూ మావారు పెట్టిన వెర్రికేక వినిపించింది.

ఆకేక వెంబడే నేను ఎలక్ట్రిక్ షాక్ తగిలినట్టుగా లేస్తూ పక్కలో వున్న పసికందును కూడా పట్టించుకోకుండా దిడ్డి వైపు పరుగెత్తాను.

ఎదురుగా వాకంట పడ్డ దృశ్యాన్ని చూచి తూలిపడబోతూ మావారి భుజం ఆసరాగా నిలదొక్కుకున్నాను. నోటమాట పెకిలి ఎవ్వరికీ ఇవతలికి రావటం లేదు.

ఇంతవరకూ మావారు చూచిందీ, ఇప్పుడు నేను చూస్తున్నదీ ఒకటేదృశ్యం. అది మాటలకు అందని పరమ దయనీయమైన అవస్థ.

ఆమె నోవగ్నస్త్రీ మూర్తి. ఆమె పొంగులువారే యౌవనంలో వున్న సొగసుకత్తె. అవయవాలన్నీ సువిభక్తమై ఎత్తు వొంపుల పొందికతో సుతారంగా తీర్చి పోతబోసిన కంచు విగ్రహంలా వుంది.

అయినా అంతటి సౌందర్యం కంటికి యింపుగాలేదు. కల్లు చుక్కకలసిన పాలకడవలా, కరిబెడిన కుక్కలు చించిన వడ్డించిన విస్తరిలా, విషలిప్తమైన అమృతాన్నంలా వ్యర్థమై వెగటునూ, వెకిలింపునూ కల్పిస్తూంది.

పరమ ఆకర్షణీయమైన ఆ శరీరం చెప్పరాని శిక్షలకు గురైనట్లుంది. పంటిగాట్లతో కందిన చెక్కిళ్లూ, గోటి గీరంతో, నెత్తుటి చారలతో పొత్తు కుదుర్చుకున్న అవయవాలూ, మాంసలాలై మాలూరఫలాల్లా, కొబ్బరి గిన్నెల్లా కుదురైన పాలిండ్లూ, కటిని దాటి చెల్లా చెదురైన మబ్బుతెరల్లా విరబోసుకున్న కురులూ, దానికి తోడు స్థానచ్యుతమై చెవికి వెనకవైపు. తలకు తట్టుకుని అసహ్యంగా వ్రేలాడుతున్న రవికతో, ఏనుగు తొక్కిన

సోకులతలా ఆపాదమస్తకం పాడువారిన ఆమె సొగసు, చూచే కంటికి ఏమాత్రం యింపుని నింపక, ఏదో జగుప్సతో కూడిన భయోద్రేకాలను రేకెత్తిస్తూంది.

ఇంతవరకూ ఏస్పందనా లేక కొయ్యబారినట్లున్న ఆస్త్రీ, తోటిస్త్రీగా నన్ను చూడగానే ఏదో స్పృహ కలిగినట్లు కొంత చలిస్తూ తన్నుతాను దాచుకోవటానికి ప్రయత్నించినట్లు కన్పించింది. కానీ తనకు మిగిలిన అరిటాకుల్లాంటి ఆ రెండు చేతుల్తో ఏ భాగాన్ని ఎట్లా కప్పుకోవాలో తెలియక నిస్సహాయంగా కూలబడిపోయింది.

అత్యాచారానికి గురై అవమానంతో, దుఃఖంతో వాడివత్తై కుప్పకూలిన తామరతూడులా వున్నా ఆ స్త్రీ రాశిబోసిన విషాదంలా కన్పిస్తూంది.

చూస్తున్న కొద్దీ, ఆదృశ్యం, వింతగా రెక్కలు విచ్చుకుని, దుస్స్వప్నగత భీతితో అందరినీఆపొగమబ్బుల్లోకిలాక్కెళ్లేలావుంది.

వికటించిన కాలంతో పోరాడలేక, రాజీపడలేక, సంఘం పెట్టిన రారాపులకు గురై, ఉడికి చివరకు మైనపు ముద్దలా మిగిలిన ఆ వ్యక్తి వికృతదృశ్యం, కామరూప పిశాచి పాశవికపు చేతుల్లో నలిగి నుజ్జై విలవిలల్లాడుతూన్న సంస్కారంలా, మానవత్వపు ముఖమ్మీద పోసిన బురదలా, స్త్రీజాతి పాపెటపై పెట్టిన గొడ్డలిపెట్టులా అమానుషతకు ఎత్తిన జెండాలా, చూచేవారిని వెక్కిరిస్తూ, వారి మనస్సులను పిండుతూ ఏ భావానికీ అందరాని విచిత్ర స్థితిలో ముంచేస్తూ వుంది. ఇలాంటి ఆయోమయ స్థితిలో మున్గుతూ తేల్తూ వున్నమాకు ఏ సవ్వడీ లేకుండా రెండు మూడు నిమిషాలు గడిచాయి.

తాము వెంటాడుతున్న వేట మాఇల్లు చొచ్చినట్లు పసిగట్టిన వేటకుక్కలు మెల్లగా జారుకుంటున్నట్లు పరుగుల సవ్వడి వినిపించింది.

ఆ ధ్వనితో యింతవరకూ కదలికలేని లక్కబొమ్మల్లా ఉండిపోయిన మాలో, తొలుతగా మేల్కొన్న మావారు తన షర్టు విప్పి ఆమెపైకి విసరి తాను ఇంట్లోకి దారితీస్తూ నడిచారు.

చేష్టలుమాని చూస్తున్న ఆమె చుట్టూ ఆ షర్టును నేను తుండు గుడ్డలా చుట్టి లోపలికి నడిపించుకొచ్చాను.

అప్పటికే అర్ధరాత్రి దాటింది. మానసికంగా నేను కూడా బాగా అలసిపోయాను. ఇంట్లోకి వెళ్ళి ఆమెకు కట్టుకోవడానికి వో పాతచీర ఇచ్చి, "ఈరాత్రికి పడుకో! తెల్లవారి అన్ని విషయాలూ చెప్పుదువుగాని, ఇప్పుడేం ఇబ్బందిలేదు" అంటూ చెప్పి నేను నాగదిలోకి వెళ్లి పోయాను.

తెల్లవారింది, మేం కొంచెం ఆలస్యంగానే లేచాం. లేచి, పక్కగదివైపు చూస్తే ఆమె లేదు. ఏదైనా అవసరంకోసం వెళ్ళిందేమో? అంటూ, అటూ, ఇటూ చూచాను ఎక్కడా ఆమె జాడ కనిపించలేదు. నేను దెబ్బ తిన్నట్లు గట్టిగా

ఏవండీ! నిన్నరాత్రి వచ్చిన ఆ మనిషి గదిలో కనిపించడం లేదంటూ కేకవేశాను.

ఆయన నామాట విని ఏ సంచలనమూ లేకుండా, నింపాదిగా, తుండు గుడ్డతో ముఖం తుడ్చుకుంటూ వో మాదిరి వెటకారాన్ని ధ్వనిస్తూ ఆ ఏమైవుంటుంది మరో మంచి గిరాకీని కుదుర్చుకోటానికి బేరసారానికో, కాక మరో వేటకోసమో వెళ్లుంటుంది. ఎంతటి ఘటికురాలుకాకపోతే, ఆ అపరాత్రి... ఇంకా నయం, నీవున్నావు కాబట్టి సరిపోయింది. లేకపోతే? అంటూ సగంలోనే నన్ను చూస్తూ ఆగిపోయారు.

మావారి ఈ చివరిమాట నాగుండెలో అంటే నాలోని స్త్రీత్వాన్ని ఎక్కడో కలుక్కుమంటూపొడిచినట్టైంది.

మావారేనా? ఇలా మాట్లాడుతున్నది?

స్త్రీ అనాథగా, అనాదరణగా ఉంటే ప్రతి వాడికీ లోకువే! అందరికీ చులకనే, పైగా ఆమె యౌవ్వనంలో ఉండి రూపసి ఐతే మరీ ప్రమాదం. ఆమె ఆకర్షణ మగ వాడి అంతరాంతరాళాల్లో దాగివున్న పుంస్త్వాన్ని రగిల్చి కోరికలకు నోరూరిస్తూ, పాశవిక ప్రవృత్తికి గిలిగింతలు పెడ్తుంది. ఆసందర్భంలో మగవాడెంతవాడైనా సరే, తొట్రుపాటు తప్పదు. కానీ సంస్కార బలం, సాంఘిక కట్టుబాట్లు కొంత వరకు ఆ పతనం నుండి ఆపగలుగుతాయి అంతేకాని, అంటూ చెప్పుకుపోతున్నారు.

అప్పుడనుకున్నాను నేను స్త్రీ పురుషుడికి తల్లిగా పరమపూజ్యురాలు, కానీ కేవలం 'స్త్రీ'గా ఆకర్షక పదార్థం, భోగ్యవస్తువు, ఆమె ఆకర్షణకు లొంగిపోవటం పురుషుడి బలహీనత, ఆతాల్యా న్నిదాచుకునే ప్రయత్నంలో, తనను తాను రక్షించుకునేందుకు చేసే ప్రబల కారణం స్త్రీ అంటూ ఆమె మీద కసితో నిందలు మోపుతూ ఆంక్షలు విధిస్తాడు.

ఎంతో సంస్కారం వున్న వారు నా భర్త అంటూ గర్వించే మావారు కూడా? ఏమో? అనుకుని మావారి వుపన్యాస ధోరణికి అడ్డువస్తూ "ఏవండీ! ఆ అమ్మాయి ఆస్థితిలో మన ఇంట్లోంచి వెళ్ళి ఎక్కడికి పోతుంది? ఏనుయ్యో, గొయ్యో చూచుకుందో? కాక, మరే రౌడీ మూక చేతుల్లోనో చిక్కి ఏం యాతనపడ్తుందో, అన్నాను ఆత్రంగా.

నామాటతో రెచ్చిపోతూ, "అవును, నీవన్నట్లే ఎక్కడో పడిచచ్చిందే అనుకో, లేదా మరో ఆకలి పులి కామానికి భోజనంగా మారిందే అనుకో ఇప్పుడు నన్నేం చేయమంటావ్? అతిగా ఆలోచించి, నీమెదడు పాడు చేసుకుంటూ నా టైం వృథా చేయకు, ఇంతవరకైందిచాలు" అంటూ మారుమాటకు తావివ్వకుండా చరచరా నడిచి వెళ్లిపోయారు.

వారెన్ని చెప్పినా నా మనసు మాత్రం ఆ అమ్మాయి నుండి మరల్చుకోలేక ఆమె ఎవరు? ఎలా వచ్చింది? ఎక్కడికి వెళ్లింది అంటూ ఆలోచిస్తూవుంది.

ఏదో వింతస్ఫూర్తి కలిగి వెంటనే తర్కవితర్కం మాని, ఇంటి పనులు పనిపిల్లకు పురమాయించి ఇంటి వెనకవైపు నడకసాగించాను.

మా ఇంటి వెనక ఆవరణ చాలాపెద్దది. తుమ్మ, రేగు, కుంకుడు, చింతలు స్వేచ్ఛగా పెరిగిన చోటు, గడ్డిగాదం, ముళ్లకంపలతో వో పెద్ద కంచెలా వుంటుంది. అక్కడ

సామాన్యంగా జనసంచారం వుండదు. ఈ కంచెను ఆనుకుని వో బావికూడా వుంది. అదెప్పుడూ గర్భిణీస్త్రీలా నిండుగా వుంటుంది. ఆగట్టు పక్కనే వో నాగరాజు ఎన్నో అంతస్థుల భవనంలాంటి పుట్టకట్టుకుని ఎన్నేళ్ల బట్టో కాపురముంటున్నాడు. దైవికంగా పరుగులాంటి నడకతో నేనక్కడికి వెళ్లేవరకు, చీరను కాశగాపోసి, బావిలో దూకడానికి సిద్ధంగా వున్న వో స్త్రీ కనిపించింది.

అదిచూచిన నేను నెమ్మదిగా వెనకవైపు నుండి వెళ్లి, రెండు చేతులూ ఆమె నడుంబిగించి లాగాను. ఆఫోర్స్‌కి ఒకళ్లమీద ఒకళ్లం పడ్డాం. లేచికూర్చున్నాం. శారదా! ఎంతకాలం ఈ దిష్టిబొమ్మను చావకుండా ఆపుతావ్? అంది ఆస్త్రీ. ఆమాటతో చకితనై లేస్తూ ఆమె ముఖాన్ని తేరిపార చూసూ -

"నీకు నేనెలా తెలుసు? అంటూ ప్రశ్నిస్తూనే ఏదో పోలిక స్మృతిలో మెదుల్తూ వుంటే, ఆ నీవు పార్వతమ్మ కూతురు అనసూయవా? అన్నాను. ఆమె ఆ మాట విని రెండు చేతులా ముఖాన్ని కప్పుకుంటూ "అవును, అనసూయనే! స్కూల్లో నీకు వో సంవత్సరం జూనియర్ని, టెంతులో ఫస్టుని, బరిబత్తల బొమ్మని, యింకా బతికివుంటే రేపు కాబోయే ఎంగిలివిస్తరినీ, అంగడి బొమ్మని" అంట్లూ నామీద వాలి భోరున ఏడ్చింది.

ఆమెను ఏడ్వకుఅంటూ వోదారుస్తూ, ఈ ధారుణం ఎట్లా జరిగిందో చెప్పమన్నాను.

"శారదా! నా విషాదగాథ ఎలా ప్రారంభించాలో తెలియడం లేదు. అయినా, నేను పార్వతమ్మ కూతుర్ని, అస్తమానం చుట్టకాలుస్తూ కళ్లద్దాలు పెట్టేరామారావు మానాన్న అంటూ తెలుసుగా

అదేంటి అనూ! నాకు తెలియకేం?

"అయితే విను. ఆరామారావు నన్ను కన్న తండ్రికాదు'

మరి నాన్నా! అంటుండేదానివిగా? మీ అమ్మగారు కూడా భర్తగానే గౌరవించేవారు? ఆమాట నిజమే! అయినా వాడు నా తండ్రి కాదు. అలంకారంలా నా జీవితంలో అంటే మా అమ్మ జీవితంలో ప్రవేశించి, అదను చూచి, నన్ని అధోగదిపాలు చేసింది ఆనీచుడే" అంది.

"అంటే? నాకేం అర్థం కావటం లేదు అనసూయా!" అన్నాను.

మా అమ్మ మంచి సంప్రదాయమైన కుటుంబంలో పుట్టిందే, అయితే కాలగతికి అడ్డమేముంది? అన్ని పాపాల్లో పేదరికం వంటి శాపం మరోటి లేదు. అట్లే విధి వక్రించిన మా తాత మా అమ్మను వోలితీసుకుని, పూర్తిగా వయసు పడమటు తిరిగిన మూడో పెళ్లివాడికి ముడికట్టాడు.

పాపం! వృద్ధుడైన ఆ హనుమంతరాయుడికి కావలసింది భార్యకాదు, తన బాగోగులు చూచే పరిచారిక, అంతే! ఎప్పుడో ఏముహూర్తంలో, ఏ ఒకటి రెండుసార్లు తాకాడో లేదో అమ్మకు నేను పుట్టాను. నాయన మంచం పట్టారు.

వికసించే వయస్సుతో వివాహితకు కోరికలు మోసులెత్తాయి, కానీ వాటిని ఆదరిస్తూ దోహదం చేసే శారీరక సుఖం మా అమ్మకు లభించలేదు. అయినా ఆమెకు ఏంకావాలో తెలియక, ఇంటి చాకిర్లో, మగనిసేవలో మునిగి ఏదో హాయిగానే వుంటుండేది.

అప్పుడు మావూరికి ఇంగ్లీషు మందులిచ్చే కొత్త డాక్టరంటూ ఈ రామారావు మా ఇల్లు తొక్కాడు. విసుక్కోకుండా పొద్దస్తమానం భర్తకు అన్ని సేవలు చేస్తూవున్న మణిశలాకలాంటి మా అమ్మ కంటపడ్డది.

మా అమ్మమీది ఆకర్షణతో మా నాన్న మీద సానుభూతి వైద్యుడికి ఎక్కువైంది. పిలిచిందే పదివేలంటూ రోగిని చూచే నెపంతో ఒకటికి పదిసార్లు ఇంటికి వస్తూ రంగురంగుల నీళ్లు మందు రూపంలో ఇస్తూ, అవకాశాన్ని కల్పించుకుని, సందుదొరికి నప్పుడల్లా ప్రయత్నపూర్వకంగా, యౌవ్వనం ఝల్లుమనేలా అమ్మను తాకుతూ అందరికీ దగ్గరి వాడయ్యాడు.

ఇంతకింతకు మానాన్న మృత్యుముఖానికి చేరువయ్యాడు. పడుచుపెళ్లామని కాబోలు, నాన్న ప్రాణాలుయమయాతన పడ్తున్నా గొంతులో గుటగుటమంటూ తారట్లాడుతున్నాయే కానీ విడిచి పోవటంలేదు.

ఓరోజు మానాన్న కాస్త నిద్రపోతున్నట్లుంటే, వొంటరిగా వసారాలో కూర్చుని అమ్మ విచారంగా ఆలోచిస్తూ వుంటే ఈరామారావొచ్చి "చూడండి పార్వతమ్మగారూ! మీ మంచిని కోరే స్నేహితుడిగా మీకోమాట చెబుదామనుకుంటున్నాను. మీ భర్తనేడో రేపో అంతే! కాటికి కాళ్లు చాచిన ముసలికిచ్చి ఇంత వరకే మీ కోరికల గొంతునులిమారు. మీరు మరీ అణగదొక్కకండి. చేజేతులా అందివచ్చిన అదృష్టాన్ని జారవిడుచుకోకండి. అవివేకంతో అవకాశాన్ని పోగొట్టుకుని వెన్నెల్లా వెలుగ వలసిన జీవితాన్ని చీకటిమయం చేసుకోకండి. ఆత్మకూ, ఇంద్రియాలకు తృప్తి నివ్వని కాపురం కేవలం దాస్యం. అంతకన్నా నరకం మరోటి వుండదు. ప్రత్యక్షంగా మీరనుభవిస్తున్న నరకాన్ని చూస్తున్నవాడిని కాబట్టి చెబుతున్నాను. నామాట వినండి. మిమ్మల్ని అన్యాయం చేయను. నన్ను నమ్మి నావెంటవచ్చేయండి. నాకింకా పెళ్ళికాలేదు. మిమ్మల్ని భార్యగా స్వీకరిస్తాను వొట్టు అన్నాడు".

"నేనంత తెగింపు చేయలేనండి. పాపం! రోగిష్టి మనిషి, చేసే దిక్కులేదు పైగా నాబిడ్డకు తండ్రి. అలాంటి వ్యక్తిని కష్టమసయంలో వదిలి మీతో లేచిపోయి ఎలా వచ్చేది?" అన్నది పార్వతమ్మ.

''అయ్యో! పిచ్చిదానా? రేపోమాపో, ఆ జీర్ణించిన శరీరంలో ప్రాణం హరీ మంటుంది. అప్పుడు చుట్టపక్కాలు రావటం, కర్మకాండ జరపడం, నీతలమాయడం, తతంగం అంతా వుంటుంది. విధవగా, కళావిహీనమై, కృశించి దీనంగా వున్న నిన్ను నా భార్యగా ఎలా స్వీకరిస్తాను?

అందుకే, ఆయనతో ఏసంబంధం లేనట్లు, నా ప్రియురాలిగా రంభలా వొయ్యారాలొలుకుతూ ఇప్పుడే నావెంటవచ్చేయ్. మనిద్దరం ఈవూరు విడిచి రేపురాత్రే బయలుదేరి వెళ్లుదాం. ఏమంటావ్? అన్నాడు.

పాపం పార్వతమ్మ, తెలిసీ తెలియని తనంతో, కోరికల ప్రేరణతో ఎండమావులను తన దప్పిని తీర్చే తీర్థం అంటూ నమ్మి, ఇంట్లో చుట్టాలు ఒక్కొక్కరే సందడిగా చేరుకుంటున్న అదునుచూచి, తెగించి బయటపడింది.

మరి నీవేమయ్యావ్ అనూ?!

నేనేం కాలేదు. నాతోకూడా పార్వతమ్మ ఆ కొత్త మొగుడి వెంట రాత్రికి రాత్రే బయలుదేరింది.

''ఐ .సి'' తన కాంక్ష తీర్చుకున్న రామారావు మీ అమ్మను వదిలెయ్యలేదుగా?

''లేదు శారదా! లేదు, కానీ మాఅమ్మ సజీవదహనాన్ని అనుభవిస్తూ గుట్టుగా బ్రతికింది.

లేచివచ్చి దండలు మార్చుకున్న తొలిరోజుల్లో కొన్నాళ్ల రామారావు వేడికౌగిట్లో ఆ బలమైన చేతుల్లో ఆమె యౌవ్వనం, హాయిహాయి అనిసుఖిస్తూ వుండే ఇంతవరకు తనకు తెలియని సుఖాలన్నీ తన పాదాల ముందు హారతులెత్తిన ప్రేమికుడుగా కనిపించాడు రామారావు.

''అయ్యయ్యో! రామారావుగారి మాట వినకుంటే జీవితంలో ఎన్నో పోగొట్టు కునేదాన్ని. ఇతరమైన ఏ సౌకర్యాలు సుఖాలు లేకపోయినాసరే ! ఈడూజోడూ కలసినవాడు, తోడుగా ఆత్మీయంగా వుంటే స్వర్గసుఖాన్ని అనుభవించవచ్చు'' అనే తృప్తితో మా అమ్మ రామారావుతో జీవించింది.

''అనసూయా! మీ కొత్తనాన్న మంచివాడేగా?

''శారదా! వాడు వ్యసని, దురాచారి, విషయలంపటుడు. డబ్బుకోసం ఏ గడ్డైనా తినడానికి సిద్ధపడేపాపి. నా పతనానికి ప్రధాన కారణం, పడుపు కూటికి ఆశించే కుక్క. కొత్త మోజులో రంభలా కనిపించిన మా అమ్మ అందం విలువ రానురాను తగ్గుతూ వచ్చింది. పైగా తనకేమీకాని నేను ఆయన కంట్లో నలుసుగా తయారయ్యాను. ప్రతి చిన్న విషయానికి నన్ను కఠినంగా శిక్షిస్తూ, తండ్రిగా నాబాగోగులు, బాధ్యతలేవీ పట్టించుకోకపోయినా ఆయన్నేమీ అనేది కాదు నాతల్లి. నేను అదీ, ఇదీ, అంటూ మారాంచేస్తే ''నీబతుక్కిఅదొక్కటేతక్కువ.వూరొక్కనాన్ననువేదించకు'' అంటూ నన్ను కసురుకునేది.

"అంటే నీకు ఈరామారావు సొంత తండ్రి కాదంటూ తెలియదన్నమాట"!

"అవును తెలియదు, మా అమ్మ తెలియనివ్వలేదు. పుట్టెడు వ్యధను కడుపులో దాచుకుని, జారినకాలు మరీ విరిగి వికృతంకాకుండా కాపాడుకుంటూ వచ్చింది. తాను మోపినకాలు బురద అంటూ గ్రహించినా, తీసుకునే మార్గం లేక పరిస్థితులతో సమాధానపడ్తూ, వాడినే మనసావాచా భర్తగా సేవించింది.

"మరినీకెలా తెలిసింది? ఈరామారావు మీ సొంత నాన్నకాడంటూ.

* * *

"శారదా! విను, నేను ఎదిగేకొద్దీ రామారావు కుళ్లు బుద్ధికి ఏంతోచిందో కానీ వాడి దృష్టిలో, ప్రవర్తనలో మార్పు తొంగి చూసింది. నా ఆరోగ్యం, పోషణా పాలనలపట్ల శ్రద్ధ ఏర్పడింది. అన్నిటా వోటిపోయిన మా అమ్మ మంచం పట్టింది. బాగా బలిసిన గొర్రె పిల్లకు బజారులో మంచి ధరను గూర్చి ఆలోచిస్తూ మురిసిపోయే గొల్లవాడి కంటికి మెరుపులా ఎదుగుతున్న నావయస్సూ, సొగసూ రామారావు కళ్లల్లో కొత్తకాంతులను నింపాయి. ఆ తళుక్కుచూచి, దగాపడ్డ మా అమ్మ గుండె వూర్కోనివ్వలేదు."

"అంటే? మీ అమ్మ ఏంచేసింది?"

ఏం చేస్తుంది? ఏం చేయలేదు, కానీ నన్ను పిలిచి, ఇన్నాళ్లూ బయటికి పొక్కే మార్గంలేక కళ్లల్లో సుళ్లు తిరిగి కరడుకట్టిన కన్నీళ్లన్నీ వరదలు కట్టేలా ఏడుస్తూ తన కథంతా చెప్పింది. చివరకు మీ నాన్న కాని నాన్నతో జాగ్రత్త! అంటూ హెచ్చరించింది. ఈ నాజన్మరహస్యం తెలిసినప్పటి నుంచీ, నాలో శాంతి నశించింది. ఇంతవరకూ మా అమ్మ అంటే సహనానికి పెట్టింది పేరూ, ఆమె మహాసాధ్వి అంటూ చిత్రించుకున్న బొమ్మకు మసితాకింది. ఏవగింపు చోటు చేసుకుంది. నాలేతమనస్సు నాకన్నతండ్రిని గూర్చీ, మా అమ్మ చేసిన తప్పొప్పులను గూర్చి ఆలోచించడం ప్రారంభించింది.

నాలో పెరుగుతున్న ఘర్షణనూ, ముభావాన్నీ పసిగట్టిన మా అమ్మ మరింత క్రుంగిపోసాగింది. నన్ను రామారావు ఆప్యాయంగా చూట్టం మొదలెట్టాడు. వోనాడు నేను నాన్నా! అంటూ పిలిచే ఆపశువు చిత్తుగా తాగివున్నాడు. ఎవరో యిద్దరు అపరిచితుల్తో హుషారుగా మాట్లాడుతున్నాడు.

"సార్! ఈరోజూ, రేపు బంగళాలో బసచేసిన మృగానికి వోమంచి వేటకావలసి వచ్చింది" అన్నాడు.

"కాసులు వెదజల్లితే లేళ్లకు కొదువలేందే?" అంటూ సకిలించాడు రామారావు.

"అదికాదుసార్, ఏదో? కొత్తపిట్ట ఐతే మంచిదంటూ మనస్సుపడ్తున్నారు".

"వొక్కపిట్టేంఖర్మ, బుర్కలు, నెమళ్లు, పావురాలు, సరిబరిపోరు సల్పే ఆడడేగలు, పట్టబోతే పదిగిచ్చులు గిల్లే రంగిపిట్టలు, నీటిబాతులు, యింకా గూటి నీడ వదలని

గువ్వలు ఎన్ని దొరకవు? రాగిపైన దులిపితే రాజు బిడ్డరాలుతుంది'' అంటూ లోతుపాతుల ముడివిప్పాడు.

"ఈనాడు ఏదో అకాలం పడి కరువు దాపురించినట్లు దొమ్మరి గుడిసెల నుండి ఘరానా బుకింగ్స్ వరకు హౌస్‌ఫుల్‌గా వుంది. ఆజంతువేమో పస్తులుపడి అలమటించిపోతూంది. మీదేభారం'' అంటూ సాగుతుంది సంభాషణం.

ఆమాటల్లోని అర్థం మొదలూ తుదీ ఏమీగ్రహించలేక. ఏదో వూరి మీది ముచ్చటై వుంటుంది. నాకెందుకంటూ నాపనిలో పడిపోయాను. సాయంకాలమైంది. మామూలుగా తలదువ్వుకుని. వున్నదాంట్లో కాస్త చిరగని చీరకట్టుకుని రోజూ నేను చెప్పే ట్యూషన్ కంటూ బయలుదేరాను. అలా వెళ్తున్న నన్నాపుతూ రామారావు -

"అనసూయా! నీవు ట్యూషన్ చేసుకుని వస్తూ వస్తూ ఈ మందు పొట్లాలు వూరి అవతలి గెస్ట్ హౌస్ పక్కని బంగళాలో వున్న పెద్దమనిషికందచేయాలి. నేనే వెళ్లుందును కానీ మందు కాస్త ఎక్కువైంది. పెద్దవాళ్ల ముందు అలా వెళ్లితే డాక్టరుగా నాపరువు దక్కదు. వచ్చే రెండు రాళ్లూరావు. మన సంసారంకోసం నీవుతప్పకుండా వెళ్లి ఈ చీటీలు ఆయనకు చేర్చిరావాలి. డబ్బిస్తే పట్టుకురా!. ఆ... అన్నట్లు ఈ చీరమరీ పాతదిగా వుంది. మరోటి మార్చుకో!'' అంటూ ఎంతో సహజంగా చెప్పాడు.

ఆమాటల్లో నాకేకొత్తకానీ. అసహజమైన విశేషం కానీ. మోసంకానీ కనిపించలేదు. నిజమే వోపెద్దమనిషి ఎదురుగా వోడాక్టరు బిడ్డగా మరీ పాతగుడ్డల్తో వెళ్తే ఏంబావుంటుంది? 'ఈ మనిషిలో కూడా కాస్త సభ్యతా రుచి యింకామిగిలేవుంది' అని అనుకుంటూ ఆలస్యం చేయకుండా వో ఇస్త్రీ చీరకట్టుకుని బయలుదేరాను.

నేను నాట్యూషన్ పని ముగించుకుని చీకటిపడబోతూంది. ఆవూరవతలి బంగళాకెళ్లాలి. యీ మందులాపెద్దమనిషికివ్వాలి అంటూ గబగబా నడిచి బంగళా చేరుకున్నాను.

గేటుదగ్గర ఎవరో కాపలా వున్నారు. "లోపల ఆఫీసరుగారున్నారా? డాక్టరు రామారావుగారు మందు పంపించారు. నేనాయన కూతుర్ని'' అన్నాను. ఆ కాపలా మనిషి లోపలికి వెళ్లి వెంటనే తిరిగొచ్చి లోపలికి రమ్మంటున్నారు వెళ్ళొచ్చు అంటూ నన్నదోలా ఆపాదమస్తకం పరికించాడు.

గబగబా లోపలికి వెళ్లి ఓ సిటింగ్ రూం లాంటి దాని ముందు ఆగిపోయాను. ఎవ్వరూ కనిపించలేదు. అది ఇల్లో, గెస్ట్‌హౌసో నాకేం అర్థం కావటంలేదు. పిలవటానికి పేరు తెలియదు. ఏం చేయాలంటూ తటపటాయిస్తూవుంటే మధ్య వయస్సులో వున్న ఒక వ్యక్తి అత్తరు వాసనలగుబాళింపులతో ప్రత్యక్షమయ్యాడు.

'నన్ను చూడగానే ఓ వ్వాటే బ్యూటీ! కమాన్ హియర్ ఐయామ్ వెయిటింగ్ ఫార్ యు' అంటూ రెండు చేతులూ చాచాడు.

నేను మరింత బిత్తరపోతూ "నన్ను డాక్టర్ రామారావుగారు పంపారండి. వారమ్మాయిన్నేను. మీకీ మందులిచ్చిరమ్మన్నారు" అంటూ మందుల పొట్లం అందించానునమస్కరిస్తూ.

' వెరి గుడ్, వెరిగుడ్ నిన్ను ఎక్స్‌పెక్ట్ చేస్తూనే వున్నాను. ఎలాయింత దూరం వచ్చావ్‌గా, కాఫీ తీసుకువెళ్లుదువుగాని వుండు" అంటూ బలవంతం చేశాడు.

పెద్దాయన అంతాప్యాయంగా పిలుస్తుంటే మరీ పల్లెటూరి గబ్బిలంలా భేషజం చూపడం బాగుండదనుకుంటూ ఆగదిదాటి లోపలికెళ్ళి కూర్చున్నాను. చూస్తున్న కొద్దీ ఆగది వాతావరణం 'డ్రాయింగ్‌రూంలా' లేదు, బెడ్‌రూంలావుంది. టి.వి ఆన్ చేసి ఆవ్యక్తి లోపలికెళ్లిపోయాడు. టీ మాత్రం రాలేదు. పోఅరగంట తరువాత డ్రస్ మార్చి లాల్చీ, లుంగీతో వచ్చి కూర్చున్నాడు. నాకెందుకో గుండె వేగంగా కొట్టుకుంటూంది. ఆ వ్యక్తి వింత వింత వికృత చూపులతో నన్ను మింగేలా చూస్తున్నాడు. ఎంత ఆదరంవున్నా ఈ చూపులేంటి? అవి నా శరీరాన్ని తాకిన చోట్లల్లా జెర్రులూ, నల్లులూ పాకినట్లుంది. పోనీ నా దృష్టిని మళ్లించుకుని గోడల వైపు చూస్తే అశ్లీలకరమైన చిత్రాలున్నాయి. చివరకు తెగించి "అంకుల్! ఇంట్లో ఆంటీ, పిల్లలూ ఎవ్వరూ లేరా? మీరొక్కరే వున్నారా? నేవెళ్తాను, బాగా చీకటి పడింది" అంటూ లేవబోయాను.

అంతలోకేవాడు అమాంతం ఎగిరి గంతేసినంత పనిచేస్తూ "ఎక్కడికి,పోతావే బుల్‌బుల్, నా ఆకలి తీర్చంది" అంటూ నన్ను అదిమి పట్టుకున్నాడు. ప్లీజ్ అంకుల్ నన్ను వదలండి. ఆలస్యం చేస్తే నాన్న కోప్పడ్తాడు.

ఎవడే నాన్న? ఆతార్పుడుగాడా? నీకింక ఏభయమూలేదు. నీవు ఇంక ఈ నా ప్యార్‌మహల్‌కు మహారాణివి. వాడెంత డబ్బు లాగాడని? అసలు బేరం, మీ అమ్మతోనే కుదుర్చుకున్నాడు. దానికేదో జబ్బు చేసిందని నిన్ను పంపాడు. వ్వాటే జాక్ పాట్ ఐ గాట్! మీ అమ్మ సొగసులాడి అంటూ విన్నాను. అయినా అభల్లూకంచేతుల్లో నలిగి నలిగి కరిగిపోక యింకా ఏం మిగిలుంటుందని? ఆపిల్‌పండులా నీవు దొరికావు. డార్లింగ్ మరీ పసిపిల్లలా వున్నావ్, లవ్ గేమ్ తెలియక పోయినా కిస్ కూడా తెలియదా? అంటూ అడవి దున్నలా నన్నాక్రమించి నా పెదవులనూ, ముఖాన్నీ ఎంగిలి చేస్తున్నాడు. నాకు దుఃఖం ఆగడం లేదు, చస్తే బాగుండుననిపిస్తోంది. అరుస్తున్నాను, గింజుకుంటున్నాను. మధ్యమధ్యలో ఎలుకతో చెర్లాటలాడే పిల్లిలా నన్ను వదిలి లోపలికెళ్లి, తినడానికేవేవో తీసుకొస్తున్నాడు. నేను కలలో కూడా చూడని కమ్మటి షర్బత్ పోసి తాగమంటున్నాడు.

నేను దీనాతిదీనంగా చేతులు జోడిస్తూ వాడి ముందు మోకరిల్లి "నన్ను వదలండి, నేను మీకు బిడ్డలాంటి దాన్ని, నన్నేం చేయకండి" అంటూ ప్రాధేయపడ్డాను.

ఆమృగం కొంత శాంతించినట్లు "నన్ను లేపి పక్కమీద కూర్చో బెట్టుకుని నావీపు నిమురుతూ నివు చలం సాహిత్యం చదువలేదా? ఆడపిల్లలు ఈ కట్టుబాట్లు తెంచుకుని ప్రగతిశీల మార్గంలో నడవాలి. 'దిసీజ్ ఆల్ గివ్ అండ్ టేక్'నా అవసరం నీవు

తీరిస్తే. నీ ఆర్థిక యిబ్బంది నేను తీరుస్తాను. సెక్స్ ఈజ్ యూనివర్సల్ అండ్ బేసిక్ నీడ్, అరుణ చూడు! ఎంత సమర్థవంతంగా అందరు మొగవాళ్లను ఆకట్టుకుందో?" అంటూ తన లిటరరీ టేస్ట్‌ను ప్రదర్శింపబోయాడు వెధవ, రెండుకాళ్ళదున్న.

మావారు చెప్పేది నిజమే! మన సాహిత్యం నీతిని ప్రత్యక్షంగా ప్రచారం చేయకపోయినా అవినీతికి దారిచూపే విధానాన్ని మాత్రం పరిహరించాలి అని మిడిమిడిజ్ఞానం వున్నవారికి యిలాంటి ప్రవచనాలు, విషముష్టిగింజల్లా ప్రమాదాన్ని తెచ్చిపెడ్తాయి. చదివించే కమ్మటి భాషలో సెక్స్ గుమ్మరిస్తే వేలంవెర్రిగా రుచి మరిగి యువత,యువతఒక్కటేనా? అంతా అదారే తొక్కుతుంది. సరే, మరి వాడినోటికి తాళం ఎలా వేశావ్?

నేను తాళం వేయడం ఏమిటి శారదా? వాడే నన్ను ఇంతింతా నరకకూపంలోకి తోసుకుపోయాడు.

మోకరిల్లిన నేను లేవబోతూవుంటే, వాడు ఏదో యంత్రంలా నన్ను వాడిపైకి లాక్కున్నాడు. మైనపు బొమ్మలా వాడి ఎదపైకి వాలిపోయాను. ఆనందంతో వాడు నవ్వుతున్నాడు. 'వండర్‌ఫుల్, వ్హాటే ప్లషర్ అంటూ, నన్ను అదుముకుంటున్నాడు, నా శరీరం భగ్గుభగ్గున మండుతూవుంది. బలాన్నంతా కూడదీసుకుంటూ నన్ను చుట్టుకున్న వాడిచేతిని కొరికి పట్టు విడిపించుకున్నాను. నొప్పితో వాడు బాధ పడ్తూవుంటే చేజిక్కిన అవకాశాన్ని జారనివ్వకుండా లేచి మంచం దిగి పరుగందుకున్నాను.

ఇంతలో తేరుకున్న ఆవసరం ఎదగొన్న కారు దున్నలా దెబ్బతిన్న పందిలా నావెనక వైపు తాకినా వెంట్రుకలు వొడిసి పట్టి, పండ్లతో కుక్కలా నాబ్లౌజు చించి బెడ్‌పై పడేసి, నన్ను పూర్తిగా వివస్త్రను చేశాడు. వాడూ అసహ్యంగా బట్టలన్నీ విప్పి నాపై పడి గిచ్చుతూ. కొరుకుతూ, గీరుతూ రాక్షసానందాన్ని అనుభవిస్తున్నాడు.

గదిలో గడియారం రాత్రి పదకొండు గంటలు కొట్టింది.

నా అదృష్టం నడిచి వొచ్చినట్లుగా, గేటుతీసిన శబ్దమైంది. ఆవెంటనే వో స్త్రీ కంఠం "ఏవండీ! తలుపు, తలుపు" అంటూ కేకలు పెడ్తూవుంది.

నాపైవాలి రేచికలా నారక్తాన్నీ, నాలజ్జనూ, నాస్త్రీత్వాన్నీ, నా సర్వస్వాన్నీ చప్పరిస్తూ, ఎంగిలి కూటిలా అపవిత్రం చేస్తూ, నన్ను మరుక్షణంలో మింగి జీర్ణించుకోవటానికి సిద్ధంగా వున్న ఆముదనష్టపు పిశాచి వెంటనే లేస్తూ, తన గుడ్డలు సవరించుకుని, దీపాలు ఆర్పి, పాపపు బోనులాంటి వాడిగది వెనక వైపు మార్గం నుండి నన్ను అవతలకితోసేసి, తలుపులు బిగించుకున్నాడు.

"ఇంతైనాక, ఇంకా నాలో కన్యత్వం, శీలం మిగిలిందోలేదో? చెప్పలేను కానీ జరుగబోయే సర్వనాశనం వాలకాన్ని బట్టి వచ్చింది ఆ రాక్షసుడి భార్యే అయివుంటుందనుకున్నాను. ఆమె మాటవినగానే సింహగర్జన విన్న నక్కలా వాడి

ప్రాణభయాలు కంపించగా శరీరంలోని నెత్తురంతా నీళ్లై గడ్డకట్టినట్లు భయంతో లేచాడు" అన్నాది అనసూయ.

"అవును అనసూయా! ఆమె భార్యే అయివుంటుంది. పైగా డబ్బున్న తండ్రి కూతురు కావచ్చు. అన్నిటికి తోడు ఎప్పటి నుంచో ఈ పశువు కాముకతా, తాల్యం బాగా తెలిసి విరక్తితో పగబట్టి వుంటుంది. తనకు దక్కవలసిన సుఖం మరెవ్వరికో పంచుతూ, తన డబ్బుతో కులుకుతున్నాడంటూ అడుగడుగునా అవమాన పరిచేందుకు చూస్తూ వుంటుంది. చేతికి దొరికినప్పుడు రెడ్ హేండెడ్ గా పట్టుకుంటానంటూ ఎరవేసి వుంటుంది.

ఈ పోక్‌బారు పశువు ఆమె కన్ను గప్పి జల్సాలకు దిగుతుంటాడు. ఇద్దరి మధ్యలో ఏమాత్రం ప్రేమలేదు. ఒకరికి అసహ్యం, కక్ష మరొకరికి భయం, నిరాదరణ. ఇంట్లో మగవాడికి కానీ, స్త్రీకి కానీ ముకుదాడువేసి ఎంతకాలం నియమించగల్గుతాం? ఏమాత్రం స్వేచ్ఛా స్వాతంత్ర్యం లేని బ్రతుకు, బ్రతుగ్గా వుండదు. నిజమే! ఇచ్చిన స్వేచ్ఛను నిరుపయోగం చేసుకోవడం కూడా మంచిదికాదు. సంసారంలో భార్యాభర్తల మధ్య నమ్మకం వుండాలి. అదిలేని కాపురం పోలీస్ డ్యూటీరూంలా వుటుందేతప్ప, అరమరికలు లేని ఆనందనిలయంలా వుండదు. అందుకే, నమ్మకం విశ్వాసం స్త్రీ పురుషులిద్దరికీ అవసరం. సందేహాగలకూ అనుమానాలకూ తావిచ్చి కాపురాలు కూల్చుకోవద్దంటాం, కానీ యిలాంటి పశువుల్ని వోకంట కనిపెట్టకపోతే ఎన్నో అనర్థాలు బాహాటంగా జరుగుతాయి. ఏమైతేనేం పుట్టి పూర్తిగా మునగకముందే భార్య వచ్చిందని సమాధానపడ్తూ "అన్నా నన్ను క్షమించు నీకు బాధ కలిగిస్తున్నానేమో? తరువాతేం జరిగిందో చెప్పు" అన్నాను.

ఆమె వికటంగా నవ్వుతూ, ఏం జరుగుతుంది?

"నన్నంత వరకూ అపురూపంగా ఆరాధించినంత పనిచేసి, తన భార్య అన్న విషయం రాగానే, నన్ను మాంసం తిన్నాక మిగిలిన ఎముకలా, రసం పీల్చిన మామిడి టెంకలా, నా నగ్నత్వాన్ని గూర్చి కూడా యిసుమంత ఆలోచించకుండా అవతలికి నెట్టాడు. కనీసం మనిషి పుట్టువుకు వుండవలసిన మానవత్వపు లక్షణాలుకూడా లేకుండా ప్రవర్తించిన వాడి నెత్తురు తాగాలనిపించింది. వస్తూ వస్తూ చేతికందిన గుడ్డను చుట్టుకుందామని ప్రయత్నించాను. కుక్కలు ఎగబడ్తూ ఆ గుడ్డను అందుకున్నాయి. భయంకొద్దీ గుడ్డను వాటినోటికిచ్చి, బరిబత్తల, కామినీపిశాచంలా, శివసత్తిలా, పూనకం వచ్చిన మరిడమ్మలా, ముళ్లూ, పొదలూ గీకుతూ నెత్తుర్లోలుకుతున్నా లెక్కచేయక పరుగందుకున్నాను. చీకట్లో పరుగెత్తుతూన్న స్త్రీ ఆకారాన్ని చూచి ఆవాసనకు ఎగబడి మనుష్య రూపంలో వున్న రెండు ఫేటుకుక్కలు నన్ను చీల్చి చెండాడి నా మాంసాన్ని నమిలి మింగడానికి దాహంతో ఆకలితో సిద్ధంగా నన్ను వెంబడించాయి. అన్నిటికీ తెగించి పరుగెత్తుతూ కనిపించిన మీ ఇంటిని రక్షణకోసం ఆశ్రయించాను. అది మీ ఇల్లు అని తెలియదు. తరువాత విషయం నీకు తెలుసు" అంది.

"అవును అనూ! మరి మాకు చెప్పా చెయ్యకుండా ఎందుకిలా వచ్చావ్? కారణం"

"శారదా! ఇంట్లో అడుగు పెట్టగానే నిన్ను పోల్చుకున్నాను. నీవూ. నీభర్తా. పండంటి పసివాడిని చూశాక నీకూ నాకూ నాగలోకానికీ నక్షత్రకూ. స్వర్గనరకాలకూ అమృతానికీ విషానికీ. పారిశుధ్యానికీ బురదకూ వున్నంత తేడా కనిపించింది. నా జీవితం నాకు పరమనీచమైన మరీ అసహ్యంగా పెంటలో పురుగులా కన్పించింది. ఛీ అనుకున్నాను. ముందు 'అవతలికి నడిచి ఆలోచించాలి అనుకుని మనస్సులోనే మీ వారికి నమస్కరిస్తూ, ఏ దృష్టి దోషం నీకు తగలవద్దని కోరుకుంటూ బయలుదేరాను. ఈ బావి కనిపించింది."

"అందులో పడి చస్తాననుకున్నావ్? అంతేనా? పడి ఏం సాధిస్తావ్" అన్నాను.

"శారదా! విను! ప్రతీకారం గూర్చి నేనూ ఆలోచించాను. ప్రతీకారం మాటఅలా వుంచి ఈ విషయం తెలిస్తే నన్ను బ్రతకనిస్తుందా సంఘం? అప్పుడు నేను జీవించాలనుకుంటే వేశ్యనై నాశరీన్ని అమ్ముతూ అందరి కొంపలూ కూలుస్తూ హాయిగానే వుండవచ్చు, తొల్త ఆ పిశాచిని సర్వనాశనం చేయాలి అనుకున్నాను. ఛీ. ఛీ మళ్ళీ వాడి స్పర్శను భరించడమా? వద్దనుకున్నాను.

ఇక రెండో మార్గం. ఉగ్రవాదుల్లో చేరి హింసకు దిగి వాడి ఇంటిల్లిపాది కూకటి వేళ్లతో పెళ్లగిస్తూ బుదిపాలుచేయడం. వాడిపై ఎక్కి తుపాకీ మొనతో కొట్టి కొట్టి చిత్రవధ పాల్జేసి చంపుతాను. కీలుకీలు విరుస్తాను, ఆ నోటిలో కణకణలాడే నిప్పు కలుపోసి కాలుస్తాను. కానీ! వాడితోపాటే ఎందరో అమాయకులు చావాలి. నా స్వార్థం కోసం అందరినీ బలివ్వడం దేనికి? సిద్ధాంతం మంచిదైనా ఆచరణలో అమలులో జరిపే సామూహిక హింస నన్ను కంపింపచేసింది వద్దనుకున్నాను. మెదడు వేడెక్కుతూ వుంది. ఎవరైనా చూస్తారేమో? కసికి ప్రకోపం తగ్గగానే పిరికితనం ఆవరించింది. ఏమైతేనేం చచ్చిపోవటమే సర్వోత్తమం. ఎవరూ రాకపూర్వమే ఈ బావిలో పడ్డాననుకున్నాను. నీవాళ్లో పడ్డాను" అంటూ ముగిచింది.

ఆనసూయా! నా మాట విను. నీవు చావవలసిన పనిలేదు. నీ పగ తీర్చుకుందుకు మరో మార్గం వుంది. పగంటూ సాధించాలీ అంటే ఎవరనేది తేల్చుకో! మొదట మీ అమ్మను కాటికి కాళ్లు చాచిన ముసలికిచ్చిన మీ తాతదోషా? పదహారేళ్ల పసిదాన్ని వాంఛలుడిగిన మీ నాన్న పెళ్లి చేసుకోవడం దోషమా? మీ అమ్మను నమ్మించి ఆమెకు అన్యాయం తలపెట్టిన ఆ నీచుడు దోషా? నిన్ను తార్చిన దురాత్ముల్లా, నిన్ను ఆటబొమ్మకన్నా నికృష్టంగా ఆడుకోదలచిన కాముకుడా? సంఘమా? పేదరికమా? తెలియనితనమా? మనఅంధవిశ్వాసాలా? గొర్రెదాటుతనమా? అన్యాయాన్ని ఎదిరించే శక్తిలేని బిడియమా? బెదురా? ఏది?

నా దృష్టిలో అన్నీ అంటాను. ఏదో వోఛిద్రం ఏర్పడితే పురుగు చొచ్చి తొల్చినట్లు అనావరణగా నిస్సహాయంగా స్త్రీ వున్నంతకాలం సంఘం వొక్కటై పిచ్చి కుక్కను తరిమినట్లు తరుముతుంది స్త్రీని.

బలాన్ని పుంజుకో! నిద్రాణమైన నీ శక్తులను జాగృతం చేయి. నీకే భయమూలేదు అవమానపడవలసింది నీవుకాదు. నిన్నాస్థితిలో చూచిన సంఘం తలదించుకోవాలి. ఆ ఇద్దరు దుర్మార్గులను శిక్షించాలి. ప్రస్తుతానికి నీ శీలం ఎక్కడికీ పోలేదు. రా! పోదాం ఇంట్లోకి నడువు. నీవు పై చదువులు చదవడానికి సిద్ధపడు. దీక్షగా వుండు. నీకు తెలియదు. మా సఖ్య సమాఖ్య వుంది. భావనా సాహితి వుంది. తదితర స్త్రీ వాద, సంక్షేమ సంఘసభ్యులున్నారు. వాళ్లంతా సంఘటితమై ఆ దుర్మార్గుడిని మూడు చెరువుల నీళ్ల తాగించి నీకాళ్లపై పడవేస్తారు. ఇప్పటికి శాంతించు అన్నాను.

పాము తోకవూపుకుంటూ పుట్టలోకి వెళ్లిపోయింది. మేం ఇంట్లోకి నడిచాం.

# మార్పు

అబ్బూరి ఛాయాదేవి

దమయంతి మరింత గట్టిగా అరుస్తోంది - "మా కనీస అవసరాలు తీర్చాలి... యాజమాన్యం దిగి రావాలి... దిగి రావాలి... శ్రామిక స్త్రీలు వర్ధిల్లాలి... వర్ధిల్లాలి..." అంటూ రకరకాల నినాదాలు వినవస్తున్నాయి. దమయంతి వెనక ఇంకా పదిహేను మంది దాకా మహిళలున్నారు. పాతిక మంది దాకా మగవాళ్ళున్నారు వారి పక్కలా, ముందూ, వెనకా. ఆ రోజు నుంచీ 'రిలేనిరాహార దీక్ష' సాగిస్తామని ముందుగానే నోటీసు ఇచ్చింది స్టాఫ్ యూనియన్.

నెల రోజుల నుంచీ సాగుతోంది ఈ వ్యవహారం. ముందు 'బ్లాక్ బాడ్జెస్' కట్టుకుని పని చేయడం, తరవాత రెండు రోజులు 'పెన్‌డౌన్ స్ట్రైక్' చేయడం జరిగింది. అయినా యాజమాన్యం స్టాఫ్ కోరికలను పట్టించుకోలేదు. ఒక రోజు పూర్తిగా స్ట్రైక్ చేశారు. అయినా సంప్రదింపులు కూడా జరగలేదు. ఇప్పుడు నిరాహార దీక్ష మొదలైంది.

అడిగిన వెంటనే వారి కోరికన్నింటికీ దాసోహమంటే ఇంకా నెత్తికెక్కుతారు. వాళ్ల కోరికలకు అంతుండదు అని యాజమాన్యం ఆలోచన. యూనియన్ వాళ్లిచ్చిన నోటీసులనూ, బెదిరింపులనూ లెక్కచెయ్యలేదు. 'డెయిలీ వేజ్ వర్కర్స్'తో పని కొనసాగిస్తున్నారు.

"ఎప్పటికప్పుడు వీళ్లు ఏదో ఒక కొత్త పేచీ పెడుతూనే ఉంటారు. వీళ్ళకసలు పనిమీద శ్రద్ధ లేదు. ఎంతసేపూ జీతాలూ, భత్యాలూ, సౌకర్యాలూ పెంచమనడం తప్ప మరోధ్యాస లేదు. సంస్థ పురోభివృద్ధి కించిత్తైనా పట్టదు వీళ్లకి. ఉద్యోగం వచ్చేదాకా కాళ్లావేళ్లా పడతారు. ఉద్యోగం సుస్థిరమైన మర్నాటి నుంచీ కళ్లు నెత్తికెక్కుతాయి.." అంటూ సాధిస్తున్నాడు మా డైరెక్టర్ రివాల్వింగ్ ఛైర్‌లో కూర్చుని.

నేను ఎదురుగా ఉన్న మామూలు కుర్చీలో (కుషన్ ఉన్నదే) ముళ్ల మీద కూర్చున్నట్లు కూర్చున్నాను.

ఇప్పుడు వాళ్ళని ఒప్పించే బాధ్యత నాపైన పెట్టాడు. ఇంకా నాతోటి డెప్యూటీలు, అసిస్టెంట్లూ లేకపోలేదు. నేను నా కింది వాళ్ళపై సానుభూతి చూపిస్తూ ఉంటాననీ, వాళ్ళతో స్నేహంగా మసలుతూ ఉంటాననీ మా డైరెక్టరుకి కొంచెం గుర్రు. చాటుగా వాళ్ళమీద కస్సుగా మాట్లాడుతూ, ఎదురుగా ఏమీ అనడు! తన ఆదేశాలను అందించడానికి డెప్యూటీలనూ అసిస్టెంట్లనూ వాడుకుంటాడు. ఎవరైనా మమ్మల్ని కాదని డైరెక్టరు దగ్గరికి నేరుగా వెళ్ళి మాట్లాడితే మెత్తబడిపోతాడు; తన కరకుతనం కరిగిపోకుండా ఉండాలని, కరిగిపోతే ఎక్కడ క్రమశిక్షణ దెబ్బ తింటుందోనని ఎవరూ తనతో నేరుగా వచ్చి మాట్లాడే పరిస్థితి లేకుండా చూసుకుంటాడు వీలైనంత వరకు. ఎప్పుడో స్టాఫ్ పార్టీలలోనూ, సమావేశాల్లోనూ తప్ప అందరికీ అందుబాటులో ఉండడు. మూల విరాట్టులా తన ఛాంబర్‌లో కూర్చుంటాడు. కనీసం వారానికి ఒకసారి డెప్యూటీలనో, అసిస్టెంట్లనో తన గదిలో సమావేశపరచి సాంకేతిక విషయాలనూ, ఇతర వ్యవహారాలనూ చర్చించి ఇవ్వాల్సిన సూచనలూ, ఆదేశాలూ ఇస్తూంటాడు. మా సీనియర్ ఉద్యోగులం ఎవరి మట్టుకు వారు ఎప్పటికప్పుడు వ్యక్తిగతంగా మా బాధ్యతా నిర్వహణ గురించీ, రేకెత్తుతున్న సమస్యల గురించీ రిపోర్టు ఇస్తూనే ఉండాలి. మధ్య మధ్య నలుగురి ముందూ డైరెక్టరు పెట్టే చివాట్లు తింటూండడం, అప్పుడప్పుడు చాటుగా ప్రశంసలు అందుకోవడమూను!

సీనియర్ టెక్నికల్ అసిస్టెంట్‌గా చేరి కష్టపడి పనిచేస్తూ, క్రమంగా అసిస్టెంట్ డైరెక్టర్‌నై, ఇప్పుడు డెప్యూటీ డైరెక్టర్ పోస్టుకి చేరుకున్నాను. కానీ, సీనియర్ టెక్నికల్ అసిస్టెంట్‌గా పనిచేస్తున్నప్పుడు జీతం తక్కువైనా, నాకు పని వల్ల కలిగే ఆనందం, తృప్తీ ఇప్పుడు ఉండటం లేదు. ఇది వరకు చాలా మటుకు నేను చేసిన పనికి మాత్రమే నేను బాధ్యత వహించవలసి వచ్చేది. నాతోపాటూ, నా కింద కొద్దిమందితోనూ కలిసి మెలిసి ఉంటూ, నేను నిజాయితీగా కష్టపడి పని చేసి పేరు తెచ్చుకునే అవకాశం ఉండేది. ఇప్పుడలా కాదు. ఎంత వద్దనుకున్నా 'సూర్యకాంతం' పాత్ర! "హాయ్ హాయ్ ... డౌన్ డౌన్" నినాదాలు వినవలసి రాకుండా, నాకింది ఉద్యోగులందరి చేతా పనిచేయించే బాధ్యత నాది. ఈ యూనియన్ ఏర్పడ్డాక ఆఫీసులో పనులు కుంటుపడడం సామాన్యమై పోయింది. మీటింగుల పేరు చెప్పి కొందరు లీడర్సు పని చేయకపోయినా నిలదీసి అడగడానికి వీల్లేదు. అది వాళ్ళ హక్కు. పని చేయని రకం అయినా సరే, చర్య తీసుకోవడానికి వీల్లేదు. కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్‌లో ఎవరి గురించీ వ్యతిరేకంగా ఒక్క ముక్క రాయడానికి సాహసించలేం. అడకత్తెరలో పోకలా ఉంటుంది నా పరిస్థితి. అటువంటి వాళ్ళందరిచేతా పని చేయించడాన్ని బట్టీ, నాతోటి అధికారులతో ఘర్షణ పడకుండా మసల్కోవడాన్ని బట్టీ నా నైపుణ్యం నిర్ణయింపబడుతోంది. అందుకే కదా నా కింత జీతం ఇస్తోందిప్పుడు!

మా డైరెక్టరుకి నా కన్నా ఎంతో ఎక్కువ జీతం వస్తుంది. మా అందరి చేతా సవ్యంగా పని చేయించడం, సంస్థని అభివృద్ధి పరచడం, ప్రభుత్వ ధనం దుర్వినియోగం కాకుండా చూడటం ఆయన బాధ్యత. అది రివాల్వింగ్ ఛైర్‌లో కూర్చున్నంత సులభం, సుఖం కాదు. ఎంత చెట్టుకంత గాలి అన్నట్లు ఎవరి బాధ వాళ్ళది.

"పీళ్లకి మతిపోయింది" "పీళ్లు ఒట్టి మూర్ఖులు" అంటూ నిశ్శబ్దాన్ని ఛేదిస్తున్నాడు మా డైరెక్టరు.

ఈ సారి యూనియన్ చేసిన 'డిమాండ్ల'లో ఒకటి కొంత మంది ఉద్యోగులకు అయిష్టత కలిగించేదీ, మరొకటి యాజమాన్యాన్ని ఇరుకులో పెట్టేదీనూ. మొదటిది విద్యకి సంబంధించిన 'క్వాలిఫికేషన్' లేని వాళ్లకి అనుభవాన్ని పరిగణనలోకి తీసుకుని ప్రమోషన్ పోస్టుల్లో కొంత శాతం రిజర్వు చేయాలన్నది. చప్పి చెడి ,చదువుకుని క్వాలిఫికేషన్స్ సంపాదించిన వాళ్లకే ప్రమోషన్లు వచ్చే అవకాశాలు అంతగా లేవు. ఫస్టు క్లాసులు తెచ్చుకున్న వాళ్లూ, గోల్డ్‌మెడల్స్ తెచ్చుకున్న వాళ్లూ అభ్యంతర పెడుతున్నారు. 'ఎంత అనుభవం ఉంటే మాత్రం గాడిదా, గుర్రం ఒకటవుతాయా. మా చదువుకీ, పడిన కష్టానికీ విలువ లేదా" - అని వాళ్ల వాదన. 'ఇన్నేళ్ళ నుంచీ సాంకేతికమైన పనులు కూడా నేర్చుకుని కష్టపడి పనిచేస్తూ సంస్థ అభివృద్ధికి తోడ్పడ్డాం. జీతాలూ హోదాలూ ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుగా ఉంటే, మాకు ఉద్యోగంలోనూ జీవితంలోనూ అభివృద్ధి అనేది శూన్యం కదా, మాక్కు కష్టపడి పనిచేయాలనే స్ఫూర్తి ఎక్కణ్ణించి వస్తుంది. సంస్థ ఎలా బాగుపడుతుంది' - క్వాలిఫికేషన్స్ లేని వాళ్ల వాదన. రూల్స్ ఒప్పుకోవు అంటే, రూల్స్ మార్చమని వాళ్ల పట్టు. వీళ్లంతా ఉన్నత స్థానాల్లో కొస్తే సంస్థ నైపుణ్యం దెబ్బతింటుందేమోనని మా భయం.

రెండవ 'డిమాండ్' 'క్రెష్' ఏర్పాటు గురించి ఇప్పుడు మా సంస్థలో పనిచేస్తున్న వాళ్లలో స్త్రీలు పాతిక మంది దాకా ఉన్నారు. వాళ్లలో చంటి పిల్లలు, ఇంకా స్కూలుకి వెళ్లని చిన్న పిల్లలున్న వాళ్లున్నారు. వాళ్లకి సౌకర్యంగా ఉండేందుకు సంస్థ ఆవరణలోనే ఒక 'క్రెష్' ఏర్పాటు చేయాలని వాళ్ల అభ్యర్థన.'అటువంటి సదుపాయం ఏర్పరచడానికి చాలా ఖర్చవుతుందనీ, అందుకు అనుకూలమైన రూలుగానీ, వనరులు గాని లేవనీ, పిల్లల్ని పరిరక్షించే బాధ్యత మా సంస్థది కాదనీ, అది ఆయా స్టాఫ్ మెంబర్ల వ్యక్తిగత సమస్య' అనీ యాజమాన్యం వాదన.

"రూల్సు లేవనడం కేవలం తప్పించుకునే మార్గమే. లేకపోతే తయారు చేసుకోవాలి. అంతకు ముందు స్త్రీలు ఉద్యోగాలు చేయడం అరుదుగా ఉండేది. అంచేత అటువంటి విషయమై ఆలోచించే అవసరంగానీ, అందుకు కావలసిన రూలు ఏర్పరచే అగత్యం గానీ లేకపోయింది. ఇప్పుడు ఏ ఆఫీసులో చూసినా ఉద్యోగాలు చేసే స్త్రీల సంఖ్య పెరిగింది. కనీసం పాతిక మంది స్త్రీలు పనిచేసే చోట పది మందికైనా చంటి వెంటా ఉంటారు. ఆఫీసు సమయంలో వారి పిల్లల సంరక్షణ కోసం 'క్రెష్' ఎంతైనా అవసరం. అందరి ఇళ్లలోనూ పిల్లల్ని చూసుకునేందుకు అమ్మలూ, అత్తలూ, ఆయాలూ ఉండరు. అటువంటి వారు ఎక్కడో ఇళ్ల దగ్గర క్రెష్‌లో పిల్లల్ని వదిలేసి వస్తే, కొన్ని మైళ్ల దూరంలో ఉద్యోగం చేసే తల్లులకి ఎంతో క్షోభకలుగుతుంది! తల్లీ పిల్లల ఆరోగ్యాలు శారీరకంగానూ, మానసికంగానూ బావుండాలంటే, తల్లి పని చేసే సంస్థలో క్రెష్ ఏర్పాటు ఉండటం చాలా అవసరం. ఈ అవసరం నగరాల్లో రోజు రోజుకీ పెరుగుతోంది. ఒక్క ఫ్యాక్టరీల్లోనే కాదు, ఉద్యోగ స్థలాల్లో క్రెష్‌లుండాలి" అని యూనియన్ వాదన.

యూనియన్‌లో క్లాస్ ఫోర్‌కేడర్‌లీడర్. దమయంతితో విపులంగా చర్చించిన తరవాత మా డైరెక్టర్‌కి వారి వాదన అంతా వినిపించాను. ఆ చెప్పడంలో వాళ్ల పట్ల కొంత సానుభూతి ధ్వనించడంతో ముందు నా మీద మండిపడ్డాడు మా డైరెక్టరు.

"మొదటి నుంచీ ఆ దమయంతిని వెనకేసుకొచ్చి చెడగొట్టింది నువ్వే" అన్నాడు. అతని కంఠంలోని కాఠిన్యాన్ని బట్టి 'నువ్వు' అన్నాడనే అనిపించింది. తోటి వాళ్లతోనూ, కింది వాళ్లతోనూ ఇంగ్లీషులో మాట్లాడుతున్నప్పుడు 'మీరు' అంటున్నారో, 'నువ్వు' అంటున్నారో తెలియదు కదా. మాట్లాడే ధోరణి బట్టి గ్రహించాలి గౌరవం చూపిస్తున్నారో లేదో. ఇంతకీ, ఇప్పుడు మా డైరెక్టరు నన్ను 'మీరు' అన్నానా కొరిగింది లేదు. నిష్ఠురం ఎలాగూ వేశాడు.

ఆ క్షణంలో నాకు గతం కళ్లముందు నిలిచినట్లయింది.

సరిగ్గా అయిదేళ్ళ క్రితం - ఒకరోజు నేను పొద్దున్నే ఆఫీసుకొచ్చి సీటులో కూర్చున్న రెండు నిమిషాలకే డైరెక్టరుగారు పిలుస్తున్నారని కబురొచ్చింది.

అప్పుడు వెంటనే డైరెక్టరు గదిలోకి వెళ్లాను. అక్కడ, ఆయన ఎదురుగా ఉన్న కుర్చీలకు దూరంగా, ఒక పక్కన నేల మీద ముడుచుకుని కూర్చుని ఉంది ఒక స్త్రీ. నెత్తినిండా ముసుగు జీర్ణాడుతోంది. వెలిసిపోయిన ముతక చీర కట్టుకుని ఉంది. నేను తెల్లబోతూ చూశాను డైరెక్టరువైపు. ఆఫీసు పరిసరాల్లో అటువంటి దృశ్యాన్ని చూడటం అదే.

నా చూపుల్లోని ప్రశ్నకి సమాధానంగా డైరెక్టరు చెప్పడం మొదలు పెట్టాడు. అక్కడ కూర్చున్నామె మా ఆఫీసులో పనిచేసినఅటెండెంట్ రామ్‌సింగ్ భార్యట. రామ్‌సింగ్ పోయి నెల రోజులవుతోంది. అతని కుటుంబానికి రావలసిన డబ్బు విషయమై వ్యవహారం నడుస్తోంది. అది కనుక్కోవడానికి కాదు ఆమె ఇక్కడికి వచ్చింది. ఆమె ఎవరి చేతో రాయించి పట్టుకొచ్చిన దరఖాస్తు కాగితాన్ని నా చేతికిచ్చాడు డైరెక్టరు.

రామ్‌సింగ్ పోస్టులో బలరామ్‌ని ప్రమోట్ చేస్తున్నాం కదా రూలు ప్రకారం' అన్నాను కాగితం తీసుకున్నాక.

'అవును తెలుసు. ఆ బలరామ్ వేకేట్ చేసే ఫ్యూన్ పోస్ట్‌లో ఒక స్వీపర్ వస్తాడు. ఆ స్వీపర్ ఖాళీలో రోజు వారీ వేతనానికి ఈమెని తాత్కాలికంగా తీసుకోవాలి ప్రస్తుతానికి. ఆ విషయమై 'నోట్' తయారుచేసి పట్టుకొస్తే సంతకం చేస్తాను. ఇది రోజు వారీ వేతనానికి ఈమెని తాత్కాలికంగా తీసుకోవాలి ప్రస్తుతానికి. ఆ విషయమై 'నోట్' తయారు చేసి పట్టుకొస్తే సంతకం చేస్తాను. ఇది రోజు వారీ వేతనం అన్న సంగతీ, డ్యూటీ వేళల గురించీ, అన్నీ చెప్పండి ఆమెకి అన్నాడాయన.

'నీపేరేమిటి' అని ఆమెని అడగబోయి, ఆమె ఇచ్చిన దరఖాస్తులో పేరు చూసి,'దమయంతీ, రా నాతో' అన్నాను ఆమెతో హిందీలో. ఆమె లేచి ముసుగుని మరింత ముందుకి లాక్కుని, డైరెక్టరుకి నమస్కారం చేసి నా వెంట వచ్చింది.

నెలా పదిహేను రోజుల తరువాత దమయంతి స్వీపర్‌గా చేరింది మా సంస్థలో. చేరిన రోజున రాగానే ముందు నా కాళ్లకు దణ్ణం పెట్టింది. నేను సిగ్గుపడి,'ఛీఛీ, అదేమిటి, అలాంటి పనులు చెయ్యకు' అన్నాను.

'మీరు కలగజేసుకుని అంత శ్రద్ధ తీసుకోకపోతే నాకీ కొలువు దొరికేది కాదు' అంది.

'ఇందులో నేను చేసినదేమీ లేదు. రూలు ప్రకారం నీ హక్కుగనే నీకొచ్చింది' అన్నాను.

'అట్లా అనడం మీ మంచితనమమ్మా. అమ్మా, ఆ దొడ్డ మనసుతోనే ఇంకాస్త పుణ్యం కట్టుకోమ్మా, ఇంకో చిన్న విషయంలో కూడా దయ చూపించు తల్లీ' అంది.

ఏమైనా డబ్బు కావాలంటుందేమోనన్న అనుమానం వేసింది. 'ఏమిటి?' అన్నాను బింకంగా.

'నా బిడ్డకి రెండేళ్ల వయస్సమ్మా. నన్ను విడిచి పెట్టి ఉండదు ఎవళ్ల దగ్గరా. మా ఊర్లో అయితే మా అత్తా, అమ్మా వాళ్లూ ఉంటారు. ఈ పట్నంలో నేనొక్కర్తినీ. మా ఊరి వాడొకాయన ఇక్కడుంటే, వాళ్లింట్లో ఉంటున్నా. అక్కడ నా బిడ్డని ప్రేమగా చూసే వాళ్లెవరూ లేరు. ఉన్నా, కొత్త వాళ్ల దగ్గర ఉండదది. ఆఫీసులో ఇక్కడే ఓ మూల కోర్చోపెట్టుకుంటాను. మీరు ఒప్పుకోవాలమ్మా - లేకుంటే నా బిడ్డ బెంగతో చచ్చిపోతుందమ్మా' అంటూ చేతులతో మొక్కుతూ దీనంగా చూసింది నావైపు.

ఇటువంటి సమస్యని నేనెప్పుడూ ఎదుర్కోలేదు ఆఫీసులో. ఇంట్లో ఒకసారి ఒక పనిమనిషి అలాగే చంటి పిల్లాణ్ణి తీసుకొచ్చేది. వాడు ఇంట్లో ఏడవడం, ఉచ్చపోసి, దొడ్డివెళ్లి ఇల్లుపాడు చేయడం చూస్తే నాకు చిరాకేసేది. కానీ, పిల్లవాణ్ణి తీసుకురావద్దంటే పనిలోకి రావడం ఎక్కడ మానేస్తుందోనని భయపడి సహించేదాన్ని. ఇక్కడ అలా ఎలా కుదురుతుంది? ఇది ఆఫీసు. ఆ చంటి పిల్లని  నడకొచ్చిన పిల్లని ఓ మూల కూర్చోమంటే కూర్చుంటుందా? అదే అన్నాను.

'అదంతా నేను చూసుకుంటానమ్మా. అది మారాం చేసే పిల్లకాదు. నేను మధ్య మధ్య కనిపిస్తూంటే చాలు దానికి. కాదనకమ్మా' అంటూ మళ్లీ నా కాళ్లు పట్టుకోబోయింది.

వారిస్తూ, 'అయినా, ఈ ఏర్పాటు ఎన్నాళ్లో సాగదు. మీ వాళ్ల నెవరినైనా పిలిపించుకోవాలి ఎప్పటికైనా. పిల్లతో ఇక్కడ గొడవైతే నీ ఉద్యోగానికే ముప్పొస్తుంది' అన్నాను.

వెంటనే కళ్లమ్మట నీళ్లు పెట్టేసుకుంది. 'నాకు లేక లేక పుట్టిన బిడ్డమ్మా. దాని దురదృష్టం. నా కర్మ. అచ్చటా ముచ్చటా తీరకుండానే పోయాడు నా మగడు. నేనెట్లా వదిలేసేదమ్మా బిడ్డని? ఎవళ్లు చూస్తా? కొలువు లేకపోతే మా బతుకెట్లా?' అంటూ ఏడ్చింది.

అనుమతి కోసం మా డైరెక్టర్ని అడిగి లాభం ఉండదని తెలుసు. ఏమైతే అవుతుంది లెమ్మని.

'సరేలే. నాకు మాట రాకుండా చూసుకో' అన్నాను - ఈలోగా తక్కిన క్లాస్ ఫోర్ స్టాఫ్‌లో కొందరితో చెప్పి ఉంచవచ్చులే అనుకుంటూ.

కాసేపటికి పక్కనున్న స్టోర్ రూమ్ లోంచి చంటి పిల్ల ఏడుపు వినిపిస్తే తెల్లబోయాను. మొదటి రోజునే, చేరేటప్పుడే పిల్లని వెంట తీసుకొచ్చేసి, తరవాత నా

మళ్ళీ కొప్పు ముడివేస్తూ కుంచిస్తా. మామా! దాని గడుసు తనానికి. వారక్కి అల్లుకుపోయాను. అప్పుడింకేం చెయ్యగలను?

'నేనున్నప్పుడుగానే ఆ పిల్ల ఓ మూల కూర్చుని ఉండేది కాదు. తల్లి కొంగు పట్టుకుని తిరగా తిరగా తిరిగేది. బొద్దుగా ముద్దుగా ఉండేది. అంచేత స్టాఫ్‌లో ఎవరికీ విరాకనిపించలేదు. కానీ మా డైరెక్టరు కంట పడిన వెంటనే, ఆ పిల్లకేసి చురచుర చూసి, తక్షణం నన్ను పిలిపించాడు.

'ఏమిటిదంతా?' అన్నాడు తీక్షణంగా చూస్తూ నేను సమాధానం చెప్పేలోపునే.

'ఇది ఇల్లా, ఆఫీసా? ఎవరిచ్చారు పర్మిషను?' అన్నాడు కఠినంగా.

'పర్మిషన్ ఇవ్వడం కాదండి. చేరిన రోజునే తీసుకొచ్చింది ఇంట్లో చూసేదెవ్వరూ లేరని. ఏం చెయ్యాలో తెలియక జాలిపడి ఊరుకున్నాను' అని. తప్పుచేసిన దానిలా తలవంచుకున్నాను.

'ఎవరూ లేకపోతే మన నెత్తికెక్కిస్తుందా? ఆఫీసులో క్రమశిక్షణ అంటూ ఉండక్కర్లేదా? రేపొద్దున్న ప్రతివాళ్లూ తమ పిల్లల్ని వెంట బెట్టుకొస్తే ఏమవుతుంది? ఫైల్స్ చూడ్డం మానేసి ఉయ్యాల లూపుతూ కూర్చుంటారా? అన్నాడు వెటకారంగా. నాకు నవ్వొచ్చింది. నవ్వితే పుండు మీద కారం చల్లినట్టు ఉంటుందని, ఎంతో దిగాలుగా ముఖం పెట్టి.

'సారీ, ఆ పిల్లతో ఏమీ గొడవ కాకుండా చూస్తాను ఇంకెప్పుడూ ఇలాంటివి జరక్కుండా చూస్తాను' అన్నాను.

'నో, వారం రోజులు గడువిస్తున్నాను. ఆ పిల్లకి కావలసిన ఏర్పాట్లేవో వేరే చేసుకోమనండి. ఏట్టి పరిస్థితుల్లోనూ ఇక్కడ ఉంచడానికి వీల్లేదు' అన్నాడు. సరేనని ఇవతలికి వచ్చేశాను.

వారం రోజులు కాదు. మొదటి నెల జీతం అందిన వారం రోజుల తరవాత, వాళ్ళ ఊరి నుంచి ఎవరినో పిలిపించుకుని ఎలాగో తంటాలు పడింది దమయంతి.

అటువంటిది ఇవ్వాళ ఎంత ఎదిగిపోయింది? చేరాక, ఏడాది తిరక్కుండానే దమయంతిలో మార్పు కొట్టొచ్చినట్టు కనిపించింది. మొదట్లో అంచులేని, వెలిసి పోయిన పాత ముతక చీర కట్టుకుని నెత్తినిండా ముసుగు వేసుకుని వచ్చేది. క్రమంగా ముసుగు కొద్దిగా నెత్తి మీదికి వచ్చేలా సవరించుకుంది. మరి కొన్నాళ్ళకి ముసుగు వేసుకోవడం మానేసింది. మంచి మంచి రంగు చీరలు - వాయిల్ చీరలు కట్టడం మొదలు పెట్టింది. ఒదిగి ఒదిగి ఉండటం ఏనాడో మరచిపోయింది. వెన్ను విరుచుకు నడవటం అలవాటయింది. కొత్తలో 'రామ్‌రామ్, మేమ్ సాబ్' అనేది. తరవాత, ఉద్యోగంలో స్థిరపడ్డాక, 'నమస్తే మేడమ్' అనడం నేర్చుకుంది. వాదించడం, ఉపన్యాసాలివ్వడం నేర్చుకుంది నలుగురినీ చూసి. అంతేకాదు, యూనియన్‌లో 'కేడర్ లీడర్'గా ఎన్నుకోబడింది.

ఈమె ఒక నాడు తన బిడ్డని ఆఫీసుకు తీసుకొచ్చి దీనంగా వేడుకుంది. ఈనాడు స్టాఫ్‌లోని స్త్రీలందరికీ ఆ అవకాశం ఉండాలనీ, అందుకు తగిన సదుపాయాలు కల్పించమనీ 'డిమాండ్' చేస్తోంది!

మా స్టాఫ్‌లో స్త్రీలు పడే ఇబ్బందుల సంగతి నాకు తెలియక కాదు. వాళ్ల ఇబ్బందులతోపాటు, వాళ్ల మూలాన్నీ - లేటుగా రావటం, షార్ట్‌లీవ్ తీసుకోవటం మొదలైన వాటి వల్ల - ఆఫీసులో పని సక్రమంగా సాగక ఇబ్బందులు ఏర్పడటం నాకు తెలుసు. అందుకే నేనెప్పుడూ అనుకుంటూ ఉండేవాణ్ని - రిటైర్ అయ్యాక ఒక 'క్రెష్' నడపాలని.

కాలక్షేపానికి కాలక్షేపం, ధనార్జనకి ధనార్జన, 'సోషల్ సర్వీస్' చేసినట్లూ ఉంటుందని అనుకునేవాణ్ని. నా కాలక్షేపం కోసం, ధనార్జనకోసం, కీర్తి కోసం 'క్రెష్' నడిపితే బావుంటుందని ఆలోచించానే తప్ప, మా ఇన్‌స్టిట్యూషన్ అధ్వర్యంలోనే, మా ఆవరణలోనే 'క్రెష్' తెరిపించాలన్న ఆలోచన నాకెందుకు తోచలేదు? చదువురాని దమయంతి కున్నపాటి ఆలోచన ఇంత చదువుకున్న వాణ్ని, అనుభవజ్ఞుణ్ని నాకెందుకు రాలేదు?

తలుచుకుంటే అది అసాధ్యమైన విషయమేమీ కాదు కదా. ప్రతి ఆఫీసులోనూ 'క్లోక్‌రూమ్స్', 'కేంటీను', 'కాన్ఫరెన్స్ హాలు' మొదలైనవి అత్యవసరమైనవిగా ఏర్పాటు చేస్తున్నప్పుడు, అధిక సంఖ్యలో స్త్రీలు ఉద్యోగాలు చేయడం పరిపాటి అవుతున్నప్పుడు ప్రతి పెద్ద ఆఫీసులోనూ 'క్రెష్' నడిపే ఏర్పాటును విధిగా ఎందుకు చేయకూడదు? ఆఫీసు ఆవరణలో కేంటీనుకి కొంత స్థలం కేటాయించి, కేంటీను నడిపే బాధ్యతని ప్రైవేటు వ్యక్తులకు అప్పగించినట్లుగా, 'క్రెష్'కి కూడా కొంత స్థలాన్ని కేటాయించి, క్రెష్‌ని నడిపే బాధ్యతని ఎవరికైనా అప్పజెప్పవచ్చు కదా. దీనివల్ల ఎంత మంది స్త్రీలు సంతోషంగా, బాధ్యతాయుతంగా ఉద్యోగాలు చేసుకోగలుగుతారు! ఎంత మంది పిల్లల ఆరోగ్యాలు బాగుపడతాయి! ఎన్ని కుటుంబాలు కలతలు లేకుండా, ఆనందంగా కొనసాగుతాయి!

అధికార వర్గంలోకి చేరే సరికి, అధికారులకు ఉపయోగకరంగానూ లాభదాయకంగానూ ఉండాలనే తప్ప, కింది ఉద్యోగుల సదుపాయాల గురించీ, వర్కర్స్ అవసరాల గురించీ ఆలోచనలు రావేమో. కష్టాలు అనుభవించే వాళ్లకే తెలుస్తాయి.

అడిగితే గాని అమ్మయినా పెట్టదని సామెత! నాకు ఆఫీసులో టి.ఎ. డి.ఎలు పెరిగినప్పుడల్లా ఇంట్లో పని మనిషికి నా అంతట నేను జీతం పెంచుతానా? అది నా వెంటపడి దెబ్బలాడితే గాని పెంచబుద్ధి కాదు కదా! అలాంటిది, యజమానులు ఉదారంగా ఎలా ఆలోచించగలరు? క్రింది స్థాయి ఉద్యోగులు యూనియన్లు ఏర్పరచడం అందుకే కదా! ప్రమోషన్ వచ్చి పైవర్గానికి చేరినందుకు మొదటిసారిగా సిగ్గుపడ్డాను.

ఇన్నాళ్లూ అవలంబించిన "కర్రవిరక్కుండా, పాము చావకుండా" అన్న పద్ధతి ప్రకారం కాకుండా, ధైర్యంగా దమయంతీ వాళ్ల పక్షం వహించాను వాదనలో. మా డైరెక్టర్ తెల్లబోయాడు నా వైఖరికి.

(భూమిక - జనవరి - మార్చి 1995)

# సర్దుబాటు

డి. కామేశ్వరి

భార్య సంపాదన లేకుండా సంసారం సాగనప్పుడు. ఆమె బాధ్యతల్లో కూడా పాలు పంచుకోవటం భర్త నేర్చుకోవలసి ఉంటుంది.

రాత్రి ఎనిమిదిన్నర అయింది. వంటింట్లో చకచక గిన్నెలు కడిగి, స్టవ్ గట్టు అలికి తుడుస్తోంది సుజాత. 'జనూన్' అప్పుడే మొదలవుతూంది టీ.వీ.లో. సుజాతకి 'జనూన్' సీరియల్ ఎంతో ఇష్టం. ఎన్ని పనులున్నా తీరిక చేసుకుని చూస్తుంది. సీరియల్ మొదలయ్యేలోగా పని పూర్తి చేసుకోవాలని గబగబ గట్టు తుడుస్తూండగా కాలింగ్ బెల్ మోగింది. పిల్లలిద్దరూ సీరియల్ ముందు అడ్వర్టయిజ్‌మెంట్లు శ్రద్ధగా చూస్తున్నారు. రవీంద్ర పొద్దుట పూర్తి చెయ్యని పేపరు శ్రద్ధగా చదువుతున్నారు. బెల్ మరోసారి మోగింది. "బెల్ కొడుతున్నారు ఎవరో, కాస్త చూస్తారా?" సుజాత అరిచింది వంటింట్లోంచి. రవీంద్ర తలుపు తీసి "అరె, అక్కయ్యా ... " అరిచారు సంతోషంగా. వంటింట్లోంచి తొంగి చూసిన సుజాతకి ఆడబడుచుని, ఆవిడ భర్తని చూడగానే ఒంట్లో బలమంతా ఒక్కసారి ఎవరో లాగేసినట్లయిపోయింది.'ఓ గాడ్' అనుకుంది. 'ఇప్పుడు మళ్లీ వంటాలా భగవంతుడా' అన్న ఆలోచన రాగానే నీరసం ముంచుకువచ్చింది. గెస్టులు, దగ్గిర బంధువులు వచ్చినా సంతోషం లేకపోగా విసుగు, కోపం, చిరాకు, నీరసం - అన్నీ వచ్చేస్తున్నాయి సుజాతకీమధ్య. ఇంట్లో చాకిరీ, బ్యాంకి ఉద్యోగం, పిల్లలు, వాళ్ల చదువులు, బస్సు ప్రయాణాలు వీటన్నింటితో కొంపలో ఎప్పుడొచ్చిపడదామా, తప్పక అంత వండి పడేసి ఎప్పుడు పక్క మీద వాల్దామా అని ఎదురుచూసే లక్షా తొంభయిమంది ఉద్యోగినులలో సుజాత ఒకర్తి. హైదరాబాదులో కాపురం కావటంతో ముఖ్యంగా చాకిరీ ఎక్కువే. అందులో ఇటు, అటు రెండు వైపులా బంధుజనం ఎక్కువే అవటంతో ఏ పెళ్లిళ్లకో, పెళ్లిచూపులకో ఆస్పత్రి పనులకో, ఉద్యోగాల

ఉంటుర్యాల్లకో, కాలేజి సీట్లకో ఎవరో ఒకరు వస్తూనే ఉండి చుట్టాలంటే విసుగొచ్చేసింది సుజాతకి. కాస్త నాలుగు రోజులు రొటీన్‌లోపడి 'అమ్మయ్య' అని ఊపిరి పీల్చుకునే వేళకి ఎవరో ఒకరు దిగుతూ సుజాత సహనానికి పరీక్ష పెడ్తున్నారు.

"సుజా, అక్కయ్యొచ్చింది. రండి బావగారూ". రవీంద్ర బావగారి చేతిలో సూట్‌కేసు అందుకుంటూ ఆహ్వానించాడు. నిట్టూర్పు అణచుకొని, మొహాన రాని నవ్వు పులుముకుని, "రండి వదినగారూ, ఏమిటి కబురన్నా లేకుండా వచ్చారు" అంది సుజాత. "హఠాత్తుగా బయలుదేరాల్సి వచ్చింది. ఫోను చేద్దాం అంటే మీ పక్కింటి వాళ్లు లేనట్టున్నారు. రెండుసార్లు చేసినా ఎవరూ తీయలేదు. సరే, ఎలాగో సాయంత్రం వచ్చేస్తాం, ఫరవాలేదు ముందు తెలియపర్చకపోయినా అనుకుని బయలుదేరాం. రైలు రెండున్నర గంటల ఆలస్యం అయింది" ఆడబడుచు అంది.

"ఏమిటి? ఏమయింది - అంతా కులాసాయేనా? నీ వంట్లో బాగుంది కదా" రవీంద్ర అడిగాడు.

"అదేనోయి, మీ అక్కయ్యకే ఈమధ్య వంట్లో బాగుండడంలేదు. అక్కడ లేడీ డాక్టర్ యూటెరస్ ఆపరేషన్ చెయ్యాలంటూంది. ఓసారి ఈ ఊళ్లో మంచి డాక్టరుకి చూపించి సలహా తీసుకుని డిసైడ్ చేద్దామని ... " బావగారు చెప్పారు.

"అలాగా ... అయ్యో, చెప్పనేలేదే సుజాతకి మంచి గైనకాలజిస్ట్ తెలుసు. చూపిద్దాంలెండి - ఈ రోజుల్లో ఈ ఆపరేషన్లు మామూలయిపోయాయి."

'ఆస్పత్రి పని .... అంటే కనీసం రెండు మూడు రోజులు ఆపైన ఆపరేషన్ ఇక్కడే అంటారు .... ' సుజాతకి ఆలోచించడానికే భయం వేసి వంటింట్లోకి వెళ్లింది.'జనూన్ లేదు ఏం లేదు - మళ్లీ వంట గిన్నెలు కడుక్కోడం' గొంతులో దుఃఖం అడ్డుపడింది సుజాతకి. బియ్యం కడిగి కుక్కరులో పెట్టి, నాలుగు వంకాయలుంటే వేయించడానికి తరగసాగింది. 'నయమే, మధ్యాహ్నం చారు పారేశాను కాను' అనుకుంటూ ఫ్రిజ్ నుంచి చారుగిన్నె తీసింది. పెరుగు కాస్త ఉంది. నిన్నటి పెరుగుంటే ఇది, అదికాస్త కలిపింది. వాళ్ళు స్నానాలూ అవి చేసి వచ్చేలోగా వంటయిందనిపించింది.

"ఏం, మరదలి మొహం అలా వాడిపోయింది - వంట్లో బాగులేదా - పాపం మళ్లీ వండాల్సి వచ్చింది. ఈ వెధవ రైళ్ళు ఎప్పుడూ ఆలస్యమే' అంది కమల.

"ఆ, ఏం ఉందిలే. వంటెంతసేపు" అన్నాడు రవీంద్ర. సుజాత మొగుణ్ణి మింగేద్దాం అన్నట్టు చూసింది. 'వంటెంత సేపుట? వండితే తెలుస్తుంది. అందులో పని అంతా అయింది అనుకున్నాక మళ్లీ వంట అంటే ఎంత విసుగు. ఈ మగాళ్ళకేం, ఎంత సులువుగా వంటెంతసేపు అంటున్నాడు' కసిగా అనుకుని రాని నవ్వు పులుముకుంది. 'ఈయనగారికి ఈ అక్కగారిని చూస్తే చాలా ప్రేమ. ఆరుగురు పిల్లల్లో ఆఖరివాడు ఇతను. పెద్దావిడ ఆవిడ. తల్లికి ఒంట్లో బాగులేకపోతే అక్కగారే అస్తమానూ తమ్ముణ్ణి ఎత్తుకోడం, ఆలనాపాలనా చూసిందని ఈయనకి, ఆవిడకి చాలా ఎటాచ్‌మెంట్.

వాళ్ళ భోజనాలు కానిచ్చి, పిల్లల గది వాళ్ళకిచ్చి కొడుకుని తమ మంచాల మధ్యలో పడుకోపెట్టి, కూతురికి డ్రాయింగ్‌రూమ్‌లో పక్క వేసింది. వాళ్ళింకా కబుర్లు చెప్పుకుంటూనే ఉన్నారు. పది దాటాక ఇంక కూర్చోలేక "నేను పడుకుంటానండి, కాస్త తలనొప్పిగా ఉంది" అంది సుజాత ఆడబడుచుతో.

"పడుకో అమ్మా పాపం పొద్దుననగా లేస్తావు" అన్నారు శేషగిరిరావుగారు అభిమానంగా చూస్తూ. బతుకుజీవుడా అనుకుంది సుజాత. తలగడ మీద తల అనగానే ఒళ్ళెరగకుండా నిద్రపోయింది.

* * *

ఉదయం ఐదు గంటలకే అలారం పెట్టినట్టే మెలకువ వచ్చేసింది. నిద్ర పోయాక కాస్త ఫ్రెష్‌గా ఉందనిపించింది సుజాతకి. రోజూ ఒకటే రొటీను. ఐదు గంటలకు లేచిందగ్గరనుంచి ఒకటే పరుగులు. కప్పు కాఫీ, కాస్త కూర్చుని తాగి ఎంజాయ్ చెయ్యడానికి కూడా తీరికుండదు. టిఫిను, వంట చేస్తూనే పిల్లలని లేపి తయారు చెయ్యడం, పక్క తియ్యడం, ఇల్లు గబగబా తుడిచి, పిల్లలకి టిఫినుపెట్టి, నలుగురికీ లంచ్ బాక్సులలో చపాతీలు పెట్టి, పిల్లల పుస్తకాల దగ్గర నుంచి సర్దిపెట్టాలి. మధ్యలో భర్తగారి అరుపులకి సమాధానం చెప్తూ పిల్లలని పంపి, తనింత తిని, టిఫిను బాక్సు పట్టుకుని ఉరుకులు పరుగులతో బస్సు స్టాప్ దగ్గిరికి చేరి, రెండు బస్సులు మారి బ్యాంకి చేరి, మళ్ళీ సాయంత్రం ఐదు గంటలకి శవంలా ఇల్లు చేరి కాస్త టీనీళ్ళు తాగి బడలిక తీర్చుకుని వంటలో జొరబడి వంటచేస్తూనే పిల్లల చదువులు చూస్తూ, మర్నాటికి కావల్సిన కూరలు తరిగిపెట్టుకుని ... అటు ఇల్లాలిగా, ఇటు తల్లిగా, ఉద్యోగినిగా క్షణం తీరిక లేక మరబొమ్మలా చాకిరీ చెయ్యడమేనా ఈనాటి స్త్రీలు సాధించిన ప్రగతి అన్న సందేహం సుజాతకి వస్తుంది. ఆదివారం వస్తే మరింత పని తలంట్లు, బట్టలుతుక్కోడాలు. ఆదివారం అని పిల్లలకి ఏ స్వీటో చేసి పెట్టడం. ఆదివారం అని వచ్చే ఫ్రెండ్సుకి మర్యాదలు, కూరలు తెచ్చుకోవడం. ఇలా జీవితం అంటే బొత్తిగా జీవితం ఇంత మెకానికల్ అయిపోయిందేమిటి! చక్కగా తనకి నచ్చిన ఓ మంచి ఇంగ్లీషు నవల చదివి ఎన్నాళ్ళయింది? థియేటరుకి వెళ్ళి సినిమా చూసి ఎన్ని ఏళ్ళయింది? హాయిగా ఏ టేప్‌రికార్డరో పెట్టుకుని సావకాశంగా తనకి నచ్చిన పాట విని ఎన్నాళ్ళయింది? కిలోమీటరు దూరంలో ఉన్న గార్డెన్‌కన్నా ఎప్పుడన్నా వెళ్ళారాతాము? చదువుకోడం, ఉద్యోగం, పెళ్ళి, పిల్లలు, చాకిరీ .... ఈ నాటి స్త్రీ ఎంతలా నలిగిపోతూంది ఇంటా బయటా. తరచు ఈ ప్రశ్నలు సుజాతలో తలెత్తుతున్నాయి. ఈమధ్య ఆడవాళ్ళు చదివి, ఉద్యోగాలు చేస్తూ సాధిస్తున్నదేమిటి? ఇంటా బయటా నలిగిపోతూ మగవాడి బాధ్యత నగం బుజాన వేసుకుని కుంగిపోతున్నారు తప్ప వాళ్ళకేం ఒరుగుతూంది! ఎకనమికల్ ఇండిపెండెన్సా!.... హా ... హా.... ఎకనమికల్ ఇండిపెండెన్సు .... రవి కంటే రెండు మూడు వందలు తక్కువ తన సంపాదన! అయినా, కావల్సిన చీర ఒక్కటైనా కొనుక్కోగలుగుతూందా నగలు అన్నదానికే ఆస్కారం లేదు. చీరలు, నగలు అటుంచి కనీసం విసుగ్గా ఉన్నరోజున ఆటో అయినా ఎక్కగలుగుతూందా తను. ఇంటినించి

తీసికెళ్ళిన పట్టాదిని పహితీలు తప్ప పక్కనున్న హోటలుకి కొలీగ్స్‌తో వెళ్ళి ఒక దోసె తినగలుగుతూందా. ఎప్పుడూ ప్రతినెలా ఏవో అనుకోని ఖర్చులు. జీతం వచ్చిన రోజున తప్ప ఆ డబ్బంతన పర్సులో ఓ రోజన్నా ఉంటుందా. తన జీతం అంతా ఫ్లాట్ కొన్న లోనుకే సరిపోతూంది మూడొంతులు. మిగతాది ఏ పండుగలకో, ఏ చుట్టాలకో, ఏ గ్రైండరు కొనడానికో, ఇంట్లో వస్తువులకో, పిల్లల బట్టలకో .... ఏం అవుతూందో కూడా తెలియకుండా అయిపోతూంది. తన కొలీగ్స్ కొందరు ఇస్త్రీ మడత నలగని బారెడు వెంకటగిరి చీరలు కట్టుకుని వస్తారు. ఇవి చేయించుకున్నాం, అవి చేయించుకున్నా అంటూ గాజులు, గొలుసులు చూపిస్తారు .... తన సంపాదనతో తాను ఏం ఎంజాయ్ చేస్తూంది - 'ఇదంతా ఎవరికోసం, నీ కోసం కాకపోతే' అంటాడు రవి. ఫ్లాట్ కొన్నా, టి.వి. కొన్నా, ఫ్రిజ్ కొన్నా అన్నీ తన కోసమే అంటాడు తెలివిగా- అంటే ఆడవాళ్ళ సంపాదనతో వాళ్ళకి కావల్సిన చిన్న చిన్న కంఫర్ట్స్ ఇచ్చి, అదంతా తాను వాళ్ళ కోసమే చేస్తున్నాననడం! ఇదివరకు ఇల్లు నడపడం మగాడి బాధ్యత. ఇల్లే కొంటాడో, భూములే కొనేవాడో, నగలే చేయించినా, పిల్లల పెళ్ళిళ్ళు చెయ్యాలన్నా అదంతా భర్త బాధ్యత. ఇదివరకటి భార్యలే అదృష్టవంతులేమో! ఏదో తెచ్చిపడేసింది వండి పెడ్తూ, పిల్లల్ని చూసుకుంటూ, లిమిటెడ్ కోరికలతో, వచ్చే డబ్బుతో తృప్తిగా బతికేవారు. అప్పటికంటే ఇప్పుడు ఆడదానికి ఒరిగిందేముంది. చదువుకున్నా, ఉద్యోగం చేస్తున్నా మగాడి అండనే బతుకుతూంది. మొగుడ్ని కాదని ఏ చిన్న నిర్ణయమూ చెయ్యలేదు ఇంట్లో. సొంత డబ్బు ఖర్చు పెట్టాలన్నా భర్తగారి ఆమోదముద్ర లేనిదే ఏం చెయ్యగలుగుతూంది. ఈ పిచ్చి ఆడవాళ్ళు ఏదో చదివి సంపాదిస్తూ చాలా ప్రగతి సాధించినట్టు సంబరపడిపోతున్నారు. అంతే ....

సుజాతకి ఒళ్ళు మండిపోయినప్పుడల్లా ఇలాంటి ఆలోచనలు వస్తాయి. అటు తను ఇంట్లో చాకిరి, బయట చాకిరీ చేస్తూ నలిగిపోతూంటే, ఇటు రవి ఇంటి పని ఆడదాని బాధ్యత అన్నట్టు ప్రవర్తిస్తుంటే పుండు మీద కారం చల్లినట్లుంటుంది. ఉదయం 5 గంటలకి లేచి ఉరుకులు పరుగులతో తానంత అవస్థపడుతూంటే ఏడుగంటలకి సావకాశంగా లేచి, హాయిగా కాఫీ తాగుతూ పేపరు చదివే అతన్ని చూస్తే ఒళ్ళు మండిపోతూంటుంది. అసూయగా ఉంటుంది. వండి వార్చక్కరలేదు. చిన్న చిన్న పనులన్నా చెయ్యొచ్చు - పక్కలు వేయడం, డస్టింగ్‌లు, పిల్లల పుస్తకాలు సర్దిపెట్టడం, రాత్రి ఇంటికి వచ్చాక పిల్లల్ని కూర్చోపెట్టి చదివించడం, బజారు సామాన్లు, కూరలు తేవడంలాంటివన్నీ చెయ్యొచ్చు. "నేను కూరలు తెస్తే ముదురు, పుచ్చులు అంటావు. బజారునుంచి సరుకులు తెస్తే నూక, బాగులేదు, మైదా పురుగులు, ఆవాలులో ఇసక అంటూ వంకలు పెట్టావు - నీవే తెచ్చుకో." ఓసారి బాగులేవంటే రెండోసారి మంచివి తేకపోగా అసలుక్కే ఎసరుపెడతాడు. మరి కోపం, విసుగు వచ్చి పక్కలు వేయమంటే దుప్పటి మడతలన్నా వు. ఎక్కడవక్కడే ఉంటాయి. డస్టింగ్ చేస్తే - ఆ పని తీరు చూసి రెండోసారి చెప్పకుండా చేస్తాడు - ఫర్ గాడ్ సేక్ ఇంటికి వచ్చాక ఒక్క క్షణం కూర్చోనీయవు అంటూ విసుగు. పిల్లల చదువు చెప్పమంటే విశ్రాంతులు వాళ్ళకే కావాలి - తమకేం అక్కరలేదు. ఛా .... అసలు తాను ఈ ఉద్యోగంలో చేరడం పొరపాటు అయింది.

హాయిగా చదువయ్యాక పెళ్ళి చేసుకుని ఇంటిపట్టున ఉండాల్సింది. మధ్యతరగతి ఇంట్లో పుట్టి ఏదో చదివి ఉద్యోగం చేసి ఉద్ధరిస్తున్నాననుకుంది అప్పుడు. అందుకే బాగా అయింది తనకి తగిన శాస్తి - ఉక్రోషంగా అనుకుటుంది.

ఆలోచనలతో ఆవేశంగా చకచక కూరల మీద కోపం చూపిస్తున్నట్లు తరుగుతూంది సుజాత. "ఏమిటమ్మా మరదలా, నీ కోపం అంతా కూరల మీద చూపిస్తున్నావు." కమలమ్మ హాస్యంగా అంటూ పమిట కొంగుతో మొహం తుడుచుకుంటూ వంటింట్లోకి వచ్చింది. సుజాత నవ్వి .... "లేచారా ఉండండి కాఫీ ఇస్తాను" అంది ఫిల్టరు తీస్తూ. రవీంద్ర మొహం కడుక్కుని డ్రాయింగు రూములోంచి ఆర్డరు వేశాడు. "బావగారు లేచారు. మాకు కాఫీ ఇస్తావా" అంటూ- ఎవరన్నా ఇంటికి వస్తే ఈయన గారు ఇంక ఆర్డర్లు ఎక్కువేస్తారు. వంటింట్లోకి వచ్చి తీసికెళ్ళచ్చుగా అనుకుంది.

పిల్లలకి స్కూలు డ్రస్సులు తొడుగుతున్న సుజాత దగ్గరకి బెడ్‌రూంలోకి వచ్చాడు.

"సుజా, ఇవాళ నీవు సెలవు పెట్టు. అక్కయ్యని డాక్టరు దగ్గరికి తీసికెళ్ళు" అన్నాడు చాలా క్యాజువల్‌గా. సుజాత మొగుడి వంక చురచుర చూసింది.

"నేను సెలవు పెట్టాలా - ఈ నెలలో ఎన్ని రోజులు మానేశానో తెలుసునా. అప్పుడే ఐదు రోజులు - రమ్యకి జ్వరం వచ్చి రెండు రోజులు, నాకు ఒంట్లో బాగులేక రెండు రోజులు, మీ రెండో అక్క వచ్చిందని ఒక రోజు .... నాకసలు కుదరదు .... మీరే పెట్టి తీసికెళ్ళండి." సుజాత కటువుగా అంది. రవీంద్ర మొహం ఎర్రబడింది. "లేడీ డాక్టరు దగ్గరకి నే తీసికెళ్ళాలా - బుద్ధి ఉండే మాట్లాడుతున్నావా?"

"ఏం తప్పేం ఉంది. మీ బావగారు, మీరు కల్సి తీసికెళ్ళండి. లేడీ డాక్టరయితే ఆడవాళ్ళే తీసికెళ్ళాలని రూలుందా." రవీంద్రకి కోపం ముంచుకు వచ్చింది.

"మా వాళ్ళెవరన్నా వస్తే నీ మొహం మారిపోతుంది. నిన్న రాత్రి నించి చూస్తున్నాను. ఆ మొహం ఎలా ఉందో చూసుకో .... ఎవరన్నా వస్తే ఏడుపు ఒక్కటే తక్కువనీకు." భార్య మీద కోపం ఆ విధంగా తీర్చుకున్నాడు కసిగా చూసి.

సుజాత చివుక్కున తలెత్తి రవీంద్ర వంక చూసింది. తన మీద వేసిన నెపానికి అవమానంతో గొంతులోకి దుఃఖం తన్నుకువచ్చింది. పెదాలు అదురుతుండగా, "అవును, మీ వాళ్ళొచ్చారని ఏడుస్తున్నానా, ఛా .... ఎంత చేసినా, ఏం చేసినా మెప్పు లేదు ఈ పాడు బతుక్కి ...." అని చేతిలో దువ్వెన విసిరికొట్టి వంటింట్లోకి వెళ్ళిపోయింది. రవి తన అక్క, బావ విన్నారేమోనన్న అనుమానంతో అవమానమనిపించి ముఖం మాడ్చుకున్నాడు - గదిలో భార్యాభర్తలు ఏదో అనుకోవడం విన్న కమలమ్మ సగం ఊహించింది. "రవీ, డాక్టరు దగ్గిరకి మేం వెడతాంలేరా, ఎడ్రసూ అదీ చెప్పు. పాపం సుజాతకి సెలవుండద్దూ" అంది.

"నే తీసికెడతాలే అక్కయ్యా .... నాకూ తెలుసులే ఆవిడ" అన్నాడు.

"వదినగారూ .... నాకు సెలవు పెట్టడానికి కుదరదు. నే రావాలంటే ఎల్లుండి శనివారం ఆఫ్డే గదా - అప్పుడు తీసికెడతాను." కాస్త ఆవేశం దిగాక వంటింట్లోంచి వచ్చి అంది సుజాత. రవి మొహం ముడుచుకుని, "ఎల్లుండి దాకా ఎందుకు, నే తీసికెడతాను ఇవాళే" అన్నాడు. నీవు రాకపోతే కొంప మునగదు అన్న ధోరణిలో సుజాత ఇంక రెట్టించకుండా ఊరుకుంది. ఆడబడుచుకి అన్ని రకాల పరీక్షలు అయి మళ్ళీ నెలలో ఆపరేషన్ జరిపేట్లు నిర్ణయం జరిగింది. ఖమ్మంలో కంటే హైదరాబాదులో మంచి డాక్టర్లుంటారు కనుక ఇక్కడే చేయించుకోడానికి నిర్ణయించారు అందరూ. మళ్ళీ నెలలో ఆపరేషన్ అనగానే ఇప్పటినుంచీ సుజాతకి భయం పట్టుకుంది. ఆపరేషన్ అంటే కనీసం పదిహేను రోజులుండాలి వాళ్ళు .... ఎలా భగవంతుడా నెగ్గుకురావడం - అటు ఇంటిపని, ఇటు ఆఫీసు, ఆస్పత్రికి తిరగడం. ఏదో రెండు రోజులు సెలవు పెట్టగలదు కాని .... అప్పటి చాకిరీ తల్చుకుని ఇప్పుడే నీరసం వచ్చింది - ఛా.... ఈ ఉద్యోగం వల్లే .... ఎంత సెల్ఫిష్గా ఆలోచించాల్సి వస్తోంది. ఖర్చు మాట ఎలా వున్నా పనికి భయపడి చుట్టపక్కాలు అవసరంలోనూ రాకూడదని కోరుకుంటోంది. అతిథులు, అభ్యాగతుల రోజులు పోతున్నాయి. ఎవరికి వారే .... రోజులు వస్తున్నాయి.

అక్కగారున్నన్ని రోజులు సుజాతతో ముభావంగానే మాట్లాడాడు రవి. వాళ్ళు వెళ్ళాక మనసులో కోపం వెళ్ళగక్కాడు - "నీ కసలు ఈ మధ్య మంచీ మర్యాదా అన్నది లేకుండా పోతూంది. వాళ్ళున్నది మూడు రోజులు. నీ మొహం ఎలా మాడ్చుకున్నదీ నీకు తెలియదేమో కాని చూసేవాళ్ళు ఏమనుకుంటారోనని కూడా లేకుండా నీ అయిష్టం స్పష్టంగా చూపించావు. నీ ఉద్దేశంలో నా వాళ్ళెవరూ నా ఇంటికి రాకూడదని గాబోలు ...." కయ్యానికి కాలు దువ్వాడు.

"మీ వాళ్ళు, నా వాళ్ళు అన్నది గాదు నా బాధ. చాకిరీ చేయలేక చస్తున్నాను అన్నది అర్థం చేసుకోకపోగా, పైగా అపార్థాలు. కట్టుకున్న వాడికి ఇంత పిసరు సానుభూతి లేదు. మీ వాళ్ళు తినిపోతున్నారని నేనెప్పుడూ ఏడవలేదు - చాకిరీ కోసం ఏడుస్తున్నాను. ఇంత పిసరు హెల్ప్ లేకపోగా పైపెచ్చు నిందలు" సుజాతకి ఏడుపు ముంచుకువచ్చింది.

"ఆ .... నీ వొక్కర్తివే ఇన్నాళ్ళకి ఉద్యోగం చేస్తున్నావు. అందరాడవాళ్ళూ చేస్తున్నారు ఉద్యోగాలు. మొగుడికి, పిల్లలకి వండి పెట్టుకోడం ఊరికి ఉపకారం కాదు ...." హేళనగా అన్నాడు. ఆ తిరస్కారం హేళన భరించే శక్తి లేకపోయింది సుజాతకి.

"నేనీ ఉద్యోగం మానేసి ఇంటిపట్టునుండి వచ్చేపోయే చుట్టాలకి పక్కాలకి వండి వారుస్తాను. అప్పుడు పళ్లెత్తి నేనేమన్నా అంటే చెప్పుచ్చుకు కొట్టండి. అంతేగాని, ఇటు ఆఫీసు, అటు ఇంట్లో ఈ చాకిరీ రెండూ నావల్ల కాదు - ఈ వెధవ ఉద్యోగం మానేస్తే మనశ్శాంతి అన్నా దొరుకుతుందేమో."

"మానేయి మానేస్తా మానేస్తా అని పదిసార్లు బెదిరించకు. నాకోసం చేస్తున్నట్లు మాట్లాడకు. ఫ్లాటు, ఇంట్లో కంఫర్ట్సు కోసం చేస్తున్నావు. మానేయి. నోరుమూసుకుని

నేనేది తెచ్చిపడేస్తే దాన్తోనే కాలం గడుపు. ఇది కావాలి అది కావాలనకుండా - " సుజాత మాటలకి మనసులో జెదిరినా పైకి తేలకుండా బింకంగా అన్నాడు రవి.

* * *

"అర్ యూ క్రేజీ సుజాతా?" బ్యాంక్ మేనేజర్ సావిత్రి సుజాత ఇచ్చిన రిజిగ్నేషన్ లెటరు చూస్తూ ఆశ్చర్యంగా అంది - "పన్నెండేళ్ళ సర్వీసు వదులుకుంటావా. మళ్ళీ కావాలంటే ఇలాంటి ఉద్యోగం దొరుకుతుందా. దొరికినా సీనియారిటీ ఉంటుందా." "సారీ మేడమ్. ఏం చెయ్యను? ఇంటా, బయటా నిభాయించుకోవడం రెండూ నావల్ల కావడం లేదు. దీనివల్ల ఇంట్లో శాంతి లేదు. సుఖం లేకపోయాక ఎందుకు సంపాదన?" ఆవిడ సాలోచనగా చూస్తూ "మిష్టర్ రవీంద్ర కోపరేట్ చెయ్యరా ఇంట్లో. పోనీ ఇంట్లో ఎవరన్నా పెద్ద వాళ్ళుంటే తెచ్చి పెట్టుకోకూడదూ."

"ఎవరొస్తారు మేడం. మా అత్తగారు లేరు. మా అమ్మ నాన్నని వదలి ఎందుకొస్తుంది. అయినా ఎవరొచ్చి ఎన్నాళ్ళాదుకుంటారు." "పోనీ ఎవరినన్నా వంటకి దానికి ఇంట్లో పెట్టుకో. అంతేగానీ ఉద్యోగం రిజైన్ చెయ్యడం ఫూలిష్ థింగ్."

"పనికే పనిమనిషి - నా టైముకి రాదని అంట్ల దగ్గరనించి తోముకుంటున్నాను. ఉదయం ఎనిమిదైనా రాదు. సాయంత్రం ఆలస్యంగా రమ్మంటే రాదు. పనికే దొరకడం లేదు - వంటకి పెట్టుకుని ఇల్లప్పగిస్తే ఇంక నే సంపాదించింది ఏముంది .... చాలా అవస్థగా ఉంది - వచ్చేపోయే బంధువులు, చాకిరీతో ప్రతి దానికి విసుగు, కోపం వచ్చేస్తున్నాయి. పిల్లలతో కాసేపు ప్రేమగా గడపడానికి కూడా ఓపికుండడం లేదు. విసుగెత్తిపోయాను ...." సుజాత తన గోడు వెళ్ళబోసుకుంది. ఆవిడా ఉద్యోగినే - ఇంచుమించు అందరి కథలు, అవస్థలు ఒక్కటే - కాస్త భర్త ఇంట్లో భార్య కష్టం, సుఖం అర్థం చేసుకుని చేదోడు ఇస్తే అంత ఇబ్బంది ఉండదు - సానుభూతిగా నిట్టూర్చింది ఆవిడ. "రిజైన్ చెయ్యకు. ఒకటి రెండు నెలలు సెలవు పెట్టు. కాస్త మార్పుగా ఉంటుంది. కాస్త రెస్టు తీసుకుంటే మళ్ళీ కొన్నాళ్ళు చెయ్యడానికి ఓపికొస్తుంది."

ఆవిడన్నది సబబుగానే అనిపించింది సుజాతకి. ఒక్క క్షణం ఆలోచించి, "మేడం మీరు నాకొక్క సహాయం చెయ్యండి. నేను సెలవు పెట్టినట్లు ఎవరికీ తెలియనీయకండి. ముఖ్యంగా మావారికి అసలు చెప్పద్దు - ఆయనగాని వచ్చి అడిగితే రిజైన్ ఇచ్చేసింది వద్దన్నా వినకుండా అని చెప్పండి."

ఆవిడ సుజాత వంక నవ్వుతూ చూసి, "ఐ అండర్‌స్టాండ్ యువర్ పాయింట్. డోంట్ వర్రీ .... రవీంద్ర రానీ ... నే చూస్తాలే" అని అభయం ఇచ్చింది.

* * *

మర్నాడు సావకాశంగా లేచి పిల్లలని తయారుచేస్తూ, టైమవుతున్నా తను తయారవని భార్యని చూసి, "ఏం ఇవాళ బ్యాంకుకి వెళ్ళవా, సెలవు పెట్టావా" అని ఆశ్చర్యంగా, అనుమానంగా అడిగాడు.

"నేను ఉద్యోగం మానేశాను. నిన్ననే రిజైన్ ఇచ్చేశాను" చాలా మామూలుగా అంది. రవీంద్ర ఒక్కక్షణం తెల్లబోయాడు.

"రిజైన్ చేశావా. నాకు ఒక్క మాట కూడా చెప్పకుండా" అరక్షణంలో అతని మొహం ఎర్రబడి ఆవేశం పొంగుకువచ్చింది.

"చెప్పడానికి ఏముంది. మీరూ అన్నారుగా చెయ్యకపోతే మానేయి అని. ఇంట్లో ఇలా కొట్టుకుంటూ తిట్టుకుంటూ శాంతి లేకుండా నేను ఇంత కష్టపడి ఎందుకు చెయ్యడం ఆ ఉద్యోగం. నాకు ఒంట్లో అసలు బాగుండడం లేదు. అందుకే మానేశాను."

రవీంద్ర మనసులో అరక్షణంలో ఎన్నో 'లెక్కలు భూతాల్లా ఎదురు నిలబడి భయపెట్టేశాయి. భార్య జీతం లేకపోతే ఫ్లాట్ కొన్న లోను ఎలా తీర్చడం? ఇద్దరి సంపాదన ఉన్నా నెలాఖరుకి ఏం మిగలదు. మరింక ఒక్క సంపాదనలో ఇల్లు ఎలా గడుస్తుంది? అతని కోపం భారీస్థాయికి చేరింది. సుజాత నిమ్మకు నీరెత్తినట్టుండడం చూసి.

"ఉన్నపాటున చెప్పా చెయ్యకుండా ఉద్యోగం మానేస్తే ఎలా అనుకున్నావు. నీ జీతం ఉందని ఫ్లాట్ కొన్నాను. అదెవరు తీరుస్తారు ఇప్పుడు. ఇల్లు కొనండి కొనండి అన్నావు. ఆ డబ్బు ఎలా తీర్చాలి" పళ్ళు కొరుకుతూ అడిగాడు.

"అమ్మేయండి ఫ్లాట్. అప్పు తీర్చేసి మిగతాదేమన్నా ఉంటే బ్యాంక్‌లో వెయ్యండి వడ్డీ వస్తుంది - అద్దె ఇంట్లోకి వెళదాం. బ్యాంక్ ఎలాగో హౌస్ రెంట్ ఇస్తుందిగా." చాలా కూల్‌గా అంది. భార్య మాట్లాడుతున్న తీరుకు కోపం ముంచుకు వస్తున్నా సుజాత నిజంగానే రిజైన్ ఇచ్చేసిందన్న నమ్మకం కలిగింది. దాంతో ఇంకా కోపం వచ్చింది. "నీ ఉద్యోగం ఉందన్న నిబ్బరంతో ఫ్లాట్ కొన్నాను. అసలు ఏదో నీ ఉద్యోగం చూసే పెళ్ళాడాను. లేకపోతే నీ మాత్రంది దొరకదని కాదు. మా వాళ్ళు చూసిన సంబంధం చేసుకుంటే బోలెడు కట్నం వచ్చేది. నీ అందం చూసి చేసుకోలేదు. ఉద్యోగం చూసి చేసుకున్నాను." భార్య తనని ఇంత దెబ్బ కొట్టిందన్న కోపంతో సుజాతని అవమానపరచడానికి ఇంతకంటే మార్గం కనబడక కసిగా అన్నాడు.

సుజాత మొహం అరక్షణం నల్లబడింది. కానీ అంతలోనే తేలిగ్గా నవ్వేసింది."నాకు తెలుసు నేనేం అందగత్తెను కానని. చాలా మామూలు మధ్యతరగతి అమ్మాయినని అవును. వెధవ కట్నం మహా అయితే పాతిక వేలో ఏభై వేలో ఇచ్చేవారు. ఉద్యోగం అయితే నా సర్వీసంతా కలిసి ఎన్ని లక్షలవుతుందో లెక్క కట్టే చేసుకుని ఉంటారు. ఏదో ప్రేమ కబుర్లు చెప్పి చేసుకున్నారని నాకు తెలుసు. సారీ, వెరీ సారీ. మీ లెక్కలు, అంచనాలు తలకిందులు అయిపోయాయి. చూడండి, ఈ రోజునుంచి నేనుత్తి హౌస్ వైఫ్‌ని. భర్త అంటే భరించేవాడు. పెళ్ళి అర్థం అదే గదా. మీ వంతు పోషించడం, నా వంతు ఇల్లు నడపడం. నా బాధ్యత నేను నిర్వహిస్తాను. ఏవన్నాలోటు పాట్లుంటే అప్పుడనండి."

"చావండి, అందరూ పడి చావండి. జీతం చాలదు. ఇది లేదు, అది లేదు అని అన్నావంటే చూడు. చెపుతా నీ పని చెపుతా. నా తడాఖా చూపిస్తా. నా కోసం నేను హాయిగా ఖర్చుపెట్టుకుంటాను. మీ కోసం క్లబ్బులు, ఫ్రెండ్సు, డ్రింక్స్, సిగరెట్లు అన్నీ మానాను. ఈ రోజునుంచి చూడు. చావకుండా రెండు పూటలా ఇంత తిండి పడేస్తాను. హాయిగా నేను ఎంజాయ్ చేస్తాను." క్రూరంగా అంటూ విసవిసావెళ్ళిపోయాడు. సుజాతకి అతని కోపం అర్థం అయి నవ్వి ఊరుకుంది.

* * *

పదిరోజులు గడిచాయి. పది రోజులుగా రవీంద్ర సుజాతతో మాట్లాడడం మానేశాడు. కావాలని ఇంటికి ఆలస్యంగా రావడం, వెంట ఓ రమ్ బాటిల్ తెచ్చుకోవడం, రాత్రి తొమ్మిదికి ఇంటికి వచ్చి సినిమాకి వెళ్ళానని పిల్లలతో చెప్పడం, ఇదంతా తన మీద కోపంతో చేస్తున్నాడని తెలుసు గనక ఏం అనకుండా ఊరుకుంది సుజాత. పది రోజులలోనే జీతం అంతా ఖర్చయి పోయింది. ఇంటి ఖర్చుకు ఇచ్చింది తప్ప చేతిలో పైసా మిగలలేదు. సుజాత ఏదో బెదిరించడానికి రెండు మూడు రోజులు ఇంట్లో ఉంటుంది అన్న ఆశ పదిరోజులు గడిచినా ఇంటి పట్టునే ఉండడంతో మనసులో బెదిరాడు. సెలవు పెట్టి ఉంటుంది. తనతో అలా అంది అని తనని తాను నమ్మించుకున్నాడు కొన్నాళ్ళు. ఆఖరికి పదిహేను రోజులు గడిచాక ఆగలేక బ్యాంక్‌కి వెళ్ళాడు. డైరెక్ట్‌గా వెళ్ళి అడిగితే మేనేజరు ఏమనుకుంటుందోనని తటపటాయించాడు. రవీంద్రని చూసిన మేనేజరు, ఇన్నాళ్ళుగా అతని రాక కోసమే ఎదురుచూస్తున్న సావిత్రి తనే అతన్ని పిలిచింది.

"రవీంద్రగారూ ... ఏమిటండీ సుజాత ఇలాంటి పని చేసింది నిక్షేపం లాంటి బ్యాంక్ ఉద్యోగానికి, అందులో పన్నెండేళ్ళ సర్వీసున్న ఉద్యోగానికి రిజైన్ ఇచ్చేసింది. నేనెంతో నచ్చజెప్పాను. షి డిడ్ యే ఫూలిష్ థింగ్. మీరన్నా చెపుతారనుకున్నాను" అంది. ఆ మాటతో రవీంద్ర మొహం రక్తం లేనట్టు యింకిపోయింది. "నిజంగానే రిజైన్ ఇచ్చేసిందన్నమాట" నిమిషం తరువాత మాట పెగుల్చుకుని అన్నాడు.

"నేనూ చెప్పాను మేడం. అసలు నాకు చెప్పకుండా చేసింది"

"ఇంట్లో ఇబ్బందులు, చాకిరీ చెయ్యలేకపోతున్నాను. రెండూ సమర్థించుకోవడం నా వల్ల కాదంది. తాను బాగా వీక్‌గా ఉంది. ఐ పిటీ హర్. కానీ, మళ్ళీ కావాలంటే ఉద్యోగం వస్తుందా. ఇదిగో చూడండి రిజిగ్నేషన్ లెటర్" అంటూ డ్రాయరు లోంచి తీసిచ్చింది. కాగితం చదివిన రవీంద్ర మొహం కాగితం లాగే అయింది.

"మీరు ఎక్సెప్ట్ చేశారా ఇది. పైకి ఫార్వర్డ్ చేశారేమిటి" బెదురుగా అడిగాడు."లేదండి ఏదో ఆవేశంలో చేసిందేమో, మళ్ళీ మనసు మార్చుకుని వస్తుందని కాగితం ఇంకా పైకి పంపలేదు. లీవ్‌కిందే ట్రీట్‌చేస్తున్నా. మీకు చెపుదామని చూశాను. మీరేబ్రాంచ్‌లో వున్నారో తెలియలేదు." ఆవిడ ఇంకా రిజిగ్నేషన్ పైకి పంపలేదన్న వార్తతో సగం ప్రాణం వచ్చింది రవీంద్రకి. "ప్లీజ్ మేడమ్, ఈ లెటరు పైకి పంపకండి. నేను సుజాతతో మాట్లాడతాను." "లాభం ఉంటుందనుకోను. తాను చాలా కచ్చితంగా చెప్పింది. మేం అందరం ఎంత చెప్పినా వినకుండా వెళ్ళిపోయింది" అతని హావభావాలు

గమనిస్తూ అంది సావిత్రి."రవీంద్రగారూ, మీరేం అనుకోకపోతే ఒక మాట - చూడండి ఆడవాళ్ళం ఇంత కష్టపడి ఉద్యోగాలు ఎందుకు చేస్తున్నాం. కాస్త మీకు భారం తగ్గి, ఇంటికి కాస్త అవసరమైనవి అమర్చుకుని, పిల్లల్ని కాస్త మంచి చదువులు చదివించాలని గదా తాపత్రయం. ఆడది ఇటు ఇంట్లో అటు ఆఫీసులో డబల్ పనితో ఆమె ఎంత అలసిపోతూందోనన్నది భర్తలు కాస్త గ్రహిస్తే మాలాంటి వారికి ఓదార్పుగా ఉంటుంది. ఇంట్లో భార్య ఇటు ఇల్లు అటు ఆఫీసుతో అవస్థపడుతూంటే కాస్త సపోర్టు చెయ్యకపోతే ఎలా. ఆ భార్య మిషను కాదు గదా. ఫారిన్‌లో ఆడ, మగ ఉద్యోగాలు చేస్తారు. ఇంట్లో పనులూ ఆడ పని మగ పని అని లేకుండా ఇద్దరూ సర్దుకుంటారు. ఇదివరకటి రోజుల్లో సంపాదన మగాడి పని కాబట్టి ఇంటి పనులు భార్య చూసుకునేది. ఇప్పుడు భర్తతోపాటు ఆవిడా సంపాదిస్తున్నా మగాడి బరువు సగం పంచుకున్నా ఇంకా ఇంటి పని ఆవిడ డ్యూటీ అంటే ఎలా అండి. ఆడవాళ్ళు తెచ్చే సంపాదన కావాలి కాని, ఆవిడ బాధ్యత సగం తీసుకోం అంటే ఎలా కుదురుతుంది. పిల్లల్ని కనడం, పెంచడం ఎలాగూ తప్పదు. పెద్దగా వంటా వార్పులు చెయ్యకపోయినా సగం సగం పనులు పంచుకోకపోతే ఆ భార్య పరిస్థితి ఏమిటో ఆలోచించండి. సుజాతకి ఎంత విసుగెత్తి ఉంటే గాని ఇలా రిజైన్ ఇస్తుందా."

రవీంద్ర మొహం గంటు పెట్టుకు వింటున్నాడు. "నా మటుకు నేను, మా ఆయన మా పనులు పంచుకున్నాం. వంట పని నాది. ఇల్లు సర్దటం, పక్కలు వేయడం, డస్టింగ్, నీళ్ళు పట్టడం, సాయంత్రం పిల్లల్ని చదివించడం అన్నీ ఆయన వంతు. ఎవరికన్నా ఒంట్లో బాగులేకపోతే ఆయనొకసారి, నేనొకసారి సెలవు పెడతాం. రెండేళ్ళకోసారి ఎల్.టి.సి. మీద తప్పకుండా ఎటన్నా వెడతాం రొటీన్ నుంచి బయటపడడానికి. చుట్టాలు వచ్చినా ముందుగానే వాళ్ళకి చెప్పేస్తాం. ఇంట్లో వంట చేసి వెడతాం, మీ పనులు మీరు చూసుకోండి అని. ఇలా ఇద్దరం ఫ్రాంక్‌గా మాట్లాడుకుని డ్యూటీలు వేసుకున్నాక రిలాక్స్‌గా ఉన్నాం. ఏదో ఇలా సర్దుబాటు చేసుకోకపోతే ఫిజికల్‌గా, మెంటల్‌గా భర్త సపోర్టు ఇవ్వకపోతే ఆడవాళ్ళు ఉద్యోగం చెయ్యడం చాలా కష్టం" ఆవిడ రవీంద్ర ముఖకవళికలు గమనించినా చెప్పదలచింది చెప్పేసింది.

"ఈ లెటరు ఇంకో నాలుగైదురోజుల వరకు పంపకుండా ఉంచుతాను. ఈలోగా మీరు సుజాతని కన్విన్స్ చేయగలిగితే మంచిదే. మరి మీ ఇద్దరూ ఆలోచించుకోండి."

"థాంక్స్ మేడమ్. ఐ విల్ టాక్ టు హర్" అన్నాడు.

మర్నాడు రవీంద్ర ఉదయం ఆరుగంటలకే లేచిపోయాడు. సుజాత వంటింట్లో పని చేస్తుండగా చకచక పక్కలు తీసేసి, పుస్తకాలు, పేపర్లు సర్దేసి, డస్ట్ చేశాడు. పిల్లల పుస్తకాలు సర్దేశాడు. పిల్లలు విడిచిన బట్టలు సబ్బు నీళ్ళలో నానబెట్టాడు. బాత్‌రూంలో వాష్‌బేసిన్, కమోడ్ బ్రష్ పెట్టి కడిగాడు. వంటింట్లోంచి ఎందుకో బయటికి వచ్చిన సుజాత రవీంద్ర చేసిన, చేస్తున్న పనులు చూసి తెల్లబోయింది. "ఇటు సూర్యుడు అటు పొడిచాడా ఇవాళ ఎంత శుభదినం" హాస్యంగా అంది. రవీంద్ర మొహం సిగ్గుతో కాస్త ఎర్రబడింది.

"ఇంక రోజూ సూర్యుడు అటే పొడుస్తాడనుకో. ఇదిగో నేను ఇంట్లో చేసే పనులు లిస్టు రాసేశాను. ఇంకేమన్నా చేర్చాలంటే చేర్చు వంట తప్ప. అది నేను చేశానంటే ఇంట్లో ఆకలితో మాడాలి" చాలా తేలిగ్గా అనేశాడు. బాత్‌రూంలో దూరి తలుపు వేయబోతూ ఇదిగో నిన్న మీ సావిత్రి మేడమ్ కనిపించి ఎందుకో రమ్మన్నారు అంటూ తన మొహం చూపలేక తలుపు వేసుకున్నాడు.

సుజాతకి అర్థం అయింది ఇదంతా ఏమిటో. రవీంద్రలో మార్పుకి తృప్తిగా నిట్టూర్చింది. పదిహేను రోజులు ఇంట్లో కూర్చునే సరికి రెస్టు దొరికి అలవాటయిన ఉద్యోగం లేక రోజంతా ఖాళీగా ఏం తోచనట్టయింది.

మొన్న నాలుగు రోజులు ఎండ కాస్తే మబ్బు పట్టడం, ఉరుములు, మెరుపులు, వర్షం రావడం ప్రకృతిలో సహజమైనట్టే సంసారంలో ఎండలాంటి కోపాలు, ఆవేశాలు, తరువాత ఉరుముల్లా అరుచుకోడాలు, వర్షంలా కన్నీళ్ళూ సంసారాల్లో సహజమే. ఒక్క సంపాదనతో రోజులు వెళ్ళదీసే రోజులు పోయాయి. ఎంత బాధ ఉన్నా దిగమింగుకు దిగిరాక తప్పదు మగాళ్ళు. ఆడదానికి సంసారంతో, పరిస్థితులతో ఎడ్జస్ట్ అవక తప్పదు. లైఫ్ అంటేనే. అందులో మారేజ్ లైఫ్ అంటేనే ఎడ్జస్ట్‌మెంట్. బతకడానికి ఎడ్జస్ట్‌మెంట్ తప్పనిసరి.

(మే 6, 1995, ఇండియా టుడే)

# స్పృహ

ఏ. లక్ష్మీరమణ

"అమ్మా! అమ్మా!!"

ఎక్కడిదీ ఈపిలుపు?

ఎంతకాలమైంది ఇంత తియ్యని పిలుపు చెవులబడి?

కలగంటున్నానా ఏమిటి?

అనుమానంగా చూసింది స్పృహ తల్లి. ఇటూ అటూ కదిలింది. తను పక్కమీదే పడుకుని వున్నాననీ, నిద్రపోవటం లేదనీ నిర్ధారణకు వచ్చింది.

స్పృహ అలా నోరారా పిలిచి చాలా కాలమైంది.

ఎనిమిదేళ్ళు ఏమయినా అల్పకాలం గనుకనా? ఈ ఎనిమిదేళ్ల దీర్ఘకాలంలో ఆ తల్లి మనసు ఎంతగా తల్లడిల్లిపోయిందో ....

ఆశనిరాశల మధ్య ఎంతగా కొట్టుకుపోయిందో ....

భగవంతుడన్న వాడుంటే అతడికే తెలుస్తుంది. కన్న తల్లిమనసు. అది ఆమెకు తెలుసు. కన్నతండ్రికి కొంత తెలుస్తుంది. స్పృహను పరీక్షించిన డాక్టర్లకీ తెలుసు ఆ సంగతి!

స్పృహ ఇన్నేళ్లు జీవచ్ఛవంలా పడివున్నా జీవం ఇంకా ఆమె శరీరాన్ని అంటిపెట్టుకునే వుండటం అందరికీ ఆశ్చర్యంగానే ఉంది!

"లెటజ్ హోప్ .... " అంటూనే ఉన్నారు డాక్టర్లు.

అవును!

ఆ ఆశే కన్నతల్లికి ఈ అంధకారంలో చిన్నదీపం.

రెపరెపలాడుతున్న ఆ దీపాన్ని ఎలాగయినా నిలపాలనే ఆమె తపన.

దినాలు నెలలుగా, నెలలు సంవత్సరాలుగా సాగిపోతున్నప్పుడు, ఆశ నిరాశలోకి జారిపోతున్నప్పుడు గిలగిలలాడిపోయింది. 'ఈ దీపం ఆరిపోకూడదు .... ఆరిపోకూడదు'

అని ఆక్రోశించింది ఆమె మనసు. స్పృహ తల్లి ఎదురుగా ఉన్న గోడ గడియారం వంక చూసింది.

బెడ్‌లైట్ చిన్న కాంతిలో రెండు గంటలు తడిమిచూసుకుంది. భర్తలేడు. పక్క ఖాళీగా వుంది. అతడు పనిమీద వూరు వెళ్లాడని గుర్తుకువచ్చింది. మరి నాలుగురోజులకుగాని తిరిగిరాడు.

మళ్ళీ అదే పిలుపు ...."అమ్మా! అమ్మా!!"

ఈ పిలుపు ఎక్కడినుంచి తన హృదయంలోకి చొరబడుతోంది?

తల తిప్పి చూసింది.

గుమ్మంలో ఎవరది? ఆరూపం ఎవరిది?

సందేహం లేదు - తన ప్రాణానికి ప్రాణం. తన కడుపుపంట. తాను కన్న బిడ్డ స్పృహ!

అవున్మా! స్పృహ ఎలా లేచివచ్చింది?

ఎనిమిదేళ్ళు మగతగా పడివున్న స్పృహ....

తనకి పెడుతున్న అన్న కూడా తింటున్నట్లు తెలియకుండా పడున్న స్పృహ ...

తనంతట తాను ఎలా లేచివచ్చింది?

మెరుపులు, వురుములు వచ్చినా కదలని స్పృహ ఎలా కదిలివచ్చింది?

ఆమెకు అర్థం కావటంలేదు. నమ్మలేకపోతోంది. అయినా, అక్కడ ద్వారంలో నిలుచుని పిలుస్తున్నది మాత్రం స్పృహే. అందులో సందేహం లేదు.

ఆమె అమాంతంగా లేచి వెళ్ళి కౌగలించుకొంది తన బిడ్డను.

"స్పృహా .... స్పృహా ...." అంటూ ఉక్కిరిబిక్కిరి చేసేసింది.

"ఓ గాడ్! నన్నిలా నలిపిప్పారేస్తున్నావేమిటమ్మా? నాకు ఆకలేస్తోంది. నిన్న ఆ ఉత్సాహంలో సరిగా భోంచెయ్యనేలేదు. రఘుమాటలు వింటూ ఉంటే అప్పుడు ఆకలి కూడా వెయ్యలేదు" అంటోంది స్పృహ.

స్పృహ ఏమంటోందో ఇంకా ఆ తల్లికి అంతుబట్టలేదు. స్పృహకి ఆకలివేస్తుందని తెలుస్తోంది. 'ఎనిమిదేళ్లగా ఆకలిదప్పులు తెలియని తనబిడ్డకు ఆకలి తెలిసి వచ్చింది' అనుకొంటూ టేబుల్ పైన అన్నీ అమర్చింది.

స్పృహ తింటోంది ఆత్రంగా. తల్లి కన్నార్పకుండా చూస్తోంది. తింటున్నది చటుక్కున ఆగి పకపక నవ్వింది స్పృహ.

ఎన్నాళ్లయింది స్పృహ నవ్వువిని. పూలవాన కురుస్తున్నట్లు సంబరంగా చూస్తోంది ఆతల్లి.

"అదేమిటమ్మా, నన్ను ఎప్పుడూ చూడనట్లు అలా చూస్తున్నావు?" అంది స్పృహ.

అది స్పృహకు విప్పిచెప్పటమెలా అని మధనపడింది తల్లి.

కొడిగట్టిన దీపం ఒక్కసారిగా కాంతులు విరజిమ్ముతున్నపుడు, అడుగంటిన ఆశాజ్యోతి దేదీప్యంగా వెలిగిపోతున్నప్పుడు ఆ ఆనంద పారవశ్యం ఆపుకోవటం ఎవరికి శక్యం?

"తల్లీ! నీకు ఎనిమిదేళ్ళ తరవాత స్పృహ వచ్చింది" అని చెప్పటం ఎలా?

స్పృహ గబగబా తినేసి "అమ్మా! నాకు నిద్రవస్తోంది. వెళ్ళి పడుకుంటా" అంది చాలా సహజంగా.

"ఆ ఆ .... పడుకో తల్లీ! మళ్ళీ త్వరగా లేవాలి" అంది మనసులో ఏదో బితుకుగాఉన్నా.

"రఘువచ్చి కూర్చోడూ! లేవక తప్పుతుందా?" అంటూ కోటి సంపెంగలు విరబూసినట్లు నవ్వుతూ వెళ్ళి పడుకుంది స్పృహ.

ఆమె వెళ్ళి పడుకోవటం గమనించి, నెమ్మదిగా గదిలోకి వెళ్ళి పక్కనే కూర్చుంది తను.

ఎన్నో ఆలోచనలు ఆమెను పెనవేసుకుపోతున్నవి. స్పృహ ఎనిమిదేళ్ళ వెనుక పెండ్లికాగానే హనీమూన్‌కని రఘుతో మద్దికర కారులో ప్రయాణమై వెళ్ళింది. పక్కన టేప్ ఆన్‌చేసి పెట్టుకున్నట్లున్నారు. ఇద్దరిమాటలూ అందులో మిగిలిపోయాయి. ఈ ఎనిమిదేళ్లలో స్పృహ స్వరం వినాలనుకున్నప్పుడల్లా అదే టేప్ వింటోంది. ఆ మాటలు ఎన్నిసార్లు విందో తనకే తెలియదు. మళ్ళీ ఎనిమిదేళ్ళ తరువాత ఇప్పుడే స్పృహ నోటి మాట వినటం.

కారుమబ్బులు చీల్చుకు వచ్చిన మెరుపుతీగలా స్పృహ మళ్ళీ నడిచి రావటం కూడా ఇదే!

ఈలోగా ఎన్ని మార్పులు. కానీ ఈ మార్పులన్నిటికీ అతీతంగా స్పృహ తప్పిపడివుంది.

టేప్ రికార్డు ఆ తల్లి మనసులో మారుమోగుతోంది. రెండు ప్రేమహృదయాల లోతుల నుండి వుప్పొంగి వచ్చిన మాటలవి!

"స్పృహా! ఇప్పుడు మనం ఎక్కుతున్నది మర్కారా కొండలు కాదు. ప్రణయ సోపానం! నాకు ఎప్పుడూ ఒక బలమైన కోర్కెవుండేది. మనం మొదటి రాత్రి ఒక అపురూపమైన ప్రదేశంలో గడపాలని! ఇక్కడికి నేను ఒకసారి క్యాంపుకి వచ్చాను. అప్పుడే నాలో ఈ ఆలోచన నాటుకుంది. ఆరోజే నేను నిర్ణయించుకున్నాను. పెండ్లికాగానే నిన్ను అమాంతం ఇక్కడికి ఎత్తుకుని వచ్చేయాలని. ఈ ప్రకృతి కౌగిట్లో మనిద్దరం మొదటిసారిగా ఏకం కావాలని"

"అయితే ఏకాంత సేవకు సరైన చోటే ఎన్నుకున్నావు. రఘూ! ఎక్కడిదీ ఈ సువాసన?"

"అవిగో ఆ ఎత్తయినవన్నీ సంపగి చెట్లే"

"ఆ సంపంగి సువాసనల్ని గాలి తన రెక్కలకి అద్దుకుని వస్తోంది లాగుంది. ఈ సువాసన నాకు మత్తెక్కిస్తోంది రఘూ. షాంపేన్ తీసుకుంటే నిషావస్తుందంటారే, నాకూ అలాంటి నిషాముంచు కొస్తున్నట్లుంది"

గలగలానవ్వి. "రఘూ! ఈ తలలు కత్తిరించిన చెట్లన్నీ ఏమిటి? ఎత్తుగా ఎదుగుతాయని మధ్యలో కత్తెర్లు వేసారా?"

"అవి కాఫీ చెట్లు స్పృహా! నీకు ఇక్కడ బెస్ట్ కాఫీ దొరుకుతుందిలే...."

"రఘూ! నీకు దగ్గరగా వుండి ఇలా పైపైకి వెళుతుంటే ఆకలి, దప్పి రెండూ లేవు. అటుచూడు రఘూ. ఆ గుంపులుగా వెళుతున్న వాళ్లంతా అలా రంగు బట్టలు వేసుకుని, జొప్పలో కత్తులు దోపుకుని వెళుతున్నారేమిటి? ఇక్కడేమీ యుద్ధాలు జరగటం లేదు కదా?"

"ఇక్కడ కూర్గు వాళ్ల పెండ్లిండ్లు చాలా విచిత్రంగా వుంటాయి స్పృహా! వీళ్లంతా పెళ్ళికి వెళుతున్న పెద్దలు. వీళ్లల్లో రాజఠీవి ఉట్టిపడుతూందికదూ! మగపెళ్ళి వాళ్ల విందులు అయిన తరువాత వినోదాలు ప్రారంభిస్తారు. మగపెళ్ళివాళ్లు నృత్యం చేస్తుంటారు. వాళ్లు అలా నృత్యం చేస్తున్నంతసేపూ, ఎంత రాత్రయినా కానీ పెళ్ళికూతురు తలపైన కుండ పెట్టుకుని నిలబడే వుండాలి తెలుసా?"

"పాపం అదేం పనిష్మెంట్ పెళ్ళి కూతురుకు?"

"మరి అంతటి వీరుడు, సుందర స్వరూపుడు భర్తగా లభించబోతుంటే పెళ్ళికూతురు ఓర్పులో చిన్న టెస్టు పాస్‌కావాలన్నమాట. నిజానికి కూర్గులో మగవాళ్లు ఎంతో మగసిరి గలవాళ్ళు స్పృహా"

"నీ కంటేనా?"

"నీ కంటికి నేను మన్మధుడిలా కనిపించవచ్చు. కానీ నిజానికి కూర్గులో మగ వాళ్లంతా గొప్ప మగసిరి గల వాళ్లేననిపిస్తుంది. ఇక్కడ ఒక కథ చెప్పుకుంటారు. అందులో ఎంత సత్యం వుందో నాకు తెలీదు. గ్రీస్ దేశం నుండి యుద్ధవీరులు వస్తుంటే, వాళ్ల ఓడ ఇక్కడ తీరాన పగిలి పోయిందట. వాళ్లంతా వచ్చి ఇక్కడే స్థిరపడిపోయి వివాహాలు చేసుకున్నారట. అందువల్ల గ్రీస్‌దేశస్థుల, మలబారువాళ్ల ఇద్దరి సంస్కృతి ఇక్కడ కనిపిస్తుంది. వారి సంతతివారు కనుక ఇక్కడ మగవాళ్లు ముఖ్యంగా చాలా అందగాళ్లని పేరు"

"ఆహా నేను నమ్మను. నీవు గ్రీక్ వాడికన్నా అందమైనవాడివి"

అంతే! అక్కడితో స్పృహ మాటకట్ అయిపోయింది. ఆ తరువాత టేప్‌లో కిర్రుమనే శబ్దం జొరబడింది.

స్పృహ, రఘూలు ప్రయాణం చేస్తున్న కారు కొండమీదనుండి ఒరిగింది. అదృష్టవశాత్తు ప్రాణనష్టం కాలేదు. రఘుకు కొద్దిపాటి దెబ్బలు తగిలాయి. స్పృహకు తలపైన బలమైన గాయాలు తగిలాయి. బాగా రక్తం పోయింది. ఫలితంగా స్పృహ తెలివి తప్పిపోయింది. ఎందరో నిపుణులు వైద్యం చేశారు.

రఘు కోలుకోగానే స్పృహని చూసి తల్లడిల్లిపోయాడు. కొన్ని రోజులు స్పృహ దగ్గరే రాత్రింబవళ్లు కాచుకొని కూర్చున్నాడు. కొన్ని నెలల పాటు రోజూ స్పృహను చూసి వెళ్ళేవాడు. ఒకటి, రెండు, మూడు సంవత్సరాలు ఆమెకోసం ఆశగా ఎదురుచూసాడు. నాల్గో సంవత్సరం ఆశ సన్నగిల్లింది. కొత్త కోర్కెలు తల ఎత్తసాగాయి. అవి మళ్లీ పెళ్లికి దారితీశాయి. కాలం స్పృహని అక్కడే పెట్టి చకచకా నడిచిపోసాగింది.

రఘు పిల్లలిద్దరూ స్కూలుకు కూడా వెళుతున్నారు. ఇవన్నీ అప్పుడే తెలివిలోకి వచ్చిన స్పృహకు ఎలా చెప్పటమని ఆ తల్లి ఆవేదన. స్పృహ ఇంతకాలానికి తలకు తగిలిన గాయం నుండి తేరుకుని బయటపడింది. అయితే స్పృహ తెలియని ఆ ఎనిమిదేళ్ల

కాలం ఆమెకు ఒక్కరాత్రిలా మాత్రమే గుర్తుకువస్తోంది. ఈ భ్రమ నుండి ఆమెను ఎలా మేల్కొలపటం అన్నదే ఆ తల్లిని ఎదుర్కొంటున్న గడ్డు ప్రశ్న.

స్పృహ పరిస్థితి చూసి అందరూ ఆశలు వదులుకున్నా తాను మాత్రం ఒదులుకోలేదు. తనలోని శక్తినంతా కూడగట్టుకుని నిలిచి గెలిచింది. తన బిడ్డశరీరానికి, మనసుకు తగిలిన దెబ్బ నుండి కోలుకోవటానికి తను ఎంతటి నిగ్రహం, ఆత్మవిశ్వాసం చూపింది. ఇప్పుడు అంతకన్నా ఆమెను మానసికంగా కుదుటపర్చటానికి సిద్ధపడాలి. ఆమె మనసుకు తగిలినగాయం మాన్పగల ఆత్మస్థయిర్యం తను పెంపొందించుకోవాలి. సున్నితంగా, నేర్పుగా ఆ పనిని నిర్వహించాలి. స్పృహకు కొత్త జీవితం ప్రసాదించాలి.

అందుకు తన శక్తినంతా కూడదీసుకుని సిద్ధపడింది ఆ తల్లి.

(విపుల, జనవరి, 1983)

# పెన్షన్

రాజ్యలక్ష్మి పోలాప్రగడ

తాలూకా ఆఫీసులోంచి కొడుతూన్న గంటలు .... ఒకటి .... రెండూ .... పదకొండు! లెక్క పెట్టాడు నరసింహం. అటునుంచి ఇటు వత్తిగిల్లాడు. దాదాపు రెండు మూడు గంటలనుంచి మంచంమీద అటూ యిటూ దొర్లుతూనే ఉన్నాడు. నిద్దర పట్టడం లేదు .... ఆలోచనలు! ఒకటే ఆలోచనలు! "ఏవిటి చెయ్యడం? ఇప్పుడెలాగ? అధమం రెండు వందలేనా లేకుండా పని జరుగుతుందా? హైదరాబాదు వెళ్ళి రావాలంటేనే అవుతాయి ఏభై అరవై రూపాయలు. ఆపైన వాడికి చెల్లించే ముడుపు .... ఖర్చులు. అవీ ఇవీ మొత్తం రెండు వందలికి తక్కువకావు. ఉద్యోగంలోంచి రిటైరయి చేతిలో నయాపైసా లేకుండా కూర్చున్న తనకి రెండు వందలు అప్పు పుట్టొద్దూ? ఇంక అడిగేది మాత్రం ఎవరిని? తెలిసినంత మట్టుకి చేబదుళ్ళూ అప్పు అందరి దగ్గరా పట్టుకొచ్చాడు. ఇంక తెలిసిన మనిషే మిగలలేదు కొత్తగా అప్పు చెయ్యడానికి.

అయినా ఇద్దరి ముగ్గుర్ని అడిగి చూశాడు. "నోటు రాసిస్తాను. ఒక్క రెండు వందలిప్పించండి .... హైదరాబాదు వెళ్ళివస్తే, నా పెన్షన్ కాగితాలు కదులుతాయి. పెన్షన్ వచ్చిన మర్నాడు మీబాకీ తీర్చేస్తాను" అంటూ. తనమాటలువిని వాళ్ళు ఒకటే నవ్వడం! "ఇదిగో నరసింహం! నీకైతే ఇంకా నమ్మకం ఉందేమోకాని మాకు మాత్రం లేదయ్యా నీకింక పెన్షన్ వస్తుందని." ఆ మాటలువిని తను వణికిపోయాడు. నిజంగానా? "వాళ్ళు అన్నమాట కూడా నిజమేనేమోనే!" అన్నాడు సీతతో. కాని ఆమె ధైర్యం చెబుతూ "ఏపనికైనా ముందే అలా నిరాశపడితే ఎలా చెప్పండి! మన ప్రయత్నం మనం చెయ్యాలి. అని మీరేకదా అనేవారు" అని తనలో తలెత్తిన నిరాశని ఒకటి రెండుమార్లు పోగొట్టింది. పక్క మంచంమీద నిద్రపోతున్న భార్య ముఖంలోకి చూశాడు. పేద ముత్తైదువ వేషంలో ఉన్న శ్రీమహాలక్ష్మిలా కళకళ్లాడి పోతోంది నిట్టూర్చాడు నరసింహం.

కష్టాల్నీ సుఖాల్నీ తనతో సమానంగా పంచుకుంటూ, నిత్యం తనకి ధైర్యాన్నీ, బలాన్నీ ఇస్తూ, తనతోడిదే లోకంగా బ్రతుకుతోంది. సీత అండలేకపోతే, తను ఇన్నాళ్ళు యిలా నిబ్బరంగా బ్రతికి ఉండేవాడా? రిటైరయి యేడాది కావస్తోంది.

రిటైరయ్యాక ఎలా తోస్తుందని అప్పుడు బెంగెట్టుకున్నాడు. కాని ఇప్పుడా బెంగలేదు. పెన్షన్ కాగితాలకోసం తనుపని చేసిన తాలూకా ఆఫీసు చుట్టూ కాళ్ళు అరిగేలా తిరిగేటప్పటికే రోజు సరిపోతోంది. రోజు రోజుకి రోజు గడవడం కష్టం అయిపోతోంది. ఓ రూపాయి అప్పు ఎక్కడేనా పుడుతుందేమో అని దేవురించడం, పెన్షన్ కాగితాలు కదిలాయేమోనని తాలూకా ఆఫీసు చుట్టూ ఓమారు ప్రదక్షిణం చేసి రావడం. ఇలా అయిపోయింది తన దినచర్య.

నిన్నో - మొన్నో "అన్నం పెట్టు. ఆఫీసుకెళ్ళాలి" అని సీతని తొందర పెట్టాడు తను.

"బాగానే ఉంది. రిటైరయినా విశ్రాంతి లేకుండా ఆఫీసు చుట్టూ తిరగడం! ఎలా నీరసించి పోయారో చూడండి. ఈ వయస్సులో పండో ఫలమో తింటూ మనవల్ని ఆడిస్తూ, చీకూ చింతా లేకుండా గుమ్మంలో కూచోవలసింది పోయి" అంటూ గుడ్ల నీరు కుక్కుకుంది.

"వెర్రిదానా! చీకూ చింతా లేకుండా ఎలా ఉంటుందే! మనకేమైనా మగపిల్లలు ఉన్నారు కనకనా? ఉన్న ఆ ఒక్క నలుసూ ఎదిగి పెళ్ళికి సిద్ధంగా ఉంది. దాన్ని ఓ అయ్య చేతిలో పెట్టొద్దూ! మనకి రోజు గడిచే ఎత్తు చూసుకోవద్దూ! ఏవో ఆ పెన్షన్‌రాళ్ళు కాసిన్నీవస్తే - " తనలో తనే గొణుక్కుంటూ తాలూకా ఆఫీసుకి వెళ్ళాడు.

"మమ్మల్నేం చెయ్యమంటారుసార్? కాగితాలు హైదరాబాదు పంపాము. అక్కడనుంచి రావాలికదా?" అన్నాడు తన ప్లేస్‌లో కొత్తగా వచ్చిన ఆ గడుగ్గాయి కుర్రాడు. ఎప్పటినుంచో పాడుతూన్న పాటే అది! సిగరెట్లు ఊదిన వాడు ఊదినట్లుంటాడు కాని సరిగా మాట చెప్పడు. ఎప్పటినుంచో ఉంటూన్న 'రికార్డు కీపరు' మాత్రం చెప్పాడు ఓ మాట "అయ్యా నరసింహంగారూ! మన కాలం కాదు. ఇప్పుడు కుర్రాళ్ళు బోలెడు డబ్బుపోసి ఉద్యోగాలు కొనుక్కుంటున్నారు. మరి వాళ్ళు పెట్టిన పెట్టుబడి రావద్దా? అందుకే ఆ అబ్బాయి ఒక వ్రతం పెట్టుకున్నాడు. చెయ్యి తడికాందే నోరు మెదపకూడదు. కాగితం కదపకూడదు అని. సాటి గుమస్తాని కదా, నాదగ్గర కూడానా అని మీరు తెల్లబోకండి. పాపం ఆ చెయ్యికి అలా అలవాటయి పోయింది ఏంచేస్తాడు?" అని.

తనకి నోటమాట రాలేదు. లంచం ఇవ్వడమే కనక అలవాటుంటే తానీ పాటికి పెద్ద ఆఫీసరుగా రిటైర్ అయి ఉండును. తీసుకోవడం అలవాటుంటే ఈ పెన్షన్ డబ్బుల కోసం ఎదురు తెన్నులు చూస్తూ కూర్చోనక్కరలేకనూ పోను. రెండూ చేతకాకే యిలా వుండి పోయాడు తను.

వెంటనే నరసింహం మనస్సు ఎదురు తిరిగింది.

నాన్సెన్స్! చేతకాక ఏవిటి? ఉహూ! చేతకాక కాదు, ఇష్టంలేక .... అవును ఇష్టంలేకే.

లేకపోతే, తను ఉద్యోగంలో చేరిన కొత్తలో "ఈ సహాయం చేశారు - థాంక్స్ - ఏమిమ్మంటారు?" అంటూ పర్సులు తీసేవారు, వచ్చినవాళ్ళు - తనకి ఇష్టం ఉంటేతీసుకోక పోయాడా? ఏదూరపు చుట్టం పేరో బేంక్‌లో ఎకౌంటు ప్రారంభించక పోయాడా? మొదటినుంచీ తనకా పద్ధతి గిట్టదు. అందుకే వచ్చినవాళ్ళతో "నా అలవాట్లు మీకు తెలియవు కాబోలు భలేవారే! పర్స్ జేబులో పెట్టుకోండి. చిరునవ్వు మాత్రం ఒకటి ఇలా పారేయండి" అనేవాడు.

వాళ్ళు "మీరు డైరెక్టుగా గాంధీ శిష్యులండీ! అంటూ ఒకటే నవ్వడం! కొత్తలో కొన్నాళ్ళిలా డబ్బు కక్కుర్తికి లొంగకుండా రోజుకో గండాన్ని ఎదుర్కొనేవాడు. తర్వాత ఆ గండాల భయం పోయింది. అందరికీ తెలిసిపోయింది. "నరసింహం లంచాలు తీసుకోడు" అని - పర్సులు ఖాళీ కాకుండా పనులందరికీ అయిపోయాయి. మంచి పేరు మాత్రం తనకి మిగిలిపోయింది. అన్నింటికీ ఆ దేవుడు వున్నాడు పోనిద్దూ అనే నిశ్చింత ఈ నాటికి కూడా. అయితే ఆ కనిపించని దేవుడు, పెన్షన్ వచ్చే ఆశకూడా కనిపించకుండా చేస్తున్నాడు. అక్కడికీ సీత ఎందరు దేవుళ్ళకో ముడుపులు కట్టింది. తనకుతోడు అదొక అమాయకురాలు. దేవుడికి ముడుపులు కడితే వస్తుందా, ఆఫీసులో ముడుపులు చెల్లిస్తే వస్తుంది కాని పెన్షన్!

తాలూకా ఆఫీసులోంచి పన్నెండు గంటలు విన్పించాయి.

ఉలిక్కిపడి, నిట్టూర్చి, అటుగా వత్తిగిల్లి, ఆప్యాయంగా చూశాడు నరసింహం. పక్క మంచంమీద సీత! కొంచెం వారగా, కుక్కి మంచంమీద తన ఆరో ప్రాణం లలిత! ఇద్దరూ చిరిగిన బట్టలే కట్టుకున్నారు. మూలనున్న గుడ్డి లాంతరు వెలుగులో, లలిత తొడుక్కున్న జాకెట్టు భుజాలమీద అతుకులు మరీ నరసింహాన్ని వెక్కిరించాయి.

హా! పువ్వుల తోటలా ఎదిగి, అటు పెళ్ళీ, ఇటు చదువూ, ఏం లేకుండా నిరాలంకారంగా నిలిచిపోయిన లలిత, తన అశక్తతకి చిహ్నం. పాపం ఏం చేస్తుంది? ఏం తోచక, ఏం చెప్పలేక మాటి మాటికీ వీధి గేటుదగ్గరికి వెళ్ళి వచ్చే పోయేవారిని చూస్తూ, కాలం గడుపుతోంది. లలిత బేల చూపులు చూస్తే, అప్పుడప్పుడు తన గుండెల్ని ఎవరో గుప్పెట్లో పెట్టుకుని గట్టిగా పిండుతూన్నట్లనిపిస్తుంది.

లలిత చూపులకి అర్థం తనకి తెలుసు. కాని ఈ పరిస్థితిలో తల తాకట్టు పెట్టినా వంద రూపాయలు పుట్టవు. పెళ్ళి అంటే అధమం రెండు వేలయినా కావద్దూ? పోనీ అమ్ముదాం అంటే ఇంట్లో ఏమున్నాయి కనుక? గోడగడియారం దగ్గర్నుంచి ఫేముకుర్చీలదాకా, చిన్నచిదరా అన్నీ ఇప్పటికే అయిపోయాయి.

అదంతాసరే - ఆలోచనలు అలా పోతూనే ఉంటాయి. ప్రస్తుతం హైదరాబాదు ప్రయాణానికి రెండు వందలు వచ్చే మార్గం ఏమిటి? ఎంత తలబద్దలు కొట్టుకున్నా దారీ తెన్నూ తోచలేదు నరసింహానికి. గొంతు ఎండిపోతే, లేచివెళ్ళి కాసిన్ని మంచినీళ్ళు తాగివచ్చి, తిరిగి మంచంమీద కూర్చున్నాడు.

పక్కమంచమ్మీద పడుకున్న భార్య ముఖంలోకి చూశాడు. ముసలితనం వచ్చినా ముఖంలో కళాకాంతులేం తగ్గలేదు. నుదుటనున్న ఎఱ్ఱని కుంకుమబొట్టు, ఎప్పుడూ నవ్వుతూ ఉండే ఆమె ముఖానికి మరింత అలంకారాన్నిస్తోంది. ఇది వాళ్ళకి ఉందని

కాని, తనకి లేదనికాని, ఎప్పుడూ బాధపడి ఎరుగదు. ఉన్నంతలోనే సంతృప్తిపడి తాలూకా ఆఫీసు గుమస్తానే మహారాజుగా చూసుకొని పొంగిపోయిన ఉత్తమ ఇల్లాలు! ఎప్పుడేనా తను నవ్వుతూ "ఏమిటి నన్ను నువ్వు మరీ గొప్ప చేసేస్తున్నావు! ఎప్పుడేనా చిన్నంఎత్తు బంగారంగాని పట్టుమని ఓ పట్టుచీరగాని కొనిపెట్టానా?" అంటే వెంటనే చిరునవ్వుతో"అదేంటండీ! బంగారంలాంటి మనస్సుమీది. పట్టు చీరలూ, బంగారాలూ లేక నాకిప్పుడు ఏం లోటు వచ్చింది?" అంటూ నొచ్చుకుంటుంది.

ఇప్పటికీ ఎప్పటికీ ఆమె ప్రోత్సాహమే తనకి బలం ఆమె చిరునవ్వే తరగని ధనం. వీటిముందు మహా సామ్రాజ్యాలు కూడా లెఖ్ఖలేవు తనకి .... అలాంటి తన దేవతకి తానీనాడు కడుపునిండా అన్నంకూడా పెట్టలేకపోతున్నాడు. పట్టరాని బాధతో ఈ చివరి ముక్కలు పైకి అనేశాడు నరసింహం. "ఏవిటండీ అంటున్నారు? ఇంకా నిద్రపోలేదూ?" అంటూ సీతమ్మ అటునుంచి ఇటు తిరిగి పడుకొంది.

ఆ కదలికలో మెడలోవున్న మంగళసూత్రాలు చప్పుడయ్యాయి.

ఆ శబ్దం చిత్రంగా వినిపించింది నరసింహం చెవులికి కళ్ళు పెద్దవిచేసి మరీ చూశాడు.

మెదడులో ఏ మూలో నిద్రపోతున్న ఆలోచనా శకలం, లేచి వళ్ళు విరుచుకుని, బద్ధకంగా ఆవులించింది.

ఛ! .... ఏవిటీ పాడు ఆలోచన ....? ఎప్పుడూ రాంది ఇలా వచ్చిందేవిటి? .... ఛీ .... ఎన్నిమాట్లో ఇలా వచ్చిన ఆలోచనని అసహ్యించుకున్నాడు. కసిరి దూరంగా ఎంత విసిరేస్తే, ఆ ఆలోచన అంత దగ్గరగా మళ్ళీ వస్తోంది. ఏక మెదడుని తొలిచేస్తోంది. అవును. తప్పేం ఉంది? ఆపదల్లో ప్రాణాల్నే అడ్డేస్తాం. ఆపదలన్నీ గడిచి అన్నీ సక్రమంగా సర్దుబాటు అయ్యాక మళ్ళీ చేయించుకోవచ్చు. పవిత్రమైనవి నిజమే. ఈ ఆలోచన తెలివి తక్కువ ఆలోచనే కాని .... కాని ....

భళ్ళున తెల్లారి పోయింది. కాని, నరసింహం ఆలోచనే, ఇంకా తెమల లేదు. కళ్ళు మూసుకుని ఆ మట్టునే పడుకుని ఉన్నాడు. కూతురూ, భార్యా లేచి పనులు చేసుకుంటున్నట్లున్నారు. ఇంట్లో ఏవస్తువు అయిపోయిందని చెప్తారో, అనే భయం నరసింహాన్ని మంచంమీద కదలకుండా కళ్ళు మూసుకుని పడిఉండేలా చేసింది. తన వాళ్ళదగ్గరే తను దొంగ! నరసింహానికి ఏడుపు ఆగలేదు.

బియ్యం కొలిచే సోలతో డబ్బా చప్పుడు చేస్తోంది సీతమ్మ.

బియ్యం అయిపోయాయని చెప్పడం కాబోలు!

అంత ఏడుపులోనూ, గుండె బ్రద్దలయ్యేలాగ బావురుమంటూ, పిచ్చిగా నవ్వుకున్నాడు. నరసింహం.

ఇవాళేవిటి? బియ్యం ఎప్పుడో అయిపోయాయి. వాళ్ళింట్లో సోలెడు, వీళ్ళింట్లో గిద్దెడు నోటి మంచితనం మీద అప్పుతెచ్చి, నాలుగైదు రోజులనుంచి తనకీ లలితకీ వండి పెడుతోంది. తాను మాత్రం పస్తులుంటోంది. ఆ సంగతి తనకి అర్థం అవుతోంది. కాని ఎలా పలకరించి అడగడం? "సీతా నువ్వు అన్నం తిన్నావా?" అని తను ఆప్యాయంగా

పలకరిస్తే, ఆ ఆప్యాయతకి ఆమె గుండె ధైర్యం కోల్పోయి బావురుమని ఏడ్చేస్తే .... ? తను ఓదార్చగలడా? ....

లలిత మంచినీళ్ళు బావికి వెళ్ళడం చూసి, "సీతా!" అంటూ మెల్లగా దగ్గిరికి వచ్చాడు నరసింహం.

"ఏవిటి?" అన్నట్లు చూసింది సీతమ్మ. ఆమె ముఖం చూసేటప్పటికి చెప్పదలచుకున్న మాట చెప్పలేక, "అహ .... అది కాదు .... " అంటూ మాటలు మింగేసి, నీళ్ళు నమిలాడు.

"అదేవిటి, నాతో చెప్పడానికి సందేహిస్తారు?"

"మరేం లేదు .... నీతో చెబుదాం అనీ .... "

"చెప్పండీ! .... ఏవిటి? మళ్ళీ బ్లడ్‌ప్రెషర్ వచ్చిందా? .... ఎలా ఉంది వంట్లో?" అంటూ ఆప్యాయంగా దగ్గరకు వచ్చింది సీతమ్మ.

నరసింహం గుండె కదిలింది ఆప్యాయమైన భార్య మాటలతో ఇంత దైన్యస్థితిలో కూడా నిర్మలమైన మనస్సూ - ఓరిమితో నిండిన ప్రవర్తన - మృదువైన పలకరింపూ ఇలాంటి ఉత్తమమైన సాధ్వీమణితో తనకి వచ్చిన ఆలోచన చెప్పడమా? .... ఆమె ఎంత ఖిన్నురాలై పోతుంది. ఉహు! .... చెప్పను .... చెప్పలేను .... ఇలా అనుకుంటూ గొంతు ఒకమారు సర్దుకుని కుడిచేత్తో గుండెలు రాసుకుంటూ, గొంతు పెకలిరాని మాటని పైకి అనలేక, అలాగని లోపల ఇముడ్చుకోలేక, ఇబ్బందిగా ఇటూ అటూ పచార్లు చేయసాగాడు నరసింహం.

భర్తపడుతోన్న బాధనీ, ఆవేదననీ చూసి అందుకు కారణం ఏమిటో అర్థంకాక, ఆ స్థితిలో అతణ్ణింక చూడలేక గుండెబరువుతో పక్క గదిలోకి వెళ్ళి గోడకి జేర్లబడి ఉండి పోయింది సీతమ్మ.

భార్య అవతల గదిలోకి వెళ్ళడం చూసి "హమ్మయ్య" అని పెద్ద భారం తీరినట్లు పడక కుర్చీకి శరీరాన్ని జేరేశాడు నరసింహం. "ఇప్పుడు అడగడం తప్పింది. కాస్సేపయ్యాకైనా అడుగుతాడుకదా? .... అప్పుడు మాత్రం ఏమని అడుగుతాడు తను? .... సీతా! నీ మెడలో మంగళసూత్రాలు .... అంటూ అడగడమా? భగవంతుడా ఎంత నీచమైన ఆలోచనలు కలిగిస్తున్నావు నాకు?" ఇలా కొంత పైకి, కొంత మనస్సులోనూ, అనుకుంటూ, నెప్పిగా అయిన గొంతును ఓ మారు సర్దుకొని, వట్టి నోటినే గుటకవేశాడు నరసింహం.

భర్త నోట్లోంచి వచ్చిన అస్పష్టమైన మాటలు సీతమ్మకి అశనిపాతంలా వినిపించాయి. ఒక్కక్షణం జీవంలేని కట్టెలా అచేతనంగా నిలబడి పోయింది. తర్వాత పైటచెంగుతో కళ్ళు వత్తుకొని మెళ్ళోని మంగళసూత్రాల్ని కళ్ళకి అద్దుకొని వంటిట్లోకి నీరసంగా నడచి వెళ్ళింది సీతమ్మ ....

చేతిలో మంగళసూత్రాలు పట్టుకుని ఎదురుగా వచ్చి నిలబడ్డ భార్యని చూసి వణికిపోతూ, కంగారుగా కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు నరసింహం. ఆమె మెడలో పసుపుకొమ్ము చూసేసరికి, అతని గొంతులోంచి వెఱ్ఱి బాధ ఏదో, అర్థంలేని శబ్దంగా

వెలువడింది. కాస్సేపటికి వణుకుతూ సన్నగొంతుని అదుపులో పెట్టుకుంటూ "సీతా ...." ఆపైన ఏం అనలేకపోయాడు నరసింహం.

రాయిలా అయిపోతున్న గుండె బరువుని అతిప్రయత్నం మీద భరిస్తూ"తీసుకోండి బాధపడకండి." అంది సీతమ్మ, తనలో మంటలా లేస్తూన్న బాధని భర్తకి కనిపించనీయకుండా ....

"అదికాదు సీతా .... ఏదో బలహీనతలో అనుకున్నాను కాని .... నీ మంగళసూత్రాల్ని అమ్ముకుని ఆ డబ్బుతో ఎలా హైదరాబాదు వెళ్ళి పెన్షన్ కాగితాలు .... " డగ్గుత్తికతో మాటపూర్తి చెయ్యలేక, కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు నరసింహం.

"ఫరవాలేదు .... తీసుకోండి .... ఊ .... మళ్ళీ అమ్మాయి వచ్చి చూస్తే బాగుండదు" అంటూ చేతిలో ఉన్న మంగళ్ళ సూత్రాలు భర్త చేతిలో ఉంచింది.

భార్య చేతిలో మంగళ సూత్రాల్ని తీసుకుని, "సంపదలు లేని ప్రేమలు భార్యాభర్తల్ని మరీ దగ్గరికి చేరుస్తాయి కాబోలు" అంటూ ఆమె వెన్ను మీద చెయ్యివేసి నిమిరాడు నరసింహం. భర్త ఊరడింపులో వెల్లువలా ఉబికివస్తూన్న ఆవేదనని అణచుకుంటూ, తనని తాను సంబాళించుకుంటూ, అక్కడ నుంచి వెళ్ళిపోయింది సీతమ్మ.

"డబ్బురాగానే ముందుగా చేయించేస్తాను - ఏం?" అంటూ అడుగు కదిపిన భర్తని, వీధిమలుపు తిరిగే దాకా కళ్ళకి నిండుగా చూసుకుని నిట్టూర్చి లోపలికి వెళ్ళి పోయింది.

వెళ్ళిన నాలుగో రోజుకల్లా తిరిగివచ్చి, పట్టలేని ఉత్సాహంతో "సీతా మన కష్టాలన్నీ తీరిపోయాయి. నా హైదరాబాదు ప్రయాణం బాగా ఉపయోగించింది. అక్కడ సీటులోఉన్న కుర్రాడు ఎంత బుద్ధిమంతుడనుకున్నావు? .... పనిచేసి పెట్టాడు .... వారం రోజుల్లో మనకి పెన్షన్ వచ్చేస్తుంది. 'నాయనా సాయంచేసి పెట్టావు .... ఇంత కంటే ఇచ్చుకోలేను' అంటూ వందరూపాయలు ఇవ్వబోతే 'భలేవారే! మీదగ్గర లంచం పుచ్చుకుంటానా? మీరెంత నిజాయితీ అయిన మనుష్యులో, మానాన్నగారు చెబుతూ ఉండేవారు.' అంటూ ఆ డబ్బు నాజేబులోనే పెట్టి, రోడ్డు వరకూ వచ్చి సాగనంపాడు .... అలాంటి కుర్రాడు మనకి అల్లుడైతేనా? .... అవును ఇంతకీ లలితేదీ?" అంటూ ఏక వరసన గబగబా మాట్లాడేయసాగాడు నరసింహం.

పైనకొంగు నోట్లో కుక్కుకుని వచ్చే ఏడుపుని ఆపుకొంటూ "మీరు మరీ ఉద్రేకపడి చెప్పకండీ .... మీ ఆరోగ్యం ఏమంత మంచిది కాదు" అంది సీతమ్మ.

"అవున్లే .... అదిసరే అమ్మాయి ఏది?"

సీతమ్మ బొటబొటా కన్నీరు కారుస్తూ నేలకేసి చూస్తూ ఉండిపోయింది.

"అమ్మాయి ఏదంటే మాట్లాడవేం?" ఆదుర్దాగా గట్టిగా అరిచాడు నరసింహం.

బావురుమని ఏడుస్తూ "రెండు రోజులయి అమ్మాయి కనిపించటం లేదండీ!" అంది సీతమ్మ.

గుండె ఆగినట్లయి, ఆ మట్టునే మంచంమీద కూలబడి, గ్రుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయాడు నరసింహం.

"పిల్ల కనిపించటం లేదని రేడియోలో చెప్పించండి" కన్నీళ్ళు తుడుచుకుంటూ అంది సీతమ్మ.

"ఏమని? ఎదిగినపిల్లం .... తండ్రి తన పెళ్ళి ఇంక చెయ్యలేడని నిశ్చయానికొచ్చినపిల్ల .... దాదాపుం20 ఏళ్ళు ఎదిగిన పిల్ల .... తప్పిపోయిందనా?" అంటూ వెఱ్ఱిగా, పిచ్చిగా భయంకరంగా, దెయ్యం పట్టినవాడిలా, గుక్కపెట్టి నవ్వుతూన్న భర్తని చూసి కంగారుపడి భయంతో,"ఏమండీ .... ఏమండీ .... ఏవిటానవ్వు .... గుండెలు పగిలిపోతున్నాయి. ఆపండి!" అంటూ ఏడుస్తూ గావుకేక ఒకటి పెట్టింది సీతమ్మ.

అంతే .... ఆ తర్వాత నరసింహం నవ్వు దానంతట అదే ఆగిపోయింది. తెరచిన నోరు తెరచినట్టూ, మూసిన కన్ను మూసినట్టూ ఆ మట్టునే ఉండిపోయాయి. ఇంత ప్రాకులాడిన పెన్షన్ గొడవా ఏం పట్టనట్లు, ఆ పెన్షన్‌లో నయాపైస కూడా, తాకకుండా ఈ జీవితం నుంచే రిటైరయి వెళ్ళి పోయాడు నరసింహం.

సీతమ్మ వెన్ను కలుక్కుమని విరిగినట్లయింది.

మెడ చేత్తో తడుముకుని ఘొల్లుమంది. "నాకీ పసుపు కొమ్ముకూడా మిగల్చకుండా వెళ్ళిపోయారా?" అంటూ నేల మీద హృదయ విదారకంగా దొర్లి దొర్లి ఏడుస్తూ ఉండిపోయింది సీతమ్మ.

**(1975 స్నేహ మాసపత్రిక)**

# వ్యక్తిత్వాన్ని చావనీయకు

*గోవిందరాజు సీతాదేవి*

ఉదయం తొమ్మిదిగంటలు కావస్తోంది. లాయరు గదాధరరావుగారి మూడంతస్తుల మేడ ముందు రెండు కార్లు ఆగి వున్నాయి. లాయరుగారి గుమస్తా వచ్చిన పార్టీలని ఆఫీసురూములో కూర్చోబెట్టి ఇంకా నిద్రలేచి కిందకిరాని లాయరు గారి కోసం చూస్తున్నాడు.

ఇంతలో ప్రహారీగేటు తీసుకుని ఓ ఎనభైయేళ్ళ ముసలాయన కిర్రు చెప్పులూ, సోడాబుడ్డి కళ్ళ అద్దాలూ, చిరుగుల లాల్చీ నీరకావి పంచెతో లోపలికి రాసాగాడు. తోటమాలి ఆ ముసలాయన్ని చూస్తూనే చప్పున పరుగెత్తుకుని వచ్చాడు.

"ఓ ముసలాయనా! ఆగు. ఆగు అయ్యగారింకా లేవలేదు" అన్నాడు.

"ఏంటీ గదాధరబాబు ఇంకా నిద్ర లేవలేదా! నేన్నమ్మను. ఆయన నాన్నగారు కొడుకు సూర్యోదయం ముందు లేవకుంటే ఊరుకునేవారుకాదే. ఆ అలవాటు ఇప్పుడు ఎక్కడికి పోయిందబ్బా. అయినా అమ్మగారు కూడా ఊరుకున్నారా! ఉండు. కోడలమ్మని కూకలువేస్తా" అంటూ దాసు ముందుకు నడవబోయాడు.

"అమ్మో నువ్వు లోపలకి వెడితే అమ్మగారు ఊరుకోరు. బైటకి గెంటేయమంటారు"

తోటమాలి మాటలకి దాసు బోసినోటితోనే నవ్వాడు.

"పిచ్చి సన్నాసీ ఆవిడ మా ఊరి కోడలుగా మా ఊళ్ళో పదేళ్ళు వుంది. ఆ పదేళ్ళ కోడలమ్మని కంటికి రెప్పలా చూసుకున్నాం మేమందరం. పోరా సన్నాసీ. పోయి దాసు వచ్చాడని చెప్పు"

ఇంతలో లాయరు గారి గుమస్తా సుబ్బారావు అక్కడికి వచ్చాడు. విషయం అంతా విన్నాడు.

"ఇదిగో ముసలాయనా అమ్మగారు పూజలో వున్నారు. దేవుడొచ్చినా లేవరు. ఇంక అయ్యగారు లేవలేదు. లేచినా ఆయన కోసం రెండు కార్లలో పార్టీలు వచ్చారు. వాళ్ళతో మాట్లాడనిదే నీతో మాట్లాడరు. అదంతా జరిగేసరికి పన్నెండు దాటుతుంది. కనుక నువ్వు వెళ్ళి రేపురా" అన్నాడు.

దాసుకి కోపం వచ్చింది.

"ఇదిగో గుమస్తా మీ లాయరు గారి కోసం రెండు కార్లలో వచ్చినా ఇరవై కార్లలో వచ్చిన వాళ్ళున్నా ముందు నాతో మాట్లాడే వాళ్ళతో మాడ్లాడతాడు వుండు నేను ఇక్కడినుంచే పిలుస్తాను. బాబూ గదాధరబాబూ" అని అరవసాగాడు.

"బాబోయ్ అరవకయ్యా అమ్మగారు అగ్గిమీద గుగ్గిలంగా మండుతారు" నెత్తి కొట్టుకున్నాడు సుబ్బారావు.

"సుబ్బారావ్! ఎవరా అరిచేది" లాయరు గారి భార్య సుందరమ్మ కేకపెట్టింది.

"అమ్మా వస్తున్నా" అంటూ లోపలికి పరుగెత్తాడు సుబ్బారావు.

దాసు పిలుపు లాయరుగారికి విన్పించింది. అప్పుడే లేచి కాఫీ తాగి కిందకి వస్తూ దాసు పిలుపు విన్పించి టక్కున ఆగిపోయాడు. 'గదాధరబాబూ' అనే ఆ ఆత్మీయమైన పిలుపు అపురూపంగా అప్పుడప్పుడూ విన్పిస్తూంటుంది. అది విన్పించినప్పుడల్లా తన జన్మభూమి గుర్తుకు వస్తూ వుంటుంది.

దాని వెంట బాల్యం కూడా గుర్తుకు వస్తూంటుంది. తనది శుద్ధపల్లెటూరు. అయినా ఇల్లు పాడీపంటాతో కళకళలాడుతూ వుండేది. ఆ ఇంట్లో ఎప్పుడూ బంధువులు ఎందరో వస్తూపోతూ వుండేవారు. తన తాతగారు రాత్రిపూట ఆరుబైట నవారు మంచం మీద పడుకుని తనని దగ్గర కూర్చోబెట్టుకుని సుమతీశతకం, వేమనశతకం, కుమారీశతకం ఇలా ఎన్నెన్నో నోటికి చెప్పి కంఠతా వచ్చేలా రోజూ వల్లె వేయించి అప్పగించమనేవారు. వాటితోబాటు ఎన్నెన్నో నీతి కథలు చెప్తూండే ఆ తాతగారంటే తనకి ఎంత ఇష్టంగా వుండేదో.

పురోహితుడు రోజూ వచ్చి తిథీ, వారం, నక్షత్రం, వర్జ్యం చెప్పి అమ్మ ఇచ్చే కూరలూ, పాలూ పెరుగూ పట్టుకు వెళ్ళేవాడు. ఆ ఊళ్ళో ఎవరింట్లో పెళ్ళి అయినా అందరూ వచ్చి సాయపడేవాళ్ళు. పాలూ, పెరుగూ, నెయ్యా, కూరలూ పట్టుకు మరీ వచ్చేవాళ్ళు. ఎవరింట్లోనైనా భోజనానికి వెళ్ళాలంటే అప్పుడు ఎంత సరదాగా ఉండేదో! నీళ్ళ చెంబులూ, గ్లాసులూ ఎవరివి వారు పట్టుకుని చెప్పులు లేని కాళ్ళతో నడవటం సరదాగా వుండేది. అన్నింటికంటే ధనుర్మాసం చలిరోజుల్లో దేవాలయంలో నించి వినిపించే దాసు సన్నాయి వాయిద్యం మరీ మరీ ఇష్టంగా వుండేది. ఆ ఊళ్ళో ఎవరింట్లో శుభకార్యం జరిగినా దాసు సన్నాయి మ్రోగవల్సిందే. దాసుకి వ్యవసాయం కూడా వుండేది.

దాసు మరోసారి పిలిచిన పిలుపుకి లాయరు గారు బాల్యస్మృతులలోనించి బైటపడి త్వరత్వరగా మెట్లు దిగిహాలులోకి వచ్చారు.

"దాసూ బాగున్నావా! అక్కడే నిలబడి పోయావేం. రా లోపలికి" అన్నారు సోఫాలో కూర్చుంటూ.

"బాగున్నాను బాబూ" ఒక్కో అడుగూ జాగ్రత్తగా వేస్తూ వచ్చాడు దాసు.

"దాసూ! బస్తా బియ్యం అలాగ్గా ఎత్తగలిగిన నీ శరీరం ఏమిటీ మరీ ఇలా ముడతలు పడిపోయిందీ" వృద్ధుడైన దాసుని పరీక్షగా చూస్తూ అన్నారు లాయరుగారు.

దాసు నవ్వాడు.

"నా వయస్సు ఎనభై ఏడు బాబూ! అయినా పొలం వెళ్ళి వస్తూన్నాగా" అన్నాడు.

"నిజమే. నీ కాలం వేరు. కానీ నువ్వు ఓ ఆడపిల్లని పెంచుకుని చదువు చెప్పిస్తున్నావుట నిజమా? నీకు నలుగురు పిల్లలుండగా అయిదో పిల్ల కావల్సివచ్చిందా" కుతూహలంగా అన్నారు.

"ఆ... నిజమే. తండ్రి మనసుతో చూడగలిగితే అయిదో పిల్లనీ స్వంతపిల్లలా చూడగలం బాబూ"

"ఊ ఇంతకీ ఎవరా అమ్మాయి?"

దాసు జవాబు చెప్పబోతుండగా సుందరమ్మ రుసరుసలాడుతూ అక్కడికి వచ్చింది.

"దాసూ నీ కల్లబొల్లి కబుర్లు ఆపు. పంట డబ్బు రెండు వేలూ పంపిస్తానన్నావు. ఏదీ?" నిలదీస్తూన్నట్లే వుంది.

"అమ్మా నేను నెలక్రితం ఈ ఊరు వచ్చానమ్మా. డబ్బు రెండువేలూ తెచ్చాను. ఇంటికి వచ్చాను. మీరూ, గదా ధరబాబూ కూడా లేరు. అమ్మాయి వుంది. ఆమెకిచ్చి వెళ్ళిపోయాను. అమ్మాయికేగా ఇచ్చిందని మీకు మళ్ళీ ఉత్తరం రాయలేదు కోడలమ్మా"

"అమ్మాయికి ఇచ్చావా! మాకు చెప్పలేదే" సుందరమ్మ రుసరుసలాడుతూనే"సంధ్యా" అంటూ కేకపెట్టింది.

"అమ్మాయి ఇంకా లేవలేదు" పనిపిల్ల జవాబు చెప్పింది.

"లేపి తీసుకురా" లాయరుగారు అరిచారు.

పనిపిల్ల పైకి పరుగెత్తింది.

లాయరుగారికి దాసు వచ్చాడన్న సంతోషం ఎగిరి చక్కాపోయింది. అసహనంగా సోఫాలో కదలసాగారు.

"మీ కోసం పార్టీలు వచ్చి కూర్చున్నారు. వెళ్ళండి. దాసు విషయం పంట డబ్బు విషయం నేను చూసుకుంటాను" సుందరమ్మ లాయరుగార్ని అక్కడనించి పంపేయాలని ఎత్తువేసింది.

లాయరుగారు లేచి వెళ్ళబోయి దాసు ముఖం కందిపోవటం చూసి మళ్ళీ కూర్చుండిపోయారు.

"చూడండీ! రెండువేలూ దాసు ఇస్తే సంధ్య ఎందుకు చెప్పదూ! ఇతను మతిపోయి మాట్లాడుతూ వుండివుంటాడు" కర్కశంగా అంది సుందరమ్మ.

"కోడలమ్మా! నాకు డబ్బు ఎవరన్నా ఇవ్వాల్సి వుంటే గుర్తు వుండకపోవచ్చు కానీ నేను ఎవరికన్నా ఇవ్వవల్సి వుంటే నా మతిపోదు. క్షణక్షణం నా మనసు నాకు గుర్తు చేస్తూంటుందమ్మా"

"అబ్బో! పల్లెటూరి బైతుక్కూడా అభిమానాలూ..." అని ఇంకా ఏదో అనబోతూ భర్త ముఖంలోకి చూస్తూ టక్కున ఆగిపోయింది.

సుందరమ్మ మాటలకి దాసు ముఖం ఎర్రగా కందిపోయింది. ఎనభై ఏడేళ్ళ జీవితంలోనూ చెమటోడ్చి శ్రమించి దాని ఫలంగా లభించిన డబ్బుతోనే నిజాయితీగా బ్రతికి ఏనాడూ ఎవరిచేతా ఇలాంటి మాటలు పడి ఎరుగడు. పొంగి వస్తూన్న ఆవేశాన్ని అణుచుకుంటూ నిలబడలేక కర్ర మరీ గట్టిగా పట్టుకున్నాడు.

సంధ్య నిద్ర కళ్ళు నులుముకుంటూ చికాకుగా ముఖం పెట్టి మెట్లు దిగి క్రింద హాలులోకి వస్తూ "డాడీ ఎందుకూ పిలిచారుటా" అంది గారాంగా.

లాయరుగారు విసురుగా సోఫాలోంచి లేచారు.

"సంధ్యా అదిగో అతను ఎవరో నీకు తెల్సునా" వేలుతో దాసుని చూపిస్తూ అడిగారు.

సంధ్యకి అప్పటివరకూ వున్న నిద్రమత్తు దాసుని చూస్తూనే ఎగిరి చక్కాపోయింది.

"ఆ... ఎవరీ ముసలాయన" ఆశ్చర్యం నటిస్తూ అంది.

దాసు తెల్లబోయాడు. అతని నోటి నుంచి మాట రావడం లేదు.

"చూశారా నేచెప్పలేదూ! మా దాసు అంత నిజాయితీపరుడు లేడు అంటూ డబ్బాకొట్టేస్తుంటారే! ఇప్పుడు చెప్పండి"

"సుందరీ! ఆగు" లాయరుగారు గద్దించినా సుందరమ్మ ఆగలేదు.

"అయినా నాకు తెలియక అడుగుతా మన పొలం చేసే రైతు ఆ డబ్బు పంపలేదా! ఎప్పుడూ పంపటం లేదా! మీరేగా అతనికి రాసింది. మా దాసు వస్తున్నాడు అతనికిచ్చి పంపమని. అయిందా ఇప్పుడు. మా దాసు పరులసొమ్ము ముట్టడని గొప్పలు కొడతారుగా. ఇప్పుడు చెప్పండి. రెండు వేలు మన అమ్మాయికి ఇచ్చానని బూటకాలాడుతున్నాడు చెప్పండి. ఇప్పుడు చెప్పండి"

"కోడలమ్మా" దాసు ఆవేశాన్ని అణుచుకుంటూ అన్నాడు.

"అలా పిలవకు. నాకసహ్యం వేస్తుంది. వెధవ పల్లెటూళ్ళు పల్లెటూళ్ళ వరసలూ మీ పల్లెటూళ్ళ వాళ్ళకి పైస కంటికి కనపడదు. కనపడితే మీకు దరిద్రపు బుద్ధులు పుడతాయి. అయినా నేచెప్తే విన్నారు కారు. ఈ దరిద్రుల చేతుల్లో రెండు వేలు పడితే మనకి వస్తాయా. ఏమండీ! ఈ దాసుగాడిదగ్గర ఆ డబ్బు ఎలావసూలు చేస్తారో నాకు తెలియదు. నాకిప్పుడే రెండువేలూ ఇమ్మనండి" సుందరమ్మ పెద్దగొంతుతో అరవసాగింది.

దాసు రక్తం ఉడికిపోసాగింది. అంతే చేతికర్ర సాయంతోనే సంధ్య దగ్గరగా వెళ్ళాడు.

"సంధ్యమ్మా నేను నీకు డబ్బు ఇవ్వలేదా! నేను వచ్చినప్పుడు ఓ కుర్రాడితో కబుర్లు చెప్తున్నావు కదమ్మా! నేను నాలుగు సార్లు పిలిస్తే కానీ తలెత్తి చూడలేదు కదమ్మా. నేను వచ్చింది ఎందుకో తెల్సుకోకుండానే అమ్మానాన్నగారు లేరు పొమ్మన్నావు కదమ్మా" దాసు నిలదీసి ప్రశ్నించాడు.

సంధ్యదిక్కులుచూడసాగింది.

"నువ్వు పొమ్మన్నా నేను డబ్బు తెచ్చాననేసరికి చప్పున లేచివచ్చి 'ఎంత తెచ్చావూ' అని నా చేతిలోని వందల కాయితాలు లాక్కున్నట్లే తీసుకున్నావు కదమ్మా. అప్పుడు నేను రెండువేలూ మీ రైతు ఇచ్చాడు దాసు తెచ్చి ఇచ్చాడని మీ అమ్మకీ నాన్నకీ చెప్పమ్మా అని చెప్పాకదమ్మా"

సంధ్య మరిచిపోయిన విషయం ఏదో గుర్తు చేసుకునేదానిలా కళ్ళు అదోలా పెట్టి కాస్సేపు ఆలోచించి "నాకేం గుర్తు లేదే" అంది నిర్లక్ష్యంగా చూస్తూ.

"గుర్తు లేదామ్మా! అయితే వుండు. అప్పుడు నీతో మాట్లాడుతూన్న కుర్రాడు మాకు తెలిసిన వాళ్ళబ్బాయే. అతన్ని సాక్ష్యం తీసుకువస్తా"

దాసు గిర్రున వెనక్కి తిరిగాడు.

"ఆగు. ఆగు. గుర్తుకు వచ్చింది. అవును. నువ్వు ఆ రోజు రెండువేలూ తెచ్చి ఇచ్చావు. నిజమే" సంధ్య మాటలకి సుందరమ్మ తెల్లబోయింది.

"ఏమిటే సంధ్యా నిజంగా అతను నీకు డబ్బిచ్చాడా అంది అంతకుముందు తను మాట్లాడిన మాటలని గుర్తుచేసుకుని సిగ్గుపడుతూ.

"అయితే మాకెందుకు చెప్పలేదు. ఏదీ ఆ డబ్బు ఇలా తీసుకురా" లాయరు గారు కోపంగా అన్నారు.

"లేదు నాన్నా ఖర్చు అయిపోయింది. అందుకే మీకు చెప్పడం మర్చిపోయాను"

"నెలనెలా నీ పాకెట్ మనీకింద అయిదు వందలు ఇస్తున్నాంగా"

"అవును ఇస్తున్నారు. అయినా ఆ అయిదు వందలూ నా ఖర్చులకి చాలటం లేదు"

లాయరుగారికి ఒళ్ళు మండిపోయింది.

"నీ సాదరు ఖర్చుకి అయిదు వందలు చాలవా పళ్ళు కొరుకుతూ అన్నారు.

"అవును. చాలవు. చాలవు అని నేననటానికి కారణం మీరు"

"నేనా?" లాయరు గారు కోపంతో చాచి చెంప పగిలేలా కొట్టారు.

"అవును మీరే. నా ఈ తప్పుకి కారణం మీరు. మీరు అన్యాయంగా సంపాదిస్తూన్న డబ్బు అంటే నాకు లక్ష్యం లేదు. అందుకే విచ్చలవిడిగా ఖర్చు చేసేస్తున్నాను. ఆ రెండువేలే కాదు అమ్మ పర్సులో డబ్బు చాలాసార్లు తీశాను"

"సంధ్యా" లాయరుగారు మండిపోతూ గావుకేక పెట్టారు.

"మీకోపానికి నేను భయపడనుడాడీ! జగదీశ్వర్రావు కేసులో అతన్ని గెలుస్తావు అంటూ డబ్బు లాగి పదేళ్ళు ఆ కేసుని నడిపి అవతల వాళ్ళతో కుమ్ముక్కై అతను చివరికి కేసు ఓడిపోతే మీకు కాస్తకూడా బాధపడలేదు. కానీ అతను సర్వస్వం పోగొట్టుకుని పిచ్చివాడై పిచ్చాసుపత్రిలో చేరాడు డాడీ. నిన్ననే వెళ్ళి అతన్ని చూసి వచ్చాను. ఇప్పుడు చెప్పండి. మీ అక్రమ సంపాదనని అమ్మ గౌరవిస్తుంది కానీ డాడీ నేను .... "

లాయరుగారి ఆగ్రహం ఎగిరి చక్కాపోయింది. కుప్పలా సోఫాలో కూలిపోయారు. సుందరమ్మ తల వంచుకుని నిలబడిపోయింది.

దాసు మనసుకి తగిలిన షాక్‌నించి తేరుకున్నాడు.

"అమ్మా సంధ్యమ్మ తల్లీ నువ్వు అన్న మాటలన్నీ బాగున్నాయి. విన్నవాళ్ళు తప్పట్లు కొట్టేలా వున్నాయి. కానీ మీ నాన్న తప్పు చేస్తే దాన్ని సరిదిద్దగలగాలి గానీ నువ్వూ మరో తప్పు చేయటం ఏం సభ్యతమ్మా! ఏం సంస్కారమమ్మా! నువ్వు చదువుకున్న దానివి ఆలోచించు"

సంధ్య ఈ మాటలని విని ఆశ్చర్యంగా దాసు ముఖంలోకి చూడసాగింది.

ఇంతలో గేటుబైట ఆటో వచ్చి ఆగటం దానిలోనించి పాతికేళ్ళ అందమైన అమ్మాయి దిగి లోపలికి రావటం ఆ అమ్మాయి లాయరు అన్నది ఆమె దుస్తులు చూస్తూనే అర్థమైపోయింది అందరికీ. హుందగా నడిచి లోపలికి వస్తూ హాలుబైటనే నిలబడి -

"నాయనా నేను నిన్ను ఇక్కడికి తీసుకువస్తానని చెప్పినా ముందే సిటీబస్‌లో ఎందుకు వచ్చావ్" అంది.

అక్కడున్న అందరూ ఒకేసారి చూడసాగారు.

దాసు చిన్నగా నవ్వి "రామ్మా రా! ఇలా లోపలికిరా! ఆయనే గదాధరబాబు. ఆవిడ కోడలమ్మ. ఆమె సంధ్య గదాధరబాబు కూతురు" అన్నాడు.

ఆ అమ్మాయి అందరికీ నమస్కారాలు చేసింది.

తెల్లటి బెంగాల్ కాటన్ చీరెకి ఆరెంజ్ బోర్డర్, తెల్లజాకెట్ భుజం మీద నల్లగౌను, చెవులకి ఒంటి ముత్యం కమ్మలూ, మెడలో సన్నటి గొలుసూ, ఎడంచేతికి వాచీ, కుడిచేతికి రెండు మట్టిగాజులూ అంతే అయినా ఆ అమ్మాయి ముఖంలో ఏదో కళ వుంది అనిపిస్తోంది.

"బాబూ నా పెంపుడు కూతురు" అన్నాడు దాసు గదాధరరావు ముఖంలోకి చూస్తూ.

లాయరుగారి నోట మాట రాలేదు. కానీ సుందరమ్మ ఆ అమ్మాయివైపు చూస్తూ "నీ పేరేంటి" అంది.

"భవాని" భవాని సుందరమ్మని పరీక్షగా చూస్తూ అంది.

"దాసూ ఇంతకీ ఈ అమ్మాయిది ఏ కులం" అంది అసూయగా చూస్తూ.

"అమ్మా భవాని కులం అడక్కు గుణం అడుగు. సుగుణాల కుప్ప. అందుకే'న్యాయవాది' వృత్తి అంటే న్యాయం చేసే వృత్తి అనే నమ్మకంతో న్యాయవాదిని చేయగలిగాను. నా నమ్మకాన్ని వమ్ము చేయదు నా భవాని తల్లి"

దాసు మురిపెంగా అంటూ భవాని వైపు చూడసాగాడు. భవాని దాసుని చూడటం లేదు. గదాధరరావుని చూస్తూ వుంది. ఆయనా భవాన్ని అలాగే కళ్ళప్పగించి చూడసాగాడు.

"దాసూ ఈ అమ్మాయి నీ పెంపుడు కూతురా?" ఒక్కో అక్షరం కూడబలుక్కుంటూన్నట్లుగా అంటూన్న గదాధరరావుని ఒక్కక్షణం తీక్షణంగా చూసి అంతలోనే శాంతించి -

"ఔను బాబూ! ఈ భవాని మన ఊళ్ళోనే వుండే సుబ్బమ్మ కూతురు జానకి వుందే ఆమెని నమ్మించి పెళ్ళి కాకుండానే తల్లినిచేసి పిరికివెధవలా పారిపోయి లక్షల

కట్నానికి ఆశపడి మరో మండోదరి మెడలో తాళికట్టి వ్యక్తిత్వాన్ని డబ్బుకి అమ్ముకున్న ఓ చవట వెధవ కూతురే ఈ భవాని''

లాయరు గారి ముఖంలో కత్తివాటుకి నెత్తురు చుక్క లేకుండా పోయింది.

భవాని ''నాయనా నాకు కోర్టు టైము అయిపోతోంది. రా పోదాం'' అంటూ దాసుని చెయ్యి పట్టుకుని నడిపించుకుని తీసుకువెళ్ళి గేటు దాటుతూ ఒక్కసారి వెనక్కి తిరిగి చూడబోయి ఆగి ఆటో ఎక్కేసింది.

సంధ్య భవానినే చూస్తూ ఆమె వెళ్ళగానే -

''అమ్మా నేను నాన్న పోలిక అంటావు కదా! మరి ఆ భవాని అచ్చం నా పోలికగా లేదూ'' అంది తల్లిని నిలదీస్తున్నట్లుగా.

సుందరమ్మ నోట్లోంచి మాటరాలేదు. నోరు నొక్కుకుంటూ దేవుడి దగ్గరవి పరుగెత్తింది.

లాయరుగారు రెండు చేతులతోనూ తల పట్టుకున్నాడు బాధగా.

'దాసూ భవాని భవిష్యత్తు కోసం నీ కుటుంబ జీవనాధారమైన రెండెకరాల పొలం అమ్మెయగలిగావు కదూ! దాసూ పేదవాడివైనా నీ వ్యక్తిత్వం ముందు డబ్బు చచ్చింది కానీ నేను ఆనాడూ ఈనాడూ డబ్బు కాంక్షతో వ్యక్తిత్వాన్ని చంపుకున్నాను. దాసూ .... నా వ్యక్తిత్వాన్ని డబ్బు కాంక్షతో చంపేసుకున్నాను ఇన్నాళ్ళూ. కానీ కానీ ఇకముందు అలా జరగదు. జరగనీయను దాసూ ....'లాయరుగారు దీర్ఘంగా నిట్టూరుస్తూ అనుకున్నారు.

(స్వాతి మాసపత్రిక, నవంబర్, 1993)

# ఒకే రక్తం

డా. కె.వి. కృష్ణకుమారి

ఉన్నట్టుండి కర్ఫ్యూ పెట్టారన్న వార్త దావానలంలా హైదరాబాద్ నగరాన్ని చుట్టుముట్టింది.

ఎక్కడి వాళ్ళక్కడే నిశ్చేష్టులై నిలబడి పోయారు. కళ్ళముందు గమ్యం కారు చీకటిగా కనిపించిందొక్క క్షణం. మరుక్షణం ఉరుకులతో, పరుగులతో, ఉద్వేగంతో, ఉద్రేకంతో ఆరాటంతో, ఆందోళనతో వాతావరణం ఉద్రిక్తంగా, ఊహాతీతంగా, దయనీయంగా మారిపోయింది.

అది జిల్లా కేంద్ర స్థాయి హాస్పిటల్.

ఆ రోజు డ్యూటీలో ఉన్నది మెడికల్ స్పెషలిస్ట్ డాక్టర్ రామారావు. ప్రొద్దుట్నుంచి క్షణం తీరిక దొరకని పనిలో సతమతమైపోతూ, కనీసం టీ త్రాగే సమయం కూడా లేకపోయినా విధి నిర్వహణను ఎంతమాత్రం అలక్ష్యం చెయ్యని రామారావు సాయంత్రం వార్డ్ రౌండ్లు వేసి, మరోసారి ఎమర్జెన్సీ కేసుల్ని చూసి, సిస్టర్స్‌కీ, వార్డ్ బాయిస్‌కీ ఇవ్వవలసిన ఆదేశాలు ఇచ్చి అలసటగా డ్యూటీ రూంలో కూర్చున్నాడు.

క్షణం కళ్ళు మూసుకుని అలసట తీర్చుకునే సమయంలోనే గందరగోళంగా హాస్పిటల్ స్టాఫ్ రామారావుని చుట్టుముట్టింది.

"సార్, కర్ఫ్యూ పెట్టేశార్ట సార్. ఉన్నట్టుండి అనౌన్స్ చేశార్ట. ఇప్పుడు ఇంటికెలా వెళ్ళాలి? వెళ్ళక పోతే ఎలా?" వార్డ్ బాయ్ మస్తాన్ దిగాలు పడిపోయాడు.

అతని కొడుక్కి రెండు రోజులుగా విపరీతమైన జ్వరంగా ఉంది. అంతకు ముందే గంట ముందుగా వెళ్ళిపోవాలని పర్మిషన్ తీసుకుని, డ్రెస్ మార్చుకుని, హడావుడిగా వెళ్ళే ప్రయత్నంలో ఉన్నాడు.

"ఓల్డ్ సిటీ దాటి వెళ్ళాలి సార్?" మస్తాన్ కళ్ళలో రాత్రంతా అపస్మారకంలో ఉన్న ఒక్కగానొక్క కొడుకే కనిపిస్తున్నాడు. తనిక్కడ చిక్కుపడిపోతే ఇంక కొడుకును ఈ జన్మలో చూడలేనేమోనన్న భావం నీళ్ళు నిండిన అతని కళ్ళలో స్పష్టంగా కనిపిస్తోంది.

"మా దొరసానికి నెలలు నిండినయి. మా అయ్య కాలిరిగిన పేషెంటు. టుప్పాచపుత్ర దాటి బోవాల"

యాదగిరి నిస్సహాయతను జాలిగా చూశాడు చంద్రయ్య. "యాద్గిరీ మీ ఇంటికాడేనంట గొడవ లవుతుండయ్"

యాదగిరి మొహం పాలిపోయింది.

"సార్... మా ఆవిడ అసలే పిచ్చిది సార్. పసిపిల్లల్తో నేవెళ్ళేదాకా తలుపులేసుక్కూర్చుంటుంది".

తను వెళ్ళకపోతే ఇంటి పరిస్థితిని తలుచుకోటానికే భయపడిపోతున్నాడు ఆస్పత్రి వాచ్‌మెన్ మోహన్‌రావు.

ఏం చెయ్యాలో, ఎవర్నెలా సమాధానపరచాలో అర్థం కావడం లేదు డాక్టర్ రామారావుకు.

"సార్... మన యాంబులెన్స్‌లో అందర్నీ పంపించెయ్యండి సార్. రిటర్న్‌లో దార్లో ఉన్న స్టాఫ్‌ని నైట్‌కి తీసుకురావచ్చు. ఈ కర్ఫ్యూ పొడిగిస్తారంటున్నారు"

సిస్టర్ లక్ష్మి వంక సాలోచనగా చూశాడు రామారావు. అందరి కళ్ళలోను దైన్యం కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. ఎవరి ఇళ్ళకు వాళ్ళు త్వరగా చేరుకోవాలనీ, ఏ అండా లేని తమ వాళ్ళను ఆదుకోవాలనీ ఎవరికి వాళ్ళే ఆత్రుత పడుతున్నారు. దారి చూపించకపోడన్న ఆశతో రామారావునే చూస్తున్నారు.

"రాజలింగం..."

"సార్" రామారావు పిలుపు కోసమే ఎదురు చూస్తున్న డ్రైవర్ రాజలింగం ఆత్రంగా చూశాడు.

"అందర్నీ తీసుకుని ఎవరిళ్ళ దగ్గర వార్ని డ్రాప్ చేసి..." అర్ధోక్తిగా ఆగిన రామారావు వంక నిస్సహాయంగా చూశాడు రాజలింగం.

"డీజిల్ చాలా తక్కువగా ఉంది సార్. గోల్కొండా, మల్కాజ్‌గిరీ, టుప్పాచపుత్రా, ఛత్రినాకా, కారవాన్, చార్మినార్... ఇలా చాలా చోట్ల దింపి నైట్ వాళ్ళని తీసుకురావాలంటే..."

రాజలింగం ఇబ్బంది అర్థమైంది. అయినా తప్పదన్నట్లు చూస్తున్న రామారావు మానవత ముందు తలవంచక తప్పలేదు రాజలింగానికి.

"సరే సార్... మేనేజ్ చేస్తాను. కర్ఫ్యూ కాబట్టి బయటనుండొచ్చే కేసులూ మనం బయటకు పంపే కేసులూ ఉండవు. కాబట్టి వెడతాము. ఒక రిద్దరు దొరికినా సరే నైట్ డ్యూటీ స్టాఫ్‌ని తెస్తాను."

అన్నదే తడవుగా అందరూ ఫాలోమంటూ కదిలారు.

మానసికంగా కూడా అలిసిపోయిన రామారావు ఇంకా మిగిలిన స్టాఫ్‌ని ప్రశ్నార్థకంగా చూశాడు.

సిస్టర్స్ షాజిదా, కృపావరం, లక్ష్మి, వాచ్‌మన్ సీతారాం, వెంకటేష్ వినయంగా నిలబడ్డారు.

డాక్టర్ రామారావు పేషెంట్స్‌కేకాదు, హాస్పిటల్ స్టాఫ్‌కి కూడా దేవుడితో సమానం. ఎవరికేమి అవసరం వచ్చినా అరమరికలు లేకుండా అందర్నీ అన్ని విధాలా ఆదుకునే రామారావంటే అందరికీ ప్రత్యేకాభిమానం.

రామారావు కళ్ళలోని భావం అందరికీ అర్థమైంది.

"వాళ్ళకున్నంత ఎమర్జెన్సీ మాకు లేదు సార్. ఇళ్ళ దగ్గరకి ఫోన్లు చేసి చెప్తాం. అదీగాక అందరం వెళ్ళిపోతే మీరొక్కరూ మేనేజ్ చేసేది ఎలా సార్? నైట్ స్టాఫ్ ఎవరొస్తారో ఏమిటో?"

అందరూ కూడబలుక్కున్నట్లు తనకు ఆసరాగా నిలుస్తుంటే అంత అలసటలోనూ రామారావు కళ్ళలో చిత్రమైన కాంతి మెరిసింది.

హాస్పిటలంతా క్షణాల్లో నిశ్శబ్దమైపోయింది. వీధులు నిర్మానుష్యమైన సూచనలు కనిపిస్తున్నాయి. ఫోను నిర్విరామంగా మోగుతూనే ఉంది.

సీతారాం, వెంకటేష్ విసుగు లేకుండా చెప్తూనే ఉన్నారు. డ్యూటీకి రాలేని అశక్తత కొందరిది. డ్యూటీలో ఉన్న వాళ్ళింకా ఇంటికి రాలేదన్న ఆందోళన కొందరిది. పేషెంట్స్‌కు అన్నం తీసుకురాలేని నిస్సహాయత కొందరిది. పేషెంట్సెలా ఉన్నారోనన్న ఆవేదన కొందరిది.

మౌనంగా వింటూ కూర్చున్న రామారావు గుండెల్లో చిరుమంట మొదలైంది. లక్ష్మి గుర్తుకువచ్చి అశాంతి, అర్థంకాని భయం నిలువునా దహించడం మొదలుపెట్టింది.

ప్రొద్దున డ్యూటీకి వచ్చే ముందు ఎప్పుడూ లేనంత బేలగా చీటికీ మాటికీ కన్నీళ్ళు పెట్టుకుంటున్న లక్ష్మి అమాయకత్వమే కళ్ళముందు కనిపిస్తోంది.

* * *

"పిచ్చి! ఏమిటిది? ఇప్పుడు నీకేమైందని?"

లక్ష్మి కళ్ళలో నీటిపొర మెరిసింది.

"ఎందుకో ఇవాళ భయంగా ఉందండీ. మీరు ఎవర్తోనైనా డ్యూటీ మార్చుకోకూడదూ?"

"ఉన్నట్లుండి డ్యూటీ చెయ్యమంటే ఎవరు చేస్తారు లక్ష్మీ? అయినా నేను కావాలని వేసుకున్న డ్యూటీనేగా ఇది. రేపట్నుంచీ నువ్వు వెళ్ళమన్నా పది రోజుల దాకా నీదగ్గర్నుంచి కదిలేదే లేదు. ఓ.కే."

లక్ష్మిని బుజ్జగిస్తున్నా రామారావు మనసు మనసులో లేదు. లక్ష్మి నిండు గర్భవతి. మొదటి కాన్పులోనే దక్కదనుకున్న లక్ష్మి పుట్టగానే బాబుని దూరం చేసుకున్నా ప్రాణాల్తో తన కోసం మిగిలింది. ఈసారి గుఱ్ఱపువాతం లక్షణాలున్నాయి. తనకు లక్ష్మే ముఖ్యమని చెప్పినా లక్ష్మి పంతం నెరవేర్చుకుంది.

రామారావుకి బాబు నివ్వబోతోంది.

లక్ష్మి ఆరోగ్యాన్ని కూడా లెక్కచెయ్యడం లేదు. తనందించబోయే బాబును చూసి భర్త పొందబోయే ఆనందాన్ని తలుచుకుంటూ రోజులు లెక్కపెట్టుకుంటోంది.

"ఇంకా డెలివరీకి పదిహేను రోజులు టైముంది. లేనిపోని భయాలు పెట్టుకోక ధైర్యంగా ఉండు. దుర్గమ్మగారు నీకు తోడుంటానన్నార్ద కనుకే నేను నిశ్చింతగా డ్యూటీకి వెడుతున్నాను. ఎల్లుండి హాస్పిటల్లో నిన్ను చేర్పించడం. మనం నిర్ణయించిన సమయానికి బాబు బయటకు రావడం..." రామారావు ధైర్యం చెప్తున్నా లక్ష్మి మనస్ఫూర్తిగా నవ్వలేకపోతోంది.

"నువ్విలా ఉంటే నేనక్కడ డ్యూటీ చెయ్యలేను. చెప్తున్నా"

భర్తలో బింకం సడలుతున్నట్లనిపించి, పెదాలు బిగించి బలవంతాన నవ్వుతున్న లక్ష్మిని వదల్లేక వదల్లేక వచ్చాడు రామారావు.

* * *

"లక్ష్మి ఎలా ఉందో..."

ఫోనందుకోబోతున్న రామారావు భుజంమీద బలమైన చెయ్యి పడింది.

"అరె షబ్బీర్! వాటె సడన్ సర్‌ప్రైజ్!"

రామారావు అప్రయత్నంగా లేచి నిలబడ్డాడు. డాక్టర్ షబ్బీర్ ఎనస్తటిస్ట్. రామారావు కొలీగ్. మంచి ఫ్రెండు. ఆ సమయంలో షబ్బీర్ లాంటి ఆత్మీయులు రావడం రామారావు కెంతో సంతోషాన్నిచ్చింది. కానీ ఆ క్షణంలో రామారావుని చూసి సాక్షాత్తూ దేవుణ్ణి చూసినట్లుగా సంబరపడ్డ షబ్బీర్ ఆత్రంగా రామారావు చెయ్యందుకున్నాడు.

అప్పుడు చూశాడు రామారావు, షబ్బీర్ కళ్ళలో కనిపించే ఆనందం వెనుకనే ఉన్న విషాద ఛాయల్ని.

అప్పుడే గమనించాడు రామారావు షబ్బీర్ చేతులు విపరీతంగా వణకుతూ ఉండడం.

"వాట్ హాపెండ్?" రామారావు భుజాల్ని గుచ్చి పట్టుకున్నాడు షబ్బీర్.

"రామూ, డాడీకి మళ్ళీ ఎటాక్ వచ్చిందిరా. కాళ్ళూ చేతులూ ఆడలేదు. ఎక్కడికి తీసుకువెడదామన్నా కర్ఫ్యూ. ధైర్యం చేసి స్కూటర్ వెనకాల కూర్చోపెట్టుకుని ఇంతదాకా రాగలిగాను. దేవుళ్ళానువ్వున్నావు."

అత్యవసరాన్ని గమనించిన రామారావుకు షబ్బీర్ మాటలు వినిపించలేదు.

షబ్బీర్ తండ్రి తనకీ తండ్రితో సమానమే. పైగా తనంటే ఆయనకున్న వాత్సల్యం డాక్టర్‌గా తన పట్ల ఆయనకున్న గురి ఆయన ప్రాణాల్ని రెండుసార్లు కాపాడగలిగింది.

అపస్మారకంగా ఉన్న షబ్బీర్ తండ్రిని వార్డులో చేర్పడం, ఎమర్జెన్సీ ట్రీట్‌మెంట్ ప్రారంభించడం, అర్జెన్సీని గమనించి ఇ.సి.జి. తీస్తూ మారుతున్న స్థితిని బట్టి క్షణక్షణానికి మందులివ్వడం జరిగిపోతుంటే, నిశ్చింతగా రామారావునే చూస్తూ ఉండిపోయాడు షబ్బీర్.

రామారావు ఏకాగ్రతలో దైవత్వం కనిపిస్తోంది. అలిసినా చెక్కుచెదరని అతని దీక్షలో అతని వ్యక్తిత్వం అగ్నిశిఖలా వెలుగుతోంది.

ఎంతో సేపటికి తృప్తిగా నిట్టూర్చాడు రామారావు.

"నువ్వే డ్యూటీలో లేకపోతే డాడీ నాకు దక్కే వాడు కాదురా" సిస్టర్ అందించిన కాఫీకప్పు కృతజ్ఞతతో తొణికింది.

"నీ మొహం..."

షబ్బీర్ మాటల్లో అతిశయోక్తి లేదని తెలిసిన రామారావు ఇంకేమీ అనలేకపోయాడు.

"నిజంరా... బయట పరిస్థితి ఎంత దారుణంగా ఉందో తెలుసా? పిట్టకూడా బయట ఎగరడం లేదు. ఓల్డ్ సిటీ ఘోరంగా ఉందిట. డాడీని తీసుకుని ఎక్కడికి వెళ్ళను? ఏ నర్సింగ్‌హోమ్‌లోనూ స్పెషలిస్టులెవ్వరూ లేరు. దేవుడి మీద భారమేసినందుకు..."

"అతిగా పొగడకురా."

ఖాళీ కప్పు టేబుల్ మీద పెట్టి క్షణం కళ్ళు మూసుకున్నాడు రామారావు.

"దీదీ ఎలా ఉందిరా?"

"లక్ష్మా!" ఉలిక్కి పడ్డాడు రామారావు.

"డ్యూ డేట్ ఎప్పుడు?"

"ఎల్లుండి నర్సింగ్ హోంలో అడ్మిట్ చేస్తున్నారా. ఎక్లాంప్సియా(గుఱ్ఱపువాతం) టెండెన్సీ ఉందికదా. పైగా జనరల్ కండీషన్ బాగాలేదు. వచ్చేవాళ్ళూ ఎవరూ లేరు."

రామారావు గొంతులో పుట్టెడు దుఃఖమున్నట్లనిపించింది. సాధారణంగా పైకి తేలని రామారావు కళ్ళలో ఊహించని దిగులు కనిపించింది.

లక్ష్మిని కావాలని ఏరి కోరి చేసుకున్నాడు రామారావు. దంపతులకు రెండు వైపులవారూ దూరమయ్యారు. పెద్దదిక్కు లేకపోయినా ఒకరికొకరుగా బ్రతుకుతున్న రామారావు బాధను డాక్టర్ షబ్బీర్ అర్థం చేసుకోగలడు.

"సుపుత్రుణ్ణి బయటికి రానియ్యరా. ఎవరికి వాళ్ళే వంతులమీదొచ్చి వాల్తారు."

షబ్బీర్ ఓదార్పుకి సమాధానంగా అదోలా చూశాడు.

"ఎవరో రావాలని కాదురా లక్ష్మికి ధైర్యం చెప్పి వచ్చాను కానీ ఈ కర్ఫ్యూ గొడవలో ... ఏమో... రోజులెలా ఉంటాయో?"

రామారావు సందేహాలు గొంతులో ఉండగానే గుండె అవిసేలా ఫోన్ మోగింది.

యథాలాపంగా ఫోనందుకున్న షబ్బీర్ మొహంలో రంగులు మారాయి.

"నేనాంటీ... షబ్బీర్ని. ఇప్పుడెలా ఉంది?"

రామారావును చూసే ధైర్యం లేనట్లు మాట్లాడుతున్న షబ్బీర్ ప్రవర్తనకు రామారావు గుండె చిక్కబట్టినట్లయింది.

ఎవరూ - ఏమిటీ అని అడిగే ధైర్యం చాలని రామారావు చేతికి మౌనంగా ఫోనందించాడు షబ్బీర్.

ఫోనందుకున్న రామారావు మొహం వివర్ణమైంది.

చేతులు ఫోన్‌మీద బిగుసుకున్నాయి.

అవతల దుర్గమ్మగారు చెప్తున్న విషయాలేవీ తలకెక్కడం లేదు.

"ఎలా?... ఎలా రావాలి?... నాకేం తోచడం లేదు. ఇప్పుడెలా?" ఒక మాట కొక మాటకి సంబంధం ఉండడం లేదు. మతి పోయినవాడిలా మాట్లాడుతున్న రామారావు నుంచి ఫోన్ బలవంతంగా లాగేసుకున్నాడు షబ్బీర్.

"హలో... ఆంటీ... దీదీని జాగ్రత్తగా చూస్తుండండి. నేనొచ్చేస్తున్నాను. మరేం ఫరవాలేదు. హాస్పిటల్‌కి నే తీసుకువెడతాను."

బరువుగా ఫోన్ పెట్టేసిన షబ్బీర్ చెయ్యి మరింత బరువుగా రామారావును ఊరడించింది.

"రామూ... ఈ పరిస్థితుల్లో నువ్వు దీదీ దగ్గరున్నా, నువ్వు కంగారుపడి ఆవిడ్ని కంగారు పెట్టేస్తావు. నేను తక్షణం వెళ్ళి దీదీని హాస్పిటల్‌కి తీసుకువెళ్తాను"

నిస్తేజంగా నిలబడ్డ రామారావును బలవంతంగా కుదిపాడు డాక్టర్ షబ్బీర్.

"బీ బ్రేవ్ మై డియర్." వెంటనే ఆదిత్యా నర్సింగ్ హోమ్‌కి డయల్ చేశాడు."డాక్టర్ మధుసూదన్! డాక్టర్ షబ్బీర్ స్పీకింగ్. డాక్టర్ ఇందిరగానీ, కృష్ణగానీ ఎవరైనా సరే గైనకాలజిస్ట్ లెవరైనా అందుబాటులో ఉన్నారా? యా... ఎమర్జెన్సీ... డాక్టర్ రామారావు మిసెస్... బాత్‌రూమ్‌లో పడిపోయార్ట... బాగా బ్లీడింగవుతోందిట... షీ ఈజ్ ఇన్

ఫుల్‌టర్మ్. బట్... మోస్ట్ కాంప్లికేటెడ్ కేస్... అవును... ఇదివరలో ఎక్లాంప్సియా వచ్చింది. సిజేరియన్ అయింది. సేమ్ కేస్. ఎలాగోలా తీసుకొస్తాను... ప్లీజ్ హెల్ప్ మీ."

"రామూ, వెళ్ళిరానా?"

"నా లక్ష్మి నాకింక కనిపించదురా. ప్రొద్దున్నే ఆఖరిసారి చూడడం..." రామారావు గుండెల్లోంచి దుఃఖం తన్నుకువచ్చింది.

"పిచ్చిగా మాట్లాడకురా... నేనేమైపోయాననుకున్నావు? నేను బ్రతికుండగా అంత పని జరగనిస్తానా... నువ్వు ధైర్యంగా ఉండు."

షబ్బీర్ వంక దీనంగా చూశాడు.

బయట కర్ఫ్యూ మెడికల్ ఫెసిలిటీస్ అందుతాయో లేదో. అసలు లక్ష్మి ఎలా ఉందో? ఇంక రామారావు దగ్గర క్షణం వేస్ట్ చెయ్యదలుచుకోలేదు షబ్బీర్.

షబ్బీర్ స్కూటర్ దూసుకుపోతున్న చప్పుడు రామారావుకి లీలగా వినిపించింది.

* * *

"ఏమిటండీ అలా చూస్తారూ... నా చేతిలో ఒట్టేశారా లేదా... ఇంకది జరిగితీరాలంతే."

పట్టుదలగా అంటున్న లక్ష్మి మొండితనానికి చికాకేసింది రామారావుకు."విషయం చెప్పకుండా ఒట్టేయించుకుంటే, అది లెక్కలోకొస్తుందా ఏమిటి? అయినా నీ పిచ్చిగానీ మనం ఒకరి కొకరం ఉండగా మన మధ్య మరో నలుసెందుకు?"

లక్ష్మి సున్నితంగా నోరు మూసింది.

"నా మీద ప్రేమెక్కువై అలా అంటున్నారు కానీ, మీకు మాత్రం లేదూ చిన్న బాబుని ఎత్తుకోవాలని. మనం ఒకరికొకరం ఉన్నాం. నిజమే కానీ మనకోసం ఇంకొకరుండద్దూ. అప్పుడు మనకోసం ఎవరూ రాకపోయినా మనకేమీ అనిపించదు... కదండీ?"

చిన్నపిల్లలా తన గుండెల్లో తలదాచుకున్న లక్ష్మి గుండెల్లో రగిలే అగ్నిపర్వతాన్ని గాఢంగా పొదివి పట్టుకున్నాడు రామారావు. "కానీ కాన్పు నీకొక పునర్జన్మ లక్ష్మి. ఈసారి నిన్ను బలి చేసుకుంటే..."

రామారావు కళ్ళలోకి ఆరాధనగా చూసింది లక్ష్మి.

"మీలో నా మీదింత ప్రేమ బ్రతికున్నంత కాలం నేనెప్పుడూ ఎవ్వరికీ ఏ పరిస్థితుల్లోనూ బలైపోను... సరేనా. అలా భయం భయంగా చూడక్కర్లేదు. నాకు బాబు నిస్తానన్నారు... ఇవ్వాల్సిందే... అంతే."

పసిపాప లాంటి లక్ష్మిని మరోసారి గాఢంగా గుండెలకు హత్తుకున్నాడు రామారావు.

* * *

"సార్, డాక్టర్ షబ్బీర్ ఫాదర్‌గారికి బి.పి. డౌనైంది సార్"

చివ్వున లేచాడు డాక్టర్ రామారావు.

కర్తవ్యం, వృత్తిధర్మం, మానవత్వం క్షణంలో రామారావుని తిరిగి ఆక్రమించాయి.

తెల్లని గెడ్డంతో, మల్లెపువ్వులాంటి దుస్తుల్లో తెల్లగా పాలిపోయి మత్తులో చలనం లేనట్లు కనిపిస్తున్న ఆయన బలహీనమైన చేతిని ఆత్రంగా, ఆప్యాయంగా అందుకున్నాడు.

నాడి ఎక్కడో కొట్టుకుంటోంది. రామారావు గుండె చిక్కబట్టినట్లయింది. బి.పి. చూసి డ్రిప్‌లో కంగారుగా ఇంజక్షన్స్ గుప్పించాడు. కాళ్ళకింద మంచం పైకి ఎత్తి స్టూల్ మీద మరింత ఎత్తుగా ఉండేలా అమర్చాడు. ఆక్సిజన్ పెట్టి పరిస్థితి గమనిస్తూ అలాగే ఉండిపోయాడు. వడిలి బిగుసుకుపోయినట్లున్న ఆ పెదాలు గెడ్డాన్ని మించిన తెల్లదనంతో, చల్లదనంతో తిరిగి ఆప్యాయంగా ఆత్మీయతను చిందిస్తాయన్న నమ్మకం రామారావులో గాఢంగా ఉంది.

కరుణనే వెదజల్లే ఆ కళ్ళు తిరిగి తనకి కొండంత అండను అందిస్తాయన్న ఆత్మవిశ్వాసం ఉంది.

ఆయన కిష్టమైన తన స్పర్శ ఆయనలో తిరిగి చైతన్యాన్ని కలిగిస్తుంది. షబ్బీర్‌నీ, తననీ ఒకేలా గుండెల్లో దాచుకోగల ఆ పితృ హృదయం తమకేవిధమైన బాధ కలిగినా సహించలేదు.

ఆ నమ్మకాన్ని అణువణువునా నింపుకున్న రామారావు ఎంతోసేపటికి గుండెల నిండా గాలి పీల్చుకున్నాడు. తన కృషి పూర్తి ఫలితాన్ని అందించబోతోందన్న నమ్మకం వెయ్యేనుగుల బలాన్ని ఇచ్చింది. అప్పటిదాకా గుండె మారుమూలన నొక్కి ఉంచిన ఆవేదన ఉవ్వెత్తున పైకి లేచింది.

కళ్ళముందు చీకటి పేరుకున్నట్లనిపించి నిస్సత్తువతో పైకి లేవలేకపోతున్న రామారావుకు సందేహిస్తూనే ఆసరా అందించాడు వాచ్‌మన్ సీతారాం.

"సీతారాం... నాకు ఫోనేమైనా వచ్చిందా?"

గొంతు చించుకుని అరవాలనిపించింది రామారావుకు. కానీ, ఏదో భయం, అధైర్యం గొంతునునొక్కేస్తోంది.

"సార్, పొద్దుట్నుంచీ టీ నీళ్ళయినా తాగలేదు"

సీతారాం వేడి కాఫీ అందిస్తుంటే సున్నితంగా తిరస్కరించాడు రామారావు.

"సార్... ఓల్డ్ సిటీలో పరిస్థితి చాలా దారుణంగా ఉందిట సార్... తలుపులు పగలకొట్టి ఇళ్ళలో చేరి ఇష్టమొచ్చినట్లు పొడిచి పోతున్నార్ట. తెల్లార్తే పేపరు చూడాలంటేనే భయమేస్తోంది సార్."

"ఈ రోజసలు తెల్లవార్తుందో లేదో సీతారాం"

బిత్తరపోయి చూశాడు సీతారాం. ఎప్పుడూ నిండుగా, హుందాగా, నిండుకుండలా, అందర్నీ ఆదుకునే మనిషిగా డాక్టర్ రామారావు అందరికీ పరిచితుడు.

బేలతనంతో నీరుగారిపోతున్న రామారావు వైఖరి విచిత్రంగా అనిపించింది సీతారాంకు.

"సార్ని కాసేపు రెస్ట్ తీసుకోనియ్యి."

వెంకటేష్ మందలింపుతో సందేహంగానే బయట కొచ్చాడు సీతారాం. నిశ్శబ్దం భయంకరంగా ఉంది. ఈ శ్మశాన నిశ్శబ్దం గుండెని మెత్తగా కోసేస్తోంది.

రాత్రి ఒంటిగంట దాటింది. నిశ్శబ్దంగా ఉన్న ఫోన్ టైం బాంబులా కనిపిస్తోంది. ఏదో నిమిషాన భయంకరమైన వార్తతో గుండెని బ్రద్ధలు చేసేలా ఉందది. అసహనంగా హాస్పిటలంతా పిచ్చిగా తిరిగి తిరిగి తన గదికి రాక తప్పలేదు.

భయంకరమైన వార్త ఏదైనా వినక తప్పదేమో! తప్పదా! గుండెల్ని చీలుస్తూ ఫోన్ మోగింది. మోగుతోంది.

రామారావు నిలువెల్లా చెమటలు పట్టాయి... మనసు, శరీరం అదుపు తప్పుతోంది. ఫోనందుకోడానికి సాహసించలేకపోతున్నాడు. మామూలుగా ఆపరేషన్ జరిగితేనే లక్ష్మి పరిస్థితి ప్రమాదకరమైంది. అందులో విషమించిన ఈ పరిస్థితుల్లో ఈ కర్ఫ్యూలో...

"సార్... మీకే సార్ ఫోన్... ఆదిత్యా నర్సింగ్‌హోమ్ నుంచి" రామారావు నిలువునా క్రుంగిపోయాడు.

లక్ష్మి ఇక లేదన్నదే ఆ ఫోన్. మొహం పాలిపోయింది. ఫోనందుకోలేకపోతున్న రామారావు స్థితి సీతారాంకు అర్థం కాలేదు. "సార్... డాక్టర్ ఇందిర గారట. మీతో అవసరంగా మాట్లాడాలట." గుండె రాయి చేసుకున్న రామారావు చేతిలో ఫోన్ బిగుసుకుపోయింది.

"ఎస్... డాక్టర్ రామారావ్ స్పీకింగ్"

"కంగ్రాచ్యులేషన్స్ డాక్టర్. నేను డాక్టర్ ఇందిరని మాట్లాడుతున్నా" రామారావు అయోమయంగా చూశాడు. ఊపిరి పీల్చుకునే శక్తి కూడా లేనట్లు చూస్తున్నాడు.

"డాక్టర్, వింటున్నారా"

"ఎస్..." కంఠం నూతిలోంచి వస్తున్నట్లుంది.

"మీరు చాలా అదృష్టవంతులు డాక్టర్. లక్ష్మిగారు చాలా కాంప్లికేషన్స్ నుంచి బతికి బయట పడ్డారు. సిజేరియన్ అయింది. బాబు చాలా ముద్దుగా ఉన్నాడు.'

రామారావు కళ్ళలో నీళ్ళు పొంగుతున్నాయి.

"డాక్టర్ షబ్బీర్ అష్టకష్టాలూ పడి స్కూటర్ మీదే ఆవిణ్ణి తీసుకు వచ్చారు. కాస్త ఆలస్యమైతే ఉంటే తల్లీ బిడ్డా దక్కేవారు కాదు." రామారావు గుండెల్లోంచి దుఃఖం తన్నుకు వస్తోంది.

"డాక్టర్ షబ్బీర్ ఎనస్తీషియా ఇవ్వటమే కాదు. ఆయన బ్లడ్ ఇచ్చి లక్ష్మిగార్ని బ్రతికించుకున్నారు."

"థాంక్యూ - థాంక్యూ డాక్టర్ ఇందిరా"

డాక్టర్ రామారావు గొంతులో గుండె స్పందన వినిపిస్తోంది. అవతల ఫోన్ పెట్టేసిన శబ్దం విని అప్రయత్నంగా ఫోనే పెట్టేశాడు రామారావు. తనున్న స్థితి తనకు అర్థం కావడం లేదు.

తను విన్నది నిజమో, అబద్ధమో కూడా అర్థం కావడంలేదు.

నిజమేనన్న నిజాన్ని ఆ సంతోషాన్ని భరించలేక పోతున్నాడు. అబద్ధమైన భయంకర స్వప్నాన్ని మరిచిపోలేకపోతున్నాడు.

"సార్... సార్... ఏమైంది సార్?"

వెంకటేష్‌కి సమాధానంగా భుజాలు పట్టుకుని కుదిపేశాడు. సీతారాం చేతుల్ని ఆప్యాయంగా అందుకున్నాడు. పరుగులాంటి నడకతో షబ్బీర్ తండ్రి మంచం దగ్గరికొచ్చాడు. ఆయన మొహంలో జీవకళ ఉట్టిపడుతోంది. అలవాటైన రామారావు చేతులు ఆయన పల్స్ తడిమాయి. "అంకుల్... అంకుల్..."

సున్నితంగా పిలుస్తున్న రామారావు పిలుపుతో ఆయన కళ్ళు బరువుగా విచ్చుకున్నాయి.

రామారావుని చూసి జీవత్వాన్ని నింపుకున్నాయి.

"రామూ..." ఆయన పెదాలు ఆత్మీయంగా పిలుస్తుంటే ఆనందాన్ని పట్టలేని డాక్టర్ రామారావు ఆయన చెయ్యందుకుని కళ్ళకద్దుకున్నాడు.

రామారావు చేతిని మృదువుగా ముద్దు పెట్టుకుంటున్న ఆయన కళ్ళకి రామారావులోనే షబ్బీర్ కనిపించాడు. "మే గాడ్ బ్లెస్యూ మై సన్."

తెల్లవారింది.

"పాతబస్తీలో కనీ వినీ ఎరుగని నరమేధం."

పేపర్లలో అక్షరాలు కూడా రక్తాన్ని కక్కుతున్నాయి.

"మత సామరస్యం లోపించి, మానవత్వాన్ని మటుమాయం చేసి, అర్థంకాని వైషమ్యాలతో, అర్థంకాని కక్షలతో, కార్పణ్యాలతో, రావణ కాష్టంలా రగులుతూ మారణ హోమానికీ, నరమేధానికీ దారి తీస్తున్న ఈ ఘోర పరిస్థితులకు విముక్తి లేదా?

ఇంక ప్రశాంతత అనేదే ఈ సమాజంలో మిగిలి ఉండదా?

భవిష్యత్తులో మానవత్వపు ఛాయలకన్నా నిలువ నీడనేది ఉండే అవకాశమే లేదా?

# శిథిలాలలో శివుడు లేడోయి

తమిరిశ జానకి

ఆధార సర్వశాస్త్రాణాం కలానాం శ్రామికస్యచ
ఆదర్శోపై ప్రజానాంచ కర్మణ్య త్వస్య ప్రేరకః
దేవ శిల్పీతి విఖ్యాతః విశ్వ కర్మేత్య విస్మృతః
సర్వ స్వం ధర్మ రక్షార్థ మర్పితుం ప్రేరక స్స్వయమ్
విశ్వ కర్మన్నహం స్మృత్వాత్వాం సదా ప్రథమం తతః
ప్రారంభే నిత్యకర్మాణి ఆ శివం దేహిమే సదా...

శ్లోకం చదువుతూ కళ్ళు తెరిచారు గౌరీపతిగారు... డెబ్భయ్యేళ్ళ వయసు... కానీ అంతకంటే ఇంకో పదేళ్ళెక్కువ వార్ధక్యం ఆయనలో తొంగి చూస్తోంది. రోజూ నిద్రలేవగానే ఈ శ్లోకం చదువుకుని భగవంతుని ధ్యానం చేసుకోడం ఆయన అలవాటు. కళ్ళు తెరిచేటప్పటికి రోజూ ఎదురుగా కనిపించే శివుడు ఆరోజు కనిపించలేదు. ఇరవైరోజులయింది ఆయన మంచం పట్టి. ఈ ఇరవై రోజుల్లోనూ ఆయన నిద్రలేచేటప్పటికి ఎదురుగా మంచం దగ్గర ఆయన సేవకోసం ఉండకపోవటం ఒక్కసారి - కూడా జరగలేదు. మొహం కడిగించడం దగ్గర్నించి అన్నిపన్లూ తనే దగ్గరుండి చేస్తున్నాడు శివుడు.

రెండు రోజులుగా గాలివానా... జిల్లా మొత్తం ముసురు పట్టింది. కొంచెం కూడా తగ్గుముఖం పట్టలేదింకా... శివుడు వంటింట్లో ఏదైనా పన్లో ఉన్నాడేమో ననుకుంటూ మంచాన్ని ఆసరాగా చేసుకుని ఎలాగైతేనేం మెల్లిగా లేచి ఆ గదిలోనే ఉన్న సింక్ దగ్గర మొహం కడుక్కోడం పూర్తి చేశారు. ఆకాస్తకే బాగా నీరసం వచ్చేసింది. కాళ్ళు వొణుకుతున్నాయి. మొహం తుడుచుకుని మళ్ళీ మంచమ్మీద వెనక్కివాలిపోయారు. ఎదురుగా గోడకున్న శివపార్వతుల పటం చూస్తూ చేతులు జోడించారు.

మృత్యుభీతమృకండు సూను కృతస్తవం శివసన్నిధౌ
యత్ర కుత్ర చయః పఠేన్నహితస్య మృత్యుభయం భవేత్
పూర్ణమాయుర రోగతా మఖిలార్థ సంపద మాదరం
చంద్రశేఖర ఏవతస్యదదాతి ముక్తి మయత్నతః
చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర పాహిమాం
చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర రక్షమాం॥

"శివా... శివా..." ఓపిక చేసుకుని కాస్త గట్టిగా పిలిచారు. తను లేచిన అలికిడివిన్నైనా శివుడు తన దగ్గరకి రాకపోవడం చాలా ఆశ్చర్యంగా ఉందాయనకి.

"ఈరోజెందుకో రోజూకంటే నీరసం ఎక్కువగా అనిపిస్తోంది. పంజరంలోంచి ఈ చిలక ఎగిరిపోయేరోజు ఇవాళేనేమో శివా!" అని శివుడితో చెప్పుకోవాలనిపిస్తోంది.

"కాఫీయేగా... ఇదిగో..." కర్రవిరిచినట్టు కటువుగా అంటూ కాఫీగ్లాసు మంచందగ్గర స్టూల్‌మీద పెట్టాడు వంటమనిషి సుబ్బయ్య. ఎన్ని సంవత్సరాలుగానో తన కాఫీ, భోజన విషయాలు పట్టించుకునేది శివుడొక్కడే... ఇంకెవరికీ ఈ ఇంట్లో తనంటే లక్ష్యమూ లేదు... శ్రద్ధాలేదు... అటువంటిదీరోజు? ....

"శివుడేడీ?" అడగకుండా ఉండలేకపోయారు.

"ఏమో?" విసురుగా జవాబిచ్చి వెళ్ళిపోయాడు సుబ్బయ్య.

బ్రహ్మస్వరూపముదయే మధ్యాహ్నేతు మహేశ్వరం
సాయంధ్యాయేత్సధావిష్ణుం త్రిమూర్తించ దివాకరం...

ముసురుపట్టి రెండ్రోజులుగా కనిపించక దాగున్న ఆ సూర్యభగవానుడిని ధ్యానించుకుని కాఫీ గ్లాసందుకున్నారు నెమ్మదిగా.

ఓ పదినిమిషాలు ఓపికగా ఎదురు చూశారు... ఊహూ... శివుడి జాడలేదు.

గది బయట కొడుకు మాట వినిపించింది.

"రాఘవా?..." కేకేశారు మరి ఆగలేక.

"ఏవిటి నాన్నగారూ?" లోపలి కొచ్చాడు రాఘవ్.

"శివుడేడీ?"

"లేడు..."

"ఏవిటి నువ్వనేది?"

"అప్పట్టు... రాత్రి జరిగిన గొడవ మీకు తెలియదుకదూ..."

"ఏం గొడవ? డాక్టర్‌గారు నిద్రమాత్రలిచ్చారు కదా నాకు... ఒళ్ళు తెలియకుండా నిద్రపట్టేసింది. అసలేంజరిగింది?"

"ఇంట్లోంచి పొమ్మని కొప్పడ్డాను. వెళ్ళి పోయాడు"

"శివాశివా... ఎంత పెద్ద తప్పు చేశావు?"

"ఏవిటి నాన్నగారూ మీరు మరీను... శివుడు దొంగతనం చేశాడు. ఆఫ్టరాల్... ఈ ఇంట్లో ఓ నౌకరు. అతిచనువిచ్చి నెత్తికెక్కించుకున్నారుమీరు. ఈ వయసులో దొంగబుద్ధి పుట్టింది..."

"రాఘవా..."

"ఇంతోటి ఆనౌకరు కోసం నామీద అరుస్తారేవిటి?... మీపన్లు చెయ్యడానికి మరో నౌకర్ని చూస్తాన్లెండి. గదిలో బల్లమీద పెట్టిన మీకోడలి గొలుసు కనిపించలేదు రాత్రి. ఇంట్లో అన్ని గదుల్లోనూ తిరిగేది శివుడేగానీ ఆ సుబ్బయ్య కాదుగా? మంచివాడు మంచివాడని మొదటి నుంచీ నెత్తికెక్కించు కున్నారు మీరు. ఆ లోకువతోనే తనమీద అనుమానపడరన్న ధైర్యంతో ఇంతపని చేశాడు. ఏరోజు ఎవరికెలాంటి బుద్ధి పుడుతుందో ఎవరు చెప్పగలరు?" దురుసుగా అన్నాడు.

"రాత్రికి రాత్రి ఇంట్లోంచి పొమ్మన్నావా? ఎక్కడున్నాడో ఈ గాలీవానలో... శివుడిని పొమ్మనే హక్కు ఈ ఇంట్లో ఎవరికీ లేదురా అబ్బాయ్... లేదు... చిన్నప్పటినుంచీ నువ్వు చేసిన ఎన్నో పొరపాట్లు... తప్పులు క్షమిస్తూ వచ్చాను. కానీ... ఈ తప్పు క్షమించడం... శివుడిని అనుమానించి నువ్వు చేసిన మహాపరాధం క్షమించడం నావల్ల కాదు...

ఈ ఇంటినొక ఆలయంగా భావిస్తూ నన్నొక దేవుడిగా తలుస్తూ... మన మనసులకి తను కష్టం కలిగించకుండా... తన మనసుకి మనం కలిగించే కష్టాల్ని చిరునవ్వుతో దిగమింగుతూ ఇన్ని సంవత్సరాలుగా... విశ్వాసంతో మనకి సేవచేసిన శివుడిని అనుమానించి ఇంట్లోంచి పొమ్మన్నావా? దొంగతనం చెయ్యవలసిన అవసరం శివుడికి లేదు... అతను కావాలనుకుంటే ఈ ఇల్లు ఈ సంపద ఏనాడో అతనివి అయిఉండేవి... ఆ మంచి మనిషి దృష్టిలో దయాదాక్షిణ్యాలకి... విశ్వాసానికీ ఉన్న విలువ డబ్బుకి లేదు. విశ్వాసం అతని ఊపిరి... అటువంటి శివుడికి కావల్సింది డబ్బు బంగారం కాదు... ఆప్యాయత అనురాగం కోరుకుంటాడు శివుడు..." ఆవేదనతో ఆవేశంతో తండ్రి ఊగిపోతుంటే చిరాగ్గా మొహం పెట్టాడు రాఘవ్.

'చిన్న విషయానికి ఎందుకింతగా ఆవేశపడిపోతున్నారు? అసలే మీ ఆరోగ్యం ఏవీ బాగులేదు. ఏమాత్రం తేడా వొచ్చినా ప్రమాదం అని డాక్టర్‌గారు చెప్పారు కదా" దురుసుగా తండ్రి మీద విసుక్కుంటూ అక్కడినుంచి వెళ్ళిపోబోయాడు.

"ఆ ప్రమాదం ఏదో ఇవాళ వొచ్చితీరుతుంది. రానియ్యి. ఇప్పటికైనా నీకు నిజం తెలియడం మంచిది. చెప్పేస్తాను. ఇలారా..." మంచమ్మీద తనపక్కన చోటు చూపిస్తూ కూర్చోమంటూ... తను వెనక్కి వాలారు గౌరీపతిగారు. మొహం చిట్లించుకుని ఇబ్బందిగా కూర్చున్నాడు రాఘవ్.

* * *

గౌరీపతిగారెంత మంచి మనిషో ఆయన భార్య అన్నపూర్ణమ్మ కూడా అంత మంచి మనిషి. ఎన్ని విషయాల్లోనో ఏదో ఒకవిధంగా వాళ్ళ సహాయం పొందిన వాళ్ళు ఆ ఊళ్ళోనేకాదు చుట్టుపక్కల ఊళ్ళల్లో కూడా చాలామంది ఉన్నారు. ధనసాయం.. మాటసాయం... మనిషిసాయం... అన్ని విధాలుగానూ తమకి చేతనైనంతలో అందర్నీ ఆదుకునేవారు. ధనం ఉంది. పలుకుబడి ఉంది. దయాగుణం ఉంది. ఆదంపతులకి లేనిదల్లా సంతానం ఒక్కటే. ముగ్గురుపిల్లలు పుట్టిపోయారు. ఆబెంగతో మనిషి సగం అయింది అన్నపూర్ణమ్మ. దేనిమీదా ఆసక్తి లేకుండా పోయిందావిడకి. అదో రకంగా నిరుత్సాహంగా తయారైంది. భార్యని చూస్తుంటే భయం వేసేది గౌరీపతిగారికి.

ఒకరోజు... ఆరోజు... తమ ఇంటి అరుగుమీద ఎవరో పడుకుని ఉండడం చూసి దగ్గరగా వెళ్ళి పలకరించారాయన. అవ్యక్తి ఏదో మాట్లాడబోయాడు గానీ... వెంటనే మాటరాలేదు నీరసంతో.

"ఒంట్లో బాగులేదా? జ్వరంగా ఉందా? ఏఊరు మీది?" అడుగుతూనే ఒళ్ళు ముట్టుకుని చూశారు. ఆమాత్రం పరామర్శకే అవ్యక్తి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. చేతులెత్తి నమస్కరించబోయాడు. చేతులు పూర్తిగా పైకిలేపే ఓపిక కూడా లేకపోయిందతనికి.

"అన్ని బాధల్లోకీ కష్టమైన బాధ ఆకలిబాధ బాబూ... ఇంకాస్సేపట్లో నా ప్రాణం పోవడం ఖాయం. నాలుగైదు రోజులైపోయింది బాబూ ఏవన్నా తిని..." పరీక్షగా తనవంకే చూస్తున్న ఆయనతో మళ్ళీ తనే అన్నాడు.

"అడుక్కునే వాడిని కాదండీ. అందుకే చేతిలో పైసాలేకపోయినా... చేసేందుకు పనేమీ దొరక్కపోయినా... ఎవర్నీ దేహీ అని అడగలేదు... పస్తులతో... ఇలా ప్రాణంపోయే స్థితిలో వున్నాను."

నవ్వారు గౌరీపతిగారు మృదువుగా "నీ ప్రాణం ఏమీ పోదు. భయపడకు. అన్నం తిందువుగాని... లోపలికిరా..." చేయి అందించి లోపలికి తీసికెళ్ళారు. భార్యని కేకేసి అన్నం పెట్టించారతనికి. అప్పుడు చెప్పాడతను తనగురించి... పేరు శివుడు. దాయాదులు మోసం చేసి ఆస్తంతా కాజేస్తే కట్టుబట్టల్తో వీధిన పడ్డాడు. ఇటు ఆస్తీ పోయింది... అటు చదువూ చదువు కోలేదు.

క్షుద్బాధ తీర్చి ప్రాణభిక్ష పెట్టడమేకాదు... ఇంట్లో ఆశ్రయం కూడా ఇచ్చారు శివుడికి గౌరీపతిగారు. ఆ ఇంట్లో అన్ని పన్లూ చేస్తూ వాళ్ళ ఆదరణ అప్యాయతలే ఆస్తిగా భావించుకుని తృప్తిపడ్డాడు శివుడు.

శివుడి పెళ్ళి గౌరీపతిగారే చేశారు.

అన్నపూర్ణమ్మ నాలుగోసారి ప్రసవించడం శివుడి భార్య మొదటిసారి ప్రసవించడం ఒక్కరోజే జరిగాయి. గౌరీపతిగారి బిడ్డ దక్కలేదు. తల్లి స్పృహలో లేదు. స్పృహ వొచ్చాక... ఈ బిడ్డ కూడా దక్కలేదని తెలిస్తే... అసలే అర్భకంగా... కళ్ళల్లో ప్రాణాల్తో వున్న తన భార్య తనకి దక్కకుండా పోతుందేమో!... వీల్లేదు... ఎలాగైనా

బతికించుకోవాలి తన భార్యని... పరిగెత్తుకెళ్ళి శివుడి చేతులు పుచ్చుకున్నారు. "నా భార్యని బతికించు శివా..."

"బాబుగారూ! ఏవిటి మీరనేది?"

"అమ్మగారికి తెలివిరాగానే... పుట్టిన బిడ్డ ఈసారికూడా దక్కలేదని తెలిసి పిచ్చిదానిలా అయిపోతుంది... ప్రాణమైనా విడుస్తుంది. పిల్లలకోసం ఎంతగానో తపించిపోతోంది. ఇలా అడుగు తున్నందుకు నన్ను క్షమించు శివా. నీ బిడ్డని తీసుకొచ్చి మా ఆవిడ పక్కన పడుకోపెడతాను. నీ పిల్లాడు మా పిల్లాడవుతాడు. అమ్మగారి ప్రాణాలు కాపాడు..."

తెల్లబోయాడు శివుడు. గుండెరాయి చేసుకుని బాబుగారి కోసం... అమ్మగారికోసం ఏంచెయ్యడానికైనా సిద్ధపడ్డాడు. తన భార్యని ఓదార్చడమే కష్టమైపోయింది. ఒక్కరోజు కాస్త అన్నం పడేస్తేనే ఎంతో విశ్వాసం చూపిస్తుంది కుక్క. కుక్కకంటే ఉత్తమమైనది కాదా మానవజన్మ... ప్రేమతో ఆదరిస్తూ... తమ ఇంటిలో ఒకడిగా చేర్చుకున్న ఆ పుణ్యదంపతుల పట్ల విశ్వాసం చూపించడం తన ధర్మం కాదా?... అంతే... స్థిరనిశ్చయానికొచ్చి భార్యకి నచ్చచెప్పాడు. ఆమె కన్నీటిని తుడిచాడు. తన కన్నీటిని దిగమింగుకున్నాడు. కన్నబిడ్డని బాబుగారి చేతుల్లో ఉంచాడు. కృతజ్ఞతతో గౌరీపతిగారి కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. తన ఇల్లు... తనకున్న పొలంలో సగం పొలం శివుడి పేరున రాసి ఆకాగితాలు అతనిచేతిలో పెట్టారు.

"నా భార్య ప్రాణం దక్కించావు. ఏమిచ్చినా తీరేదికాదు నీ ఋణం..."

"బాబుగారూ! ఆస్తులు అయిన వాళ్ళమధ్య గొడవలు తెచ్చిపెడతాయని అనుభవపూర్వకంగా తెల్సుకున్న వాడిని నేను. మీ ఆదరణ... ఆప్యాయత అనే ఆస్తిపాస్తులు చాలునాకు. డబ్బు మీద వ్యామోహం ఏనాడో చచ్చిపోయిందినాలో. ఇలా మీకు సేవచేస్తూ ఉండిపోనివ్వండి." చిరునవ్వుతో చేతిలో కాగితాలు చింపేశాడు.

శివుడిలో దైవత్వాన్ని గౌరీపతిగారు చూశారు. గౌరీపతిగారిలో దేవుడిని శివుడెప్పుడో చూశారు.

ఆతర్వాత కొద్ది రోజుల్లోనే బాలెంత జబ్బుతో శివుడిభార్య పోయింది. తనకాలాన్నీ శ్రమనీ పూర్తిగా ఆ ఇంటికి అంకితం చేశాడు.

రాఘవ్ బాబుకి దెబ్బ తగిలితే తనకి తగిలినట్టుగా గిలగిలలాడిపోయేవాడు. బాబుకి జ్వరం వొస్తే తను లంఖణాలు చేసేవాడు. పెరిగి పెద్దవుతున్న కొద్దీ బాబు తనని నౌకరుగా తీసిపడేసి దురుసుగా మాట్లాడుతుంటే చీటికీ మాటికీ చీదరించుకుంటుంటే... ఆవేదన గుండెల్లోనే అణిచిపెట్టి చిరునవ్వుత తిరగడం అలవాటు చేసుకున్నాడు. అప్పుడప్పుడు బాబుకి నీతులు నేర్పబోయి... మంచీ చెడ్డా చెప్పబోయి నీకెందుకు పొమ్మంటూ చివాట్లు తినేవాడు బాబుచేత.

గౌరీపతిగారి మనసు కూడా కలుక్కుమంటుండేది శివుడి పరిస్థితికి.

తప్పుబాబూ అలామాట్లాడకూడదు. శివుడినేమీ అనకూడదని చెప్తూనే ఉండేవారు.

ఆమాటలు రాఘవ్ చెవికి ఎక్కేవి కావు. అబ్బాయిగారి దృష్టిలో ఇంటి నౌకరికి ఏమాత్రం విలువ లేదు. నౌకర్లకి చనువు ఇవ్వకూడదు. ఇస్తే నెత్తికెక్కుతారన్నదే అతని ఉద్దేశం. అందుకే... శివుడు తనంటే అగ్గగ్గలాడుతూ అల్లంతదూరంలో చేతులు కట్టుకు నిలబడాలని... ఎప్పుడూ దురుసుగానే మాట్లాడేవాడు అతనితో

అమ్మగారు బస్సుయాక్సిడెంట్లో పోయినప్పటినించీ... అయ్యగారికి వేళకి అన్నీ అమర్చి బాధ్యత పూర్తిగా తనేతీసుకున్నాడు శివుడు.

* * *

"ఇదంతా ఏదో సినిమా కథలా అనిపిస్తోందేమోనీకు... కానీ నూటికి నూరుపాళ్ళూ ఇది నిజంరా అబ్బాయ్! నిజం... నీకన్న తండ్రి శివుడే" చెప్పడం పూర్తిచేసి... ఎక్కువగా మాట్లాడి నందువల్ల కలిగిన ఆయాసంతో ఇబ్బంది పడుతున్నారు గౌరీపతిగారు.

"ఏవండీ! నా గొలుసు దొరికింది. పెట్టెలోనే ఉంది... ఇదుగో... బల్లమీద పెట్టానని అనుకున్నాను. అందుకని ఎంతసేపూ బయటే వెతికాను." రాఘవ్ భార్య మొహం చేటంత చేసుకుని గొలుసు చేత్తో పట్టుకునొచ్చిందాగదిలోకి.

అప్పటికే రాఘవ్ మొహం పాలిపోయింది. శివుడిని తన కన్న తండ్రిని అనవసరంగా అనుమానించి ఎన్నెన్ని మాటలన్నాడు తను.

"శివా!... శివా!..." శివుడినే తల్చుకుంటూ ఆయాసం ఎక్కువై తలవెనక్కి వాల్చేశారు గౌరీపతిగారు.

# జీవన రాజకీయం

*ఇంద్రకంటి జానకీబాల*

తళతళ మెరుస్తున్న స్కూటర్ని తనివితీరా మరొక్కసారి చూసుకుని జేబురుమాలు తీసి సున్నితంగా వ్యూమిర్రర్ తుడిచి, స్టాండు తీసి స్టార్ట్ చేసి రెండుసార్లు హారన్ మోగించాడు మోహన్. ఆ రోజు ఫిబ్రవరి 24వ తేదీ. మోహన్ కొత్త స్కూటర్ మీద మొదటిసారి బయలుదేరబోతున్నాడు.

తార ఇంట్లోంచి కాలు బయటకి పెట్టబోయి, చటుక్కున ఆగిపోయింది. ఒక్కసారి భూమి కంపించినట్టు, నేల చీలుకుపోతున్నట్టుగా, ఇంటి కప్పు పెళ్ళలు పెళ్ళలుగా కూలి మీదపడుతున్నట్టుగా - ఆమె బాధతో మెలికలు తిరిగింది. కళ్ళు గిర్రుమని తిరిగాయి. కాళ్ళు దడదడలాడిపోయాయి. పొద్దుట నుంచీ సన్నగా బాధిస్తున్న పొత్తి కడుపులో నొప్పి ఒక్కసారి వికృతరూపం దాల్చి కొండ చిలువ కదిలినట్టయి, కడుపు చీల్చుకుని ఏదో ఏలియన్ బయటకొస్తున్నట్టనిపించింది. బాధతో వొళ్ళంతా చెమట ముద్దవడమే కాకుండా వెచ్చగా బట్టలన్నీ భళ్ళున తడిసిపోయాయి.

'అమ్మా...' అంటూ పెద్ద కేక పెట్టి అక్కడే కూలబోయి తలుపు సాయంతో నిలదొక్కుకుంది. వెనుకనుండి తలుపేసుకోడానికి వచ్చిన అత్తగారు చటుక్కున పట్టుకుని "ఏమమ్మాయ్! ఏమైందీ" అంది కంగారుగా- అంతలో ఆమె పరిస్థితి గ్రహించి 'అదేమిటంటూ' గుట్టుగా పొదివి పట్టుకుని లోపలకి నడిపించుకెళ్ళింది.

తార హాస్పిటల్ బెడ్ మీద నీరసంగా పడుకొని ఆలోచిస్తోంది. ఆమెకి బ్లీడింగ్ అవుతున్నా బాధ తగ్గింది. గర్భం పోయినట్టేనని లేడీ డాక్టర్ ధ్రువపరిచింది. ఆ విధంగా డాక్టర్ సర్టిఫికెట్ తీసుకుని, దీనికి సెలవు కాగితం జత చేసి పంపించింది ఆఫీసుకి. అబార్షన్‌కి ఇచ్చే ఆరు వారాల స్పెషల్ లీవు కోసం విపులంగా రాసి పంపింది.

సాయంత్రం అయిదు గంటలు దాటినప్పటి నుంచి భారతి ఎప్పుడొచ్చి ఆఫీసు విశేషాలు చెప్తుందా అని చూపులు గుమ్మానికి తగిలించి పడుకుంది.

రకరకాల ఆలోచనలు మనసులో సాగుతున్నాయి. జీతం డ్రా చేశారా? తను భారతికి పే ఆథరైజేషన్ ఇచ్చింది కనుక ఆమె తప్పకుండా ఆ డబ్బు ఇవ్వడానికి వస్తుంది.

తార నీరసంగా కళ్ళు మూసుకుంది. కళ్ళ ముందు ఏవేవో రూపాలు, చెవుల్లో ఏవేవో సంభాషణలు. ఆఫీసులో కూర్మారావు, రామనాథం, రంగారావు, ఒక్కొక్కసారి వాళ్ళు మాట్లాడే మాటలు, వాళ్లు విసిరే కామెంట్లు గుర్తుకొచ్చి బాధగా నవ్వుకుంది.

ఉద్యోగం చేస్తున్న స్త్రీల మీద చలోక్తులు విసరడానికి, విమర్శలు కురిపించడానికి అందరూ ముందుగానే వుంటారు.

"ఆడవాళ్ళమై పుట్టినా బాగుండేది. హాయిగా నెలల తరబడి సెలవు మీద ఫుల్ జీతం తీసుకుంటూ ఇంట్లో విశ్రాంతి తీసుకోవచ్చు"

ఆఫీసులో మెటర్నిటీ లీవు ఎవరు పెట్టినా, గర్భస్రావమై స్పెషల్ లీవు మీద ఎవరు వెళ్ళినా, ఎవరో ఒకరు ఈ కామెంట్ చేయకమానరు.

తారకి ఎప్పుడు పట్టిందో బాగా నిద్ర పట్టేసింది. ఎనిమిది గంటలు దాటుతుండగా తార తల్లి వైదేహి అన్నం క్యారేజి పుచ్చుకొచ్చింది. తల్లిని చూడగానే తారకి ఎక్కడిదో దుఃఖం ఒక్కసారిగా పొంగుకొచ్చింది. వైదేహి కూతుర్ని పొదివి పట్టుకుని"ఏం లేదు. ఏముందిందులో? అంతగా బాధపడాల్సిందేమీ లేదు - పోతే పోయిందిలే అంటూ ఓదార్చింది.

"నువ్వెప్పుడొస్తావా అని చూస్తున్నాను" అంది కళ్ళ నీళ్ళతో తార.

"నాకు నిన్న లెటర్ అందింది. మధ్యాహ్నం బయలుదేరాను" అంటూ సముదాయించింది.

* * *

తార ఎకనామిక్స్ ఎం.ఎ చేసింది. అందులో గోల్డ్‌మెడల్ తీసుకుంది. కాంపిటేటివ్ టెస్టులో నెగ్గుకొచ్చింది. ఇంటర్వ్యూలో పక్కన పెట్టేయకుండా తండ్రి రమేష్‌బాబు బందోబస్తు చేశాడు. అందుకే తార ఇప్పుడు బంగారు బాతు. బంగారు బాతు కాబట్టి మోహన్ ఆర్థిక వ్యూహాలను తట్టుకుని, అతని పెళ్ళి కూతుళ్ళ ఎంపికలో నెగ్గుకొచ్చి అతని భార్య అయింది.

భారతి వస్తూనే "సారీ తారా! నిన్న రాలేకపోయాను. మా చంటివాడికి ఉదయమే కొంచెం జ్వరం తగిలింది. మధ్యాహ్నం మరీ ఎక్కువైందని ఫోను వస్తే వెళ్ళిపోయాను. అయినా మోహన్ వచ్చి నీ సేలరీ తీసుకెళ్ళారు కదాని, ఈ రోజు రావచ్చులే అనుకున్నా" అంది.

సైలెన్సర్ అమర్చిన పిస్తోలు గుండు నిశ్శబ్దంగా గుండెల్లో దూరినట్టయింది తారకి. పైకి వినిపించనంత మాత్రాన బుల్లెట్ తక్కువ బాధేం పెట్టదు. భారతి రాలేకపోయినందుకేం

బాధ లేదుగానీ తన జీతం తీసుకున్న మోహన్ కనీసం రాత్రయినా ఒక్కసారి ఆస్పత్రికొచ్చి తనకి కనిపించలేదని విపరీతమైన బాధ గుండె నిండిపోయింది.

"ఎప్పుడెళ్ళిపోతున్నావ్" అంది భారతి.

"ఈరోజు సాయంత్రం. అంటే మరో అరుగంటకే"

"అయితే సర్లేగాని నేను శలవు పెట్టాను. నెల్లాళ్ళు"

"అబ్బ. ఎందుకు?"

"మా అన్నయ్య రమ్మని రెండేళ్ళ నుంచి గొడవ"

"హాయిగా వెళ్ళిరా"

"ఇదిగో నీ పే స్లిప్. మరి నేవెళ్తానింక" అంటూ భారతి వెళ్ళిపోయింది.

భారతి వెళ్ళిపోయాక. విచిత్రమైన అవమానంతో కూడిన గుబులు తార మనసంతా కమ్ముకుంది.

* * *

ఏమిటీ? ప్రతీ చిన్నదానికీ రాద్ధాంతం చేస్తావు? ఏం? నీ జీతం నేవెళ్ళి తీసుకుంటే తప్పా? నీకేమైనా నామోషీయా అన్నాడు చిరచిరలాడుతూ మోహన్.

"నాకొక్కమాట చెప్పాలి కదా!"

"ఇప్పుడు చెప్తున్నాను కదా!"

"ఏమిటీ? ఇప్పుడా? నేనడిగాక. ఇంత నిష్ఠూరం పడ్డాక" అంది చిరాకుగా.

"భార్యాభర్తల మధ్య ఆమాత్రం అండర్‌స్టాండింగ్ వుండకపోతే కష్టం" అన్నాడు.

"నేనూ అదే అంటున్నా" అంది కఠినంగా

మోహన్ మరేం మాట్లాడలేదు. ఆ రోజు తన తల్లిని హాస్పిటల్‌కి బండి మీద దింపి. లోపలికి రాకుండా వెళ్ళిపోయి. ఇప్పుడేదో కథలు. కబుర్లు చెప్తున్నాడని తారకి ఉక్రోషంగా. కోపంగా వుంది.

పరిస్థితి గ్రహించిన వైదేహి కూతుర్నే కేకలేసింది.

అతనికేదో పనుందని. మళ్ళీ లోపలికొస్తే ఆలస్యమవుతుందని వెళ్ళాడే ఇప్పుడేమైందనీ గొడవా అంటూ అల్లుడ్నే సమర్థించింది.

* * *

లీవు పూర్తవగానే తార ఆఫీసుకెళ్ళడం మొదలు పెట్టింది. తన సీటులో పని నిలవ పడిపోయిందని. ఆఫీసు టైము అయ్యాక కూడా చేయడం ప్రారంభించింది.

ఆ రోజు ఒళ్ళు భారంగా ఎలాగో అనిపిస్తుంటే లెక్కలు చూసుకుంది - పీరియడ్స్ రాలేదని గ్రహించి ఎందుకా అని ఆలోచనలో పడింది. అత్తగారితో అదే మాట అంది.

"ఆ... మొన్నటి దాకా చాలా బ్లడ్ పోయింది కదా - కొన్నాళ్ళు ఆగుతుంది. భయం లేదులే" అందామె. నిజమే కదా అని వూరుకుంది. రెండు నెలలు దాటి పోతుంటే వంట్లో భారం ఆమెకి అనుమానం కలిగించి లేడీ డాక్టరు దగ్గరకెళ్ళింది. డాక్టరు తారకి ప్రెగ్నెన్సీ అని నిర్ధారణ చేసి మందులు రాసిచ్చింది. తార ఆశ్చర్యం పడలేదు. ఆనందమూ పొందలేదు గానీ "మూడో నెల వచ్చిందంటారా" అంది.

"లేదమ్మాయ్ - ఎడ్వాన్స్డ్ - అయిదు నెల్లు దాటినాయి" అంది.

"అదెలా నాకు మూడు నెలల క్రితం అబార్షనైంది.

"నో... ఇట్స్ నాట్ కరెక్ట్" అంటూ మందుల చీటీ చేతిలో పెట్టి, ఇంక వెళ్ళచ్చు అన్నట్టు నవ్వింది. స్కూటరు వెనుక కూర్చుని నెమ్మదిగా మోహన్‌తో చెప్పింది.

"పోన్లే యిప్పుడు నీకొచ్చిన కష్టమేంటి?" అన్నాడు మోహన్.

"ఏం లేదనుకోండి - అప్పుడు చూసింది డాక్టరు లలిత. ఆమె అమెరికా వెళ్ళే హడావుడిలో వున్నారు. రెండుసార్లు ట్రై చేసినా దొరకలేదు" నెమ్మదిగా అంది తార.

ఇప్పుడు నీ ప్రాబ్లమ్ ఏమిటో అర్థం కావడం లేదు అన్నాడు భుజాల మీదుగా వెనక్కితిరిగివిసుగ్గా.

అతనికి త్వరగా విసుగు. విసుగు పెరిగిన కొద్దీ కంఠం పెద్దదవడం లక్షణాలు. వెంటనే తార సర్దుకుంది "నో ప్లాబ్రెమ్" అంది.

నాలుగు రోజుల తర్వాత భారతిని తోడుగా తీసుకుని బాగా అనుభవం గల డాక్టరు మహాలక్ష్మిగారి దగ్గరకెళ్ళింది తార. వీళ్ళు వెళ్ళేసరికి ఆమె కాస్త విశ్రాంతిగానే వుంది. భారతికి ఆమె పూర్వమే తెలిసి వుండడం వల్ల చనువుగా పలకరించింది.

ఆమె తారని పరీక్ష చేసి, అయిదో నెల దాటిందనీ సెప్టెంబరు ఇరవై డెలివరీ డేట్ యిచ్చింది. తార నెమ్మదిగా అసలు జరిగిన కథ చెప్పింది.

"ఓ అదా ఒక్కొక్క సారలా జరుగుతుంటుంది. ఇంప్లెంఎటేషన్ అంటే ఫెర్టిలైజ్డ్ ఎగ్ గర్భసంచిలో ఒక పక్కగా ఒక ప్రదేశానికి చేరి వుండి పోతుంది. అప్పుడు కొందరికి బాగా రక్తస్రావం అవుతుంది. దాన్ని పోస్ట్ ఎబార్టల్ బ్లీడింగ్ గా పొరబడితే యిలాంటి అనుమానం వస్తుంది. కానీ అప్పుడు పిండం ఏం కాదు క్రమంగా పిండం పెరిగి బిడ్డ పుట్టవచ్చు - అదే జరిగింది" అంది డాక్టరమ్మ. ఆ మహాలక్ష్మి గారికి వైద్యంలో ఎంత అనుభవం వుందో, ఆసక్తి చూపించిన వారికి అన్నీ విపులంగా చెప్పేఅంత ఉత్సాహం, ఓర్పు కూడా వున్నాయి.

సెప్టెంబరు పది వరకు ఆఫీసుకెళ్ళిన తార పదకొండు నుంచి మెటర్నిటీ లీవు అప్లై చేసింది.

ప్రస్తుతం తారకి పుట్టబోయే బుజ్జి పాపాయి కోసం ఎదురు చూడ్డం తప్ప వేరే వ్యాపకం ఆలోచన లేదు.

* * *

ఆ రోజు పాపకి బారసాల. ఇరువైపుల బంధువులతో ఇల్లంతా కలకల్లాడుతోంది. పాపకి భాగ్యశ్రీ అని పేరు పెట్టారు. అత్తగారూ, మామగారూ తన హోదాకి తగిన బట్టలు పెట్టలేదేమోనని అనుమానంతో మోహన్ తన కిచ్చిన బట్టలు రహస్యంగా చూసుకుంటున్నాడు.

అందరూ భోజనాలయి తాంబూలాలు వేసుకుని కులాసా కబుర్లు చెప్పుకుంటు కూర్చున్నారు. ఇంతలో పోస్ట్‌మెన్ వచ్చి తార పేరున ఒక రిజిస్టర్ కవరిచ్చి వెళ్ళిపోయాడు. ఒక్క క్షణం వాతావరణం నిశ్శబ్దమైంది. ఆఫీసు నుంచి వచ్చింది ఏమై వుంటుందా అని తార తండ్రి రమేష్‌బాబు లెటర్ తీసి చదివి నిర్ఘాంత పోయాడు.

తార అయిదు నెలల క్రితం దొంగ సర్టిఫికెట్ పెట్టి, అబార్షన్ అనే వంకతో ఆరువారాలు ప్రత్యేక శలవు తీసుకుని అది పూర్తయిన అయిదు మాసాలకే మెటర్నిటీ లీవు తీసుకున్నారని - ఇది డిపార్టుమెంటుని మోసం చెయ్యడం కనుక, మీ సంజాయిషీ అడుగుతూ షోకాజ్ నోటీసు అది.

ఇంటిలోని పండగ వాతావరణం గంభీరమై, విషాదంగా మారిపోయింది. అసలు జరిగిన విషయం పూర్తిగా తెలుసుకున్న రమేష్‌బాబు మహాచిరాకు పడిపోయాడు. మోహన్ అయోమయంలో పడిపోయాడు. తారకి ఒక్క క్షణం బుర్రంతా మొద్దుబారిపోయినట్లయింది.

వెంటనే రమేష్‌బాబు రంగంలోకి దిగాడు. కూతురి ఉద్యోగం నిలబడాలని కంకణం కట్టుకుని బయలుదేరాడు.

తెలియక జరిగిన పొరబాటుని ఎంత చెప్పినా పై అధికారులు వినలేదు.

డాక్టరు దగ్గర మోసం విషయం బయట పడినప్పుడు అదే విషయం డిపార్టుమెంట్‌కి తెలియబరచి, మీ ప్రత్యేక సెలవును మరో లీవ్‌గా మార్పించుకోవాలి కదా- అది ఉద్యోగి కనీస బాధ్యత. ఆ బాధ్యతని విస్మరించి, సంస్థని చీట్ చేద్దామని చూసినందుకు రిమూవల్ తప్పదన్నారు.

రమేష్‌బాబు మొదట చెక్ చేసిన డాక్టర్ లలిత కోసం ప్రయత్నించాడు. ఆమె పొరబాటైందని రాసిస్తుందని ఆశించడం తెలివి తక్కువని తేలిపోయింది. ఆమె విదేశాలకి వెళ్ళిపోయే హడావిడిలో వుంది.

ఆఫీసులో కొందరు అధికారులు, సెక్షను హెడ్లులు కేసు బాగా పకడ్బందీగా ఫ్రేమ్ చేయడం వల్ల రమేష్‌బాబు ఎంత ప్రయత్నించినా లొంగలేదు. తారని ఉద్యోగం లోంచి తీసేస్తూ ఆర్డరు వచ్చేసింది.

ఆ రోజు మోహన్ వచ్చి తార మీద తాడెత్తున లేచాడు.

"ఉద్యోగం చేస్తున్నామని పెద్ద ఫోజు. రూల్సు తెలీవు. రెగ్యులేషన్స్ తెలీవు. ఆడవాళ్ళనేమైనా అంటే మాత్రం పౌరుషం పొడుచుకొస్తుంది" అంటూ ఏవేవో మాట్లాడాడు.

"నేనా విషయం ఎంతో ఆందోళన చెందాను. మీకు గుర్తుందా" అంది తార.

ఏం లాభం? వ్యంగంగా అన్నాడు మోహన్.

"నేను డాక్టరు మహాలక్ష్మి గారి దగ్గర కెళ్లే వరకు ఊరుకోలేదు. కానీ నాకా విషయం ఆఫీసుకు తెలియపరచాలని తోచలేదు.

"అదే అడుగుతున్నాను. ఆమాత్రం తెలీదా?"

"అవును నాకు తోచలేదు. నిజమే మీరు చెప్పచ్చు కదా- మీకు రూల్సూ రెగ్యులేషన్లు బాగా తెలుసుగా" అంది.

"ఆహా... నాకింకేం పనిలేదా - ఇలాంటి చిన్న విషయం కూడా నే చెప్పాలా"

"ఏం ఇదేమంత చిన్న విషయం కాదే, నా ఉద్యోగానికి ముప్పుతెచ్చిన విషయం"-

"నాకేం తెలుసు. నువ్వేం చెప్పుకున్నావో నీ ఆఫీసులో - ఏమడిగినా, విషయంలో కల్పించుకున్నట్లుంటుందనీ..."

"మీకు జరిగింది జరిగినట్టు చెప్తూనే వున్నాను. మీరు నన్ను గైయిడ్ చెయ్యొచ్చు కదా! నాకు నెలలు తేడా వచ్చినప్పుడు మీకు చెప్పలేదా?"

"ఏమో! నాకేం గుర్తు, నాకు నీ ముట్టునెలలు గుర్తుపెట్టుకోవడమే తప్ప వేరే పన్లేదనుకున్నావా"

ఒక్కసారి తారలో కోపం తారస్థాయినందుకుంది. ఇంతవరకు ఆమె తన భర్తలో ఎన్నో నీచగుణాలు చూసినా, గ్రహించినా ఇంతటి నీచమైన మాటలు మాట్లాడగలడని వూహించలేదు. ఆమెలో సహనం నశించింది.

"అవును. నా ముట్టు నెలలు లెక్కపెట్టడానికి, గుర్తుపెట్టుకోడానికి మీకెక్కడ గుర్తు? నా జీతం డబ్బులు మాత్రం బాగా లెక్కలు కట్టి, జేబులో పెట్టుకోవడం కుదురుతుందిగాని అంది. తారచెంప చెళ్ళుమంది. మరో దెబ్బపడేదే - కాని తార అతని చెయ్యి గట్టిగా పట్టుకుని "మరొక్క దెబ్బ నా వంటిమీద పడిందో మీ అంతు చూస్తాను" అంది కళ్ళలో నిప్పులు కురుస్తూ. ఈ గొడవకి లోపలికొచ్చిన ఆమె తండ్రి కూతుర్ని చిన్నగా మందలించి అల్లుణ్ణి అక్కడ్నించి బయటకు తీసుకెళ్లే ప్రయత్నంలో పడ్డాడు.

మామగారు సముదాయించేసరికి మరీ రెచ్చిపోయి జేగురించిన ముఖంతో పెద్దపెద్ద రంకెలు వేయడం మొదలుపెట్టాడు మోహన్.

కూతురి ఉద్యోగం పోయినందుకు బాధపడాలో, అల్లుడిలా అరుస్తున్నందుకు బాధపడాలో రమేష్‌బాబుకి అర్థంకాలేదు.

"ఇదిగో మామయ్యగారూ! ఇప్పుడే చెప్తున్నా, నేను ఉద్యోగం చేస్తున్న అమ్మాయి కావాలని ఏరి చేసుకున్నాను. అది నా కండిషన్లలో ఒకటి. ఇప్పుడు ఉద్యోగం పోగొట్టుకుని కూర్చుంది. దానికి నా బాధ్యత లేదు. ఉద్యోగం కనుక లేకపోతే

మీ అమ్మాయికీ నాకూ ఎటువంటి సంబంధం వుండదు" అంటూ ఇష్టమొచ్చినట్లు అరిచాడు.

"అదేమిటలా మాట్లాడుతున్నావు మోహన్! సమస్య లొచ్చినప్పుడే, స్థిమితంగా ఆలోచించుకోవాలి. వాటిని పరిష్కరించుకోవాలి. అంతేగానీ..." అతని మాట పూర్తికాకుండానే మోహన్ అందుకున్నాడు.

"అవన్నీ నా కనవసరం. ఎలా పరిష్కరించుకుంటారో ఏం చేస్తారో, మళ్ళీ ఎలా ఉద్యోగం వేయిస్తారో నాకు తెలీదు. ఆ ఉద్యోగం మళ్లీ వేయించలేకపోతే మీ అమ్మాయిని మీ ఇంట్లోనే వుంచుకోండి" అన్నాడు విసురుగా.

రమేష్‌బాబుకి చర్రున కోపమొచ్చింది. అతని జీవితానుభవం అతని కోపాన్ని మింగేసింది. ఇది కూతురి ఉద్యోగ సమస్యగా కాకుండా ఆమె సంసార జీవన సమస్యగా మలుపుతిరగడం అతన్ని కంగారుపెట్టింది. తార మాత్రం స్థబ్దుగా, రాయిలా వుండిపోయింది. ఆమె మోహన్ వైపు చూసిన చూపులో ఏ భావం వుందో చెప్పడం కష్టం - అది కోపమా! అసహ్యమా! జీవిత సత్యాన్ని గ్రహించిన తెరిపితనమా! ఏమో!... కానీ ఆమె కళ్లు చెమ్మగిల్లలేదు. ఆమెకసలు ఏడుపు రాలేదు.

* * *

అంతవరకు రంగురంగుల బట్టలు కట్టిన రబ్బరు బొమ్మలాగా పెరిగిన తార ఒక్కసారి రక్తమాంసాలు గల మనిషిలా, ఆలోచన గల అమ్మాయిలా, ఇష్టాఇష్టాలు గల స్త్రీలా కళ్లు తెరచింది. చిన్నప్పటి నుంచి తల్లి చెప్పినట్టుగా వినడం, తల్లి ఆలోచనలతో నడవడం మాత్రమే తెలుసు తారకి. తానుగా ఏదీ ఆలోచించలేదు. అలా ఆలోచించాల్సిన అవసరమూ రాలేదు. కట్టూ, బొట్టూ, నగలు, ఫ్యాషను, బంధువులు, మిత్రులు అన్నీ అమ్మ చెప్పినట్టుగానే జరిగిపోయేవి. చదువు - సబ్జక్టు, పరీక్షలు, మార్కులు, ఫస్టుక్లాసులు, గోల్డుమెడల్స్, కాంపిటేటివ్ టెస్టులు, ఇంటర్వ్యూలు, ఇవన్నీ నాన్న చెప్పినట్టుగా జరిగిపోయాయి.

తన సాటివారిలో తను ఎక్కువగా వుండాలని అర్థం చేసుకుంది. ఏలోటూ లేకుండా కాన్వెంటు చదువు పూర్తిచేసింది. ఆ తర్వాత కాలేజీలో చేరే సరికి అందమైన బట్టలు, అంతస్థులు, హోదాలు అర్థమయ్యాయి. బి.ఎ. చివరి సంవత్సరంలో వుండగా ఇంట్లో పెళ్లి కబుర్లు సాగుతుండేవి. తారకవి అత్యంత సహజంగా అనిపించేవి.

"ఇదిగో ఇలా వుంటే నీకుపెళ్లి కాదు" అంటే తల్లి మర్నాటి నుండి తార ఆతప్పు దిద్దుకుని ప్రవర్తించేది. ఎలా వుంటే తనకి పెళ్లి బాగా అవుతుందంటే అలాగే వుండేందుకు ప్రయత్నించేది.

"ఈ రోజుల్లో చదువు ఒక్కటే వుంటే చాలదు. ఉద్యోగం కూడా వుంటేనే మంచి సంబంధం వస్తుంది" అన్న వెంటనే పట్టువదలకుండా ఉద్యోగం సంపాదించుకుంది. జీతం బ్యాంకులో వేసుకుని కట్నం కూడబెట్టుకుంది.

భర్త అంటే ఎత్తుగా, అందంగా, చదువు, ఉద్యోగం, హోదా, కట్నం, కానుకలు, లాంఛనాలు వగైరాలే ఆలోచించింది కానీ, మనిషి, అతనిలోని భావాలు, అతని ఆలోచనా ధోరణి, సమభావం, ప్రేమ, ఇలాంటివెప్పుడూ ఆలోచించలేదు.

పిల్లవాడు మంచివాడు. బుద్ధిమంతుడు అని అందరూ సర్టిఫై చేయడం వింది.

"మంచి" అంటే ఏమిటి.

బుద్ధిమంతుడు అంటే ఎలా వుంటాడు అనేది తార ఎప్పుడూ ఆలోచించలేదు.

తల్లిదండ్రుల ఎంపికలో మోహన్ సహజమైన, అన్ని అర్హతలూగల యువకుడు, పెళ్ళి కొడుకు ఇప్పుడు తారకి మొగుడు.

అసలు తారకి తనకేం కావాలో తనకే తెలీని స్థితిలో వుంది. అదే తెలిస్తే, ఆ కావల్సిన దానికోసం అతని దగ్గర వెదికేది.ం

తారకిప్పుడే తను కోల్పోయిన వ్యక్తిత్వం అర్థమవుతోంది. అలా అర్థమవడం మొదలుపెట్టగా, విపరీతమైన అసంతృప్తి ఆమె మనసుని కల్చిపారేస్తోంది.

రమేష్‌బాబు రంగప్రవేశం చేశాడు. ఆఫీసులో కొందరు ఆడవాళ్ళ మీద కేవలం ఈర్ష్యాసూయల కొద్దీ, ఈ కేస్ బాగా భూతద్దంలో పెట్టి చూపించి ఫ్రేమ్ చేశారు.

"వంద రూపాయలు పడేస్తే డాక్టరు ఏ సర్టిఫికెటైనా యిచ్చే ఈ రోజుల్లో ఇదేమంత కష్టం కాదని, తార డిపార్టుమెంటును చీట్‌చేసి, ప్రత్యేక శలవువాడుకుందని" నిరూపించారు.

అవన్నీ తిరగతోడించి, అందర్నీ ఒప్పించి, బతిమాలి, పాతిక వేలు ఖర్చుచేసి, ఆరేళ్ళ సర్వీసు పోగొట్టుకుని, ఫ్రెష్‌గా అప్పాయింట్‌మెంట్ ఆర్డర్ సంపాదించేసరికి రమేష్‌బాబు లాంటి వ్యవహారం తెలిసిన మనిషికే ఏడాది పట్టింది.

రోజులు, వారాలు, నెలలు గడిచేకొద్దీ తారలో ఆలోచన పదునైంది.

ఏడాదిలోను మోహన్ తారని చూడటానికి రెండు మూడుసార్లు వచ్చాడు. ఇద్దరిమధ్యా పొడిపొడి మాటలు జరిగాయి. అతను రమ్మనమని అడగలేదు. ఆమె వస్తానని ఆత్రం చూపించలేదు.

ఆరోజు రమేష్‌బాబు ఆనందంతో ఆటోలోంచి దూకినంత వేగంగా దిగి చకచకా యింట్లోకి జొరబడ్డాడు.

"తారా! అమ్మా తారా - తల్లీ తారా" అంటూ అతని గొంతు ఆవేశం ఆనందం కలిసి గుడిలో గంటలా మోగింది. వైదేహి లోపల్నించి హడావిడిగా వచ్చింది.

"వైదేహీ, మనకష్టాలు గట్టెక్కాయి. ఇదిగో తార వుద్యోగం ఆర్డరు" అన్నాడు.

లోపలిగదిలో కూర్చునేదో పుస్తకం చదువుకుంటున్న తార పరుగున హాల్లోకి వచ్చింది.

"ఇదిగో నమ్మా నీ ఆర్డరు"

ఆమె ఆత్రుతగా అందుకుంది. కళ్ళల్లో చిప్పిన చిమ్మిన నీటివల్ల ఏం కనిపించలేదు.

"రేపే జాయిన్ అవుదువుగానీ. రేపు మంచి రోజు కూడా"

"అలాగే నాన్నా" అంది. ఆమె గొంతు వణికింది. దుఃఖంతో పూడుకు పోయింది.

ఆ తల్లిదండ్రులామె బాధనర్థం చేసుకుని, నిట్టూర్చారు.

* * *

ఇంట్లో అడుగుపెట్టిన అల్లుడికి ఎంతో మర్యాద చేసింది అత్తగారు వైదేహి.

గౌరవంగా ఆహ్వానించి వుత్సాహంగా కబుర్లు చెప్పాడు మామగారు రమేష్‌బాబు.

అప్పుడే వచ్చింది తార.

"తారా! ఎల్లుండి మంచిదట. అమ్మచెప్పింది మనింటి కెళ్దాం" అన్నాడు మోహన్.

రమేష్‌బాబు ముఖంలో ఏదో తృప్తి, వైదేహి ముఖంలో ఒక రకమైన రిలీఫ్.

"నేను రాను" అంది తార. ఆ కంఠంలో కోపం, వుద్రేకం లేవు. దృఢనిశ్చయం ఖంగుమని మోగింది.

రమేష్‌బాబు,వైదేహిఒక్కక్షణంవెనక్కిజంకారు.

మోహన్ ముఖం వివర్ణమైంది.

"అదేమిటమ్మా..." అని ఇంకా ఏదో చెప్పబోయిన తండ్రి మాటకి అడ్డొచ్చి.

"నాన్నా! అదంతే, నా వుద్యోగం నాకిప్పించి బతుకుతెరువు నిచ్చారు. మీ రుణం జన్మలో తీర్చుకోలేను. కానీ ఈ మొగుడితో వెళ్ళి కాపురం చెయ్యమని మాత్రం అడక్కండి

"తారా..." తల్లి ఏదో అనబోయింది.

మోహన్ ఒక వెర్రినవ్వు లాంటిది నవ్వాడు. దొంగతనం చేస్తూ పట్టుబడిన వాడు కప్పిపుచ్చుకునే ధోరణిలా

"ఏదో నేను ఆవేశంలో అన్నమాటలు పట్టించుకున్నట్లుంది.

భార్యాభర్తలన్నాక...

"స్టాప్ ఇట్. ఇంకచాలు మరేం మాట్లాడకండి. నేనీ జన్మలో మీ దగ్గరికి రాను. మీతో జీవించను"

"ఏమనుకుంటున్నావో..."

"నేనేమనుకున్నా.మీ కనవసరం, విడాకులికి ప్రయత్నించుకోండి. కాదంటే నేనే చేస్తాను"

మరింక ఒక్కక్షణం కూడా అక్కడ నిలబడలేదు తార. విసురుగా తన గదిలోకెళ్ళి తలుపేసుకుంది.

# ఎర్రగులాబీ

డా. వాసా ప్రభావతి

జీవితపయనంలో అడుగడుగునా అలసిన మనిషి ఒయాసిస్సులాంటి హృదయాన్ని కోరుకుంటాడు.

పగలల్లా పయనించి అలసిన సూర్యుడు పడమటి కొండవడిని చేరుకుంటున్నాడు.

నీరెండవచ్చి ఆయింటి ముందున్న పచ్చని చెట్లమీదవాలి గిలిగింతలు పెడుతోంది.

చల్లని గాలి తరంగ మొకటి వచ్చి మెట్లమీద నిలబడి చూస్తున్న శిల్పను వాటేసుకుంది. శిల్ప శరీరంలో సన్నని గగుర్పాటు హృదయంలో ఏదో తెలియని కొత్త త్రుళ్ళింత.

ఎదురుగా గాలికి అటుఇటు ఊగుతున్న ఎర్రగులాబి శిల్పను పలకరించినట్లనిపించింది.

పొద్దుటనగా వికశించి ఆరిపోతున్న దీపంలా ఉన్న గులాబీకి ఒక మహాత్ముని చిరునవ్వులా ఆలవందమెందుకో. ఆ స్వల్పకాల జీవితంలో తన ఆనందాన్ని, పరిమళాన్ని లోకానికి పంచి తెల్లారితే రేకులు రాల్చేస్తుంది. ఆ కాస్త వ్యవధిలోనే అన్ని పూవులలో తానై బతుకుతుంది. మనిషలా బతకలేడెందుకో? బతకాలని ఉన్నా మనసు సుఖంగా బతకనివ్వదు. ఆ గులాబీకి లేని మనసు ఈ మనిషి కెందుకో? అడుగడుగునా తృప్తి, అసంతృప్తుల మధ్య తులాభారాలు!"

శిల్ప మనస్సులో విరిగిపడి లేచే తరంగాల్లా కోటి ఆలోచనలు.

"అమ్మా! శిల్పా!" అత్తగారి పిలుపు బడిగంటలా వినబడింది. శిల్ప ఉలిక్కిపడి లోపలకి నడిచింది.

"అత్తయ్యా! పిలిచారా?"

"అవునమ్మా! అలా ఎంతసేపని నిలబడతావు? శేఖర్ వచ్చే వేళయింది. వెళ్ళి బట్టలు మార్చుకో? ఈ రోజు సినిమాకు తీసుకెడతానన్నాడుగా!"

"ఇలా ఎన్నో సార్లు చెప్పాడు! ఒక్కరోజూ చెప్పిన టైముకి ఇంటికి రాడు. ఈ రోజూ నమ్మకంలేదు" శిల్ప మాటలు మనస్సులోనే ఉండిపోయాయి. తల్లిలా ఆదరిస్తున్న రాధాదేవితో ఆమాటలు అనలేకపోయింది.

"అలాగే అత్తయ్యా!" శిల్ప తనగది వైపు నడిచింది.

శిల్ప ముఖం కడుక్కుని పౌడరు రాసుకుంది. ఎర్రని బొట్టు పెట్టుకుంది. తనకు నచ్చిన చీర కట్టుకుని అద్దం ముందు నిలబడింది.

"దేవకన్యలా ఉంటావు. మహారాణీలా నీ జీవితం కాలుకింద పెట్టకుండా సాగిపోతుంది" అందరు ఒకనాడు అన్న మాటలు ఆమె చెవుల్లో రింగుమన్నాయి.

"కాని తన కళ్ళ కింద అప్పుడే నల్లని చారలు. తన బతుకు పొగబారిన గాజు చిమ్నీలా మసిబారిపోతోంది" విశాలమైన శిల్పకళ్ళు కన్నీళ్ళతో నిండిపోయాయి. అద్దంలో ఆమె ముఖం ఆమెకే కనబడలేదు. గుండె మోయలేనంత బరువైంది. నిలబడలేక వెళ్ళిసోఫాలో వాలింది.

"అమ్మా! శిల్పా!"

అత్తగారి పిలుపు వినగానే శిల్ప కన్నీళ్ళు తుడుచుకుంది. జుట్టు మరోసారి దువ్వుకుని చన్నీళ్ళతో ముఖం కడుక్కుంది. తిరిగి పౌడరు రాసుకుని బొట్టుపెట్టుకుని బయటకువచ్చింది.

పాలరాతి శిల్పంలా నడచి వస్తున్న శిల్పను రాధాదేవి కళ్ళార్పకుండా చూసింది. శిల్ప ముఖంలో నీలి నీడలు కొట్టవచ్చినట్లు కనబడుతున్నాయి.

"బృందావనంలో ప్రియుని వెంట హాయిగా తిరగవలసిన నిన్ను తెచ్చి కారడవిలో కట్టిపడేసాను. జంటను చేసాను గాని జీవితంలో జంటగా నడిపించలేకపోతున్నాను. ఈ పాపం నాదేనమ్మా!" రాధాదేవి మనస్సు విలవిల్లాడింది. అంతలో కాలింగ్ బెల్లు వినబడింది.

"శిల్పా! తలుపు తీసి చూడమ్మా!"

రాధాదేవి మాట పూర్తి కాకుండానే శిల్ప వీధి తలుపు తీసింది. ఎదురుగా రఘూ నిలబడి ఉన్నాడు.

"శిల్పా! బాగున్నావా?"

ఆ కంఠంలో ఏదో ఆప్యాయత. ఆ మాటలో హృదయాన్ని తడిపే ఏదో మాధుర్యం. ఎండిపోయిన హృదయంలో చల్లని పన్నీటి జల్లులా కురిసాయి

బాగున్నానని చెప్పలేని శిల్ప తలాడించింది.

రఘూ చొరవగా లోపలకి వచ్చి సోఫాలో కూర్చున్నాడు. శిల్ప అపరాధిలా అతనివైపు చూడలేక పోయింది.

"ఇతను రఘూ అత్తయ్యా!"

"అలాగా! రఘూ అంటే మీవూరి అబ్బాయే కదూ!"

"అవునత్తయ్యా!"

"ఈవిడ మా అత్తగారు"

"నమస్కారమండీ" రఘూ రెండు చేతులు జోడించి నమస్కరించాడు.

"రఘూ లేకుండా శిల్ప పెళ్లై పోతోంది. ఈ సంగతి తెలిస్తే అతను ఎంత బాధపడతాడో!" పెళ్ళిలో శిల్ప స్నేహితురాళ్ళు అనుకున్న మాటలు రాధాదేవికి గుర్తుకొచ్చాయి.

"ఇప్పుడితడెందుకు వచ్చాడో!" ఆవిడ అంతరాత్మలో ఏదో అనుమానం.

"శిల్పా! మీరు మాట్లాడుతూండండమ్మా! నేను టీ పట్టుకొస్తాను" రాధాదేవి టీ తేవడానికి వంటింట్లోకి వెళ్ళింది. రఘూ ఇల్లంతా ఒక్కసారి కలయ చూసాడు.

"శిల్పా! మూగనోము పట్టావా? మాట్లాడవేం? నీ వీణానాదంతో ఈ ఇల్లంతా ప్రతిధ్వనిస్తూ ఉంటుందనుకున్నాను. నీ చిత్రాలతో ఈ గోడలన్నీ కళకళ లాడుతాయనుకున్నాను" రఘూ చెప్పడం ఆపి శిల్ప వైపు పరిశీలనగా చూసాడు.

"మబ్బులు కమ్మిన ఆకాశంలో మరుగుపడిన చంద్రునిలా శిల్పముఖం కనబడింది" రఘూ కొంత వరకు పరిస్థితి అర్థం చేసుకున్నాడు. అతని మనస్సు విలవిల్లాడింది.

"టీ తీసుకోబాబూ! శిల్పా! నువ్వు కూడా తీసుకో!" రాధాదేవి టీ అందించింది.

"శిల్పా వాళ్ళ అమ్మగారూ! నాన్నగారూ! అందరు బాగున్నారాబాబూ"

"నేను కలకత్తాలో ఉంటున్నానండీ. అక్కడి సంగతులు నాకేమీ తెలీవండీ. శిల్పను ఒకసారి చూసిపోదామని వచ్చానండీ" చనువుగా మాట్లాడుతున్న రఘుని రాధాదేవి ఆశ్చర్యంగా చూసింది.

"శేఖర్ వచ్చేటప్పటికి ఆలస్యమవుతుంది బాబూ! నువ్వు భోజనం చేద్దువుగానిలే!"

"ఇప్పుడేకదండీ టీ తాగాను. భోజనానికేమిలెండి? మళ్ళీ వచ్చినప్పుడు చేస్తాను. నేవెళ్ళి పోవాలండీ! శిల్ప మీ చల్లని నీడలో సుఖంగా ఉండాలని కోరుకుంటున్నాను. ఈ మాటన్నందుకు ఏమీ అనుకోకండి. నమస్కారమండీ!" రఘూ వీధివైపు అడుగులు వేసాడు. అతని కళ్ళల్లో కదలిన నీటిచార రాధాదేవి కంటపడింది.

"రఘూ ఉన్నంతసేపూ ఏదో తెలియని ఆనందం. రఘూ వెంటే అది తిరిగి వెళ్ళిపోయింది" శిల్ప మనస్సు ఆలోచించలేకపోయింది. ఆమె రెండు కళ్ళు నీళ్ళతో నిండాయి. అక్కడ నిలబడలేక గదిలోకి వెళ్ళి మంచం మీద వాలిపోయింది.

"శిల్ప అతని వెంటే వెడుతుందేమోనని ఎంత భయపడ్డానో! రాధాదేవి ఊపిరి పీల్చుకుంది.

"రఘూ కనబడితే నా బాధలన్నీ చెప్పుకోవాలనుకున్నాను. కాని అత్తింట్లో బందీగా ఉన్న నేను అత్తగారి ఎదురుగా ఏం చెప్పుకోగలను? అయినా చెప్పుకున్న ఏం ప్రయోజనం? ఎవరి కష్టాలు, కన్నీళ్ళు వారివే. ఎవరి జీవితం వారే చక్కదిద్దుకోవాలి. ఈ అవమానాలు, తిరస్కారాలు నేనింక భరించలేను. నా ఓర్పు నన్నే వెక్కిరిస్తోంది. హృదయం లేని ఈ శేఖర్‌తో నే కాపురం చెయ్యలేను" దుఃఖం ఆపుకోలేని శిల్ప వెక్కివెక్కి ఏడ్చింది.

కట్టలు తెంచుకు వచ్చిన నీరంతా సముద్రంలో కలుస్తుంది. తర్వాత నది ప్రశాంతంగా ఉంటుంది.

శిల్ప కళ్ళలో పొంగి వచ్చిన దుఃఖం బయట కలిసింది. ఆమె మనస్సు కాస్త కుదుట పడింది. గతం ఆమె కళ్ళ ఎదుట నిలిచింది.

శిల్ప బి.ఎ. మొదటి తరగతిలో పాసయింది. శిల్ప కాలేజీలో మార్కులు తీసుకుని బస్సుస్టాపుకు వచ్చింది. ఎంత సేపయినా బస్సురాలేదు. శిల్ప చిరాగ్గా అటు ఇటు చూస్తూ నిలబడింది. "హలో! శిల్పా! కన్‌గ్రాట్యులేషన్స్. ఫస్టుక్లాసు వచ్చినందుకు అందుకోండి నాచిరుకానుక" రఘూ తన చేతిలో ఉన్న ఎర్రగులాబీని శిల్పకు అందించాడు.

శిల్ప చిరునవ్వుతో చేయిచాచి గులాబీని అందుకుంది. ఆ పువ్వు శిల్ప కంటికి ఎంతో అందంగా కనబడింది.

"ఏ వస్తువు ఎక్కడ ఉంటే అందమో అక్కడికే చేరుతుంది. ఈ గులాబీ మీ చేతుల్లో ఎంత అందంగా ఉందో చూసారా!" రఘూ మాటలకి శిల్ప పకపకా నవ్వింది. ఆమె బుగ్గలు ఎర్రగులాబీలయ్యాయి. ఆమెను చూసిన రఘూ హృదయం ఎర్రగులాబీ అయింది. అంతలో బస్సు రావడంతో శిల్ప అటుకదలింది.

"శిల్పా నాకు ఉద్యోగం దొరికింది. మద్రాసు వెళ్ళిపోతున్నాను. నీతో ఒక్క మాట చెప్పాలని వచ్చాను" ఇంట్లో వంటరిగా ఉందని తెలుసుకున్న రఘూ చొరవగా వెళ్ళి శిల్పతో చెప్పాడు.

అతనిని చూడగానే శిల్ప ముఖం వికసించింది. ఏమిటో చెప్పమన్నట్లుగా అతని వైపు చూసింది.

"నేను ఉద్యోగంలో చేరి త్వరలోనే తిరిగి వస్తాను. అప్పటి వరకు నువ్వు నాకోసం .............. "

అతని మాట పూర్తి కాలేదు. ఎవరో లోపలకి వచ్చారు.

"టాటా!" రఘూ చెయ్యి ఊపుతూ వెళ్ళిపోయాడు.

"రఘూ! ఏం చెప్పాలనుకున్నాడో? నేను కూడా ఎన్నో చెప్పాలను కున్నాను. కాని చెప్పలేకపోయాను" శిల్ప పదేపదే అనుకుంది.

ఆరోజు శిల్ప అక్కపెళ్ళి. మగపెళ్ళి వారి తరఫున రధాదేవి పెళ్ళికి వచ్చింది. బొమ్మలా అందంగా ఉన్న శిల్ప అటుఇటు తిరుగుతుంటే ఆవిడ ఆసక్తిగా చూసింది. "ఈ అమ్మాయి నా కోడలయితే శేఖర్ తిన్నబడతాడు. బయట తిరుగుళ్ళు మానేసి ఇంటిపట్టున ఉంటాడు" రాధాదేవి అనుకున్నట్లుగానే శేఖర్ని పిలిచి శిల్పను చూపించింది.

సంసార జీవితంపై ఏ ఆశయం లేని శేఖర్ ఆమె అందం తన సొంతం కావాలనుకున్నాడు. శిల్పను పెళ్ళి చేసుకోడానికి అంగీకరించాడు.

అప్పుడే వికసించి పురివిప్పిన నెమలిలా నాట్యం చేస్తున్న శిల్ప హృదయంలో రఘూ రూపం చిత్రించబడింది. చేతివేళ్ళతో వీణ తంత్రులు మీటి రాగాలు పలికించే ఆమె హృదయమే వీణై అతని జ్ఞాపకాలతో రాగాలు పలుకుతోంది. శిల్ప లేతహృదయం రఘూకోసం తపిస్తోంది. శిల్ప పెళ్ళి చేసుకోనని మొండి పట్టుపట్టింది. ఇంట్లో ఎవరు ఆమె మాట వినిపించుకోలేదు.

పెద్దింటికి వెడుతోందని తండ్రికి సంబరం. కావలసిన నగలు, బట్టలు, లంకంత కొంపా ఉన్నాయని తల్లి అక్కచెల్లెళ్ళకు సంబరం. పెళ్ళికి ముహూర్తం పెట్టేసారు.

అప్పట్లో శిల్పకు ఇల్లు వదలి పారిపోయేటంత ధైర్యం లేదు. ఆత్మహత్య చేసునేటంత సాహసమూ లేదు. రఘూకి తెలిస్తే రెక్కలు కట్టుకువాలేవాడు. అతనికి తెలియజేయడానికి శిల్పకు ఎడ్రస్సే తెలీదు. ఎవరూ తన బాధను పంచుకునేవారు లేకవంటరిగా బాధపడింది.

పెళ్ళి పనులు సందడిగా ప్రారంభమయ్యాయి. కాలమే గాయం మాన్పినట్లుగా పెళ్ళి సందడిలోపడి శిల్ప క్రమంగా రఘూ సంగతి మరచిపోసాగింది.

అనుకున్నట్లుగానే శిల్ప, శేఖర్‌ల పెళ్ళి వైభవంగా జరిగింది. శిల్ప అత్తవారింట్లో అడుగు పెట్టింది.

ఆ రాత్రి కొత్త దంపతులకు మొదటి రాత్రి. రెండు మనసులు, రెండు తనువులు ఒక్కటయ్యేరాత్రి. శిల్ప గుండె వేగంగా కొట్టుకోడం మొదలు పెట్టింది. సన్నని శరీరం లేతీగలా అల్లాడిపోసాగింది.

పప్పిటి స్నానం చేయించి తెల్లని పాలనురుగులాంటి చీర కట్టించారు. ఘుమఘుమలాడే అత్తరు పూసి పూల మాలలు తల నిండా తురిమారు. అడుగులు తడబడుతుంటే నడవలేని శిల్పను బలవంతంగా గదిలోకి పంపారు. భయంతో చేతులు వణుకుతుంటే శేఖర్‌కి పాలగ్లాసు అందించింది. అతనివైపు సూటిగా చూడలేక అరమోడ్పు కన్నులతో నిలబడింది.

"లైటార్పు" శేఖర్ గొంతు ఖంగుమంది.

ఉలిక్కిపడి శిల్ప కళ్ళు తెరిచింది. భయంతో గజగజలాడింది. నిలబడలేక గోడను ఆనుకుంది.

శేఖర్ ఆమె వైపు గుడ్లురిమిచూసాడు. అతనే లేచి వెళ్ళి లైటార్పి ఆమె చెయ్యి పట్టుకుని మంచంవైపు లాక్కువెళ్ళాడు.

"అక్క, పిన్ని చెవిలో గుసగుసలాడినవన్నీ అబద్ధాలేనా!" శిల్ప మనస్సు చిన్నబోయింది. ఆమె ఎదురు చూసిన ఆనందమంతా కరిగి కన్నీరై కారింది. అయినా తలుపు తీసుకుని బయటకు రాలేక పోయింది.

ఆ చీకట్లో శేఖర్ ఆమె శరీరాన్ని ఆక్రమించుకున్నాడు. ఆమెకాదనలేకపోయింది. సుస్నితమైన ఆమె పెదాలు, బుగ్గలు కొరికిగాట్లు వేసాడు. ఆమె అంగీకారం లేకుండానే ఆమె వక్షస్థలం మీద చేతులు వేసాడు. ఆమె అంగీకారం లేకుండానే ఆమెను పూర్తిగా ఆక్రమించుకున్నాడు. ఆమెను లాలించలేదు. తీయని మాటలతో కవ్వించలేదు. ఆత్మీయతను పంచలేదు. అయినా వయసులో ఉన్న ఆమె శరీరం నలిగి అలిసి నిద్రలోకి జారిపోయింది.



తెల్లవారింది మొదలు శిల్ప శరీరంలో ఏదో తడబాటు. శేఖర్ వంటరిగా కలిసి పలకరిస్తాడనే ఆశ. కొంగుపట్టి లాగుతాడేమోననే కోరిక. ఆమెను నిలవనియ్యలేదు.

"అమ్మా! శిల్పా! అబ్బాయికి కాఫీ యిచ్చిరామ్మా!" 

శిల్ప అత్తగారి చేతిలోని కాఫీ కప్పు అందుకుని గదిలోకి అడుగు వేసింది. శేఖర్ తలెత్తి చూడలేదు. పలకరించలేదు. ఆమె ఉత్సాహం సగం నీరుకారిపోయింది. అయినా శిల్ప చిరునవ్వుతో కాఫీ కప్పు అందించింది. అతను అందుకోలేదు.

"అలాపెట్టు" ఆ గొంతు ఉరిమినట్టుగా వుంది. 

ఉరుము ఉరిమితే కడిమి వికసిస్తుందంటారు. కాని ఈ కడిమి వడలి ముడుచుకుపోయింది. శిల్ప చిన్నపిల్లలా రెండు చేతులతో కారే కన్నీళ్ళు తుడుచుకుంది.

"ప్రేమగా దగ్గరకు పిలిచి శేఖరే ఈ కన్నీళ్ళు తుడిస్తే ఎంత బాగుంటుంది. ఆ సుఖం మరే వస్తువు అందించగలదు. శేఖర్ బిగికౌగిలిలో నన్ను బంధించి ఉక్కిరిబిక్కిరి చేస్తే నాకింత కంటే ఏం కావాలి? అతడు లాలనగా నా వీపు నిమురుతుంటే విశాలమైన అతని వక్షస్థలం మీద వాలి అతని హృదయంలో తలదాచు కోడం కంటే నాకు అదృష్టమేముంటుంది." శిల్పకోరిక జీవితాంతం కోరికగానే మిగిలిపోయింది.

"శేఖర్ సరసుడుకాడు. కఠినుడు" శిల్ప అంతరాత్మ ఘోషించింది.

"తానేమితప్పుచేసానని తనకీశిక్ష" శిల్ప కుమిలి కుమిలి ఏడ్చింది. ఆకాశంలో హాయిగా ఎగిరే రాచిలుకను తెచ్చి పంజరంలో బంధించినట్లు బాధపడింది.

"అమ్మా! శిల్పా! ఒక్కసారి వీణ వాయించమ్మా! నాకు వీణంటే చాలా యిష్టం. నాకు రాకపోయినా నువ్వు వాయిస్తుంటే ఆనందించాలనే నిన్ను నాకోడలిగా తెచ్చుకున్నానమ్మా. ఈ యింటికి కోడలివైనా కూతురివైనా నీవేనమ్మా!" ఓరోజు రాధాదేవి కోడలిని అడిగింది.

వీణ వాయిస్తున్న శిల్ప అత్తగారికంటికి అపరసరస్వతిలా కనబడింది.

రాధాదేవి నిజంగా బృందావనంలోని రాధై తన్మయత్వం పొందింది. శేఖర్ రాక ఇద్దరూ గమనించలేదు.

"ఏమిటీ గోల? ఈ యింట్లో యిలాటివి పనికిరావని ముందే చెప్పాను. ఒకసారి చెబితే బుద్ధిరాదను కుంటాను"

శేఖర్ ఎడమకాలితో వీణ తన్నుకుంటూ వెళ్ళిపోయాడు. "అమ్మా! శిల్పా! నన్ను క్షమించమ్మా! శేఖర్ మనిషికాడు. కర్కోటకుడు. వీడు మారడమ్మా! మారడు" రాధాదేవి హృదయం పశ్చాత్తాపంతో కుమిలిపోయింది.

శిల్ప కళ్ళు తిరిగి అచేతనంగా నేలవాలింది. రాధాదేవి ఆమె ముఖం మీద నీళ్ళు జల్లి తుడిచింది. శిల్ప కళ్ళు తెరవగానే వేడి వేడి పాలు తాగించింది.

రాధాదేవి చల్లని సన్నిధిలో శిల్ప సేదతీర్చుకుంది. శిల్ప మరెప్పుడు వీణను తాకలేకపోయింది.

రాధాదేవి కూడా మరెప్పుడు వీణ వాయించమని అడగలేదు. కొడుకు ప్రవర్తన ఆమెను మరింత కుంగతీసింది. ఆమె ఆరోగ్యం రోజు రోజుకు దిగజారడం మొదలు పెట్టింది.

గతం నుంచి బయటకు వచ్చిన శిల్ప భయంతో వణికింది. తానొక అగాధంలో కూరుకుపోయానని బాధపడింది.భవిష్యత్తేమిటో ఊహించుకోలేక ఉక్కిరిబిక్కిరయింది.

"ఇలా గతం తలుచుకుంటూ కూర్చుంటే కాలమే తెలీదు. అనారోగ్యంతో బాధపడుతున్న ఆవిడను మరింత బాధపెట్టకూడదు" శిల్ప బయటకు వచ్చింది.

"అత్తయ్యా! అన్నం తింటారా? వడ్డించనా?"

"జ్వరం తగిలినట్టుందమ్మా! నేను భోజనం చెయ్యను. నువ్వు వడ్డించుకోమ్మా!"

"ఇదేమిటత్తయ్యా! వళ్ళు ఇంత వేడిగా ఉందేమిటి?" శిల్ప అత్తగారి వంటిమీద చెయ్యివేసి చూసి కంగారుపడింది.

"పోయేవయస్సేకాని వచ్చే వయస్సు కాదు కదమ్మా! ఏదో ఒకటి వస్తూనే ఉంటుందమ్మా. అంత కంగారు దేనికి? ముందు నువ్వు భోంచెయ్యమ్మా!"

"మానసిక బాధలతో పాటు శారీరక బాధలెలా తట్టుకుంటావత్తయ్యా! పెరుగుతున్న వైద్య విజ్ఞానమంతా రోగాలు తగ్గటానికే కదా! మానసిక వ్యాధులకే మందుల్లేవత్తయ్యా"

"ఏ వ్యాధులకైనా మందులున్నప్పుడు మానసిక వ్యాధులకు కూడా మందులుంటాయి. ఆ మందులు వైద్యుడు కాదు ఇచ్చేది! మనమే కనిపెట్టుకోవాలి. సమస్యలతో కుమిలిపోవడం కాదు. సమస్యని పరిష్కరించుకోడానికి ప్రయత్నించాలి. ప్రయత్నం మానవ ధర్మం. అది మర్చిపోకూడదు శిల్పా!"

అత్తగారి మాటలు జాగ్రత్తగా విన్న శిల్ప ఆశ్చర్యపోయింది.

"ఈ సందేశం నాకేనేమో!" ఆవిడ ఆలోచనల ముందు నేనెంత. మనస్సులోనే ఆవిడను అభినందించింది.

అత్తగారికి మందులు వేసి పడుకోపెట్టింది. అప్పటికీ శేఖర్ ఇంటికి రాలేను. శిల్ప పట్టెడు అన్నం కంచంలో పెట్టుకుంది. ముద్ద గొంతు దిగకపోయినా కుక్కుకు మింగింది. వంటిల్లు సర్దింది. అత్తగారిని మరోసారి పలకరించి గదిలోకి వెళ్ళి పడుకుంది.

శిల్ప మనస్సు చుట్టూ ఆలోచనలు జోరీగల్లా మూగాయి. "శేఖర్‌కి హృదయంలేదు. అంటే శేఖర్ మనిషి కాడు. మనిషి కాని శేఖర్‌తో తానింక కలిసి కాపురం చెయ్యలేదు. ఈ మంగళ సూత్రాలూ మూడు ముళ్ళు శారీరక బంధాలు ఇవి స్త్రీ పురుషులు కలిసి జీవించడానికి లైసెన్సులేకాని కలిసి కాపురాలు చేయించలేవు. మనసులు కలిస్తేనే మనువవుతుంది. లేనినాడు అది రాతిబొమ్మల పెళ్ళే. ఈ బంధాలకు దూరంగా వెళ్ళిపోవాలి" శిల్ప మనస్సులో చెలరేగిన మనస్సు కాస్తకుదుట పడింది.

"అత్తగారికి జ్వరం తగ్గగానే ఒక నిర్ణయం తీసుకోవాలి" ఆలోచనలతో అలసిన శిల్ప నిద్రలోకి జారింది.

నాలుగు రోజుల్లో రాధాదేవి జ్వరం తగ్గి మామూలు స్థితికి వచ్చింది. ఆ నాలుగు రోజులు శిల్ప ఆవిడ పక్కనే ఉండి సేవలు చేసింది. ఆ నాలుగు రోజులు శేఖర్ యింటికి రాలేదు. శిల్ప తిరిగి ఆలోచించడం మొదలు పెట్టింది.

"అత్తగారు తనని చూసి స్వార్థపరురాలను కుంటుందేమో! అయినా నేను లేకపోతే ఆవిడ వంటరిగా ఎలా బతుకుతుంది? అయినా జీవితంలో తానెవరో? ఆవిడెవరో, నేను జీవితాంతం ఆవిడ వెంటే ఉంటానని వాగ్దానం చెయ్యలేదు. ఆవిడ దారి ఆవిడ వెతుక్కుంటూ నాకు పెళ్ళి చేసింది. అంతా మోసం, దగ, నటన. నాదారి నేను వెతుక్కుంటూ వెళ్ళిపోవాలి. శేఖర్ రాకుండానే యిల్లు వదలాలి. రఘూని వెతుక్కుంటూ వెళ్ళిపోవాలి"

శిల్ప కంగారుగా బట్టలు సర్దుకుంది. తనదంటూ ఏదీ వదలలేదు. అన్నీ పెట్టెలలో పడేసుకుంది. మోయలేనంత బరువుగా ఉన్న రెండు పెట్టెలు చేతపట్టుకుని బయటకు వచ్చింది.

ఎదురుగా సోఫాలో అత్తగారు కనబడగానే శిల్ప గతుక్కుమంది. తప్పు చేసి పట్టుబడిన దానిలా నీరుకారిపోయింది. తలవంచుకుని అక్కడే నిలబడింది.

"ఈవిడ అత్తగారా? అందరిలా సాధించదు. నిందించదు. ఆవలిస్తే పేగులు లెక్కపెడుతుంది. శిల్ప బోనులో పడ్డ ఎలుకలా తప్పించుకోడానికి గింజుకుంది.

"శిల్పా నువ్వు తీసుకున్న నిర్ణయం చాలా బాగుంది. కాని కొన్నాళ్ళు భర్తతో కాపురం చేసిన నిన్ను ఆ రఘూ స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నాడా అమ్మా! చాటు వ్యవహారానికైతే ఫరవాలేదుకాని ఏలుకోడానికి ముందుకు వచ్చే మగవాళ్ళెంత

మందంటావు? రఘూకి అంత విశాల హృదయముంటే అంతకంటే ఏం కావాలమ్మా! అయినా ఒక్కమాట ముందే చెప్పివుంటే పసుపు కుంకుమలిచ్చి పంపించేదాన్ని కాదా? ఏదైనా మంచి సాహసమే చేసావు. డ్రైవరికి చెబుతాను. ఎక్కడికి వెళ్ళాలో బయలుదేరు" రాధాదేవి సోఫాలోంచి లేచింది.

"శిల్పా! ఏమైందినీకు" కళ్లు తిరిగిపోతున్న శిల్పను రాధాదేవి వెళ్ళిపట్టుకుంది.

ఆవిడ కేకలకు లోపలకి పరుగెత్తుకు వచ్చిన డ్రైవరు సహాయంతో శిల్పను మెల్లిగా సోఫాలో పడుకోపెట్టింది.

"శిల్ప మనస్సును ఎంతగా నొప్పించానో" రాధాదేవి ఓపక్క బాధపడుతూనే డాక్టరుకి ఫోను చేసింది.

లేడీ డాక్టరు వచ్చి పరీక్ష చేసింది.

"రాధాదేవిగారూ! మీరు నాయనమ్మ కాబోతున్నారండీ!" రాధాదేవి సంతోషానికి అంతులేదు.

"డాక్టరుగారూ! ఇదంతా మీ చలవండీ! నా జన్మచరితార్థమయిందండీ" రాధాదేవి ఆవిడకు ఇవ్వవలసినదానికంటే ఎక్కువ ఇచ్చి పంపించింది.

"అమ్మా! శిల్పా! తొందరపడి ఏమేమో అన్నాను. నన్ను క్షమించమ్మా" రాధాదేవి శిల్ప రెండు చేతులు పట్టుకుంది.

"రఘూతో వెళ్ళిపోవాలనుకుని పొరపాటు చేసాను. ఈ విషయం శేఖర్‌కి తెలిస్తే ఏమనుకుంటాడో? శేఖర్ తండ్రి కాబోతున్నాడని తెలిస్తే తప్పకుండా మారుతాడు" సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అవుతున్న శిల్ప అత్తగారి మాటలకి సిగ్గుతో మెలికలు తిరిగింది.

"క్షమించడానికే ముందత్తయ్యా! నేను చేసింది పొరపాటేగా" శిల్ప సోఫాలోంచి లేచి అత్తగారి పాదాలకు నమస్కరించింది.

"నువ్వలా వంగకూడదమ్మా! ఈరోజు మొదలు నువ్వేపని చెయ్యకు. హాయిగా విశ్రాంతి తీసుకో. నాకు వెయ్యి ఏనుగుల బలమొచ్చిందమ్మా! నాకు దేముడే ప్రత్యక్షమై ఏమికావాలని అడిగితే నా మనవల్ని చూసుకుంటూ ఇంకో పదేళ్ళు బతకాలని కోరుకుంటానమ్మా" రాధాదేవి కారే కన్నీళ్ళు కొంగుతో ఒత్తుకుంది.

ఆరోజు శేఖర్ అర్థరాత్రి దాటాక యింటికి వచ్చాడు. శిల్పా, రాధాదేవి కూడా అతని కోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు.

శేఖర్ భోంచేస్తుంటే రాధాదేవి పక్కనే కూర్చుంది. శిల్ప లేనిటపిక తెచ్చుకుని కొసరి కొసరి వడ్డించింది.

జ్యోత్స్నాభిసారికలా తెల్లని వలువలతో తెల్లని మాలలతో శిల్ప అలంకరించుకుంది. ఎగసిపడే హృదయంతో గదిలో అడుగు పెట్టింది. శేఖర్ తలెత్తి ఆమెవైపు చూసి తిరిగి చూపులు మరల్చుకున్నాడు.

పాలపొంగులాంటి శిల్ప ఉత్సాహం మీద నీళ్ళు జల్లి నట్లయింది. అయినా మనసులోని మాట తొందర చేసింది. మెల్లిగా అడుగులు వేసి మంచం మీద అతనికి దగ్గరగా కూర్చుంది.

"మీరు... మీరు... తండ్రి... "వసంతారంభంలో కొత్త కోయిలలా ఆమె కంఠం పలికింది.

"తెలుసు! మా అమ్మ చెప్పింది" ఆమె మాట పూర్తి కాకుండానే శేఖర్ కంఠం ఖంగుమంది.

"ఏడు నెలల్లో మన బాబు మన ఒడిలో ఉంటాడు" అతని మాటలు పట్టించు కోకుండా పలికింది.

"బాబూ లేడు గీబూలేడు అప్పుడే పిల్లలవసరం లేదు. పొద్దుటే డాక్టర్ దగ్గరకెళ్ళి అబార్షన్ చేయించుకో" పెద్దపులిలా గాండ్రించాడు.

లేడి పిల్లలా బెదురుతున్న శిల్ప శరీరం రోజూలాగే శేఖర్ ఆక్రమించుకోబోయాడు.

శిల్ప పగబట్టిన ఆడు త్రాచులా అతన్ని పక్కకు తోసింది. జరజర నడుచుకుంటూ పక్కగదిలోకి వెళ్ళి తలుపులు పెట్టుకుంది.

శేఖర్ కోపంతో ఊగిపోయాడు. శిల్పను ఏమీ చెయ్యలేక తలుపులు మూసుకుని ముసుగెట్టుకు పడుకున్నాడు. ధైర్యం చేసి శేఖర్‌ని తప్పించుకున్న శిల్ప పరిపరివిధాల ఆలోచించింది.

"ఈ దేశంలో నాలాంటి నిర్భాగ్యపు తల్లులెందరో ఉన్నారు. అందరిలా నేను కాకూడదు. ఇటువంటి తల్లులకు భర్త నెదిరించే ధైర్యం కావాలి. ఎదిరించే శక్తి కావాలి. కోరలుపీకే చాతుర్యం కావాలి. ఒకనాడు ధైర్యం చేసి ఉంటే నాకీ కష్టాలుండేవి కావు. రాత్రి నాలుగు గోడల మధ్య చీకటి గదిలో శరీర భాగాలు తడిమే ఆ చెయ్యి పగలు ఆదరించదు. భార్యాభర్తలు శారీరక, మానసిక సుఖాలను సమానంగా పంచుకోవాలని తెలీదు. ఈసారి నేను ధైర్యం తెచ్చుకోకపోతే నాగర్భంలో పెరిగే శిశువు నాశనమై పోతుంది" శిల్ప శేఖర్‌కి దూరంగా ఉండాలని నిశ్చయించుకుంది.

ఎప్పుడూ లేవని శేఖర్ ఆరోజు 7గం.లకే లేచాడు.

"శిల్పా" అతని కంఠం ఖంగుమంది.

"హాస్పిటల్‌కి నడు"

"నేరాదల్చుకోలేదు" శిల్ప మొండిగా సమాధానమిచ్చింది. కోపం పట్టలేని శేఖర్ చెయ్యిపైకెత్తాడు. శిల్ప దూరం జరిగింది.

కోపంతో మండిపోతున్న శేఖర్ శిల్పను ఒక్కతోపుతోసాడు. "అమ్మా!" అంటూ శిల్ప వెళ్ళి కుర్చీ మీద పడింది. పొట్ట చేత పట్టుకుని బాధతో మెలికలు తిరిగింది. వెంటనే హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళింది రాధాదేవి. శిల్ప నాలుగు రోజుల తర్వాత ఇంటికి వచ్చింది.

పాలిపోయిన ముఖంతో అచేతనంగా మంచం మీద పడిఉన్న శిల్పను చూసి రాధాదేవి భోరున ఏడ్చింది.

"అమ్మా శిల్పా! నేను చాలా తప్పుపని చేసాను. ఆరోజే నిన్ను రఘుతో పంపిఉంటే ఈ ఘోరం జరిగేది కాదమ్మా! నేనూ అందరి లాంటి మనిషినే. నా స్వార్థానికి నిన్ను బలిచేసానమ్మా! నా తప్పు సరిచేసుకునే అవకాశం నాకియ్యమ్మా" రాధాదేవి శిల్ప రెండు చేతులు పట్టుకుని బతిమాలింది.

"ఒకనాడు రఘూ నామనస్సు నిండా వెన్నెల్లా పరచుకున్నాడు. కాని ఈ నాడు నామనస్సులో రఘూ లేడత్తయ్యా" శిల్ప ఈ మాటలు పైకనలేకపోయింది.

"కొన్ని తప్పులు సరిచేసుకునేవి కావత్తయ్యా! కాలంతోపాటు ముందుకు నడుస్తూనే ఉంటాయి" కంఠం బొంగురుపోయి శిల్ప మాట్లాడలేకపోయింది. అంతలో శేఖర్ లోపలకి వచ్చాడు.

"శేఖర్! నువ్వు చేసిన పనికి శిల్ప జీవితం సర్వనాశనం అయింది. ఇంక పిల్లలు పుట్టే అవకాశమే కోల్పోయిందిరా"

"పీడా విరగడయింది. సుఖంగా ఉండమను"

"శేఖర్! ఆమెను ఓదార్చడం పోయి ఇవా నీమాటలు? నీ కోసం శిల్ప జీవితం సర్వనాశనం చేసామురా? మీనాన్న యిలా చేసి ఉంటే నువ్వు పుట్టే వాడివి కాదురా"

"నువ్వు నన్నుకని పంచి ఉద్ధరించిందేమిటి? నువ్వు నన్ను కనకుండా ఉంటే బాగుండేది" శేఖర్ విసురుగా లోపలకి వెళ్ళిపోయాడు.

ఆ మాటలకి రాధాదేవి ఉలిక్కిపడింది.

"శేఖర్ మనిషికాదు. కనీసం జంతువుకూడా కాదు. వాటికి కూడా పిల్లల మీద ప్రేమ ఉంటుంది" శిల్ప చీదరించుకుంది.

శిల్ప క్రమంగా కోలుకుంది. రాధాదేవి ఆరోగ్యం క్రమంగా క్షీణించడం మొదలు పెట్టింది.

"శిల్పా నేను ఇదిగో అదిగో అన్నట్టున్నాను. ఈ శరీరం నేలరాలకుండానే నీ జీవితం బాగుపడాలి. నువ్వు ఆనందంగా కనబడితే తప్ప నా ఆత్మకి శాంతి లేదు. నువ్వు రఘూని వెతుక్కుంటూ వెళ్ళిపో అమ్మా"

"ఆ రఘూ ఎప్పుడో పెళ్ళి చేసుకున్నాడత్తయ్యా" శిల్ప మాటలు ఆవిడకు చెప్పలేకపోయింది.

"ఇప్పుడవన్నీ ఎందుకత్తయ్యా" శిల్ప ఒక చిరునవ్వు నవ్వింది. శిల్ప అలా ఎందుకు నవ్విందో ఆవిడ అర్థం చేసుకునే స్థితిలో లేదు.

ఆవిడ చేయి చాచింది. శిల్ప ఆవిడ చేతిలో చేయివేసింది. ఆవిడ కళ్ళు మూతలు పడ్డాయి. శిల్ప అచేతనంగా కూర్చుండి పోయింది.

శేఖర్ తల్లి చనిపోయిందని తెలిసి యింటికి వచ్చాడు. తల్లి శవాన్ని చూసి వెక్కి వెక్కి ఏడవలేదు. శిల్పను పలకరించలేదు. రాధాదేవి దహన సంస్కారాలు పూర్తి చేసాడు.

ఆటో వచ్చి గుమ్మంలో ఆగింది. శిల్ప తాళాలు తీసి శేఖర్ ముందు పెట్టింది.

"శేఖర్ నువ్వెంత అవమానించినా ఊరుకున్నాను. కాని నా కడుపు మీదే దెబ్బకొట్టావు. అందుకే నిన్ను క్షమించలేక పోతున్నాను. నన్ను క్షమించు" శిల్పగొంతు విని శేఖర్ ఆశ్చర్యపోయాడు. క్షమించమని అడగలేకపోయాడు.

డ్రైవర్ శిల్ప సామాను ఆటోలో పెట్టాడు.

"అమ్మా! లక్ష్మీదేవిలా తిరిగేదానివి! ఈ యింటిని వదలి వెళ్ళిపోతున్నావా అమ్మా" డ్రైవర్‌వెక్కివెక్కిఏడ్చాడు

"నీపాటి హృదయం ఈ యింటి యజమానికుంటే ఎంత బాగుండేది. ఒక వ్యక్తి మూర్ఖత్వం వల్ల అజ్ఞానం వల్ల ఎన్ని హృదయాలు విలవిల్లాడుతున్నాయో? ఆ వ్యక్తికి మాత్రం తెలియడం లేదు" శిల్ప మనస్సు మధనపడుతూనే ఉంది.

"రాములూ! నువ్వలా బాధపడితే ప్రయోజనం లేదు. ఈ ఇంటిని జాగ్రత్తగా చూసుకోవలసిన బాధ్యత ఇంక నీ మీదే వుంది. నువ్వు ధైర్యంగా ఉండాలి"

"వయసులో చిన్నదానివైనా పెద్ద మనసుతో చెప్పవమ్మా" రాములు చేతులు జోడించాడు.

రాములు చూడకుండా శిల్ప కళ్ళు తుడుచుకుంది.

శిల్ప ఉద్యోగంలో చేరుతోందని, లేడీస్ హాస్టల్‌కి వెడుతోందని వీధి వాకిట్లో వికసించిన ఎర్రగులాబీకి తెలిసినట్లుంచి చిరునవ్వుతో శిల్పకు వీడ్కోలు చెప్పినట్లు అటు ఇటు ఊగింది.

శిల్ప గులాబీకి చేయిఊపింది. ఆటో ముందుకు కదిలింది.

శేఖర్ ముఖం పూర్తిగా వాడిపోయింది.

# చిరుజల్లు

శీలా సుభద్రాదేవి

"పిల్లి పిల్లలను తిప్పినట్లు ఈ సామాన్లు పట్టుకొని ఇలా అద్దిళ్ళు తిరగడం ఎన్నాళ్ళో? ఎప్పటికైనా స్వంతయింట్లో ఇలా సామాన్లు సర్దుకునే రోజు వస్తుందో లేదో" అనుకొంటూ అద్దెయిళ్ళల్లో పడ్డ అవస్థలు గుర్తు తెచ్చుకొంటూ వంటింట్లో సామాన్లు సర్దుతున్నాను.

అంతలో బాబు మంచినీళ్ళంటూ వచ్చాడు.

"ఒక్క నిమిషంరా. ఈ డబ్బాలు అల్మారాలో సర్దడం అయిపోతే చేతులు కడుక్కొని పక్కవాళ్ళింట్లో నీళ్ళు అడుగుదాం. లేకపోతే అక్కా నువ్వూ వెళ్ళి పక్కవాళ్ళని అడిగిరండి" అని పెద్ద గిన్నె యిచ్చి పంపాను.

పిల్లలు మోసుకొని రాలేరనేమో పక్కయింటామె తానే బిందె తీసుకొని వచ్చింది.

"అయ్యయ్యో మీరు తీసుకొచ్చారెందుకండీ. ఆ గిన్నెతో యిస్తే సరిపోయేదిగా" అని నొచ్చుకొంటూ బిందె అందుకొన్నాను.

"దానికేముందండీ. రాత్రివరకూ సరిపోవాలి కదా అని తెచ్చాను. మీరు ఈరోజు వస్తారని తెలిసి నీళ్ళు ఎక్కువ పట్టి ఉంచాను." అంటూ కలుపుగోలుగా మాట్లాడేసరికి నాకు ప్రాణం లేచొచ్చింది. కొత్తచోట. మాట కలిసే వాళ్ళు దొరికేసరికి ఎన్నాళ్ళు పడుతుందో అనుకున్నాను. అదేమాట ఆమెతో కూడా అన్నాను.

కాసేపు అక్కడ వసతుల గురించీ, నీళ్ళు రోజూ ఎప్పుడొస్తాయో, కూరలూ, వెచ్చాలూ ఎక్కడకొంటే బాగుంటాయో అన్నిటి గురించీ వివరాలు కనుక్కున్నాను.

వాళ్ళ పనిమనిషిని మాయింటికి కూడా పంపమని చెప్పాను. అంతలో వాళ్ళపాప నాన్నగారు పిలుస్తున్నారని పిలిచేటప్పటికి కొత్త పొరుగామె - అంటే జానకి "ఏమన్నా కావాలంటే మొగమాట పడకుండా పిల్లల్ని పంపండి" అని చెప్పి వెళ్ళింది.

అప్పుడే స్నేహితురాల్ని సంపాదించేసినట్లున్నావే" అన్నారు శ్రీవారు. ఆవిడ వెళ్ళిన తర్వాత గాస్‌స్టౌని గట్టుమీద పెట్టటానికి వచ్చినపుడు.

నేను తలూపుతూ నవ్వాను.

"అన్నట్లు ఏమండోయ్! తెల్లవారుజామున 2 గంటల నుండి అయిదింటి వరకూ వస్తాయట నీళ్ళు అసలే మూడిళ్ళకీ ఒకటేకొళాయి. ఈ రాత్రికి హోటలు నుండి కారియరు తీసుకొచ్చేయండి. ఈ సర్దుకోవటాలు అయ్యాక మళ్ళీ వంట చేయటం నావల్లకాదు. అదీగాక రాత్రికి తొందరగా పడుకుంటేగానీ తెల్లవారుజామున తొందరగా లేవలేము" అన్నాను.

"అలానేలే" అన్నారు శ్రీవారు.

ఆరాత్రి అలసిపోయి నిద్రపోయినా బయట నీళ్ళ అలికిడికి తొందరగానే లేచాను.

అప్పటికే జానకీ వాళ్ళూ నీళ్ళు నింపేసుకున్నట్లున్నారు. నేను రాగానే "మీరు నీళ్ళు నింపుకోవటం అయ్యాక సంప్‌కి కనెక్షను పెట్టేయండి. వాడుకలకి ఉపయోగించుకోవచ్చు" అని చెప్పి వెళ్ళిపోయింది.

మేము నీళ్ళు నింపుకుంటుండగానే మూడో యింటాయన వచ్చి ఓ రెండు బిందెలు నింపుకొని వెళ్ళాడు.

నీళ్ళపని అయ్యాక మళ్ళీ వచ్చి కాసేపు పడుకున్నాను.

ఇల్లు సర్దుకోవడం, పనిమనిషిని మాట్లాడుకోవటం అన్నీ పూర్తయ్యాయి. నేను పెట్టిన వారం రోజుల సెలవు కూడా పూర్తయింది.

ఆరోజు వంటా, భోజనం అయ్యాక శ్రీవారు ఆఫీసుకి వెళ్తుంటే నేను వాకిట్లోకి వచ్చాను. యథాలాపంగా మూడో యింటివైపు చూశాను.

వాళ్ళపనిపిల్ల కాబోలు గుమ్మం దగ్గర నిలబడి చూస్తోంది. "ఇలారా" అన్నట్లు తల ఊపాను. ఆపిల్ల రాబోయింది. అంతలో ఇంటాయన పిలిచిన కేక వినబడే సరికి మళ్ళీ వెనక్కివెళ్ళిపోయింది.

ఆయింట్లో ఏ సమయంలోనూ కూడా అలికిడి వినిపించడం లేదు. ఆ పిల్ల కూడా ఎవరితోనూ కబుర్లు పెడుతుండగా చూడలేదు. ఇంటాయన మాత్రం అప్పుడప్పుడు కనిపిస్తున్నాడు. ఇంకా ఎవరన్నా ఇంట్లో ఉంటారో లేదో ఈవారం రోజుల్లోనూ నేను కూడా అంతగా గమనించలేదు.

అంతలో జానకి బయటికి వచ్చి "పనయిందా" అంటూ పలకరించింది. "అయిందం"టూ ఆమెని రమ్మన్నాను.

"ఇప్పుడే ఆయన ఆఫీసుకు, పిల్లలు స్కూలుకీ వెళ్ళారు" అంటూ తలుపు దగ్గరికి చేరేసి వచ్చింది.

"మీరు ఉద్యోగం చేస్తున్నారని విన్నాను. వెళ్ళటం లేదా" అంది జానకి.

"అవునండీ. సెలవు పెట్టాను. ఎల్లుండి సోమవారం నుండి వెళ్ళాలి" అంటూ అవీ ఇవీ మాట్లాడుతూ మధ్యలో "అన్నట్లు ఆ మూడో యింట్లో ఏమీ అలికిడే ఉండదు. ఆయన ఒక్కడే ఉంటాడా" అన్నాను.

"లేదు. అతని భార్య కూడా ఉంది. ఇంట్లోనే ఉంటుంది. ఎవరితోనూ మాట్లాడదు. నేను ఒకటి రెండుసార్లు మాట్లాడబోతే కూడా ముక్తసరిగా సమాధానం చెప్పి వెళ్ళిపోయింది. వాళ్ళు వచ్చి రెణ్ణెల్లు దాటింది. ఆవిడకి గర్వమేమో మరి బయటకే రాదు. అన్నీ అతనే చూసుకుంటాడు. భార్యాభర్తలే ఉంటారు. పనిపిల్లని వాళ్ళూరినుండి తెచ్చుకున్నారట. ఆపిల్లని కూడా బయటికి పంపరు" అంది.

నాకు ఆశ్చర్యం అనిపించింది. "గర్వం దేనికి" అన్నాను.

"ఏమో! మరి మహారాణిలా బయటకే రాకుండా ఉంటుంటే అనుకున్నాను. ఆమధ్య శ్రావణ మాసంలో పేరంటానికి పిలిస్తే కూడా రాలేదు.

"ఒకవేళ ఏదైనా జబ్బేమో" ఆలోచనగా అన్నాను.

"అయితే అయ్యుండొచ్చు. మాపిల్లలు ఆడుకుంటూ సెలవు రోజుల్లో వాళ్ళ కిటికీ వైపు వెళ్తే ఆమె పడుకుందని అటువైపు రావద్దని ఆయన అనేవాడట." అంతకన్నా ఆమె గురించి ఏమీ తెలియలేదు.

జానకికీ నాకూ బాగానే స్నేహం పెరిగింది. వాళ్ళ పిల్లలూ, మాపిల్లలూ కూడా కలిసి ఆడుకుంటున్నారు.

ఆ పరిసరాలకి మెల్లగా అలవాటు పడిపోయాము. అయితే నాకు ఉదయం అంతా వంట హడావుడి, ఆఫీసు. సాయంత్రం వచ్చాక మళ్ళీ పని. వీటితో తీరిక దొరకకపోవటం వలన మళ్ళీ మూడో యింటామె ఎలా ఉంటుందో కూడా తెలియకుండా మరో పదిరోజులు గడిచిపోయాయి.

ఒక ఆదివారం మధ్యాహ్నం భోంచేసి పేపరు పట్టుకొని నడుం వాల్చాను. అంతలోకే మూడో యింటి పనిపిల్ల మా యింట్లోకి పరిగెత్తుకుంటూ వచ్చి "మా అమ్మగారు పడిపోయారు. ఒక్కసారి రండమ్మా" అంటూ ఏడవటం మొదలెట్టింది.

"జానకి అంటీని పిలుచుకురమ్మ"ని పిల్లల్ని పంపి నేను ఆ మూడో పోర్షను వైపు కదిలాను. వెళ్తూ వెళ్తూ "మీ అయ్యగారు లేరా" అని ఆ పిల్లని అడిగాను.

"అయ్యగారు పెళ్ళికి వెళ్ళారు. అమ్మ ఒక్కరే ఉన్నారు" అంది.

గదిలో అడుగుపెట్టాను. గదిలో వెల్తురు కాస్త తక్కువగా ఉంది. లోపల మంచంమీదే ఫిట్ వచ్చినట్లుంది. బిగుసుకు పోతున్నట్లుగా కొట్టుకుంటూ ఉంది ఆమె.

పనిపిల్లని గ్లాసుతో నీళ్ళు తెమ్మని చెప్తే తెచ్చింది. నీళ్ళు ముఖం మీద చిలకరించి తుడుస్తున్నాను. జానకి వచ్చి మళ్ళీ వెళ్ళి గ్లాసుతో వేడివేడి పాలు తీసుకొచ్చింది. పాలు చెమ్చాతో తాగించాం. చేతికి తాళాలగుత్తి యిచ్చాం. ఉల్లిపాయ చితక్కొట్టి వాసన చూపించాం. పనిపిల్ల అరికాళ్ళు రుద్దుతూ కూచుంది. ఇలా మాకు తోచిన ప్రథమ

చికిత్సలు చేస్తుంటే ఓ అయిదు నిమిషాలకి సర్దుకున్నట్లయింది. కానీ యింకా మగతగానే అలసటగా పడుకుందామె. ఏదో సేవలు చేస్తున్నానే కానీ మనసులో ఉద్వేగాన్ని నేను తట్టుకోలేక పోతున్నాను.

కొంతసేపటికి ఆమె కళ్ళు తెరిచింది.

"రజనీ ఏమిటిది? ఇలా అయిపోయావేమిటి? అసలు నువ్వు నిజంగా రజనీవేనా?" గొంతు బొంగురుపోయి నాకు మాట పెగలట్లేదు.

ఎన్ని సంవత్సరాలుగానో ఘనీభవించి పోయిన దుఃఖం ఒక్కసారిగా కరిగి పోయిందేమో ఆమె నా ఒళ్ళో తలపెట్టుకొని ఏడవటం మొదలెట్టింది. జానకి ఆశ్చర్యంగా చూసింది.

నన్ను నేను సంబాళించుకొని రజనీని ఓదార్చేను. కాసేపటికి సర్దుకొని నేను తాగిస్తున్న పాలు తాగి మౌనంగానే అలాగే కళ్ళుమూసుకొని పడుకొంది. అప్పుడు చెప్పాను జానకితో - "రజనీ నాతోపాటు కాలేజీ వరకూ చదువుకున్న చిన్ననాటి స్నేహితురాలని."

ఏవేవో ప్రశ్నలడగాలని ఉన్నా కళ్ళు మూసుకొని పడుకున్న రజనీని అడగలేక ఊరుకున్నాను. అంతలో రజనీ భర్త వచ్చాడు. పనిపిల్ల ద్వారా విషయమంతా తెలుసుకొని కృతజ్ఞతలు చెప్పబోయాడు.

"రజనీ నా స్నేహితురాలండీ. పక్క పక్కనే ఉండి కూడా తెలియకుండానే యిన్ని రోజులూ గడచిపోయాయి" అన్నాను.

నిద్రపోతున్నట్లున్న రజనీని డిస్టర్బ్ చేయటమెందుకని "రజనీ లేస్తే చెప్పండి నేను మళ్ళావస్తాను" అని లేచాను. నాతో బాటు జానకికూడా బయటకి వచ్చేసింది. అయితే బి.ఎస్సీ రెండో సంవత్సరంలో వాళ్ళ నాన్నగారికి ట్రాన్స్ఫర్అయి గుంటూరు వెళ్ళిపోయారు. ఫైనలియరు పూర్తిఅయ్యే వరకూ హాస్టల్లో ఉండి చదివింది. తర్వాత ఆమె గుంటూరు వెళ్ళిపోయింది. నేను పెళ్ళయి హైద్రాబాదు వచ్చేసాను. కొన్నాళ్ళు ఉత్తరాలు నడిచాయి. కాని నేను సంసారం, ఉద్యోగం వీటిలోపడి కాలక్రమేణా ఉత్తరాలు ఆగిపోయాయి. ఆమె పెళ్ళి జరిగినట్లు శుభలేఖ వల్ల తెలిసింది. కానీ ఆ తర్వాత విషయాలు, వాళ్ళాయన ట్రాన్స్ఫర్లతో ఏ ఏ వూళ్ళు తిరిగిందో, చివరికి ఎప్పుడు ఆమె హైద్రాబాదు వచ్చిందో అవేవీ నాకు తెలియదు. ఇప్పుడు ఇలా కలుసుకోవటం నిజంగా ఆశ్చర్యం. ఆమె పరిస్థితికి దుఃఖం అన్నీ కలగలసిపోతున్నాయి" అన్నాను జానకితో.

ఇంటికి వచ్చాక శ్రీవారితో ఈ విషయాలన్నీ చెప్పాను.

రజనీ ఎందుకిలా అయిపోయిందన్నది నా ఊహకి అందటం లేదు. ఆరాత్రి మరోసారి చూడటానికి వెళ్లాను. రజనీ ముఖం తేటగానే ఉంది. ఎక్కువ ఏమీ మాట్లాడలేదు. రజనీవాళ్ళ అమ్మానాళ్ళూ ఎక్కడున్నారు? వాళ్ళ అన్నా, అక్కల విశేషాలు తప్ప రజనీ కుటుంబ విషయాలు డైరెక్టుగా అడగలేక కాసేపు మాట్లాడి రెండు మూడు రోజుల వరకూ రావటం కుదరదనీ, పెళ్ళికి విజయవాడ వెళ్తున్నామని చెప్పి వచ్చేశాను.

నాలుగోరోజు ఉదయం రైలు ఆలస్యంగా రావటం వలన హడావుడిగా తయారై ఆఫీసుకి వెళ్ళిపోయాను.

అదేరోజు సాయంత్రం బస్‌స్టాపులో రజనీ భర్త కనిపించాడు. నన్ను చూడగానే గుర్తుపట్టి నాదగ్గరికి వచ్చాడు. "మీకోసమే చూస్తున్నాను మీతో కొంచెం మాట్లాడాలి. కొంచంసేపు ఉంటారా" అన్నాడు.

ప్రశ్నార్థకంగా చూశాను.

"రజనీ గురించి మీతో మాట్లాడాలి" మొహమాటంగా అన్నాడు.

"అలాగే .... చెప్పండి" అన్నాను.

సాయంత్రం ఆఫీసులు విడిచి పెట్టే టైమ్ కావటాన బస్‌స్టాపు కిటకిటలాడిపోతోంది.

"మీకభ్యంతరం లేకపోతే ఎదురుగా ఆ హోటలులో కాస్త కాఫీ తాగుతూ మాట్లాడుకుందాం" అన్నాడు.

సరేనని హోటలువైపు నడిచాను. అతనూ వెంటే వచ్చాడు.

కాఫీలకు ఆర్డరిచ్చి, అవి యింకా రాకుండానే ఆయన చెప్పడం మొదలెట్టాడు.

"మొన్న మీరు వచ్చివెళ్ళాక రజనీ చెప్పింది, మీతో స్నేహం గురించి. రజనీని వాళ్ళ అక్క పెళ్ళిలో చూసి ఆమెనే కావాలని ఇష్టపడి మరీ పెళ్ళిచేసుకున్నాను. అయితే మొదటిసారి నెలతప్పినపుడు, పుట్టబోయేది పాపో, బాబో తెలుసుకోవాలనే కుతూహలంతో సరదాగా స్కానింగు చేయించాము. అదే మేము చేసిన తప్పు. స్కానింగులో ఆడపిల్లని తెలిసింది. ఈ విషయం తెలిసిన బంధువులు కొందరు మా వంశ చరిత్రలన్నీ తోడి ఎవరికీ మొదటి సంతానం ఆడపిల్ల లేదనీ, మొదట ఆడపిల్ల పుడితే అరిష్టం అనీ, అంతకు ముందు ఎవరెవరికి ఎలాంటి దుర్ఘటనలు జరిగాయో ఉదాహరణ పూర్వకంగా చెప్పి అమ్మ బుర్ర తినేశారు. దాంతో ఆమె కూడా అబార్షన్ చేయిస్తే బాగుండును అనేది -.. "

అంతలో సర్వర్ వచ్చి కాఫీ పెట్టి వెళ్ళాడు.

"కాఫీ తీసుకోండి" అని కాఫీ కప్పు నాముందుకి జరిపి మళ్ళీ మొదలు పెట్టాడు.

ఆఫీసులో కూడా నా స్నేహితులు ఇద్దరు ముగ్గురు అదే విషయాన్ని నమ్మించారు. దాంతో నాలో నాకు తెలియకుండానే అంధ విశ్వాసం చోటు చేసుకుంది. దానికి బానిసనై పోయాను. రజనీ పట్ల నా ప్రేమని మించిన ఏ పశువు నాలో ప్రవేశించిందో, అమ్మ మాట తీసేయలేక అబార్షను చేయించుకోమని ఒత్తిడిచేసి అలా చేయించాను..."

నాకు కాఫీ చేదుగా అనిపించి మింగుడు పడలేదు. అలానే మౌనంగా వింటున్నాను.

"... తర్వాత మరో ఏడాదిలోపునే మరోసారి నెలతప్పినా నిలవలేదు. ఇంకోసారి కూడా అట్లానే అయింది. అంతకంతకూ ఆమె ఆరోగ్యం పాడయింది. పరీక్షలు చేయిస్తే

గర్భంలో ఇన్‌ఫెక్షను వచ్చిందని అన్నారు. అందువలన యూట్రస్ తీయించవలసి వచ్చింది. మరికొన్ని రోజులకి అమ్మకూడా పోయింది. ఆ తర్వాత రోజురోజుకీ రజనీ పరిస్థితి దిగజారినట్లయి పోయింది. ఎందరు డాక్టర్లనో చూశాము. సిటీ మధ్యలో ప్రశాంతత ఉండదని ఇలా ఇక్కడ అద్దెకి దిగాము. కానీ ఈమె పరిస్థితిలో మార్పులేదు. ఈమె పరిస్థితి అందరికీ తెలిస్తే ఎగతాళి చేస్తారేమోనని నలుగుర్లోకి వెళ్లదు. ఎప్పుడెలా ఉంటుందోనని జాగ్రత్తగా కాపాడుకొంటున్నాను. కానీ ఒక్కమాట కూడా మాట్లాడదు. రాత్రిళ్ళు నిద్రపోకుండా అలానే కూచుంటుంది. అందుకని డాక్టరు నిద్రమాత్ర వేయమని రాసారు. అది వేస్తుంటే రోజంతా మగతగానే మన్నుతిన్న పాములా ఉండిపోతుంది. అయితే ఆరోజు మీరు ఆమెని కలిసిన తర్వాత ఆమెలో కదలిక కనిపించింది. ఈమూడు రోజులూ మీగురించి అప్పుడప్పుడు ఏదో చెప్తూనే ఉంది. అందువలన మీకు వీలున్నప్పుడు, సాధ్యమైనంతవరకూ తరచుగా ఆమెను కలిసి మాట్లాడుతుంటే మామూలు మనిషి అవుతుందేమోనని ఆశగా వుంది. అయితే ఈ విషయాలు నేను మీకు చెప్పినట్లుగానీ, మీకు తెలిసినట్లుగానీ ఆమెకు తెలియనీయవద్దు. ఆమె తనంతటతానే చెప్తే మనసు తేలికై మామూలు మనిషి అవుతుందేమో. నేను చేసిన తప్పు నన్ను కృంగదీస్తోంది. ఆమె అయినా నాకు దక్కితే కొంత మనశ్శాంతి కలుగుతుందేమో " గొంతు భారమై రుమాలుతీసి ముఖం తుడుచుకున్నాడు.

అంతమనిషీ అలా మనసులోనే కృంగిపోయి ముద్దయి పోతుంటే అంతకు ముందు కలిగిన కోపాన్ని మింగుకొని ఏం మాట్లాడాలో తోచక మౌనంగా ఊరుకున్నాను.

అంతలో సర్వరు బిల్లు తీసుకొచ్చాడు.

'నా స్నేహితురాలు మామూలు మనిషి అవుతుందంటే నాకూ సంతోషమే" అంటూ బయల్దేరుదాం అన్నట్లు లేచాను.

ఆరోజు నుంచీ ఆఫీసయ్యాక సాయంత్రం పూట వీలయినప్పుడల్లా రజనీతో కబుర్లు చెప్పేదాన్ని.

ఒకరోజు అలాగే కబుర్లు చెప్పుకొంటూ "అన్నట్లు ఈరోజు రేడియోలో లలితగీతాలు వస్తాయికదా పెట్టలేదేమిటి?" అన్నాను.

"ఈగీతాలూ, ఈరాగాలూ నేను వినలేను" అంది రజనీ.

"అదేమిటి? అంత పిచ్చిగా పాటలు వినటం, పాడటం చేసేదానివి. ఇప్పుడు మానేశావా? ఒకరోజు నీచేత పాడించుకోవాలి అని నేను అనుకొంటుంటే. ఎంతకాలమైందో నీ పాట విని" అన్నాను.

ఒక్కసారిగా రజని సముద్రం పొంగినట్లు, ఉప్పెన వచ్చినట్లు నావళ్ళో తలపెట్టుకొని ఏడవటం మొదలెట్టింది. గుండెల్లో గూడు కట్టుకున్న దుఃఖం అంతా కరిగిపోతేనే మంచిదని ఆమె చేతిని ధైర్యం చెపుతున్నట్లుగా ఒత్తుతూ ఉండిపోయాను.

కొంతసేపటికి దుఃఖం తగ్గి తనకుతానే అంతకుముందు ఆమె భర్త చెప్పిన విషయాన్నే ఒకటొకటిగా పూసగుచ్చినట్లుగా చెప్పసాగింది.

అంతా చెప్తూ - "ఇప్పుడు చెప్పు నేనీ శిక్ష ఎంతకాలం అనుభవించాలి? కాలేజీలో స్త్రీల హక్కుల మీద ఉపన్యాసాలిచ్చిన దాన్ని నేను ఎలా లొంగిపోయాను? తరతరాలుగా మన నరనరాల్లోనూ జీర్ణించుకుపోయిన బానిసత్వ మనస్తత్వం వలనా, నేను తిరగబడలేకపోయాను. అదీకాక పెళ్ళయిన కొత్తలోనే ఎదిరించి మాట్లాడితే నలుగుర్నూ ఏమనుకుంటారోనని ధైర్యంగా కాదనలేకపోయానేమో. అయినా ఇప్పుడేమనుకొనీ ఏం లాభం? దానికి ఫలితం అనుభవిస్తూనే ఉన్నాము. ఒంటరిగా బతుకుతున్నాము. నా అనే వాళ్ళుకూడా లేకుండా ఎప్పుడో పండుటాకుమై ఏ రాగాలూ, అనురాగాలూ తెలియకుండానే రాలిపోతామేమో..." అలా ఏమిటేమిటో మాట్లాడుతూనే వుంది. మధ్యలో ఆమె ఆలోచనలు మళ్ళించడం మంచిదనిపించింది.

"రజనీ!" కాస్త కోపంగా మందలించినట్లుగా ఆపాను. "ఇదుగో రజనీ అలా ఏదేదో ఆలోచిస్తావెందుకు? మేమంతా లేమా? ముందు నువ్వు మనుమల్లోకి రావటం అలవాటుచేసుకో. ఒంటరిగా ఉండటంతో విపరీతాలోచనలు చేసి ఒంటికీ, మనసుకీ అనారోగ్యం తెచ్చుకొంటున్నావు. నువ్వు ఏమీ అనుకోకపోతే నాదొక సలహా" అన్నాను.

అనాసక్తంగానే ఏమిటి అన్నట్లు చూసింది.

"ఒక పాపనో, బాబునో పెంచుకోకూడదా? నీకూ కొంత ఊరటగా ఉంటుందేమో" అన్నాను.

ఒక నిమిషం ఊరుకొని మళ్ళీ అంది "ఎవరిని పెంచుకోమంటావు? ముందు యిచ్చినా తర్వాత ఉండలేక తీసుకెళ్తామంటే. అయినా ఆ పిల్లలు కూడా నన్ను స్వంత తల్లిగా ప్రేమించగలరా" అసంభవం అన్నట్లు అంది.

"అదికాదు రజనీ! తెలిసిన వాళ్ళ పిల్లలు వద్దు. కొన్ని పెద్దపెద్ద అనాధాశ్రమాలలో రోజుల పిల్లలు కూడా దొరుకుతారు. దత్తత తీసుకొనే వాళ్ళకి వారసులు ఎవరూ లేరని తెలిసాక చట్టప్రకారమే దత్తతకి యిస్తారు. ఛంటి పిల్లలు కావటాన ఆ పిల్లలు కూడా స్వంత పిల్లల్లాగే మీకు ఒదిగి పోతారు. ఆలోచించి చూడు. నీకు యిష్టమైతే ఎక్కడన్నా ఎంక్వైరీచేసి అటువంటి ఆశ్రమాల గురించి కనుక్కుందాము" అన్నాను.

సాలోచనగా ఉండిపోయింది రజనీ.

నిజానికి ఈ విషయాన్ని అంతకుముందే ఆమె భర్తకి చెప్పి ఒప్పించాము నేనూ మా శ్రీవారూ.

ఆరోజు నేను, మావారూ రజనీ వాళ్ళింటికి వెళ్తూ పిల్లల్ని కూడా రమ్మంటే వాళ్ళు వాకిట్లో ఆడుకుంటామని అన్నారు. మేం వెళ్ళేసరికి రజనీ, వాళ్ళాయనా ఇంట్లోనే ఉన్నారు. కాసేపు కబుర్లు చెప్పి కాఫీ తీసుకొస్తానని రజనీ లోపలికి వెళ్ళినపుడు రజనీ భర్తతో ఈ విషయం మాట్లాడాము.

అనాధాశ్రమం నుండి చట్టరీత్యా తెచ్చుకొంటే బాగుంటుందనీ మాకు తెలిసిన యిలాంటి ఓ సంస్థన గురించి చెప్పాము. రజనీ కూడా మానసిక అనారోగ్యం తగ్గి

మామూలు మనిషి కావటం జరుగుతుందేమో ఆలోచించమని సలహా యిచ్చాం. మా వారు కూడా యీ విషయాన్ని కాస్త నొక్కి చెప్పారు. ఈ సలహా రజనీ భర్తకి నచ్చినట్లే వుంది. చాలాసేపు సాలోచనగా ఉండిపోయాడు.

ఆ తర్వాత "ఒకసారి డాక్టరు కూడా ఈ విషయం చెప్పాడు. రజనీ అక్క కొడుకుని కొన్ని రోజులు మా యింట్లో ఉంచుకున్నాం. కాని వాళ్ళు ఎంతకాలం యిస్తారు. వాళ్ళకి ఇద్దరే పిల్లలు. ఓ నెలరోజులు ఉంచుకొని పంపించేసాము. మీరు చెప్పిన సలహా బాగుంది. రజనీ ఒప్పుకుంటే మంచిదే. మీరే ఆ విషయం ఆమె మనసులోకి ఎక్కించండి. మీరంటే రజనీకి యిష్టం కనుక అంగీకరించొచ్చు" అన్నాడు.

ఇది జరిగి వారం రోజులైంది. ఈ వారం రోజులుగా రజనీతో ఈ విషయం ప్రస్తావించడానికి సమయం దొరకలేదు. చివరికి ఈరోజు అవకాశం వచ్చింది.

ఇంకా ఆలోచనలలో ఉండి పోయింది రజనీ.

అయితే ఇప్పుడు రజనీ స్తబ్ధంగా శూన్యంలోకి చూడటం లేదు. ఇన్నాళ్ళూ వినిపించకుండా అణిగిపోయి ఉండిపోయిన రాగాలు అనురాగ గీతికలై ఆమె ఒంటినిండా ఆక్రమించుకొని కళ్ళల్లోంచి ఉప్పొంగి పోతున్నాయి.

ఆ వెలుగు నేనేకాదు. అప్పుడే కూరల సంచి పట్టుకొని లోపలకొచ్చిన ఆమె భర్త కూడా రజనీ కళ్ళల్లో స్పష్టంగా చూడగలిగాడు.

**(భూమిక, జూలై-సెప్టంబర్, 1993)**

# కథ వంటి జీవితం

సి. వేదవతి

ఇది కథ అవునో కాదో నాకు తెలియదు! దీనిని ఇట్లాగే ఎందుకు మొదలు పెట్టాలో అంతకన్నా తెలియదు! మానవ జీవితాల్లోంచే కథలు పుట్టుకు రావాలనీ, అట్లా వచ్చినవే మంచి కథలు అవుతాయనీ చెపుతారు. జీవితం నుంచి కథలు పుట్టినట్లే, కథలను పోలిన జీవితాలు ఉండటమూ సహజమే అనిపిస్తుంది ఒక్కొక్కసారి. వచ్చిన చిక్కేమిటంటే, కథల్లో జీవితాన్ని చూడటానికి ప్రయత్నించే మనం జీవితంలోని కథల్ని చూసీచూడనట్లు, అంటీ అంటనట్లు వదలివేస్తాం.

అదుగో! అటువంటిదే ఒక కథ. అట్లా చూసీచూడనట్లు వదలివేయబడిన జీవితపు కథని ఇప్పుడు మీముందు ఉంచుతాను. ఊహూ, ఈ కథను నేను చెపుతున్నానని అనటం కంటే మా ఇంటికి మూడిళ్ల అవతల ఉన్న ఒక డాక్టరు స్పెషలిస్టు చెప్పారనటం బాగుంటుంది.

అసలు మొదటికి వస్తాను.

ఆరోజు సాయంత్రం టీ త్రాగుతూ వీధి వరండాలో కూర్చున్నాను. రోజూ ఆ వీధివెంట గేదెల్ని తోలుకెళ్లే అబ్బాయీ, మరొకతనూ రొగర్చుకొంటూ పరుగెత్తుకు వచ్చి

"వైద్యానికి కూస్తంత వేపాకు కోసుకెళతాం అమ్మా! గేదెకి ఏదో అయింది. నడుస్తూ నడుస్తూనే పడిపోయింది." అన్నారు.

కోసుకెళ్లమన్నట్లు సైగ చేసి కాంపౌండు గోడమీదుగా తొంగి చూశాను. ఎదురు వరుసలో రెండిళ్ల అవతలగా పడిఉంది గేదె. నాలుగు కాళ్లూ ఆడిస్తూ తపతపా కొట్టుకొంటూ ఉంది. చుట్టూ కొంతమంది చేరి ఎవరికి తోచిన వైద్యం వారు చెపుతున్నారు.

నాకు ఆ గేదె మీద నుంచి దృష్టి కదల్లేదు. ఏదో తెలియని బాధతో నిండు ప్రాణం గిలగిలా కొట్టుకొంటూ ఉంది. ఆ దేహంలో జీవం ఇమడలేనట్లూ, బయటకు పోలేనట్లూ కటకటలాడిపోతూ ఉంది.

ఆ గేదె అట్లా పడిఉండి నాలుగు కాళ్లూ పైకీ కిందకూ లేపుతూ బాధతో తన్నుకొంటున్నది. శరీరంలోని సర్వజీవ శక్తి గింజుకుంటూ గిలగిలలాడి పోతున్నది. ఫలానా బాధ అని అది నోటితో చెప్పలేదు! చెప్పటానికి నోరు లేదు. నోరు ఉన్నా, ఆ సమయంలో అది చెప్పగలిగేది కాదేమో! ఏదో చెప్పరాని భయంతో దాని కళ్లు బెదురుతున్నాయి.

ఆ దృశ్యాన్నీ, ఆ జంతువు పడే మూగ వేదననీ చూడలేక పోయాను. చూడవద్దనుకున్నా, చూడకుండా ఉండనూ లేకపోయాను. ప్రాణోత్క్రమణ సమయంలో జీవి ఇంతటి యాతనను అనుభవించాలా! లేకుంటే జీవికి విముక్తి లభించదా?

నేను కొన్ని మరణాలు చూచాను. చాలా ఏళ్లక్రితం మానాన్న పోయినప్పుడూ, కొన్నేళ్లక్రితం మా అమ్మ చనిపోయినప్పుడూ. ఇంకా కొందరు దగ్గరి బంధువులూ, మిత్రులూ మరణించినప్పుడూ దగ్గరే ఉన్నాను. అప్పటి జ్ఞాపకాలన్నీ ఆరని పచ్చి గాయాల్లాంటివి.

నేను చూస్తుండగానే ఒకొక్కరూ ఒకొక్క విధంగా మృత్యుదేవత ఒడిలోకి వెళ్లిపోయారు. కొందరు చివరిదశలో అపస్మారక స్థితిలో ఉండీ, కొందరు ఎంతో శారీరక బాధను అనుభవిస్తూనూ, కొందరు చనిపోబోతున్నామని తెలిసీ, కొందరు తెలియకా ఇట్లా రకరకాలుగా భౌతిక శరీరాలని విడిచి పోవటం చూచాను. కాని, ఈ అన్ని మరణాలలోనూ నేను చూచింది ఒకే సామ్యాన్ని! సమాన ధర్మాన్ని!

అదేమిటంటారా? అంతిమ ఘడియలో ఆ జీవి పడే యమయాతన! శరీర బంధం నుండి విడివడుతున్నప్పటి ఉద్ధృత వేదన!

మిత్తవ ఘడియల్లో మనిషికైనా, మరో జీవికైనా ఈ వేదనానుభవం తప్పదు కాబోలు!

నేను చూస్తూ ఉండగానే, గేదె ఒక పావుగంటసేపు తన్నుకుని తన్నుకుని నిశ్చలం అయిపోయింది.

"నా బాధ తీరిపోయింది! ఇహ మీ ఏడుపు మీరు ఏడవండి!" .... అన్నట్లు అచలం అయిపోయింది!

నాలో చాలా రోజుల నుంచీ జనన మరణాలను గురించిన ఒక తార్కికమైన జిజ్ఞాస బయలు దేరింది. జన్మించక ముందు ఈ జీవి ఎక్కడ నుంచి వచ్చేటట్లు? చనిపోయిన తర్వాత ఆజీవి ఎటు పోయేట్లు? అసలు చనిపోవడమంటే ఏమిటి? శ్వాస ఆగిపోవటమా? ప్రాణం పైకి లేచి పోవడమా? ప్రాణం అనేది శ్వాసమాత్రమేనా? లేక అదొక బ్రహ్మాత్ర పదార్థమా? ప్రాణం పోయేటప్పటి మరణయాతన అంత భయంకరంగా ఎందుకుంటుంది? కొందరు సునాయాసంగా చనిపోయినారని అంటారే! అదెలా సంభవం? పోయేటప్పుడు ఇహలోక స్మృతి ఉంటే, మనిషి మనఃస్థితి ఎలా ఉంటుంది?

ఎవరిని అడిగితే చెపుతారు? ఒకొక్క సమయంలో ప్రాణాలు పోయగలిగిన డాక్టర్లే మరొక సమయంలో ప్రాణాలు పోతుంటే ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో పడతారు. రోగంతో, మృత్యువుతో, హోరాహోరీ నిత్యమూ పోరాడుతూ ఉంటే డాక్టర్లకు నా ప్రశ్నలకు సమాధానం ఏమైనా తెలుస్తుందా?

మా ఇంటికి మూడిళ్ల అవతల కొత్తగా ఇల్లు కట్టుకుని ఒక డాక్టరుగారు చేరారు. ఆయన గొప్ప డాక్టరుగా పేరు పొందిన కేన్సరు స్పెషలిస్టు. ప్రభుత్వ కేన్సరు హాస్పిటల్లో పనిచేసి రిటైరు అయివచ్చారు. రోజూ సాయంత్రం వేళ ఇంటి వద్దనే ఆయన పేషంట్లను చూస్తారు.

పట్టిందంటే ప్రాణం తీయకుండా ఊరుకోని కేన్సర్ వ్యాధి. ఆ వ్యాధిని నయం చేసే ప్రయత్నంలో ఎంతమందినో మృత్యోన్ముఖులైన వారినీ, మృతులవుతున్న వారినీ దగ్గరగా చూచిన అనుభవజ్ఞుడయిన డాక్టర్. ఆయన నా మనస్సులోని సందేహాలకు కొంతయినా సమాధానం చెప్పగలుగుతారా అనే ఆలోచన వస్తుండేది. అయినా, ఇంతవరకూ ఆయన వద్దకు వెళ్లి మాట్లాడే చొరవచేయ లేకపోయాను.

ఆ నాటి సాయంత్రం ఆ మూగ జంతువు తన్నుకు తన్నుకు ప్రాణం విడవటం చూచినాక ఇహ ఉండలేక పోయాను.

ఆ సాయంత్రం పేషంట్లు అందరూ వెళ్లిపోయి, డాక్టరుగారు కులాసాగా తోటలో తిరుగుతున్న సమయం చూచి, వారింటికి వెళ్లి నాకు నేనుగా పరిచయం చేసుకున్నాను.

"డాక్టరుగారూ! తోచనప్పుడల్లా తెల్లకాయితాల్ని నలుపు చేస్తూ ఉండే రచయితనండీ! ఇదివరకంతా జీవితాన్ని గురించే ఎక్కువగా ఆలోచిస్తూ ఉండేదానిని. ఈ మధ్య మరణాన్ని గురించి తెలుసుకోవాలనే ధ్యాస ఎక్కువయింది. జనన మరణాలతో చాలా దగ్గర సంబంధం ఉన్నవాళ్ళు మీ డాక్టర్లు. కొంతసేపు నా ఆలోచనలని పంచుకోవాలి మీరు. నన్ను వేధిస్తున్న ప్రశ్నలకు సమాధానం మీరు తప్పక చెప్పగలరనుకుంటాను - అంటూ నా సందేహాలను ఏకరువు పెట్టాను.

డాక్టరు ఎందుకనో నావంక జాలిగా చూచారు. కేన్సరు వ్యాధి సోకిన వారికి ఆ మాట చెప్పబోయే ముందు డాక్టరు చూచే చూపులా అనిపించి నాకు ఎందుకో భయం అనిపించింది. నా మనస్సుకు కానీ కేన్సరు సోకిందని చెప్పరు కదా ఈయన!

డాక్టరూ, ఆయనతోపాటు నేనూ పచార్లు చేస్తూనే ఉన్నాము. నా ప్రశ్నలు ఆయనలోనూ అంతకు ముందు లేని ఆలోచనలు కలిగించినట్లున్నాయి. ఆ భృగుటి ముడతలోనే ఆ విషయం నాకు స్పష్టం అయింది.

"మీరు ఈ ప్రశ్నలతో నా వద్దకు రావటంలో పొరపాటు చేశారు. జీవన్మరణ రహస్యాల గురించి తాత్వికమైన వివరణ ఇవ్వగల ఆధ్యాత్మిక వేత్తల దగ్గరకో, వేదాంతుల వద్దకో మీరు వెళ్లవలసింది. డాక్టరుగా ఇన్నేళ్ల అనుభవంలోనూ, మృత్యువు గురించి నేను ఎప్పుడూ ఈ విధంగా ఆలోచించలేదు. నా దగ్గరకు వచ్చే రోగుల్ని మృత్యువు బారినుండి రక్షించడం కోసం మృత్యువుతో పోరాడటంతోనే నా సమయం గడిచిపోయింది. మృత్యువును దూరంగా తరిమేయాలని ప్రయత్నించే నేను మీకు మృత్యువును-గురించి ఏమి చెప్పగలను?"

"నేను మీవద్దకు రావటంలో పొరపాటు చేశానని అనుకోవటం లేదు డాక్టరుగారూ! వేదాంతులు చెప్పేది వాళ్లు అధ్యయనం చేసిన శాస్త్రాలలోని మాటలని వాళ్లు తత్త్వవేత్తలు అయిఉండవచ్చు. ఆధ్యాత్మిక దర్శనాచార్యులూ కావచ్చు! కాని, వాళ్లు మృత్యువుని మీరు చూచినంత దగ్గరగా చూచిఉండరు! మీ అనుభవ దృక్కోణం నుండి ఈ విషయాల గురించి చెప్పాలి మీరు! తప్పదు! మిమ్మల్నము విసిగించడానికి వచ్చానని అనుకోకపోతే!" .... అని నవ్వాను.

డాక్టరు కూడా నామాటలకు నవ్వారు. మా మధ్య జరిగిన బరువైన ప్రసంగానికి ఈ పరిహాస వాక్యం కొంత ఉపశమనం కలిగించినట్లు అనిపించింది.

"ఫ్రెండ్స్! కేన్సరు వ్యాధి గురించి స్పెషలైజు చేసిన డాక్టరుగా, నేను ఎన్నో కేసులు చూచాను. వైద్యం చేశాను. ఆపరేషన్లు చేశాను. కొన్ని కేసులు వైద్యానికి లొంగేవి. కొన్ని లొంగినట్లే లొంగి మళ్లీ ప్రజ్వలించేవి. కొన్ని చూస్తుండగానే చెయ్యిదాటిపోయేవి. కొందరు జబ్బు తగ్గి కొన్నేళ్లపాటు బ్రతికితే, కొందరికి అప్పటికప్పుడు ముంచుకు వచ్చేది వ్యాధి. ఈ రోగం వెంటే నీడలా తిరిగే మృత్యువుతో శాయశక్తులా పోరాడటమే నా విధ్యుక్త ధర్మంగా భావించాను.

కాని, మైడియర్ ఫ్రెండ్! ఒక్కవిషయం చెప్పాలి మీకు! మృత్యువు మనం అనుకునేటంత భయంకరమైనది కాదు! పుట్టుకలాగా, బ్రతుకులాగా, మామూలుగా, సహజంగా జరిగిపోయే పరిణామం మరణం! ఒక్కొక్కసారి బ్రతుకే నిర్దయగా బాధిస్తుంటే, అమ్మ ఒడి అంత చల్లగా, హాయిగా, తనలోకి తీసుకుని నిద్రపుచ్చి లాలిస్తుంది మృత్యుదేవత!

ఇప్పుడు నేను ఒక ప్రతిపాదన చేస్తున్నాను. మృత్యువు కంటే భయంకరమైనదీ, అసహ్యకరమైనదీ, దుర్భరమైనదీ మరొకటి ఉన్నది. అదేమిటో చెప్పుకోగలరా? మీరు రచయితలు కదా!"

ఉలిక్కిపడ్డాను నేను, మృత్యువు కంటే భయంకరమైనదా? ఏమిటో అది! ఆలోచనల సుడిగాలి నామనస్సు నిండా! కాస్సేపు నా సమాధానం కోసం అన్నట్లు ఆగి, తనే మొదలు పెట్టారు డాక్టర్.

"ఇప్పుడు మీకు ఒక చిన్న కథ చెపుతాను. అది కథ అనేకంటే నా అనుభవంలోని వాస్తవ ఘటన అంటే సరిపోతుంది. అది విన్న తరువాత మీరే చెపుతారు ఆ భయంకరమైన విషయమేమిటో!"

"చెప్పండి డాక్టర్!" - అన్నాను ఎంతో కుతూహలంగా.

పాతజ్ఞాపకాన్ని తవ్వుకొన్నప్పటి తాజా అనుభూతితో డాక్టర్ చెప్పడం ప్రారంభించారు.

"రోగికీ వైద్యుడికీ మధ్య ఉండే సంబంధం మరీ అంత యాంత్రికమో వ్యాపామో కాకుండా ఉండాలని నేను ఎప్పుడూ అనుకొంటూ ఉంటాను. రోగీ మనిషే! వైద్యుడూ మనిషే! వీరిద్దరి మధ్య సంబంధం రోగం, వైద్యం, డబ్బు అనే మూడు విషయాల మీద ఆధారపడి ఉండేమాట నిజమే! అంతకు మించి మనిషికీ మనిషికీ మధ్య ఉండవలసిన సత్సంబంధం కూడా వీరిద్దరి మధ్యా ఉండాలని నా ఉద్దేశం. రోగిని కేవలం రోగిగా కాక

సానుభూతితో కూడిన మానవతా ధర్మంతో డాక్టరు ఆదరణతో చూడాలి. వైద్య వృత్తిని చేపట్టినప్పటి నుండీ మనసా, వాచా, కర్మణా ఈవిధమైన దయా ప్రపూర్ణమైన ప్రవృత్తిని పెంచుకొని ఆచరించడం నా ధర్మంగా భావిస్తూ వచ్చాను.

ఏడెనిమిదేళ్ల అమ్మాయి హేమ నేను పనిచేస్తున్న హాస్పిటల్‌లో వైద్యం కోసం చేరటం నేను మరువలేని సంఘటన. ఆ అమ్మాయితో ఉండవలసిన దానికన్నా ఎక్కువ చనువును పెంచుకుంటున్నానా అని కూడా అనుకొంటూ ఉండేవాడిని అప్పుడప్పుడూ. కాని, రోగంతో అలసిపోయిన ఆ పసిముఖం, ఆ అమాయకపు మాటలు, తెలియని మమతాను బంధంతో నన్ను కట్టివేసిన మాట నిజం! ఆ అమ్మాయి నాకు 'హేమా బేబీ'గా మారిపోయే వేళకు నేనామెకు 'డాక్టర్ అంకుల్'ని అయిపోయాను!

తీరా, హేమ హాస్పిటల్ నుంచి డిశ్చార్జ్ అయి ఇంటికి వెళ్లే సమయానికి ఆఅమ్మాయి తల్లి సరోజిని చాటుగా కళ్లనీళ్ళు పెట్టుకుంది.

"డాక్టరుగారూ! డాక్టరుగానే కాకుండా ఒక తోడపుట్టిన వానిలాగా నన్నూ, నాబిడ్డనూ ఆదరించారు. ఇప్పుడు ఇంటికి పంపించి వేస్తున్నారు. ఏమయిపోవాలి మేము చెప్పండి డాక్టరుగారూ!" .... అన్నది.

"ధైర్యంగా ఉండండి సరోజిని గారూ! ఇప్పటికి చేయవలసినదంతా చేశాం. హేమను ఇంటివద్దే ఉంచుకుని మందులు వాడుతూ జాగ్రత్తగా చూచుకోవటం తప్ప ఇప్పుడు మేమైనా పెద్దగా చేసేది ఏమీలేదు. నేను పనిమీద తరచుగా విజయవాడ వరకు వస్తూనే ఉంటాను. అక్కడకు దగ్గరే కదూ మీ ఊరు? వీలున్నప్పుడల్లా వచ్చి హేమను చూస్తాను" .... అంటూ ధైర్యం చెప్పాను. ఆమె కళ్లు తుడుచుకుంటూనే తన అడ్రసు వ్రాసిన చీటీని అందించి చేతులు జోడించింది."

ఇంతవరకూ కథను ఏకధాటిగా చెప్పి, డాక్టరుగారు ఆగిపోయారు. తమ జీవితంలో చాలాకాలం క్రిందట జరిగి పోయిన సంఘటనే అయినా మనస్సుకు హత్తేట్లు ఎంత చక్కగా చెప్పారు - అనిపించింది.

"డాక్టరుగారూ! ఇంతవరకూ మీరు చెప్పిన సన్నివేశంలో కరుణరసం మాత్రమే కనిపించింది. నాకు మీరు చెప్పాలనుకున్నది ఇంకా ఏదో ఉన్నది కదా!" -అన్నాను.

"ఫ్రెండ్! మీరేదో నానుంచి తెలుసుకోవాలనే తపనతో నావద్దకు వచ్చారు. నేను మీకు ఇంకేదో చెపుతానని అన్నాను. అవునా?" .... అన్నారు డాక్టర్ గంభీరంగా!

"యస్ డాక్టర్! నేను అడిగింది మృత్యువు గురించి! అంతిమ ఘడియలలోని జీవుని వేదనను గురించి - డాక్టర్‌గా మీరు కొన్ని విషయాలు చెప్పగలరన్న నమ్మకంతో నేను మీవద్దకు వచ్చాను."

"మీకు నేను మృత్యువు కంటే కఠినమైనది మరొకటి ఉన్నదనీ దానిని గురించి చెపుతాననీ అన్నాను. అవునా?"

"అవును డాక్టర్! అంతకన్నా ముందు ఇది చెప్పండి! హేమకు ఏమయింది? క్షేమంగా ఉంది కదా!"

"హేమకు ఏమయిందో నాకే తెలియదే! మీకెట్లా చెప్పను? హేమ హాస్పిటల్ నుండీ వెళ్లిపోయిన తర్వాత ఆరు నెలల లోపునే రెండు మూడు సార్లు అటువేపు పని

ఉండి వెళ్లినప్పుడు చూచి వచ్చాను. ఆ ఆరు నెలలూ ఆ అమ్మాయి పాలిట కృష్ణపక్షమే అని చెప్పవచ్చు. అమావాస్యరాకముందే దుమారంలా లేచిన ఒకపెద్ద అపవాదు నాకాళ్లకు బంధం వేసింది. హేమను మరి నేను చూడనీయకుండా చేసింది"

"అపవాదా? అదేమిటి?" .... అన్నాను ఉలిక్కిపడి.

"ప్రేమ పేరిట స్త్రీ పురుషుల మధ్య సంబంధాల గురించి ఎడాపెడా రచనలు వచ్చేస్తున్న ఈ రోజుల్లో అపవాదు అంటే అర్థం కాలేదా మీకు? అందులోనూ రచయిత కదా మీరు! సరే! చెపుతా వినండి!

"పిల్ల జబ్బు పేరుతో ఒక ఇల్లాలు ఒంటరిగా, కొన్నాళ్లపాటు దూరదేశంలో హాస్పిటల్‌లో ఉన్నది. గవర్నమెంటు హాస్పిటల్లో డాక్టర్లు అందులో ఉన్న రోగుల్నే శ్రద్ధగా చూడరు! అటువంటిది హాస్పిటల్ నుంచి పంపించి వేసినాక ఏమి సంబంధం ఉన్నదని ఒక డాక్టర్ ఇంతదూరం వచ్చి ఉచితంగా ఈ పిల్లరోగిని చూస్తారు? తనకు ఏమి లాభం ఉందని ఈ డాక్టర్ ఇన్నిమార్లు ఇక్కడకు వచ్చి పిల్లను చూస్తున్నాడు? ఏదో తిరకాసు ఉంది! పిల్లతల్లికీ, ఈ డాక్టరుకీ ఏదో ...."

"ఇహ చెప్పకండి డాక్టర్! అర్థం అయింది!" - అన్నాను చెవులు మూసుకుంటూ.

నా తల తిరుగుతూ ఉంది. ఏదో అస్పష్టమైన వేదన గుండెకు ఎగబ్రాకినట్లయింది. మంచితనమూ, మానవత్వమూ అనే పదాలు ఈ మనుష్యుల నిఘంటువులోనే ఉండదా? దయ, కరుణ, ఆదరణ - అన్న లక్షణాలు మానవ హృదయ ధర్మాలుగా వీళ్లు గుర్తించడం లేదా? మంచి మనస్సుకు విలువ ఇవ్వడం చేతకాక పోతేమానె! దానికి ఇంత వికృతరూపం ఎందుకు దిద్దుతారు? పనిలేని పనిగా ఇట్లా నిప్పును రాజేసుకుంటూ ఎందుకు కూర్చుంటారు?

తోటి మానవుల పట్ల కాస్తంత కరుణా, ప్రేమా చూపిన నేరానికి క్రీస్తును ఎందుకు శిలువ వేశారు? మతాలు వేరయినా, మనుషులంతా అన్నదమ్ములే అన్న నేరానికి గాంధీని ఎందుకు కాల్చి వేశారు?

శారీరకంగానో, మానసికంగానో ఇతరులను హింసించటంలో కొందరు తాత్కాలికమైన ఆనందాన్ని అనుభవిస్తారు. జీవితాన్నే కథలు చేస్తారు!

మృత్యుదేవత ఇప్పుడు నాకు కారుణ్యమూర్తిగా కానవస్తున్నది. బడల, వడలిన శరీరాలకు శాంతిని ప్రసాదించే వరదాయినిగా అనిపిస్తున్నది!

ఒకరిపైన నిష్కారణంగా నిందలు మోపదు కదా మృత్యువు? సున్నితంగా, సుందరంగా, సురభిళంగా ఉండవలసిన మానవీయ అనుబంధాలను వక్రభాష్యం కూడా చెప్పదు!

చిత్రం! మృత్యువు ఇప్పుడు నాకు ఒక కఠిన సమస్యగా అనిపించడం లేదు! అంతకన్నా కఠినమైన ప్రవృత్తులు మనలో నాటుకుపోయిన వాటి మాటేమిటి?

"థాంక్యూ డాక్టర్! థాంక్యూ వెరీమచ్" .... అంటూ డాక్టరూ, ఫిలాసఫరూ కూడా అయిన ఆ స్నేహమూర్తి వద్ద సెలవు తీసుకున్నాను.

# కాపలా

డా. ముక్తేవి భారతి

"కుక్కగారి గొలుసుగారు ఊడిపోయారు. కాస్త కట్టరా - " రామలక్ష్మి గొంతు ఖంగుమంది. చదువుతున్న పుస్తకం బల్లమీద పడేసి లేచాడు రామం. ఎప్పుడయితే గౌరవవాచకం చెవిని పడిందో అప్పుడే అర్థమయింది పరిస్థితి. అందులో గొలుసుగారు అని కూడా తల్లి అనేసరికి పరిస్థితి కొంచెం డేంజర్‌లో పడిందని అర్థమవటానికి అరనిముషం పట్టలేదు రామానికి. రామలక్ష్మి ముఖం ఎప్పుడయితే ఎఱ్ఱబడిందో అప్పుడే ఇంట్లో అంతా నిశ్శబ్దం. ఇంచుమించుగా వారంలో మూడు రోజులైనా రామలక్ష్మికి ఇంట్లో అందరి మీద కోపం రాకతప్పదు. ఈ మధ్య వారంలో ఆరు రోజులూ ఇదే పరిస్థితి కారణమేమిటంటే - బిక్కీ వచ్చి అప్పటికి మూడు వారాలైంది.

బిక్కీ రావడానికి ముందు ఇంట్లో చాలా గొడవ జరిగింది. వాదోపవాదాలయ్యాయి. వాగ్దానాలు కూడా అయ్యాయి. ఇంట్లో అందరూ ఓ రాజీ మార్గానికొచ్చిన తర్వాత బిక్కీ ఇంట్లో ప్రవేశించింది.

"చాకిరీ, ఈ పిల్లలు చాలక దీన్ని నేను చూడలేను - అంత్య నిష్ఠూరంకన్నా, ఆదినిష్ఠూరమే మేలు" అంది ఖచ్చితంగా రామలక్ష్మి.

"నువ్వేం చూడక్కర్లేదు - అన్నీ మేమే చూసుకుంటాము." ముక్తకంఠంతో ఇంట్లో అందరూ అన్నారు.

అంతే. ఆ తర్వాత రెండు రోజులయేసరికి బిస్కట్లు, ప్లేటు, గొలుసు, బెల్టు - ఒకటేమిటి ఆఖరికి - ఓ మూల మంచి చోటు, పడుకుందుకు ఓ దుప్పటి అన్నీ సిద్ధమయిపోయాయి. ఒక శుభ సమయంలో గృహప్రవేశం చేసింది బిక్కీ. ఇంట్లో ఎంతో సందడి. ఎవరొచ్చినా బిక్కీ ముచ్చట్లే - ఒకళ్ళపైన ఒకళ్ళు పోటీపడి దానికి తిండి పెట్టడం, ఒళ్ళో కూచోపెట్టుకోటం - చెప్పలేనంత హడావిడి. బిక్కీ తప్ప మరో ప్రపంచం లేదనుకునే జడభరతులయ్యారింట్లో అందరూ - ఒక్క రామలక్ష్మి తప్ప!

నెలరోజులు గడిచాయి. వస్తాయి వస్తాయి అనుకున్న పరీక్షలు వచ్చేసాయి అందరూ ఎవరి గొడవలో వారు మునిగిపోయారు. స్నేహితుడింటికి వెళ్ళి చదువుకొనేవాడయితే, తలుపు తీసుకుని గదిదాటి బయటికి రానివాడు మరొకడు. ఇంట్లో వాతావరణమే మారిపోయింది.

"అరే - పన్నెండవుతోందే - " గబుక్కున పుస్తకం కింద పడేసి వంటింట్లోకి నడిచాడు రామం.

రామలక్ష్మి అన్నం తింటోంది. కాసేపు అటు ఇటు చూసాడు. "ఏం కావాలి" అంది రామలక్ష్మి.

"ఏం లేదు - బిక్కీకి అన్నం పెట్టావా అని" నసిగాడు రామం. "ఓహో ఇప్పుడు గుర్తొచ్చిందా - అది తిని గంటయింది. వెళ్ళు - వెళ్ళి చదువుకో" రామం మాట్లాడకుండా గదిలోకొచ్చేసాడు.

వాగ్దానాలు చేసిన వారంతా వాటి విషయమే మరిచిపోయారు. తెల్లారేసరికి పాలు పోయటం - తర్వాత బిస్కట్లు, తర్వాత - అన్నం ఇలా ఒక దాని తర్వాత ఒకటిగా బిక్కీ పనులన్నీ రామలక్ష్మి చేస్తోంది. గుమ్మంలో రామలక్ష్మి నిలబడితే చాలు తోకాడిస్తూ దగ్గరకొస్తుంది. కోపంగా వుంటే దానికీ తెలుస్తుంది. ఓ మూల నక్కి కూచుంటుంది. ఎవరిమీద ఏమి కోపగించినా బిక్కీని మాత్రం శ్రద్ధగా చూస్తోంది రామలక్ష్మి. రెండు నెలలు తిరిగేసరికి బొద్దుగా, ముద్దుగా తయారయింది బిక్కీ.

జ్ఞాపకమొచ్చినప్పుడు అడుగుతుంటారు ఇంట్లో అంతా - 'పాలు పోసావా, అన్నం పెట్టావా' అని. అలాంటప్పుడు రామలక్ష్మికి ఒళ్ళు మండిపోతుంది.

"అంత ప్రేమున్న వాళ్ళయితే మీరే పొయ్యలేక పోయారా - ఎలాగూ నేనే అన్నీ చూసుకుంటా కదా అని తెలిసి - గడుసుతనం!" రామలక్ష్మి మూతి తిప్పుకుంటూ లోపలకెళ్ళిపోతుంది. మరీ విసుగ్గా వున్నపుడు 'దీన్ని బయట వదిలేయండి' అంటుంది.

"నిజంగా వదిలేయనా?" పెద్దబ్బాయి అన్నాడు తల్లితో.

"ఆ వదిలేయ్"

"నిజంగానేనా?" రెట్టించాడు.

"ఏం, నన్నుద్ధరించటానికే దీన్ని తెచ్చినట్టు మాట్లాడుతున్నావే!"

"సరే, సాయంత్రం మా ఫ్రెండు వస్తాడు. ఎప్పటినుంచో కుక్కపిల్ల కావాలంటున్నాడు దీన్ని ఇచ్చేస్తాను. ప్రేమగా పెంచుకుంటాడు. ఒక మాట చెప్పనా మమ్మీ - ఇది ఇంట్లో వుంటే నీకు కొంత కంపెనీ - అదే, నీకు కాలక్షేపం."

పెద్దబ్బాయి మాటలకి విస్తుపోయింది. కళ్ళల్లో గిర్రున తిరిగాయి నీళ్ళు. ఇదా నాకు కంపెనీ! దాని మీద ఇష్టంతోటి, ఇంటికి కాపలాగా వుంటుందని తెచ్చారనుకుంది. ఇన్నాళ్ళికి - ఇప్పుడర్థమయింది అసలు విషయం.. అయినా మనింట్లో మణి మాణిక్యాలేమున్నాయని కాపలాకి? నిజమే - అది నాకు కాపలా, నేను దానికి కాపలా.

రామలక్ష్మి మాట్లాడకుండా లోపలికెళ్ళి పోయింది ఎర్రబడ్డ ముఖంతో

అమ్మకి అంత కోపం ఎందుకు వచ్చిందో అర్థంకాక తికమక పడ్డాడు అబ్బాయి.

* * *

ఆనాటి నుంచీ బిక్కీ అంటే ప్రత్యేకమైన అభిమానం ఏర్పడి పోయింది రామలక్ష్మికి. అబ్బాయి దీన్ని బయట వదిలేస్తాడేమో అనే భయం కూడా లేకపోలేదు. వదిలేస్తే దిక్కులేని అనాథలా రోడ్డున పడుతుంది. అలా కావడానికి వీల్లేదు - ఎవర్నూ చూడక్కర్లేదు. నేనే చూసుకుంటాను దీన్ని. గుమ్మంలో కూచున్న బిక్కీ అమాయకంగా రామలక్ష్మి కేసి చూస్తోంది. పాపం. నోరులేనిది. ఆ నిముషంలో ఎంతో జాలేసింది దాని మీద రామలక్ష్మికి!

అప్పుడప్పుడు పాలు పోశావా అని, అన్నం పెట్టావా అని అడిగే వాళ్ళు ఈ మధ్య అది కూడా అడగటం మానేశారు. దాని బాధ్యతంతా రామలక్ష్మిదే అనే భావం ఇంట్లో అందరికీ కలిగింది. మరో ధైర్యం కూడా వచ్చింది. ఎవరెక్కడకెళ్ళినా, ఎప్పుడొచ్చినా ఫరవాలేదు. బిక్కీ వుందిగా ఇంట్లో!

* * *

కాలం గడుస్తోంది. రామలక్ష్మికి ఇల్లే సర్వస్వం అయిపోయింది. ఎప్పుడయినా బయట కెళ్ళాలంటే బిక్కీకి పాలు ఎవరు పోస్తారు, అన్నం ఎవరు పెడతారు అనే బెంగ! - ఒక్కోసారి రామలక్ష్మికి ఇంట్లో వాళ్ళ మీదే కాకుండా లోకం మీదే కోపం వస్తుంటుంది. అలాటప్పుడు బిక్కీ దగ్గరకిపోయి కూచుంటుంది!

ఆ రోజు పెద్దబ్బాయి తల దువ్వుకుంటూ "ఈరోజు ఇంగ్లీషు సినిమా కెడుతున్నాం. నిన్ను తీసికెడదామంటే - " నసిగాడు. రామలక్ష్మి నవ్వింది. "ఏం నేను ఇంగ్లీషు సినిమా చూడకూడదా?"

"అది కాదు" అద్దంలో మరోసారి ముఖం చూసుకుని బయటికి వెళ్ళిపోయాడు పెద్దబ్బాయి.

మరో రోజు "నేనూ వస్తా మీతో" అంది రామలక్ష్మి, టై సరిచేసుకుంటూన్న రాజశేఖరంతో

"రా నీకభ్యంతరం లేకపోతే. మా ఫ్రండ్సుతో కలిసి వెడుతున్నా."

"ఏం ఫరవాలేదు, నేనూ వస్తాను." రామలక్ష్మి జుట్టు ముడి వేసుకుని గబగబా డ్రస్ చేసుకుని, చెప్పులు తొడుక్కుంది.

"నిజంగా వస్తున్నావా?"

"భయపడకండి. మీ వెంటపడి రాను - ఊరికే అన్నానంతే.

రాజశేఖరం ఒక్క నిమిషం నిలబడ్డాడు. కొంచెం బరువుగా రెండడుగులు ముందుకు వేశాడు. ఒక్కసారి వెనక్కి తిరిగి చూశాడు. బిక్కీని ఒళ్ళో కూచో పెట్టుకుని ఒళ్ళు నిమురుతోంది రామలక్ష్మి. గబగబా నడిచి ముందు కెళ్ళిపోయాడు.

* * *

ఇంట్లో మిగిలింది తను. కాదు కాళ్ళదగ్గర కూచున్న బిక్కీ కూడా. రామలక్ష్మికి నవ్వొచ్చింది ఎందుకో.

"బిక్కీ- నిన్ని ఇంటికి తెచ్చినప్పుడు కోపగించాను. విసుక్కున్నాను. కానీ ఎంత ఫూలునో చూశావా! నువ్వు ఈ ఇంటికి కాపలా. నేనూ ఈ యింటికి కాపలా. ఈ ఇంటివాళ్ళు ఎంత గొప్పోళ్ళో బిక్కీ! నిన్ను నన్ను కూడా పోషిస్తున్నారు. కాకపోతే నీ

మెడకి ఓ గొలుసు కట్టారు తప్పించుకు పోతావని, ఎవర్నన్నా కరుస్తావని. నేను అరుస్తాననుకో కరవను. నీకు ఒక్క గొలుసు బంధం, నాకు గొలుసుల గొలుసులు బంధాలు. ఎక్కడికి తప్పించుకుపోతామే మనం బిక్కీ?" రామలక్ష్మి చేతిలో వున్న బిస్కట్లు దాని నోటి కందిస్తూ అప్రయత్నంగా చూసింది గోడకేసి. పెళ్ళినాటి ఫోటో .... అబ్బ, ఎంత సన్నగా ఉందప్పుడు! ఇప్పుడో? రామలక్ష్మికి పాతికేళ్ళగతం కళ్ళముందు కదలాడింది. ఇంట్లో వాళ్ళ నెదిరించి రాజశేఖరాన్ని రిజిష్టరు పెళ్ళి చేసుకొంది. చదువుకొనే రోజుల్లో వుండే ఆదర్శాలు ఒకటి ఒకటి దూరమైపోయాక, కేవలం పిల్లల తల్లిగా, మిసెస్ శేఖరంగా మిగిలిపోయింది. అయితే మాత్రమేం!

"మమ్మీ నిన్ను అమ్మమ్మ ఊరు పంపించం. నువ్వు లేకపోతే బోర్‌గా వుంటుంది" అంటారు పిల్లలు.

రాజశేఖరం మాటలు తక్కువ మాట్లాడినా అతని మనసు నిండా ఉన్నది తనేగా! రామలక్ష్మికి గొప్ప తృప్తి మనసు నిండా నిండింది. రామలక్ష్మి గోడమీదున్న ఫోటో కేసి చూస్తోంది? వీధిలో కారు హారన్ మోగటంలో ఈ ప్రపంచంలోకి వచ్చింది.

మిసెస్ నళినీ మోహన్ కారు దిగింది.

"ఓ చిన్న పార్టీ. రేపు నువ్వు రావాలి"

"పార్టీయా?"

"ఆ. నా బర్త్‌డే పార్టీ. అన్నట్టు ఇవి నీకు చూపించాలని నిన్నటి నుంచి ఒకటే ఇదిగా వుంది నాకు." తళ తళలాడుతున్న వజ్రాల దిద్దులు.

"అబ్బ చాలా ఖరీదుంటాయేమో?"

"ఆ ముప్పయివేల పయినే. దిద్దులే కాదు, రింగు కూడా తెచ్చారు మద్రాసునించి." గలగల మాట్లాడింది మిసెస్ నళినీ మోహన్.

"వెంకటలక్ష్మికి ఫోను చేశాను. వస్తానంది. అది వచ్చేదేమిటిలే, భర్త తీసుకొస్తాడుగా. నిన్న పంతొమ్మిది వందల ఏభై పెట్టి మంచి చీర కొన్నాను. చూస్తావుగా రేపు". గలగలా మాట్లాడి, గబగబా కారెక్కింది.

రాళ్ళు, రప్పలు, చీరలు, నగలు ఇవి చూసుకు తృప్తిపడిపోతోంది. పాపం నళిని! జీవితంలో ఏం పోగొట్టుకుందో తెలుసుకోలేని వెర్రిది. విలాసాల్లో వినోదాల్లో మునిగి తేలుతూ జీవితాన్ని అనుభవించేస్తున్నాడు మోహన్ మద్రాసులో. అతని భార్యగా సంఘంలో బతికేస్తోంది నళిని.

ఎంత దురదృష్టవంతురాలో నళిని! ఎంతో జాలేస్తుంది నళినిని తల్చుకున్నప్పుడల్లా రామలక్ష్మికి.

రామలక్ష్మికి రాజశేఖరం మాటలు గుర్తొచ్చాయి వెంటనే. "సంసారం అనే సామ్రాజ్యాన్ని ఏలే మకుటం లేని మహారాణి నువ్వు" అని. నిజమే మరి. రామలక్ష్మి కళ్ళు గర్వంతో మెరిశాయి ఆ క్షణంలో

"బిక్కీ- మనమే హాయిగా ఉన్నాం మనం ఈ ఇంట్లో భాగస్వాములం. అరే, ఈ మధ్య నీకు ఇంగ్లీషులో చెప్తే కాని అర్థం కావటం మానేసింది కదూ. మనం పార్టనర్స్. ఈ ఇల్లు నువ్వు కాపలా కాయి. ఈ ఇంట్లోవాళ్ళని నేను కాపలా కాస్తాను." అవునుమరి, ఏ

వయ్యారిభామో రాజశేఖరాన్ని కొట్టేయ్యకుండా కాపలా కాసుకోవద్దూ తను! ఏ చిన్నదో అమాయకుడైన తన అబ్బాయిని వలలో వేసుకోకుండా కాపలా కాసుకోవద్దూ తను!! ఒళ్ళో వున్న బిక్కీ నల్లని కళ్ళతో రామలక్ష్మిని చూస్తూ అటు ఇటు కదిలింది - "కూర్చో. నాకు పనులు లేవనుకుంటున్నావా?" బిక్కీని కిందకి దింపివేసింది రామలక్ష్మి.

బిలబిలమంటూ నలుగురు స్నేహితుల్ని వెంటేసుకు వచ్చాడు రామం లోపలికి.

"మమ్మీ, ప్లీజ్"

"ఏమిటీ?"

"ఫైవ్ కప్స్ ఆఫ్ టీ ప్లీజ్"

"నాకు తెలియదు" రామలక్ష్మి టీ ఇస్తానందో ఇవ్వనందో తెలుసు కోకుండా ముందు గదిలోకెళ్ళి స్నేహితుల మధ్య కూచున్నాడు రామం!

తిన్నగా వంటింట్లోకి నడిచి టీ కోసం నీళ్ళగిన్నె స్టౌ మీదుంచింది రామలక్ష్మి.

**(వనిత - నవంబరు 1981)**

# పాలు పొంగే పుణ్యభూమి

డా. ముదిగంటి సుజాతారెడ్డి

" అమ్మా !-"

" ఏందిరా ?" కసిరింది ఎల్లమ్మ

ఆకలికాగలేక ఒడిలో చిన్నోడు ఏడుస్తున్నాడు. మూన్నెళ్ల చిన్నోడిని ఒడిలో వేసుకొని ఉయ్యాల ఊపుతూ ఊరడించాలని చాలాసేపట్నుంచి ప్రయత్నిస్తున్నది ఎల్లమ్మ. వాడి ఆకలి ఏడుపు మాత్రం ఆగడం లేదు.

" ఏందిరా ?- బువ్వ దింటవా ?-" వెంటనే ఎల్లమ్మ లాలనగా అడిగింది.

పెద్దోడు అడ్డంగా తలతిప్పాడు - వద్దన్నట్టుగా. వాడు ఆరేళ్ళవాడైనా మూడేళ్ళ వాడిలా కన్పిస్తాడు. కాళ్ళు చేతులు సన్నగా వున్నాయి. వాడి పెరుగుదల అంతా వాడి పొట్ట మీదే కన్పిస్తున్నది. ఆ పొట్టమీద ఆగలేక చిరుగుల లాగు కిందికి జారింది. పైన ఒంటిని కప్పే చొక్కా ఏం లేదు.

" అమ్మా !- గణేశుడూ - పాలు - తాగుతుండటనే !-" నెమ్మదిగా ఆగుతూ ఆగుతూ అన్నాడు.

" గణేశులను గా మొన్ననే గదరా ఉస్సేనుసాగరంలో పడేసిండ్రు. మల్లెక్కడి గణేశుడురా !-"

ఎల్లమ్మ చిన్నోడిని భుజంమీద తీసుకొని లేచి నిలబడింది. వాడి ఏడ్పు సాగుతూనే వుంది. వాడికి గట్టిగా ఏడ్చే శక్తి కూడా లేదు.

" వారం రోజుల్నుంచి ఆడికి పాలే సరిగ్గ లేవు. ఇగ ఏడ్సే సత్తువ ఎక్కన్నుంచి ఒస్తది -" అనుకుంది ఎల్లమ్మ.

అయ్యగారి పొలెంలో వానలు లేక భూమిలో నాగలే పెట్టలేదు ఈ యేడు. వానల్లేక వరుసగా అది మూడో యేడు. ఈ యేడు మరీ వానచుక్క జార్చలేదు మబ్బులు. భూమి దాహంతో ఎండి పగిలి పోయింది. భూమిని నమ్ముకున్నోళ్ళకు తిండి కరువైంది.

తాగడానికి నీళ్ళు కూడా కరువయ్యాయి. ఎక్కడనో పాతబావిలో నీళ్ళు పాతాళంలో వుంటె చేదిచేది పొలెంలో ఆడోళ్ళ రెక్కలు విరిగి పోయాయి.

ఒక్క గింజ విత్తనం పడని భూమివైపు చూసి పోచయ్య గుండెలదిరి పోయాయి.

" ఇగ ఏడాది పొడుగునా డొక్కలు ఎండవల్సిందే "-

అని దుఃఖం పొంగుకొచ్చింది అతనికి.

పట్నం నుంచి వచ్చిన వీరయ్య కన్పించాడు.

పట్నంలో రిక్షా తొక్కుతున్నాడట. పెండ్లాం పిల్లలను పట్నం తీసుకపోతానని వచ్చాడు.

" పట్నంలో ఎట్లున్నదే - మా అసోంటోల్లకు ఏమైన పని దొర్కుతదానే ? - " వీరయ్యనడిగాడు పోచయ్య.

" చేస్కునేటోల్లకు పనికేం తక్కువలేదు పట్నంలో. గక్కడ పనికీ పైసలకూ తక్కువ లేదనుకో - మబ్బుల్నంటుతున్న మేడలు కడ్తున్నారు. గక్కడ గంప మోసినా రోజుకు నలుభై ఎక్కడికీ పోవు !-" చెప్తున్నాడు వీరయ్య.

" మబ్బుల్నంటుతున్న మేడలు !- అందు కేనేమో మబ్బులు కురుస్తలేవు !-"

నిట్టూర్చాడు పోచయ్య.

" పనీ ! - పైసలు !-" ఈ రెండు పోచయ్య మెదడులో నిలిచాయి. అదే రాత్రి పోచయ్య పట్నం పోదామని నిర్ణయించేసుకున్నాడు.

" ఎల్లీ ! - మనం పట్నం పోదాం. గక్కడ మస్తుగ పని దొర్కుతదట !- పెద్దపుషాల కూడా పోయింది. ఇగ వానలు పడ్తయని నమ్మకం లేదు. గిక్కడుంటే తిండికిలేక సస్తం. గట్ల పట్నం పోయి ఇద్దరం కొన్నాల్లు పని చేస్కొని గిన్నిరాల్లు ఎన్కేసుకొని మల్ల మన ఊరుకు ఒద్దాం -" అని తన నిర్ణయాన్ని భార్యకు వినిపించాడు పోచయ్య.

భర్తమాటలకు ఎల్లమ్మ భయపడ్డది -

" గంత పెద్ద పట్నం !- గక్కడికి పోయి - దిక్కూమొక్కూ లేకుంట ఎట్లుంటమో ఎందో -" అనుకుంది. మళ్ళా ఆలోచించింది -

కాని - గిక్కడనే వుంటే తినబోతే తిండిలేక తాగబోతే నీళ్ళు లేక నిజంగనే సస్తం !- పట్నంపోయి గింత సంపాయించుకొని మల్ల ఎన్కకొస్తే బాగనే వుంటది -" అనుకొని " సరే ! - మంచిగనే వుంటది. పోదాం పట్నం -" అంది భర్తతో.

అదే రాత్రి ఎల్లమ్మ సొట్టలు పోయిన రాతెండి గిన్నెలు పళ్ళాలు గ్లాసులు సంచిలో వేసి మూట కట్టింది. పాత ఈత చాప వుంటె - మడతలు వేసి రెండు పాతబొంతలను దానికేసి తాడుతో బిగించి కట్టింది.

" ఈ గుడిసెలో వున్న సంసారం - సామాను గిదే గదా ! - " అని ఎల్లమ్మ గుడిసెంతా కలజూసింది. ఓ మూల కుక్కి మంచం తప్ప ఇంకా ఆ గుడిసెలో ఏం లేవు. పొయ్యి దగ్గర మాత్రం ఇన్ని పొయిల కట్టెలు కన్పించాయి.

" గా పొయిల కట్టెలు కట్టనా ? - గక్కడ పట్నంలో పొయిల కట్టెలు శాన పిరమట -" అంది ఎల్లమ్మ పోచయ్య వంక చూసి.

" గాటికి ముండ్లున్నయే - ఆ ముండ్లనెక్కడ మోస్కపోతాం - ఒద్దులే -" అని పోచయ్య భార్య కట్టిన రెండు మూటలు నెత్తుకొని బయటికి నడిచాడు.

చిన్నోడిని చంకలో వేసుకొని ఎడమచేత్తో పెద్దోడి చేతిని పట్టుకొని ఎల్లమ్మ పోచయ్య వెంట నడిచింది

ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. చీకట్లు అప్పుడప్పుడే విచ్చుకుంటున్నాయి.

ఇన్ని బియ్యముంటె ఎల్లమ్మ రాత్రి ఉడికేసింది: అన్నం ఒంపిన గంజి ఇన్ని ఉప్పురాళ్ళు వేసుకొని ముగ్గురూ అన్నం తిన్నారు.

" మబ్బులనే పోతె పట్నం జల్ది పోతం. పొద్దుపోతె మల్ల గక్కడ తిప్పలయితది " అని పోచయ్య రాత్రీ చెప్పాడు.

ఆ రాత్రి తిన్నదే. పొద్దున కడుపులోకి ఏంలేదు.

" గిన్ని బియ్యం గింజలుండె గదా - మూట కట్టినవా ?-" భార్యనడిగాడు పోచయ్య.

" ఆ - కట్టిన. తొందరగ నడువు -" ఎల్లమ్మ కొడుకులతో గబగబ ముందుకు నడిచింది.

తెల్లవారక ముందే బస్సుస్టాండుకు చేరుకున్న వాళ్ళకు మధ్యాహ్నమయినా బస్సు దొరకలేదు. పట్నం పోయే బస్సులేవీ ఆగకుండా రయ్యిన వెళ్ళి పోతున్నాయి. వాటి నిండా జనమే ! ఆఖరికి ఒక తెల్ల బస్సు ఆగింది. తలుపులు తెరుచుకున్నాయి. పోచయ్య మూటలతో ఎల్లమ్మ పిల్లలతో పరిగెత్తారు.

" దొరా ! గీ బస్సు పట్నం పోతద ?-" అడిగాడు పోచయ్య.

" పట్నం పోవాల్నా -" తలుపుకడ్డంగా నిల్చున్న కండక్టరు నవ్వాడు.

" గిది సూపర్ ఎక్స్‌ప్రెస్సు. టికెట్టు పైసలు డబల్ అయితయి. నీ దగ్గర పైసలున్నయా ?-" నవ్వాపకుండానే అడిగాడు కండక్టరు.

అతనితో పాటు డ్రైవరు పాసెంజర్లు నవ్వారు.

" ఎంతయితది శార్జీ - దొరా !-" అడిగాడు పోచయ్య దిగులుగా.

పొద్దటినుంచి తిండిలేక వాళ్ళ కడుపులు మలమలమాడుతున్నాయి. నీళ్ళు తాగి తాగి కడుపులు నింపుకుంటున్నారు. చిన్నోడేమో ఎల్లమ్మ రొమ్ములను నిమిషనిమిషానికి చీకిచీకి ఆ పాలు సరిపోక ఏడుస్తూ తన చిన్ని పిడికిళ్ళతో తల్లిని కొడ్తున్నాడు. ఆకలితో పెద్దోడు తోటకూర కాడ లాగ అయి పోయాడు.

వాళ్ళవైపు చూసి కండక్టరు మళ్ళీ నవ్వాడు. బస్సుమెట్టుమీద అడుగేసిన పోచయ్య వైపు చూసి -

" ముందు నువ్వు కిందికి దిగురా !-" అని కండక్టరు పోచయ్యను భుజం పట్టి కిందికి తోసేసాడు.

" గదేంది దొరా ! గీ బస్సు పట్నం పోదా ?-"

" మనిషికి నలభై అయితయి - ఆ నీ కొడుక్కు కూడా సగం టికట్టు -" అన్నాడు కండక్టరు.

" గదేంది దొరా !- పట్నం టిక్కట్టు రెండు రూపాయలే గదా !-"

"ఎన్నాల్లకింది మాట మాట్లాడుతున్నవురా !-" నవ్వాడు కండక్టరు మరింత హేళనగా.

బస్సులో వున్నవాళ్లంతా అతనితో కలిసారు. పోచయ్య ముఖం చిన్న బోయింది. ఒకవైపు ఆకలి. ఇంకోవైపు ఏ బస్సూ ఆగడం లేదు. ఒక బస్సు ఆగితే బోలెడు చార్జీలు చెప్తున్నాడు. ఏం చెయ్యాలో పోచయ్యకు దిక్కుతోచలేదు.

" లారీలనైన పడిపోదాం -" అంది ఎల్లమ్మ.

ఆగిన ప్రతి లారి దగ్గరకు పరిగెత్తి పోచయ్య ప్రాధేయపడ్డాడు. చివరకు ఒక లారీడ్రైవరు ఒప్పుకున్నాడు. ముప్పై రూపాయలు అతని చేతిలో పెట్టి లారీ ఎక్కారు.

వాళ్లు పట్నం చేరేసరికి అర్ధరాత్రయింది. ఆ రాత్రి రోడ్డు పక్కనె పొయ్యిపెట్టి ఎల్లమ్మ అన్నం వండింది. వెంట తెచ్చిన ఇంత పొడికారముంటె అది వేసుకొని అన్నం తిన్నారు.

రెండు రోజుల తర్వాత కూలిపని దొరికింది. మగాడికి నలభై అడదానికి ముప్పై ఇస్తామన్నారు. రోజుకు అంత డబ్బు విని ఎల్లమ్మ పోచయ్యలు ఆనందం పట్టలేక పోయారు. ఉండడానికి ఆ కాంప్లెక్సులోనే ఓ మూల దొరికింది. జీవితంలో కష్టాలన్నీ పోయి మంచి రోజులు వచ్చాయనుకున్నారు వాళ్ళిద్దరు.

పోచయ్య ఎల్లమ్మ - ఇద్దరూ పొద్దున పనిలోకి దిగుతారు. పొద్దున్నే లేవగానే ఎల్లమ్మ అన్నం కూరా వండుతుంది. వాళ్ళతోపాటు పెద్దోడు తింటాడు. చిన్నోడిని చూసుకుంటూ వుంటాడు. పొద్దున పాలిచ్చిన ఎల్లమ్మ మళ్ళా మధ్యలో వచ్చి చిన్నోడికి పాలిస్తుంది. మధ్యాహ్నం ఒక గంట అన్నాలకు వదుల్తారు. రోజంతా ఇటుకలు ఇసుక మోసీ మోసీ వాళ్ళ ఒళ్ళు హూనం అయి పోతున్నది. కాస్సేపు కాలు చేయి ఆగితే కంట్రాక్టరు బూతులు అరుస్తాడు. ఆగని మిషన్ లాగే వాళ్ళ పని సాగుతూనే వుంటుంది.

ఇంతలో వర్షాకాలం వచ్చింది. కాంప్లెక్సులో మూల కురువకుండా హాయిగానే వుంది. కాని విపరీతంగా దోమలు. దోమలు కుట్టికుట్టి పోచయ్య ఒళ్లంతా పుండ్లతో నిండిపోయింది. గోకితే రక్తం వస్తుంది. ఎల్లమ్మను చలిజ్వరం పట్టుకుంది. డాక్టరు దగ్గరకు పోతే అరవైరూపాయల ఫీసు తీసుకొని చీటీ నిండా మందులు రాసిచ్చాడు. రెండు రోజుల కూలి డాక్టరుకు పోతే నాలుగు రోజుల కూలి మందులకు సరిపోయింది.

ఆ మందులకు ఎల్లమ్మ జ్వరమైతే తగ్గింది కాని ఒకటే నీరసం. నోరంతా చేదు. నోట్లోకి ముద్ద పోవడం లేదు. పనికి పోకున్నా మొగునికి కొడుక్కూ ఇంత ఉడకేసి

పెద్దామన్నా ఎల్లమ్మ లేవలేకుండా వుంది. పోచయ్య అన్నం కూరా వండి పెద్దోడికి పెట్టి తానూ తిని పనిలోకి పోతున్నాడు.

జ్వరంతో ఎల్లమ్మ రొమ్ములు ఎండిపోయాయి. ఇంతవరకు చిన్నోడికి ఎల్లమ్మ పాలు బొటాబోటిగా సరిపోయేయి. కాని ఇప్పుడు తిండిలేక ఆమె రొమ్ములు పేగుల్లాగా వేలాడబడ్డాయి. చిన్నోడు తల్లిరొమ్ములను చీకిచీకి పాలు రాక పోయేసరికి ఆకలితో ఏడ్పు లంకించుకున్నాడు. ఎంత ఊపినా లాలించినా వాడి ఏడ్పు ఆగడం లేదు.

" కూలి పైసలు గిన్ని అడ్వాన్సుగ అడిగి పొద్దుగూకంగ చిన్నోడికి గిన్నిపాలు కొనుక్కరా'- అని ఎల్లమ్మ పోచయ్యకు చెప్పింది.

పోచయ్య రావడానికి ఇంకా చాలా సేపవుతుంది. చిన్నోడి కూనిరాగం సాగుతూనే వుంది. నిస్సత్తువ నిస్సహాయతలతో ఎల్లమ్మకూ ఏడ్పు వస్తున్నది. అప్పుడే పెద్దోడు వచ్చి " అమ్మా ! - " అని పిల్చాడు. దుఃఖంతో ఎల్లమ్మ వాడి మీద కసురుకుంది. అయినా పెద్దోడు జంకలేదు.

" అమ్మా ! - గణేశుడూ - పాలు - తాగుతుండటనే !-" అన్నాడు.

" గణేశులను గా మొన్ననే గదరా ఉస్సేనుసాగరంలో పడేసింగ్రు మల్లెక్కడి గణేశుడురా !-" అడిగింది ఎల్లమ్మ.

"గా గణేశులు కాదే - గుడి కాడ గణేశుడు -! అందరూ పాలు - పట్టుకొని గణేశుకాడ నిలబడింగ్రు -" అన్నాడు పెద్దోడు.

చేతుల్లో పాలతో చాలామంది వరుసలో నిలబడి ఎల్లమ్మ మనస్సులో కన్పించారు.

పాలు !

"గక్కడ్కి పోతె గీనికి గిన్న పాలు దొర్కుతయి!-"

వెంటనే ఆలోచన వచ్చింది ఎల్లమ్మకు.

చిన్నోడిని చంకలో వేసుకొని ఎల్లమ్మ గుడివైపు పరిగెత్తింది. ఆమె వెంట రాతెండి గిన్నెతో పెద్దోడు పరిగెత్తాడు.

రంగురంగుల చీరెల్లో డ్రెస్సుల్లో ఆడామగా చిన్నా పెద్దా గ్లాసుల్లో చెంబుల్లో పాలు పట్టుకొని నిలబడివున్నారు.

" ఈ భూమ్మీద పాపాలు పెరిగిపోతున్నాయి. అది చెప్పడానికే దేవుడు ఈ మహిమ చూపుతున్నాడు !" అంది ఒకావిడ. ఆమె పక్కనే జీన్స్‌ప్యాంటులో ఒక యువకుడు నిల్చున్నాడు పాలగ్లాసుతో

" ఆంటీ ! ఈ రోజు ఆఫీసుకు సెలవు పెట్టి ఈ వింత చూద్దామని వచ్చాను " అన్నాడు.

" వింత - అంటావేమిటి బాబూ ! - దేవుడు ప్రకటమై తన మహిమ చూపిస్తుంటే-" ఆమె గొంతులో కోపం ధ్వనించింది.

" నిజమే !- పెరుగుతున్న అవినీతిని దేవుళ్లు కూడా తట్టుకోలేక పోతున్నారు. సంభవామియుగే యుగే - అన్నాడు గదా - ఆ పరమాత్ముడు "

చేతులెత్తి మొక్కాడు జీన్స్‌ప్యాంటు ముందు నిల్చున్నతడు.

అతన్ని చూసి జీన్స్‌ప్యాంటు యువకుడు ఏదో తప్పు చేసిన వాడిలా రెండు చెంపలేసుకొని దండం పెట్టాడు.

పాలతో లైనుకట్టి నిలబడివున్న వాళ్ళను చూసింది ఎల్లమ్మ.

" దొ॥రా ! గీనికి గిన్ని పాలు పోయింర్డి దొరా ! గీడు ఆకల్తో ఏడుస్తుండు దొరా! -" అని రాతెండి గెన్నెను చూపించింది.

" ఛీ ! ఛో !- ఇక్కడ కూడా ముష్టివాళ్ళు తయ్యారు. అసలు దేశం నుంచి బెగ్గర్సును వెళ్ళగొట్టాలి !- వీళ్ళను తీసికెళ్ళి జెయిల్లో వేయాలి ! వాళ్ళ వల్లనే ఫారెన్ టూరిస్టులు మన దేశానికి రావడం మానేసారు. ఇంత న్యూసెన్సు ఏ దేశంలో లేదు !-"

" ఏంటి మీరు ఫారెన్ నుంచి వచ్చారా !-" అడిగాడు జీన్స్‌ప్యాంటు యువకుడు కుతూహలంగా.

" అవును - అమెరికా నుంచి విజిట్ కోసం వచ్చాను. అక్కడ కంప్యూటరు ఇంజనీయరుగా పనిచేస్తున్నాను -" గర్వంగా అన్నాడతడు.

" గిన్ని పాలు పోయింర్డి దొర్సానీ ! గీడు ఆకల్తో సచ్చిపోతుండు తల్లీ !-" ఎల్లమ్మ గిన్నెను ఆడాళ్ళ ముందు చాపింది.

" పాలా !- ఈ పాలు దేవునికి !- నీవంటి ముష్టాళ్ళకు కాదు మోసుకొచ్చింది !-" కోపంతో అంది పట్టుచీర జరీ అంచులు సవరించుకుంటు.

ఆమె కోపం పతివ్రతకోపంలా ఎదుటివాళ్ళను కాల్చేసే లాగుంది. ఆమె పక్కనే పంజాబీ డ్రెస్సుల్లో ఇద్దరమ్మాయిలున్నారు.

ఎల్లమ్మ వాళ్ళవైపు గిన్నె పట్టి - " గిన్ని పాలు తల్లీ !-" అని అడిగింది.

ఆ ఇద్దరమ్మాయిలు ఎల్లమ్మ మాటలను విననట్లే వాళ్ళ మాటల్లో మునిగిపోయివున్నారు.

" నేను పార్వతికే పాలు తాపుతానే - అందరూ గణేశునికి శివునికే పాలు తాపుతున్నారు ! ఇక్కడ కూడా పక్షపాతమేనా !-" అంది ఒకమ్మాయి.

" అబ్బ !- ఇక్కడా నీ ఫెమినిజమేనా ?-" నవ్వింది ఆమె ఫ్రెండు.

" లేక పోతే ఏమిటే !- దేవుడు మగాడే ఎందుక్కావాలి ! ఆడది ఎందుక్కాకూడదు!-" నవ్వింది మొదటి అమ్మాయి.

" దొర్సానీ !- నీ బాంచను - గీనికి గిన్ని పాలు పోయింర్డి తల్లీ !-" ఎల్లమ్మ మళ్ళా వాళ్ళకుగిన్నె చూపించింది.

" ఛీ !- అందరూ మగదేవతలకే పాలు తాపుతున్నారు - నేను పార్వతికి పాలు తాపి మహిమ చూపిస్తానని వస్తే - ఈ ముష్టిదాని గొడవేమిటే !- పాలు ! పాలు ! అని ప్రాణాలు తోడేస్తున్నది !" విసుక్కుంది ఆ అమ్మాయి. ఇంతలో ఆ అమ్మాయికోటి తట్టింది. ఎల్లమ్మ వైపు చూసి -

" అదిగో ! అటు చూడు !- అక్కడ బక్కెట్టుతో పాలు పెట్టుకొని కూర్చున్నాడు - అక్కడి కెళ్ళి పాలు అడుగు "- అని చేయెత్తి చూపుడువేలితో చూపించింది.

ఆ పిల్ల చూపించిన వైపు చూసి ఎల్లమ్మ గబగబా గిన్నెతో పరిగెత్తింది. ఆమె వెంట పెద్దోడు పరిగెత్తాడు.

" అయ్యా !- గిన్ని పాలు పోయింగ్రి - గీనికి తాపిస్త -" ప్రాధేయపడింది ఎల్లమ్మ.

" పాలా ?- గీ పాల దర ఎంతనో నీ కెరుకేనా ?-

ముప్పై రూపాయలకు లీటరు - గవి కూడా దొర్కుత లేవు - నీ కేమైన సమజ్ వుందా ?-

గిన్నె పట్టుకొని ముష్టికి బయలుదేరినౌ !-

పుణ్యానికి పాలు దొర్కుతయని వచ్చినవా ?-" అని కసిరాడు.

" అయ్యో దొరా ! గీడు ఆకల్తో సస్తుండు - ఒక్క బొట్టు పాలు పొయింగ్రి - సాలు ! నీ కాలు మొక్కుత !-" ఎల్లమ్మ అతని కాళ్ళు మొక్కబోయింది.

అతడు దూరం జరిగాడు.

"ఎక్కడెక్కడోళ్లో వచ్చి ముట్టుకుంటె పాలు మైలపడ్తాయి. గీ పాలను దేవుని కెట్ల తాపుతరు !- ఫో పాడు ముండా !- ఇక్కన్నుంచి ఫో !-" పక్కనున్న కట్టెను చేతిలోకి తీసుకున్నాడతడు.

ఆ తిట్టు వినేసరికి ఎల్లమ్మ నిశ్చేష్టురాలయింది. ఏం చేయాలో తోచలేదు. ఆమె తన ఊరిలో ఒకరికి పెట్టిందే కాని ఎవరి ముందు చేయి చాచింది కాదు. ఎవరినీ తిట్టింది కాదు ! తిట్టు పడింది కాదు !

" గింతమంది చేతుల్లో పాలున్నయి. ఎవరూ గిన్ని పాలు పోస్తలేరు - పెద్దోని తర్వాత పుట్టిన ఇద్దరు పోరలు జరంతో దవఖనాకు తీస్కపోయేటాల్లకే సచ్చిపోయింగ్రు. గీడు ఆకల్తో సచ్చిపోతడో యేందో -" అనుకుంటున్న ఎల్లమ్మ కళ్ళవెంట నీళ్ళు వరదలు కట్టాయి. చిన్నోడిని ఒడిలో వేసుకొని అక్కడే రోడ్డు పక్కగా కూల బడింది. పక్కకు చూస్తే పెద్దోడు లేదు !

" ఒరే పెద్దోడా !- ఎక్కడికి పోయినవురా !-" ఎల్లమ్మ చూపులు అటూయిటూ వెతికాయి.

రాతెండి గిన్నెలో నిండా పాలుపట్టుకొని పాలు తొణక కుండా మెల్లగా నడచి వస్తూ పెద్దోడు కనిపించాడు.

" పాలా !-గవెక్కడివిరా-" సంతోషంగా అడిగింది ఎల్లమ్మ.

" అమ్మా ! గుడి - ఎన్కాల - శాన పాలున్నయే. కాలువల పారుతున్నయి -" పెద్దోడికి సంతోషం ఉప్పొంగిపోతున్నది.

"ఎక్కడరా?- పాలు ! - పద నన్ను తీస్కపో -" అని ఎల్లమ్మ లేచింది.

పెద్దోడు ముందు పరిగెత్తాడు. వాడి వెనుక చిన్నోడిని ఎత్తుకొని ఎల్లమ్మ పరిగెత్తింది. గుడి వెనుక ఎవరూ లేరు. గర్భగుడి నుంచి వచ్చే కాలువలో పాలు ప్రవహిస్తూ పోతున్నాయి.

" నిజంగనే గివన్నీ పాలే !-" అరిచింది ఎల్లమ్మ.

" గీ పాలన్నీ నా కొడుక్కు తాపుత -" సంతోషంతో ముంచెత్తింది ఎల్లమ్మ.

" గీ పాలన్నీ తాగురా !-" ఎల్లమ్మ చిన్నోడి వైపు చూసింది. చిన్నోడు రెప్పవేయకుండా తల్లివైపు చూస్తున్నాడు. ఎల్లమ్మ వాన్ని కుదిపింది.

" తాగరా !-" అంది చేతిలోని గిన్నెను పైకెత్తి. కట్టెలాగా కదల్లేదు వాడు !

# నాకోసం నలభై నిమిషాలు

భార్గవీరావు

కమ్మటి కల ఒకటి పిల్లతెమ్మెరలా అర్థంకాని భాషలో పలకరించిన విషయం తలుచుకుని, పులకరింతతో నిద్రలేచి, బద్ధకంగా ఒళ్ళు విరుచుకుని కళ్ళు తెరిచాడు కృష్ణమూర్తి. తెల్లారిజాము కలలు నిజమౌతాయిట చూడాలి అనుకుంటూ గోడగడియారంవైపు చూస్తే రెండు ముళ్ళూ ఏడంకె మీద నిలబడి వెర్రి నాగన్నా ఇది తెల్లారి జాము కాదు, తెల్లారి జామైంది అని వెక్కిరించినట్లనిపించింది. 'స్వాతీ' అంటూ ఓగావుకేక పెట్టి దుప్పటితో సహా గది బయటికొచ్చి నిలబడ్డాడు. రోజూ ఆరింటికే స్నానం చేసి, ఆరున్నరకల్లా కాఫీతో నిద్రలేపే స్వాతి ఎక్కడా కనపడలేదు. వంటింట్లో, బాత్‌రూమ్‌లో, పెరట్లో ఎక్కడా కనపడలేదు. బయట వీధి గుమ్మం తలుపు తీసి చూసాడు. పాలపాకెట్టు, న్యూస్ పేపర్ దిక్కులేని అనాథల్లా పడివున్నాయి. కృష్ణమూర్తి కెందుకో గుండె గబగబా కొట్టుకుని, కాళ్ళు వణికాయి. మున్నీ, బబ్లూ అంటూ గట్టిగా కేకలు పెడ్తూ పిల్లల గదిలోకి పరిగెత్తాడు. అక్కడ మంచంపైన మున్నీపైన చేయివేసి, ముడుచుకుని పడుకుని వున్న స్వాతిని చూసి ప్రాణం లేచి వచ్చినట్లయింది కృష్ణమూర్తికి. మెల్లగా దగ్గరకెళ్ళి స్వాతీ అని పిలిచాడు. నుదుటిమీద చేయి వేస్తే కొంచెం వెచ్చగా తగిలింది. "జ్వరం వచ్చినట్లుంది - పిచ్చితల్లి, అస్తమానం మొగుడూ, పిల్లలూ, ఇల్లూ, వంటా తప్పిస్తే మరో ధ్యాస లేకుండా గానుగెద్దులా పని చేస్తూనే వుంటుంది" అనుకుని ప్రేమగా మళ్ళీ పిలిచాడు స్వాతీ అని.

ఊ... అంటూ కళ్ళు తెరచి ఎదురుగా నిలబడిన భర్తను, పక్కన పడుకునివున్న పిల్లల్ని చూసి గబుక్కున లేచికూచుంది.

"ఏమిటీ, ఒంట్లో బాగా లేదా?"

పిల్లల్ని లేపడానికని ఇక్కడకొచ్చి, కొంచెం నలతగా అనిపిస్తే కాస్సేపు నడుంవాలుద్దామని పడుకున్నాను. అరే ఏడున్నర అయిపోయింది. బబ్లూ, మున్నీ లేవండిరా అంటూ గట్టిగా కుదిపి లేపింది.

అదేమిటమ్మా! రోజూ ఆరింటికే లేపే దానివి. ఆలస్యం అయిపోయింది అంటూ బాత్‌రూమ్‌లోకి పరిగెత్తింది మున్నీ.

అమ్మా, నేను సాయంత్రం వచ్చి స్నానం చేస్తాను అంటూ ముఖం కడుక్కుని యూనిఫాం వేసుకోడానికి తయారయ్యాడు బబ్లూ. అంతలో కృష్ణమూర్తి కాఫీ కలిపి పట్టుకొచ్చాడు.

"అయ్యో, ఎందుకండీ, నేను కలుపుకునేదాన్నిగా" అంది బిడియంగా.

ఫరవాలేదు లేవోయ్. నీవు వేసిన డికాక్షనే. సరిగ్గా కలిపానో లేదో చూడు. పెళ్ళయిన ఈ పదిహేనేళ్ళలో నేను పదిసార్లు కూడా కాఫీ కలుపుకోలేదు. ఈ దీనుడికి సతిసేవాభాగ్యం కల్పించు" అన్నాడు నాటకీయంగా.

చిన్నగా నవ్వుతూ కాఫీ కప్పు అందుకోబోయి అబ్బా అని నడుం పట్టుకుంది స్వాతి.

"ఏమైంది?" కంగారుగా అడిగాడు కృష్ణమూర్తి.

"నడుం పట్టుకున్నట్టుగా వుంది"

లేచేటప్పుడు కంగారు పడివుంటావు. బెణికిందేమో? పదింటికి కాలనీలో గవర్నమెంటు హాస్పిటల్ కెళ్ళి మందుతెచ్చుకో, తగ్గకపోతే సాయంత్రం ప్రైవేటు డాక్టరు దగ్గరికి తీసుకెళ్తాను. కాస్సేపు పడుకో" అని దుప్పటి కప్పాడు.

స్కూటరెక్కి వెళ్ళి బ్రెడ్, జామ్ తెచ్చుకుని తిని, పాలుతాగి బయలుదేరాడు.

స్వాతీ మేం వెళ్తున్నాం తలుపేసుకో డాక్టరు దగ్గర కెళ్ళడం మరచిపోకు అన్నమాటలు ఎక్కడో దూరం నుండి వినిపించినట్లయింది. కాస్సేపయ్యాక కళ్ళు తెరచి చూస్తే టైము పదిన్నర. మంచాన్ని ఆసరా చేసుకుని మెల్లగా లేచి నిలబడింది. కడుపులో ఆకలికి కళ్ళు తిరిగినట్లనిపించింది. అప్పుడు గుర్తొచ్చింది క్రితం రాత్రి గురువారం కదా అన్నం తినలేదని. మెల్లగా గోడవారగా నడిచి హాలులోకి వచ్చింది. ఇల్లంతా చిందర వందరగా వుంది. విడిచిన బట్టలు, ఉతికిన బట్టలు, మడత విప్పని న్యూస్‌పేపరు, చదివేసిన నిన్నటిపేపరు ఏవో మాగజైనులు, డైనింగ్ టేబిల్ నిండా గిన్నెలు, గ్లాసులూ లక్ష్మమ్మ కూడా రానట్టుంది. పాచివాకిలి అలాగే వుంది. అలాగే రెండడుగులు వేసి కుర్చీ మీద కూర్చుని మిగిల్చిన రెండు బ్రెడ్డు ముక్కల్ని బబ్లూ సగం వదిలేసిన పాల్లో ముంచుకుని తిన్న తరువాత ప్రాణం కొంచెం కుదుట పడినట్లనిపించింది.

డాక్టరు దగ్గరకెళ్ళాలా వద్దా? ఎలా వెళ్ళాలి? రిక్షా దాకా నడవగలనా? డాక్టరుకి చూపించుకో అని సులువుగా చెప్పి వెళ్ళి పోయాడు. ఒక్కరోజు ఆఫీసుకి సెలవుపెట్టి దగ్గరుండి తీసికెళ్ళొచ్చుకదా పోయినవారం తనకి కొంచెం ఒళ్ళు వెచ్చబడితే నానా హంగామా చేసి డాక్టరు దగ్గరకెళ్ళి అన్ని టెస్ట్‌లూ చేయించింది. జ్వరం తగ్గాక నీరసమని మరో మూడు రోజులు సెలవు పెట్టాడు. ఆవారం రోజులూ తను ఒకక్షణం కూడా వదలకుండా తన అవసరాలు కనిపెట్టుకుని పక్కనే ఉండేది. టైము సరిగ్గా మందులిచ్చి చాకిరీ చేసింది. అతనికే కాక అతన్ని పలకరించడానికొచ్చిన ఫ్రెండ్స్‌కి కాఫీలు, టీలుపెట్టి హైరానపడి తనకే జ్వరం వచ్చినట్లని పించింది. పిల్లలు కూడా అంతే. కొంచెం నలతగా అనిపిస్తే నానా హంగామా చేసి రాత్రిళ్ళు కుడా నిద్రపోనివ్వరు. కానీ తనకి ఒంట్లో బాగాలేకపోతే అందరూ ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు. వాళ్ళంతా బయటవేవో తెచ్చుకున్నారు కానీ, తను ఏం తినాలి? వండుకోగలనా లేదా అనికూడా ఎవ్వరూ ఆలోచించలేదు. ఈ సంసారం కోసమేనా తను పగలూ రాత్రీ కొవ్వొత్తిలా కరిగిపోతోంది. ఆలోచిస్తుంటే స్వాతి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

అంతలో బెల్ మోగింది. లేచి వెళదామనుకుంటుండగానే తలుపు నెట్టుకుని గాయిత్రీ, పనిమనిషి లక్ష్మమ్మ ఇద్దరూ లోనికొచ్చారు.

"హాయ్, ఏమిటీ అవతారం? ఎప్పుడూ ఇంటిని మోడల్‌హౌస్‌లా సర్దేదానివి! ఒంట్లో బాలేదా?"

"ఆలీసం అయిందమ్మగారూ. చలికి మోకాళ్ళు పట్టుకుపోయాయి. అందుకే పొద్దుపోయింది"

"రా గాయిత్రీ, నాకూ మా లక్ష్మమ్మలాగే ఒళ్ళునొప్పులు. చలికేనేమో! ఇప్పుడే లేచాను. నీవేమిటి, ఇలా? ఆఫీసు లేదా" అడిగింది స్వాతి.

గాయిత్రి, స్వాతి ఇద్దరూ మంచి ఫ్రెండ్స్. ఇద్దరికీ ఇంచుమించు ఒక్కసారే పెళ్ళిళ్ళయ్యాయి. పెళ్ళయ్యాక పోస్ట్ గ్రాడ్యుయేషన్ ముగించుకుని ఒక ప్రైవేట్ ఫర్మ్‌లో పి.ఆర్.ఓ ఉద్యోగం సంపాయించుకుంది గాయిత్రి. స్వాతి చదువు జోలికి పోక ఇల్లూ పిల్లలూ అంటూ గృహిణిగా వుండటానికి నిర్ణయించుకుంది. అప్పుడప్పుడూ కలుసుకుని కబుర్లు కలబోసుకుంటుంటారు ఇద్దరూ.

పర్స్ పక్కన పడేసి వంటింట్లో కెళ్ళి ఓ గిన్నెలో పాలపాకెట్ కట్ చేసి పోసిపాలుకాచి, మూడు కప్పులో టీ కలిపి లక్ష్మమ్మకు ఒకటిచ్చి, స్వాతికీ యిచ్చింది. పర్స్‌లోంచి ఒక మైక్రోపైరిన్ తీసిచ్చింది. లక్ష్మమ్మ అంతలో ఇల్లు తుడిచి, అంట్లూ, బట్టలూ బయట పెట్టుకుంది. గాయిత్రి పక్కబట్టలూ అవీ సర్దుతూ కబుర్లు చెప్తోంది.

"స్వాతీ, నేనూ నీవూ ఒకే ఈడు వాళ్ళమే కదా, నేను చూడు ఇంటి పని చేసుకుని ఉద్యోగం కూడా చేస్తున్నాను. నీకప్పుడే ముసలమ్మలా కీళ్ళనొప్పులూ..."

"నీకేం, మీ ఆయన చక్కగా ఇంటా, బయటా కూడా సాయం చేస్తాడు. పిల్లలు కూడా ఎవరి పన్లు వాళ్ళు చేసుకుంటారు"

"నీవూ తర్ఫీదు యివ్వొచ్చుకదా? ఎప్పుడూ నీవే చాకిరీ చేస్తూ వుంటే వాళ్ళకలాగే అలవాటయి పోతుంది. ఎలా ఎయిపోయావో చూడు. నీకు ముప్పై ఆరో, ఏడో కదా? యాభై ఏళ్ళదానిలా అనిపిస్తున్నావు"

సరే, నీలాగా జుట్టు కత్తిరించుకుని, సల్వార్‌కమీజ్ వేసుకుంటే మావారు తన్ని తగలేస్తారు"

"అలా చేయమన్నానా? జీవితంలోని మోనాచనీని తీసెయ్యడానికి ఏమైనా చెయ్యకపోతే నీరసం వచ్చి, ఇలా డల్ గా ఐపోతారు. చూడు నీవు రోజూ వ్యాయామం చేస్తే ఈ కీళ్ళ నొప్పులూ, అన్ని రోగాలూ పోతాయి. డాక్టరూ వద్దూ, మందులూ వద్దు.

"నాకు ఇంట్లో పని ఏం తక్కువుందని? అయినా టైము కూడా వుండాలి కదా?"

"పనివేరు, వ్యాయామం వేరు. పనచేస్తే అలసట వస్తుంది. వ్యాయామం చేస్తే ఫ్రెష్‌గా అనిపిస్తుంది. చేసి చూడు నీకే తెలుస్తుంది. ఎక్స్‌ర్‌సైజ్ చేయలేకపోతే రోజూ ఉదయం ఓ అరగంట వాకింగ్‌వెళ్ళు. నేనిలా సన్నగా వున్నానంటే దీని వెనక ఎంత శ్రమవుందో తెలుసా? నోరు కట్టేసుకుని, స్వీట్లో, ఐస్‌క్రీములో మానేసి, ఒళ్ళు వంచి స్కిప్పింగ్ చేసి తిప్పలు పడలేను. నేవుంటాను ఆరోగ్యం జాగ్రత్త" అని లూనా ఎక్కి వెళ్ళిపోయింది గాయిత్రి.

* * *

సాయంత్రం ఇంటికొచ్చిన కృష్ణమూర్తి చక్కగా సర్దిన యిల్లూ, నవ్వుతూ పలకరించిన స్వాతిని చూసేటప్పటికి హాయిగా అనిపించింది.

"నేచెప్పలేదూ తగ్గిపోతుందని! అనవసరంగా కంగారు పెట్టేసావు. ఆఫీసులో అంతపనిలోనూ నీవు రెండు మార్లు గుర్తుకొచ్చావు" అన్నాడు కృష్ణమూర్తి కాఫీ కప్పు అందుకుంటూ.

తిన్నావా? ఏం చేశావు? అని అడగలేదని పించింది స్వాతికి. తినే ఓపిక తెచ్చుకుని వండిన చారూ, అన్నంకూరా తిని అందరూ పడుకున్నారు.

* * *

మరుసటి రోజు ఉదయం మామూలుగా ఐదున్నరకే మేలుకువ వచ్చింది స్వాతికి. ఒళ్ళు నెప్పులు కొంచెం తగ్గినట్టని పించింది. "రోజూ ఉదయం వాకింగ్ చేసి చూడు. ఎంత ఆరోగ్యంగా అనిపిస్తుందో" అన్న గాయిత్రి మాటలు గుర్తుకొచ్చాయి. స్వాతి వాళ్ళ ఇంటికి ఓ అరకిలోమీటరు దూరంలో ఒక చిన్న లేక్ ఉంది. దాని గట్టు మీద చుట్టు పక్కల చాలా మంది రోజూ వాకింగ్ చేస్తూవుంటారు. తనూ వెళ్ళి చూద్దాం అని లేచి,

చెప్పులేసుకుని, ఒక శాలువా కప్పుకుని వీధి తలుపులు బయట నుండి తాళం వేసుకుని బయటకు అడుగు పెట్టింది. చలిగాలి రివ్వున వీస్తే అప్రయత్నంగా తలచుట్టూ కప్పుకుని ముందుకు నడిచింది. నాలుగడుగులు వేసేటప్పటికి చలి తగ్గినట్టనిపించింది. ఇంకొంచెం ముందుకు నడిచి, రోడ్డు దాటి గబగబా అందరూ వాకింగ్ చేసే స్పాట్ చేరుకుంది. ఒక టీనేజీ అమ్మాయి, కాలేజీ స్టూడెంట్ కాబోలు పలకరింపుగా నవ్వుతూ జాగింగ్ చేసుకుంటూ దాటిపోయింది. మరో పెద్దమనిషి అప్పుడే వాకింగ్ చేసేసి తిరిగి వచ్చేస్తున్నాడు. ఒక నడివయస్సు భార్యాభర్తలు ఎదురొచ్చారు. ఏదో గట్టిగా వాదించు కుంటూ నడుస్తున్నారు.

మరో నలుగురు కుర్రాళ్ళు ట్రాక్‌సూట్ వేసుకుని అంతచలిలోనూ చెమటలు పట్టేంత త్వరగా నడుస్తున్నారు. పరుగులాంటి నడక "ఏమండీ" వెనుక నుండి ఎవరో పిలిచినట్టనిపించి తిరిగి చూసింది. "నమస్తే, కొత్తగా వాకింగ్ మొదలెట్టారా? ఇంకొంచెం గబగబా నడవాలి. నన్ను గుర్తు పట్టలేదా. నా పేరు మృణాళిని. మా వదిన భారతితో మీరు మాట్లాడుతుంటే చూసాను. గుడిపక్కనే మాయిల్లు. నాతో కలిసి నడవండి. కంపెనీ వుంటుంది. ప్లేస్ కూడా అలవాటవుతుంది" ఓ నలభై నిమిషాలలో రెండు కిలోమీటర్లు నడిచి వెనక్కి తిరిగి వచ్చేసింది. ఇంకా ఆరున్నరే! ఎవరూ లేవలేదు.

* * *

స్వాతి తను వాకింగ్ వెళ్తున్న విషయం కృష్ణమూర్తితో ఎంతో ఉత్సాహంగా చెప్పింది. కొత్తగా పరిచయమైన వాళ్ళ గురించి చెప్పి, అతన్ని కూడా రమ్మని పిలిచింది. తెల్లారిజామున వెచ్చగా పడుకుని కమ్మని కలలు కనకుండా కాళ్ళీడ్చుకుంటూ నేనడవలేను బాబూ, నీవూ వెళ్ళకు. ఇంటి పనులతోనే అలసి పోతున్నావు" అని తేలిగ్గా కొట్టి పారేశాడు. ఇక లాభంలేదనుకుని, తను మాత్రం రోజూ వెళ్ళడం మొదలెట్టింది. మొదలుపెట్టిన నెలలోనే తేలికగా, ఏదో ఉత్సాహం అనిపించింది. రెండు, మూడు నెలల్లో కొంచెం ఒళ్ళు తగ్గినట్టనిపించింది. ఆ టైములో వచ్చే వాళ్ళందరూ పరిచయమయ్యారు. మృణాళిని, ట్రాక్‌సూట్ అబ్బాయి శశాంక్, ప్రభాకర్, శాంతాబాయి. అందర్లోకి స్వాతిని ఆకట్టుకున్నది రాధిక.

రాధిక కాలనీలో బ్యూటీ పార్లర్ నడుపుతోంది. భర్త పెద్ద ఆఫీసరు. తనూ స్వాతి ఈడుదే కానీ పదేళ్ళు చిన్నగా అనిపిస్తుంది. రోజూ తప్పకుండా వాకింగ్‌కు వస్తుంది. "మా పార్లర్‌కి రండి" అని పిలిచి స్వాతిని ఒక రోజు తీసికెళ్ళింది. ఇంట్లోనే క్రింద పార్లర్, పైన కాపురం ఉన్నారు. మీరు కూడా ఎందుకు ఫేషియల్ చేయించుకోకూడదు అని అందంగా కనిపించడంలోని అడ్వాంటేజస్ అన్నీ చెప్పింది.

"నాకెందుకండీ, నేనేమన్నా ఉద్యోగం చేస్తున్నానా? ఇంట్లోనే వుంటానుకదా?" అంది బిడియంగా స్వాతి.

"ఎందుకు? ఉద్యోగం చేసేవాళ్ళే అందంగా కనిపించాలా? మీకోసం, మీ వారి కోసంచక్కగాతయారవ్వచ్చుకదా? ఒక్కసారి ట్రై చేయండి" అని నచ్చచెప్పి కనుబొమ్మలు ట్వీజ్‌చేసి, ఫేషియల్ చేసింది. ఇంటికొచ్చి తీరిగ్గా అద్దంలో చూసుకుంటే తనలో మార్పు కొట్టొచ్చినట్లుగా కనిపించింది. చర్మం శుభ్రంగా నున్నగ మెరిసిపోతూ కొద్దిగా రంగొచ్చినట్టుంది. తీర్చిదిద్దిన కనుబొమ్మలు కళ్ళ సోయగాన్ని పెంచాయి. మృణాళిని ఇచ్చిన లిప్‌స్టిక్ లేతగా పెదిమలకు పూసుకుంది. అంతలో వెనక నుండి కృష్ణమూర్తి అద్దంలో కనిపించాడు. గబుక్కున వెనక్కి తిరిగి చూసి సిగ్గుపడింది.

'ఏమిటీ, నీలో ఇంత మార్పు? గత ఆర్నెల్లగా చూస్తున్నాను? ఎవడికోసం ఈ వేషాలు?" అన్నాడు కటువుగా.

మెచ్చుకుంటాడని ఎదురుచూసిన స్వాతికి లాగి లెంపకాయ కొట్టినట్టనిపించింది. అభిమానంతో కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

వాకింగ్ ఫ్రెండ్ రాధిక పార్లర్ విషయం చెప్పాలనుకుని మానేసింది.

"ఇదంతా నీ ఫ్రెండ్ గాయిత్రి ప్రభావమే. మొగుడంటే లెక్కలేకుండా లూనా ఎక్కి షికార్లు చేస్తుంది. ఆగాలి నీకూ సోకినట్టుంది. అలాటి పప్పులేం నాదగ్గర ఉడకవు. పిచ్చి పిచ్చి వేషాలేయక ఇదివరకులా పడివుండు" అన్నడు గట్టిగా.

స్వాతికి రోషం వచ్చింది. "ఇదివరకులా కాకుండా ఎలా వున్నాను? మామూలుగా మీ అందరికీ వండి, వూడ్చి పెడ్తున్నాను కదా?"

"అంటే వంట చేసి పడేసి ఏసాని వేషమైనా వేయొచ్చునా?"

"జాగ్రత్తగా మాట్లాడండి. కొంచెం శ్రద్ధగా అలంకరించుకుంటే సానివేషాలా? మీ ఆఫీసులో ఆడవాళ్ళంతా ఎలా వస్తారు?"

"వాళ్ళ గురించి అందరూ ఎంత లేకిగా కామెంట్స్ చేస్తారో తెలుసా? ఈ మార్పంతా నీలో ఆ వాకింగ్ మొదలెట్టాకే వచ్చింది. రేపటి నుండి బయటకు వెళ్ళడానికి వీల్లేదు"

కోపం వచ్చింది స్వాతికి. "ఆవిషయం చెప్పడానికి మీరెవరు? నా ఆరోగ్యం మెరుగుపడి కాస్త ఫ్రెష్‌గా కనిపిస్తున్నానని మీకు అసూయ. మీరూ నాతోరండి. అక్కడ నాకెవ్వరూ ప్రత్యేకంగా మెచ్చుకునే బాయ్‌ఫ్రెండ్స్ లేరు"

"ఆ విషయాలన్నీ నాకనవసరం. నేను నీలో వచ్చే మార్పుని గమనిస్తూనే వున్నాను. కొత్తలో పట్టించుకోలేదు. రెండుమూడుసార్లు చూచాయగా చెప్తే నీవు అర్థం చేసుకోలేదు. ఇప్పుడు గట్టిగా చెప్తున్నాను. నీవు మార్నింగ్ వాక్ మానెయ్"

"నేను మానను. ఏం తప్పు చేస్తున్నానని. మీరందరూ లేవకముందు లేచి ఓ నలభై నిమిషాలు అలా నడిచి వస్తే మీకేం కష్టం. రోజులో మిగిలిన ఇరవైమూడుగంటలా

ఇరవై నిమిషాలు మీపైనా, మీపిల్లలపైనా ఖర్చుపెట్టున్నాను కదా? ఇల్లూ వాకిలీ కాదనుకుని ఉద్యోగాలు చేయలేదు. అందరి గృహిణుల్లా సినిమాలు, టి.వీలూ చూట్టం లేదు. రోజులో నాకోసం ఓనలభై నిమిషాలు నడకకు వెచ్చించడం తప్పా?"

"తప్పే" అని గిరుక్కున తిరిగివెళ్ళిపోయాడు, ఇక చర్చ అనవసరం అన్నట్టుగా కృష్ణమూర్తి.

* * *

ఆరోజు రాత్రంతా నిద్రపట్టలేదు. ఇల్లే స్వర్గమనుకుని నాలుగ్గోడల మధ్యే రోజంతా, గడిపేతను, స్వతంత్రంగా ఓ నలభై నిమిషాలు వాకింగ్ వెళ్ళడం తప్పా? అందంగా అలంకరించుకోవడం నేరమా? ఎంత సులువుగా తన్ను అనుమానిస్తున్నాడు కృష్ణమూర్తి. నిజానికి కృష్ణమూర్తికి తనంటే చాలా ప్రేమ. కావలసినవన్నీ కొని పెడతాడు. ఆప్యాయంగా పిల్లలను చూసుకుంటాడు. అసూయ కూడా ప్రేమలో భాగమేనంటారు. తనను అంతగా ప్రేమించే భర్త కోసం ఈ నలభై నిమిషాలూ త్యాగం చేయాలా?

నిద్రలోకి జారుకున్న స్వాతికి సరిగ్గా 5.30కు మెలకువ వచ్చింది. తేలికైన మనస్సుతో, ధైర్యంగా చెప్పులేసుకుని, శాలువా కప్పుకుని బయటకు అడుగు పెట్టింది. చల్లగాలి పలకరింపుగా నవ్వింది. ఉషాకిరణాలు స్వాగతం చెప్పాయి. ఆ రోజు ఎందుకో - మరీ అందంగా అనిపించింది.

# మూగనేస్తాలు

ఆర్. కుసుమారామారావు,

ఎప్పటి నుండో బాబు, కోడలు ఉత్తరాలు వ్రాస్తూనే ఉన్నారు, వాళ్ళ వాళ్ళ, ఆఫీసుల నుండి ఫోనులు చేస్తూనే వున్నారు.

అమ్మా! నువ్వు, డాడీ, ఎపుడు వస్తారూ? మా ఇల్లు ఎపుడు చూస్తారూ? మా దగ్గర ఎపుడు వుంటారూ? అని. ఎపుడూ ఆయన బిజీయే. నేనా ఒంటరిగా వెళ్ళే అలవాటు లేనిదాన్ని. ఈగూడు, ఈగూటిలో గువ్వజంటలా మా జీవితం సాగిపోతోంది. ఎక్కడికైనా వెళ్ళాలంటే అదో పెద్ద ప్రయత్నం.

అయినా, బాబు దగ్గరకు వెళ్ళే విషయంలో మా మధ్య ఎపుడూ సంభాషణలు సాగుతూనే వున్నాయి. చూద్దాం! చూద్దాం! అంటున్న ఈయన ఒకరోజు ప్లెయిన్ టిక్కెట్టు తీసికొని ఇంటికి వస్తే నేచాలా ఆశ్చర్యపోయాను.

ఇదుగో! చూడు కమలా! పిల్లలు బాధ పడుతున్నారు. నాకా బిల్డింగుపని ఒత్తిడి ఎక్కువగా వుంది. నీకు తెలుసుగా, నే ఒక్కడ్నే అన్నీ చూసుకోవాలని. అందుకే నీవు వెళ్ళి పిల్లల దగ్గర నాలుగురోజులు వుండిరా! వాళ్ళకూ సరదా తీరుతుంది. నీకూ మార్పుగా వుంటుంది. ఏమంటావ్! సరేనా!"

మార్పా! మీతోడులేని మార్పు నేఎపుడైనా కోరుకొన్నానా? మనస్సులో మాట మనస్సులో వుండగా 'మరిమీరో' అన్నాను.

"వాళ్ళు ఎలాగూ సంక్రాంతికి వస్తున్నారుగా! నేమార్చిలో వెళ్ళి ఒకసారి చూసి వస్తాలే. ఎల్లుండే నీ ప్రయాణం. అన్నీ జాగ్రత్తగా సర్దుకో అనేసి, నా సమాధానం కోసం కూడా ఎదురు చూడకుండా ఆయన వెళ్ళిపోయారు.

నేహడావిడిపడి అన్నీ సర్దుకోవడంలో ఆఎల్లుండి కాస్తరానే వచ్చింది. బాబు కిష్టమైన "పొడులు, వడియాలు" కోడలు రత్నకిష్టమైన "పచ్చళ్ళు, చీరలు" అన్నీ

సర్దుకొన్నాను. నేరెంద్రోజులు పడి సర్దుకొన్న 'ఢిల్లీ' ప్రయాణం. రెండు గంటలైనా పట్టలేదు.

'ప్లెయిన్' ఎక్కిస్తూ మావారు అన్ని జాగ్రత్తలూ చెప్పారు.

'నేజాగ్రత్తగా వెళ్తాగాని. మీరు టైముకి భోజనం చేయండి. ఇల్లు జాగ్రత్త. బ్రౌనీ జాగ్రత్త అన్నాను. బ్రౌనీ మా ఇంటిల్లిపాదికీ యిష్టమైన కుక్కపిల్ల. అతి తెలివైన కుక్కపిల్ల.

అక్కడ నుండి బాబు ఫోనులో అన్ని జాగ్రత్తలూ చెప్పాడు. అమ్మా! సింపుల్‌గారా! లగేజి పెంచుకోకు ఇక్కడ అన్నీ దొరుకుతాయని. కాని, నా చాదస్తం నాదిగా, ఇక్కడే ఎయిర్‌పోర్ట్‌లో పది కేజీలు ఎక్కువన్నారు. మావారు ఎలాగో మేనేజ్ చేశారు.

ఆకాశంలో దూదిపింజాల్లాంటి మబ్బుల్లోనుండి విమానం దూసుకుపోతుంటే వివాహం జరిగి క్రొత్తకాపురం పెట్టిన బాబు ఇంటికి మొదటిసారిగా వెళ్తున్నాననే ఆనందంతో నాకంటే ముందుగా నా మనస్సులోని ఊహాలు ముందుకు దూసుకుపోతున్నాయ్.

ఆకాశంలో ఎంతో ఎత్తు నుండి ప్రయాణం చేస్తున్నాను. జీవనప్రయాణం కూడా ఎంతో ఎత్తునుండే సాగుతోంది. బాబుని అనుకొన్నట్లుగా వాడికిష్టమైన పెద్దపెద్ద చదువులు చదివించాము. చదివించడమే కాదు. ఆ చదువులు వాడికి అబ్బాయి. ఆ చదువుల్లో బాబు రాణించాడు. చిన్న వయస్సులోనే పెద్ద కంపెనీకి జనరల్ మేనేజర్ అయ్యాడు. కంపెనీ పనుల మీద ఎపుడూ విదేశీ ప్రయాణాలు చేస్తుంటాడు. వాడికి అన్ని విధాలా తగిన సహధర్మచారిణి దొరికింది. నా మనస్సు కూడా దూదిపింజంలా తేలిగ్గా వుంది. 'ఎయిర్‌హోస్టెస్' అనౌన్స్‌మెంట్‌తో ఈలోకంలోకి వచ్చాను. ప్లెయిన్ లాండ్ అవుతోంది. ఇంతసేపు ఆకాశంలో ఎగిరిన ప్లెయిన్ భూమ్మీద దిగుతోందన్నమాట. మనిషి జీవితంలోని హెచ్చుతగ్గుల్లా.

ఎయిర్‌పోర్టులో నేదిగేసరికి పున్నమినాటి చంద్రునిలా నవ్వుతూ మా కోడలు రత్న, అమ్మలగేజి బయటకు తేవాలనే ఆదుర్దాతో బాబూ, ఇద్దరూ రెడీగా వున్నారు. మాకోడలు ఆనందానికి హద్దుల్లేవు. మమ్మీ వచ్చేసింది. మమ్మీ వచ్చేసిందంటూ ఎయిర్‌పోర్ట్‌లోనే గంతులు వేసింది. మరి ఎవరికైనా అలాగే వుంటుంది. వాళ్ళ క్రొత్త సంసారం చూచి ఆనందించే తల్లిదండ్రులు, అత్తమామలు వచ్చారంటే.

"అమ్మా!" అంతా హేపీనా! అంటూ బాబు లగేజి తేవడానికి వెళ్ళాడు.

దారిలో పళ్ళు ఫలాలు కొనుక్కొని ఇంటికి వచ్చాం. దారిపొడవునా 'రత్న' రోడ్లు, భవనాలు, షాపింగ్‌సెంటర్లు అన్నీ చూపిస్తూ, అన్ని చెప్తూనేవుంది.

ముప్పైఏళ్ళ వైవాహిక జీవితంలో ఒంటరిగా మొదటిసారిగా ఇల్లు వదలి వచ్చానేమో, మావారు పాపం ఏం చేస్తున్నారో! అని మనస్సులో ఆలోచనలు కలచి వేస్తుంటే బాబు ఇల్లురానే వచ్చింది.

అది ఓపెద్ద మూడంతస్థుల మేడ. చాలా బావుంది. కారు పోర్టికోలో ఆగిన వెంటనే అదే అన్నాను.

అపుడేనా! "ఇల్లు లోపల కూడా చూసి అపుడు చెప్పు మమ్మీ" అంటున్నాడు బాబు.

క్రింద ఇంటి యజమానులు ఉంటున్నారు. తల్లి, తండ్రి, కొడుకు, కోడలు, ఇద్దరు మనుమలు, పనిపిల్ల వగైరా అన్నమాట. మధ్యఫ్లాట్ మావాళ్ళది. పైనఫ్లాట్‌లో వేరొక కుటుంబం వుంటోందట.

మావాళ్ళ ఫ్లాట్ చాలా బావుంది. రెండు పడక గదుల ఫ్లాట్. పెద్ద పెద్ద బాల్కనీలు వున్నాయ్. చాలా అందంగా వుంది. ఇంటి ముందు పెద్ద స్కూల్ ప్లేగ్రౌండ్. ఒకప్రక్క పెద్దపార్కు. కార్నర్ ఇల్లేమో. ఇంటికి రెండు ప్రక్కలా రోడ్డు. భలే కాలక్షేపంగా వుంది. ఆమాటలేపైకి అనేశాను. "మీరిద్దరూ ఆఫీసుకు వెళ్ళినా నాకేం ఫర్వాలేదు. భలే కాలక్షేపంగా ఉంటుంది" అని.

మాకు తెలుసు మమ్మీ! నీకు బాగానచ్చుతుందని, ఇద్దరూ ఒకేసారి వాళ్ళూ పైకి అనేశారు. బాబు, మమ్మీ! అంటాడుకదా! అందుకని రత్న కూడా 'మమ్మీ' అనే అంటుంది. ఇల్లంతా చక్కగా ఫర్నిష్ చేసికొన్నారు. మా కోడలు ఇల్లు చాలా అందంగా అలంకరించుకొంది. చూడగానే ఎంతో ముచ్చట గొలిపేలా వుంది. ఆనందంతో ఉబ్బితబ్బిబ్బైపోయాను. ముగ్గురం కలసి మావారిని పదేపదే తలచుకొన్నాము.

వరసగా మూడ్రోజులు మారత్నకి ఆఫీసు లేదు. సెలవులు. బాబు అపుడే ఆఫీసు పనిమీద 'ఎబ్రాడ్' వెళ్ళి అంతకు ముందురోజే వచ్చాడు. అందుకని ఆఫీసుకి వెళ్ళిపోయాడు. మూడ్రోజులు ఆనందంగా, ఉల్లాసంగా గడిచిపోయాయి. మారత్న, నేను, మూడ్రోజులు ఏకధాటిగా ఊళ్ళోవి, ఇంట్లోవి కబుర్లన్నీ చెప్పుకొన్నాం.

నాలుగోరోజు సోమవారము. నాకు కాస్త నలతగా వుంది ఎందుకో. సెలవు పెట్టనా మమ్మీ! అంది రత్న.

వద్దన్నాను. సెలవులన్నీ దాచుకో ఎక్కువరోజులు సంక్రాంతి పండుగకు మా దగ్గర వుండొచ్చు. నాకేం ఫర్వాలేదు. నీవెళ్ళు అన్నా.

బాబుకి ఇంట్లో లేనిదంటూ ఏమీ లేదు. అన్నీ వున్నాయి. ఇంకా ఇంట్లో ఫోనుకి కనెక్షను యివ్వలేదు. ఫోను కూడా రెడీగా పెట్టేసే వుంది.

ఫోను కూడా లేదే, ఆఫీసు నుండి ఫోను చెయ్యాలంటే అని మారత్న బెంగపడి పోయింది.

ఫర్వాలేదులే, అంతకీ అర్జెంటు అయితే క్రింద వుందిగా అంటూ బాబు సర్దేడు. నేనూ అదే సమర్థించాను.

ఇద్దరూ టిఫిను తిని ఆఫీసుకి బయల్దేరారు. బాబు, రత్నను ఆఫీసులో వదిలి, తన ఆఫీసుకి వెళ్ళిపోతాడు. అదే ప్రోగ్రామ్ వాళ్ళదిరోజూ.

వాళ్ళు వెళ్ళిన తర్వాత నాకేం చేయాలో తోచలేదు. అన్నీ రత్న చేసి వెళ్ళిపోయింది. నేనేమీ చేయకూడదట. హాయిగా విశ్రాంతి తీసికోవాలట. బాగానే వుంది.

ఇంతలో మధ్యాహ్నం పై అంతస్థులో ఏదో కోలాహలం మొదలైంది. ఏమిటో నాకు తెలియలేదు. ఊరికే తలుపులు తీయవద్దని మావాళ్ళు చెప్పివెళ్ళారు. ఎటూ తోచక అలాగే చప్పుళ్ళు వింటూకూర్చున్నాను.

సాయంత్రం బాబు వచ్చిన తర్వాత అడిగా ఏమిటని? ' పైవాళ్ళకి ఎప్పటి నుండో ట్రాన్స్‌ఫర్ ప్రపోజల్ వుందట ఇంక తప్పలేదట మమ్మీ, కలకత్తా వెళ్ళిపోయారు' అన్నాడు.

'మళ్ళీ ఇపుడు ఎవరు వస్తారూ? అన్నా కంగారుగా! ఏమో చెప్పలేము. కొన్నాళ్ళు కాళీగానే వుండొచ్చు. లేదా ఇంటి వాళ్ళ ఇంకో కొడుకు, కోడలు, కుటుంబమే వస్తుందని కూడా అనుకొంటున్నారు' అన్నాడు బాబు.

రత్న ఎంతో రుచిగా వంటచేసి, కొసరి కొసరి తినిపించింది. భోజనాల తర్వాత ముగ్గురం దివాను మీద కూర్చుని, పిచ్చాపాటి మాట్లాడుకొన్నాము.

తెల్లారిలేచిన తర్వాత కార్యక్రమాలన్నీ మామూలే. రత్న, మళ్ళీ సెలవు పెట్టనా మమ్మీ అంది.

అనవసరంగా సెలవు వృధా చేయవద్దన్నాను. రత్న, బాబు, ఆఫీసు వెళ్ళిన తర్వాత, కాసేపు పడుకొని నెమ్మదిగా పనులన్నీ ముగించుకొని, భోజనంచేసి బాల్కనీలోకి వచ్చాను. భౌ... భౌ... అని అరుస్తోంది కుక్క. క్రిందకు తొంగి చూశాను.

పోర్టికోలో కట్టేసిన కుక్క నన్ను చూసే కాబోలు భౌ... భౌ... అని అరుస్తోంది. చూడటానికి చాలా భయంకరంగా వుంది. 'ఆల్సేషన్ ఎమో చిన్న పులిలా' వుంది. నిన్నలేని కుక్క ఈ రోజు ప్రత్యక్షమయింది ఏమిటా? అనుకొన్నాను.

అంతలో ఒక మనిషి 'రింగో, రింగో' అంటూ గేటుతీసికొని వచ్చాడు. ఆ పిలుపుకి నామీద అరవడం మాని అతన్ని చూస్తి తోక ఊపడం మొదలుపెట్టింది.

ఓహో పేరు రింగో అన్నమాట. వాడుదానికి అన్నంపెట్టేసి, కాసేపు దాన్ని, అటుయిటు తిప్పేసి, కట్టేసి వెళ్ళిపోయాడు.

బాల్కనీలో నన్ను చూసి మళ్ళీ అరవబోయింది. రింగో రింగో' అని పిలిచాను. పేరు పెట్టి పిలిచానేమో నెమ్మదిగా తోక ఊపడం మొదలుపెట్టింది. అయినా మధ్య మధ్య నన్ను చూసి అరుస్తోంది. మా ఇంట్లో కూడా బ్రౌనీ' వుందిగా కుక్కలు అలవాటే నాకు.

లోపలికి వెళ్ళి బిస్కట్లు తెచ్చా. ఒక బిస్కట్టు చూపించి, ఇదిగో నీకోసమే, తిను తిను అన్నా అది చలించలేదు. రింగో "టేకిట్, ఫర్‌యూ ఓన్లీ" అన్నా, ఈసారి రెండు కాళ్ళుపైకెత్తింది. ఇంగ్లీషు అలవాటు కాబోలు, బిస్కట్లు వేశా చక్కగా క్రిందపడకుండా అందుకొని తింది.

సాయంత్రం బాబు రాగానే అడిగా, ఏమిటని? క్రింద ఇంట్లో వాళ్ళందరూ ప్రొద్దుటే వాళ్ళ స్వంత ఊరు వెళ్ళారట. వాళ్ళ కుమార్తెకూడా ఈ ఊరిలోనే వుంటుందట. అందుకని వాళ్ళకుక్కని తెచ్చి, తిరిగి క్రిందవాళ్ళు వచ్చేవరకూ ఇక్కడే కాపలా పెట్టారట. వాళ్ళమ్మాయి ఇంటి దగ్గర నుండి రోజు మనిషి వచ్చి అన్నం పెట్టి పోతూ వుంటాడట. అదీ సంగతి అన్నాడు. ఓహో అన్నానేను తేలిగ్గా. ఆ ఓహో అంత తేలిక కాదని మర్నాడు తెలిసింది.

మళ్ళీ రత్న పాతపాటేపాడింది. సెలవు పెట్టనా? అని. వద్దన్నాను. ఇద్దరూ వెళ్ళిపోయారు.

కాలనీ అంతా చాలా కామ్‌గా వుంది. అంత పెద్ద బిల్డింగుకి నే ఒక్కదాన్నే. కార్నర్ యిల్లు. చుట్టూ ఖాళీస్థలాలు. ఏదో మనిషి సంచారంలేని వెలితి. మొదటి సారిగా కలిగింది. ప్రత్యేకమైన సమయాల్లో తప్ప. మిగిలిన సమయాల్లో జన సంచారం లేక నిశ్శబ్దం తాండవిస్తోంది.

నిశ్శబ్దవాతావరణం ఎంత ప్రశాంతమో, రణగొణధ్వనులు లేని మానవ మనుగడ ఒక్కోసారి అంత ప్రమాదకర వాతావరణాన్ని సృష్టిస్తుంది. మనిషి ఎపుడూ నిశ్శబ్దాన్ని భరించలేడు. అది కొంతసేపే హాయిగా వుంటుంది. ఎందుకంటే నిశ్శబ్దంలో నుండి ఏకాంతత, ఏకాంతతలో నుండి ఒంటరితనం పుట్టుకొస్తాయి కనుక.

వెంటనే బాల్కనీలోకి వచ్చా. రింగో నావైపు ఆశగా చూసింది. బిస్కట్లు తెచ్చివేశాను. అందుకొని ఆత్రంగా తింది. రింగో, రింగో అంటూ 'నే' పిలుస్తుంటే అది తోకవూపుతుండేది. అది అలా తోకవూపుతుంటే, నీకు నేను 'తోడు'వున్నానన్న భావన కలిగింది. అది ఆశగా నావైపు చూస్తుంటే, ఇంత పెద్ద బిల్డింగులో ఓప్రాణి నాకోసం, ఓప్రాణి కోసం నేను అన్నట్లుంది.

నిశ్శబ్దం, శబ్దాన్ని వెతుక్కొన్నట్లు, ఇన్నిరోజులు పట్టించుకోని ఒక విషయం ఆరోజు బాత్‌రూమ్ వైపు వచ్చినపుడు నేపసిగట్టేను. బాత్‌రూమ్ వెంటిలేటర్ దగ్గర నుండి, గువగువ శబ్దాలు వస్తున్నాయ్. అక్కడ రెండు పావురాలు కాపురముంటున్నయ్. కొంచెం, వెంటిలేటర్ అద్దము సవరించి వాటి వంక పరీక్షగా చూశాను. అవి నన్ను చూసి బెదరిపోలేదు. వాటికీ మనుష్యులు అలవాటల్లేవుంది. నెమ్మదిగా బాత్‌రూమ్ తలుపు తీసిపెట్టి వాటి గువగువ శబ్దాలు వింటూంటే ఏవో ప్రాణులు నాతోపాటు ఆపెద్ద బిల్డింగులో వున్నట్లే అనిపించింది.

గువగువ శబ్దాలు రాకపోతే ఏదో ఒంటరితనం ఆవరించి నట్లుండేది. వెంటనే వెళ్ళి బాత్‌రూమ్ వెంటిలేటర్ అద్దాలపై తట్టేదాన్ని. నేచేసిన చప్పుళ్ళకవి మళ్ళీ గువగువమనేవి. ఆహా! వున్నాయిలే అనుకొనేదాన్ని. అలా, ఆరోజంతా గడిచింది పావురాలతో, రింగోతో సహజీవనం చేస్తూ.

బాబుని అడిగా వెంటిలేటర్ అద్దాలు కొంచెం ఎత్తి, బాత్‌రూమ్ తలుపుతీసి పెట్టుకోవచ్చాఅని.

ఆ! తప్పకుండా! ఇది చాలా సేఫ్టీ ఇల్లు అన్నాడు.

రామమ్మా! నేడాడితో మొన్ననే మాట్లాడేననుకో ఈరోజు నీవు ఎస్.టి.డి.లో మాట్లాడుదువుగాని అన్నాడు.

బయటకు వెళ్ళి మావారితో మాట్లాడివచ్చా. 'ఏమోయ్! కొడుకు దగ్గరకు వెళ్ళగానే, ఇల్లు మర్చిపోయావా' అన్నారు. 'ఇంట్లో ఫోను లేక ఇబ్బంది అంతే' అన్నాను. మావారితో మాట్లాడిన తర్వాత మనస్సు కాస్త తేలిగ్గా వుంది. రత్న, బాబు ఆఫీసుకి వెళ్తున్నారు. క్రింద రింగోకి బిస్కట్లు వేస్తూ, పైన నాతోపాటున్న పావురాలకు మరమరాలు, బియ్యపు గింజలు వేస్తూ, ఆమూగజీవాలనే నానేస్తాలనుకొన్నాను.

కాని ఒక రోజు ఉన్నట్లుండి ఎలాంటి గువగువలు వినరాలేదు నాకేం అర్థంకాలేదు. ఇంతలో రింగోకి అన్నం పెట్టే కుర్రాడొచ్చాడు. వాడికి సరిగ్గా బాత్‌రూమ్

వెంటిలేటర్ వైపు కనిపిస్తుంది. వాణ్ణి అడిగేను 'అక్కడ రెండు పావురాలు వుండాలి. వున్నాయా?' అని. వాడు పళ్ళికిలిస్తూ, 'లేదు మేమ్‌సాబ్, నేనే నిన్న రింగోని తిప్పడానికి వచ్చినప్పుడు కర్రతో అదిలించి తరిమేసి, అక్కడ కర్రతో జాలీని మూసేసాను. ఒకటి ఎగిరిపోయింది' అన్నాడు.

మరి ఇంకొకటి ఏమైంది? అన్నా.

కర్రతో అదిలిస్తుంటే, దాని కాలికి దెబ్బ తగిలినట్లుంది. ఎగరలేకపోయింది మేమ్‌సాబ్. జాలీలోనే వుండిపోయింది మేమ్‌సాబ్ అన్నాడు.

ఓరి! భడవా! ఇది నీపనా అనుకొంటూ, జాలీలో నెమ్మదిగా బ్యాటరీలైటు వేసి చూశా, ఒక మూలకి, ఒదిగి విచారంగా కూర్చుంది ఆపావురం. మరమరాలు, బియ్యపు గింజలు వేస్తే ముట్టుకోలేదు. జాలీని బ్రూత్‌బ్రష్‌తో ఎత్తి, పావురాన్ని బయటకు వదలాలని ప్రయత్నించా, కాని వీలుపడలేదు. మధ్య మధ్య దానిని గమనిస్తూనే ఉన్నా. అది గువగువమనడం లేదు.

మాబ్బాయితో చెప్పి ఏదైనా చేయాలనుకొన్నా, కాని ఆరోజు వాళ్ళిద్దరూ ఆలస్యంగా ఇంటికొచ్చారు. బాబుకి ఆఫీసులో ఏదో మీటింగు వుంది, రత్న ఆఫీసుకి ఆలస్యంగా వెళ్ళాడు. అందుకే ఇద్దరికీ ఆలస్యమయింది. వాళ్ళు అలసిసొలసివస్తే, పావురాయి అంటే ఏం బావుంటుంది? అందుకే నేఊరుకొన్నాను.

మర్నాడు రింగోకి అన్నం పెట్టే వాడువచ్చాడు. వాడ్ని చూసి ఆపువారాన్ని కూడా జాలీలో నుండి వదిలేయమన్నా. కాలి నొప్పిపోయినట్లుంది. అదికూడా రివ్వున గాలిలోకి ఎగిరిపోయింది. అమ్మయ్య పోనీలే రెండూ కలసి కొంటాయి అనుకొన్నాను. మనస్సు కుదుటబడింది.

ఆమర్నాడంతా ఎదురు చూశాను. ఆ పావురాళ్ళు కాని మళ్ళీ వస్తాయేమోనని. వాడు ఏంబెదర గొట్టాడో ఏమోకాని అవి కనుచూపుమేరలోకి రాలేదు. ఒకటి వాడు బెదరగొట్టాడు. ఒకటినే చెదరగొట్టా, లేదు లేదు నేనే వదిలేశా. పోనీలే అవి రెండూ కలిస్తే అంతేచాలు. ఆ భావనే ఎంతో హాయిగా వుంది. కాని ఏదో పోగొట్టుకొన్న బాధ సన్నగా ప్రారంభమయింది మనస్సులో.

ఆమర్నాడు రోజు వారి కార్యక్రమాలు మామూలే. బాల్కనీలోకి వచ్చా. ప్రేమగా క్రిందికి చూశాను. అక్కడ రింగో లేదు. చాలసేపు ఎదురు చూశాను. వాడు కాని బయటకు తీసికెళ్ళాడేమోనని. గంటలు గడిచాయి కాని రింగో జాడలేదు. ఆశగా బాత్‌రూమ్ వైపు పరుగెత్తికెళ్ళాను. పావురాళ్ళు కాని వచ్చాయేమోనని. ఉహూ అవీ రాలేదు. రావడానిక్కూడా వీల్లేకుండా, గట్టిగా, జాలీ నొక్కేసి వుంది. అదివాడిపనే.

సాయంత్రం రత్నని అడిగా, రింగో గురించి. 'మమ్మీ అది యజమానులకు దూరంగా ఇక్కడ వుందికదా! బాగా బెంగపెట్టుకొందట, జ్వరం కూడా వచ్చిందట. ఇంటి వాళ్ళమ్మాయి వచ్చి తీసికెళ్ళిందట. మనం ఉన్నాంకదా! ఇంటికేం ఫర్వాలేదు. మనం చూసికొంటామని అనుకొంటున్నారు - అంది. అయ్యో పాపం అనుకొన్నాను.

పిల్లలిద్దరూ ఆఫీసులకు వెళ్ళిన తర్వాత తెలిసింది. అంత పెద్ద ఇంట్లో ఎవ్వరూ లేరని. నే ఒక్కర్తినే వున్నానని. ఆశగా ఒకసారి బాత్‌రూమ్‌లోకెళ్ళి చూశా, ఏ పావురాలు

లేవు. ఏ గువగువలూ లేవు. వాకిట్లోకి తొంగి చూశా. రింగో లేదు. మూగప్రాణుల తోడు కూడా లేనినాకు. మనస్సు కూడా మూగబోయింది. జంటగా వున్నపుడు తుంటరిగా వుండే మనస్సు. ఒంటరిగా వున్నపుడు మూగబోతుంది కాబోలు.

నా ఆ ఒంటరి తనాన్ని పటాపంచలు చేస్తూ. ఫోను గణగణ మ్రోగింది. ఆశ్చర్యంతో రిసీవర్ అందుకొన్నా.

మమ్మీ! ఏం చేస్తున్నావ్? ఈరోజు మన ఫోనుకి కనెక్షన్ యిచ్చేశారు. రేపటి నుండి మనం రోజూ ఆఫీసు నుండి ఇంటికి. ఇంటి నుండి ఆఫీసుకి ఫోనులో మాట్లాడుకోవచ్చు.

వింటున్నావా? మమ్మీ?

ఆ... ఆ... వింటున్నా! బాబు గొంతువినేసరికి ప్రాణంలేచివచ్చినట్లైంది. నా ఒంటరి తనం పటాపంచలైంది.

నీవు వెంటనే డాడీకి ఫోను చేసి మాట్లాడు. మర్చిపోవద్దు. సాయంత్రం తొందరగా ఇంటికి వచ్చేస్తాం సరేనా! మమ్మీ!

ఆ... ఆ... సరే!

వెంటనే మావారికి ఫోను చేశాను. "ఏమండీ, నేనే కమల్ని మాట్లాడుతున్నా. బాబు వాళ్ళకి ఫోను వచ్చేసింది. మొదట ఫోను మీకే చేస్తున్నాను. ఏమిటి? ఎలా వున్నారు? ఏం చేస్తున్నారు?

ఆ... బాగానే వున్నా! కాని నీవు లేక నాకిక్కడ అంతా ఒంటరిగా వుంది. ఎపుడు వస్తావ్?

"ఒంటరిగా వున్నారా? బ్రౌనీ వుందిగా!"

బ్రౌనీ! అది నీకోసం బెంగపెట్టుకొందేమో చాలా జబ్బుగా వుంది కమలా!

మరి నాకు వెంటనే చెప్పలేదేమండీ!

చెప్తే నీవు బెంగపెట్టుకొంటావని. నా ఒంటరి తనంనాకెలాగూ తప్పదు. నిన్ను కంగారు పెట్టడమెందుకని చెప్పలేదు.

అలాగా! నే తొందరగా వచ్చేస్తాలెండి. ఆరోగ్యం జాగ్రత్త. బ్రౌనీ జాగ్రత్త. నేవుంటాను. ఫోను పెట్టేశాను.

వారు ఒంటరితనమన్నమాటకు అర్థం గ్రహించాను. నా కళ్ళలో ఎందుకో నీళ్ళు తిరిగాయి.

సాయంత్రం. బాబు ఇంటికి రాగానే నెమ్మదిగా అసలు విషయం కదుపుతూ

'రేపు నాకు టిక్కెట్టు కొనునాన్నా! ఊరు వెళ్తా'నన్నాను.

'అపుడేనా మమ్మీ. వచ్చి ఎన్నో రోజులు కాలేదుగా!' అన్నాడు.

'మరి అక్కడ మీ డాడీ ఒంటరిగా వున్నారుగా పాపం' అన్నాను. రత్న నవ్వుతోంది.

డాడీని కూడా రమ్మంంటేనో మమ్మీ.

ఇపుడు రాలేనంటున్నారుకదా నాన్నా!

మరి. తప్పదా! టిక్కెట్టుకొనేయమంటావా?

తప్పదుమరి, మీరు ఏప్రిల్లో అమెరికా వెళ్లేటపుడు ఎలాగూ రావాలిగా, అపుడు ఇద్దరం కలిసే వస్తాము. రత్న! మళ్ళీ నవ్వుతోంది.

డాడీ మార్చిలో వస్తానన్నారు కదా మమ్మీ!

మార్చిలో వచ్చినా ఇద్దరం కలిసే వస్తాము.

రత్న ఇంకా నవ్వుతోంది. ఇంటికి వెళ్ళాలనే నానిర్ణయము మారదని బాబుకి తెలుసు. బాబు టిక్కెట్టు తెచ్చాడు. రత్న, బాబు ఎయిర్‌పోర్టుకొచ్చారు.

విండోలో నుండి నే టాటా చెప్తుంటే, విమానం 'టేకాఫ్' తీసికొంది. జాలీలోని పావురాలు ఎగిరినట్టు నా మనస్సులో మెదిలే మూగనేస్తాల సాక్షిగా!

# బాలలదినం

చంద్రలత

అలారం మోగగానే టక్కున లేచి, గడియారం వంక చూసింది శిరీష. కమాండర్ చూపు తనవైపు పడగానే అటెన్షన్‌లోకి వచ్చిన సైనికునిలా నిటారుగా నిలుచునివున్నాయి గడియారంలోని ముళ్ళు.

అమ్మో, అప్పుడే సిక్స్ అయిందే!' అనుకొంటూ, బెడ్‌మీద నుంచి గబుక్కున దూకి, కప్పుకున్న దుప్పటిని ఉండలా చుట్టి, అల్మారాలో కుక్కి బాత్‌రూంలోకి పరుగుతీసింది శిరీష.

"గీతా టీచర్ సిక్స్‌థర్టీకంతా స్కూలుకి వచ్చేయమంది. నేను వెళ్ళడం లేటు అవుతుందో! ఏమో?" గొణుక్కుంటూ గీజర్ ఆన్‌చేసి రూంలోకి వచ్చింది.

అల్మారాలోంచి స్కూల్‌బ్యాగును బయటకు తీసి దాంట్లోని పుస్తకాలు టేబుల్‌పైకి విసిరేసింది. తెల్ల స్పోర్ట్సుడ్రస్‌ని, తెల్లరిబ్బన్స్‌ని బ్యాగులో పెట్టుకొంది. అవి కన్పించకుండా పైన రెండు పుస్తకాలు సర్దింది.

ఫ్రిజ్‌లోంచి ఇన్సులిన్ బాటిల్ తెచ్చి టేబుల్‌మీద పెట్టింది.

బరబరా డ్రాయర్‌లాగి సిరంజిని, మిగిలిన సరంజామాని బయటకు తీసింది.

సిరంజి లోడ్ చేసుకొని, ఎడమ తొడలోకి ఇంజెక్ట్ చేసుకొంది. ఖాళీ సిరంజిని డస్ట్‌బిన్‌లో పడేసి, ఓసారి దూదితో ఇంజెక్షన్ చేసుకున్న దగ్గర అదిమి, దూదిని కూడా సిరంజిపక్కకివిసిరేసింది.

ఎదురుగా వున్న డ్రస్‌ని ఓదాన్ని తీసుకొని స్నానానికి వెళ్ళింది.

మొక్కల దగ్గరనుండి అప్పుడే లోపలికి వచ్చిన సుధ, శిరీష రూంలోంచి పొద్దున్నే స్నానం చేస్తున్న శబ్దం వినిపిస్తూండడంతో, ఆశ్చర్యంతో శిరీష రూంలోకి వచ్చింది, "ఏమిటో విశేషం! ఇవ్వాళ శిరీష లేపకుండానే లేచిందే!" అనుకొంటూ.

బెడ్‌షీట్ సరిచేసి, స్కూల్ బ్యాగుతీసి టేబుల్‌మీద పెడదామని చేతిలోకి తీసుకొంది.

ఇంతలో, దఢాల్న బాత్‌రూం తలుపు తీసుకొని, పరిగెత్తుతున్నట్లు బయటకు వచ్చింది శిరీష.

"ఏంటి శిరీ! ఇంత హడావుడి? ఎప్పుడూ లేనిది ఇంత ఎర్లీగా రెడీ అవుతున్నావు?" అడిగింది సుధ.

తన బ్యాగ్‌లోపల వున్న వైట్‌డ్రస్‌ని సుధ చూసిందేమోనని, సుధ చేతిలోన్ని బ్యాగును ఒక్క ఉదుటున లాక్కొని టేబుల్‌మీద పడేసింది శిరీష.

శిరీష తన కంగారును కవర్‌చేస్తూ టక్కున అంది.

"అబ్బే, ఏంలేదు మమ్మీ, ప్రతిమా వాళ్ళింటికి వెళదామని!"

"ఇంత పొద్దుటే ఎందుకురా? నిదానంగా వెళ్ళవచ్చుగా!" అంది సుధ, గబగబ జడలు విప్పుకొంటున్న శిరీషను ఆశ్చర్యంగా చూస్తూ.

"ప్రతిమావాళ్ళ ట్యూషన్‌మాస్టరు ఇంపార్టెంట్ క్వొశ్చన్స్ ఎక్స్‌ప్లెయిన్ చేస్తారంట మమ్మీ! ఆయన ఆరునుంచి ఏడుగంటలవరకే కదా వుంటారు. కొంచెం తొందరగా పోనీ వేసేయి మమ్మీ" అంటూ దువ్వెన సుధ చేతికిచ్చి ఆమెను కూడా హడావుడి పెడుతూ అంది శిరీష.

డస్ట్‌బిన్‌లో వున్న సిరంజిని చూసి, "అప్పుడే ఇంజెక్షన్ చేసుకొన్నావా? అయితే టిఫిన్ చేసి వెళ్ళు శిరీ" పోనీకి రబ్బర్‌బాండ్ వేస్తూ అంది సుధ.

"లేదు మమ్మీ లేటవుతుంది. నేను ప్రతిమా వాళ్ళింట్లో టిఫిన్ చేస్తాలే మమ్మీ. ఎలాగూ ఆంటీ వెళ్ళగానే ఏదో ఒకటి తినమని ఇస్తుంది. అందుకనే ఇంజెక్షన్ కూడా చేసేసుకొన్నాను" వైట్ కాన్వాస్ షూస్‌ని మంచం కింద నుంచి బయటకులాగి, వాటికి ఇన్‌స్టంట్‌షైన్ పాలిష్ వేస్తూ అంది శిరీష.

"కాన్వాస్ షూస్ ఎందుకు? పమ్స్ వేసుకొని వెళ్ళకపోయావా!" సుధ శిరీషవంకే చూస్తూ అంది.

"ఏమిటి మమ్మీ, నువ్వు అన్నిటికీ ఏదోఒకటి అంటావు! ఇప్పుడు ఇవి వేసుకొంటే ఏం? పమ్స్ ఈ డ్రస్‌కి మ్యాచ్ అవ్వవు. ఊరికే గొడవ చేయకు మమ్మీ!" లేని కోపం తెచ్చి పెట్టుకొని విసుక్కొంటూ అంది శిరీష.

"సరే నీ ఇష్టం కనీసం పాలయినా తాగి వెళ్ళు" అంటూ వంటింట్లోకి వెళ్ళింది సుధ.

శిరీష షూస్ వేసుకొనే లోపలే పాలు తెచ్చిచ్చి వెళ్ళింది సుధ.

బొట్టు బిళ్ళ కోసం హడావుడిగా డ్రాలో వెతుకుతూ, శిరీష పాలు ఓ గుక్కతాగి, గ్లాసు టేబుల్‌మీద పెట్టింది.

పంచదార లేని పాలు రోజూ తాగుతూనే వున్నా, ఈ రోజెందుకో వెగటుగా అన్పించాయి.

పాలు వాష్‌బేసిన్‌లో పోసి, ట్యాప్ తిప్పేసింది.

ఖాళీగ్లాసు తెచ్చి టేబిల్‌మీద పెట్టి. ముఖానికి బొట్టుబిళ్ళ అతికించుకుంది. బ్యాగు భుజానికి తగిలించుకొని బయటకు పరుగుతీసింది.

"శిరీ. నువ్వు టిఫిన్ చేయలేదని ఆంటీకి ఫోన్ చేసి చెప్పనా?" సుధ వెనుకనుంచి పిలుస్తూ అంది.

"వద్దులే మమ్మీ. నేనే అడిగి తింటాను. బై మమ్మీ!"

గేటు తీసుకొని గబగబ నడుస్తూవెళ్ళింది శిరీష.

పరుగులు పెడుతున్న శిరీషను ఆశ్చర్యంగా చూస్తూ నిల్చుంది సుధ కాసేపు.

"బ్లడ్‌లో షుగర్ తగ్గిపోతే హైపోగ్లైసిమియా వస్తుందన్నారు డాక్టరుగారు. శిరీషేమో ఇంజెక్షన్ చేసుకొని టిఫిన్ చేయకుండా వెళ్తోంది. రాత్రి కూడా సరిగ్గా తినలేదు. అయినా నా కంగారు కానీ ప్రతిమ వాళ్ళ మమ్మీకి శిరీష సంగతి తెలుసుగా! ఏదో ఒకటి తినమని చెపుతుందిలే!" తననుతాను సమాధానపరుచుకొని లోపలికి వెళ్ళింది సుధ. అయినా ఓసారి ప్రతిమ వాళ్ళింటికి ఫోనుచేద్దామని రిసీవర్ ఎత్తింది సుధ. డయల్‌టోన్ రావట్లేదు. ఫోన్ డెడ్ అయినట్లుంది.

కానీ అప్పటికే, ప్రతిమ వాళ్ళింటికి వెళతానన్న శిరీష అడుగులు స్కూలువైపు మళ్ళాయి.

* * *

"హాయ్ శిరీషా! ఏవిటే ఇంత లేటు?" అంది బిందు శిరీష స్కూలు గేటులోంచి లోపలికి అడుగుపెట్టగానే.

"హాయ్! మన ఫ్రెండ్సంతా ఏరి?" చుట్టూ చూస్తూ అడిగింది శిరీష.

"గీతా టీచర్ అందరినీ రెడీ చేసింది. నువ్వే మిగిలిపోయావు. కాసేపు చూసి మేం స్టేడియంకి వెళ్ళిపోయేవాళ్ళం తెలుసా!" అంది బిందు శిరీషని గీతాటీచర్ వాళ్ళున్న దగ్గరికి తీసుకువెళ్తూ.

"ఏం చేయాలే! నిద్ర లేచేసరికి లేటయిపోయింది. నడిచి వచ్చేసరికి ఇంకాస్త! ఇదే ఫస్ట్‌టైంకదా నేను ఇలాంటి ప్రోగ్రామ్స్‌కి రావడం. ముందు ఎలా ప్రిపేర్ అవుతారో నాకు తెలియదుగా. నావలన ప్రోగ్రాంకి లేటయిపోతుందేమో? టీచర్ కోపంగా లేరుకదా! అయినా. నువ్వేమిటి గేటు దగ్గరే వున్నావు?" శిరీష బిందుని గబగబ అడిగింది.

"నీ కోసమే! గీత టీచర్ పంపించింది. నువ్వు మరీ అంత లేటవ్వలేదులే. బస్సు ఇంకా రాలేదు. ఎప్పుడో తయారయికూర్చున్న మా అందరికి బోర్ కొడుతోంది. అందుకే. టీచర్ నీకోసం వెళ్ళమనగానే, గభాల్న బయటకు వచ్చేశాను. అలా ఓ రౌండ్ కొట్టొచ్చుకదాఅని. సరేకానీ! మీ మమ్మీని ఎట్లా మానేజ్ చేశావు? నీవు స్పోర్ట్సుడ్రెస్ తెచ్చుకొంటుంటే ఆంటీ చూడలేదా?" కుతూహలంగా అడిగింది బిందు.

"ఏముంది? ప్రతిమ వాళ్ళింటికి వెళ్తున్నానని చెప్పాను. తనే పోనీవేసి మరీ పంపింది. తెలుసా?" పోనీని ముందుకు వేసుకొంటూ అంది శిరీష.

"మరీ ఊరికినే అంటీ గొడవ చేస్తుందని భయపడ్డావుగా?" అంది బిందు.

"ఆ .... మమ్మీకి తెలిస్తే ఎప్పటికీ నన్ను పార్టిసిపేట్ చేయనిచ్చేదే కాదు" అయిష్టంగా ముఖంపెట్టి అంది శిరీష.

బిందూ తమ క్లాసువాళ్ళున్న రూంలోకి దారితీసింది.

"వైట్‌డ్రస్, రిబ్బన్స్ తెచ్చుకొన్నావా శిరీషా?" గీతా టీచర్ శిరీష రూంలోకి అడుగు పెట్టి పెట్టగానే అడిగింది.

శిరీష తలూపి, గభాల్న బ్యాగులోంచి వాటిని చేతిలోకి తీసుకొంది.

"క్విక్ శిరీషా! నీదే ఆలస్యం! వెళ్ళి తొందరగా డ్రస్ మార్చుకో!" అంది గీతా టీచర్.

బెంచీలను పక్కపక్కన నిలబెట్టి, ఏర్పాటు చేసిన డ్రస్సింగ్ రూంలోకి వెళ్ళి శిరీష డ్రస్ మార్చుకొని వచ్చింది.

గీత శిరీష పోనీని విప్పి, కొద్దిగా దువ్వింది. తెల్లరిబ్బన్‌ని చెవిపక్కన చిన్నపువ్వు వచ్చేలా కట్టింది గీత టీచర్. తన దగ్గర వున్న మేకప్ సామాగ్రితో శిరీష ముఖానికి కొద్దిగా మెరుగులు దిద్దింది.

లైట్‌గా లిప్‌స్టిక్ వేసింది.

వాళ్ళ స్కూలు పేరున్న పెద్ద శాటిన్ బ్యాడ్జ్‌ని షర్టుకి పిన్ చేసింది. జుట్టును మరో సారి దువ్వి, బొట్టును సరిచేసింది.

బిందును, శిరీషని రూంలో మూలగా పెట్టివున్న పూలబుట్టల దగ్గరకి తీసుకెళ్ళింది.

"మీరిద్దరూ ఈ ఎర్రగులాబీ గుత్తులను చెరోటి పట్టుకోండి. మినిష్టరుగారు మీ దగ్గరకి రాగానే ఇచ్చి, నమస్కారం పెట్టాలి. వీటిని జాగ్రత్తగా పట్టుకోండి. ముళ్ళు ముదురుగా వున్నాయి. గుచ్చుకోగలవు" అంటూ వారిచేతికి పూలగుత్తులను అందించింది గీత.

వాళ్ళిద్దరూ వాటిని జాగ్రత్తగా అందుకొన్నారు. ఏదో అపురూపమైన వస్తువును మొదటి సారి అందుకొన్నట్లు.

గదిలో వున్న మిగిలిన అమ్మాయిలను పిలిచింది గీత.

"అరవిందా, మీరంతా ఇలా రండి. మీ రందరూ ఈ బుట్ట తలా ఒకటి తీసుకోండి. ఈ బుట్టలలో వున్న ఎర్రగులాబీ పూరేకులను మినిష్టరుగారు నడిచే దారిలో చల్లుతూ వుండాలి. అర్థమయిందికదా?"

"అలాగే టీచర్" అంటూ అందరూ తలలూపారు.

"మీరందరూ ఒకే దగ్గర వుండండి. నాకు చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళద్దు" అంటూ చెప్పి గీత బయటకు వెళ్ళిపోయింది.

"అబ్బా! ఈ బుట్ట బరువుగా వుందికదూ దివ్యా" అంది అరవింద.

"నీతలకాయ్! పూలబుట్ట బరువుండడం ఏవిటి? అయినా ఇప్పట్నించీ మోయడం ఎందుకులే! కిందపెట్టి వెళ్ళేప్పుడు తీసుకెళ్దాంలే!" అంది దివ్య తన చేతిలోని బుట్టను కిందపెడుతూ.

"అలాగా? అయితే పహిల్వాన్ బేబీ, నా బుట్టను కూడా స్టేడియంకి నువ్వే మోసుకురా!" అంది అరవింద విసురుగా తన బుట్టను దివ్య చేతికిస్తూ.

"జీ హుజూర్!" అంది కీర్తి. వీళ్ళిద్దరి ఎదురుగా మోకాళ్ళమీద వంగి నాటకీయంగా కుడిచేతిని, తలని కొద్దిగా వంచి.

అందరూ నవ్వడంతో వాతావరణం తేలికఅయ్యింది.

"శిరీషా! మీ మమ్మీకి తెలిస్తే నిన్ను ఇక్కడ్నించి లాక్కెళ్తుందికదా?" అంది శీతల్ శిరీషవైపు తిరిగి.

"మమ్మీకి ఎలా తెలుస్తుంది?" కనుబొమ్మలు ఎగరేస్తు అంది శిరీష.

"ఆంటీ ప్రతిమకి ఫోన్‌చేస్తే? సందేహంగా అడిగింది బిందు.

"అపశకున పక్షి" తన రెండు బొటనవేళ్ళను నుదుటికి అటూఇటూ అన్చి, మిగిలిన వేళ్ళను రెక్కల్లా ఆడిస్తూ వెక్కిరిస్తూ అంది కీర్తి.

అందరూ నవ్వుతూ వున్నా, శిరీష మాత్రం సందేహంతో ముఖం ముడుచుకుంది.

"లాస్ట్‌టైం నువ్వు డాన్స్‌లో పేరిచ్చినప్పుడు కూడా ఆంటీ నిన్ను మాన్పించిందికదా శిరీషా?" శీతల్ అంది.

"మనముందే శిరీష మాటలన్నీ! వాళ్ళ మమ్మీని చూసిందా... మ్యావ్... మ్యావ్" వెక్కిరిస్తూ అందికీర్తి.

ఉక్రోషంతో శిరీష ముఖం ఎర్రబడింది.

"ఎందుకబ్బా ఊరికినే శిరీషని టీజ్ చేస్తారు? వాళ్ళ మమ్మీ వద్దు అంది అంటే ఏదో రీజన్ వుండేవుంటుంది. అయినా శిరీషా! నీకు వంట్లో బావుండదుగా?" అప్పటిదాకా మౌనంగా వున్న సైరా అంది.

"ఆ... అలా అని చెప్పే మా మమ్మీ నన్ను ఏ ప్రోగ్రాంలోకి రానివ్వదు. నాకు ఏమీ ప్రాబ్లెం లేదన్నా విన్పించుకోదు. ఇప్పుడు డాక్టరంకుల్ ఇంజెక్షన్ వేసుకోవడం నేర్పాక హాయిగా వుంది. అంతకుముందయితే దానికి కూడా రోజూ ఓ సీన్ పెట్టేది. మీ అందరితో కలిసి ఇలాంటి ప్రోగ్రామ్స్‌లో ఎంజాయ్ చేస్తే ఎంత బాగుంటుంది! అయినా మినిష్టర్‌కి బొకే ఇచ్చేఛాన్స్ అందరికీ వస్తుందా? మా మమ్మీకి ఏం తెలీదు" చేతుల్ని గాలిలోకి విసురుతూ గబగబా అంది శిరీష.

"అవునవును... పోయినసారి చిల్డ్రన్స్‌డే రోజు నేను బొకే ఇస్తే మినిష్టరు నా భుజం మీద తట్టారు తెలుసా! మా అన్నయ్య ఫొటో కూడా తీశాడు" అందర్నీ గర్వంగా చూస్తూ అంది శీతల్.

"మరే! ఆ తరువాత ఓ ఆర్నెల్లు నీ ఫోజు చూడలేక... మేం చచ్చాం!" కీర్తి టక్కున అంది.

అందరూ కిసుక్కునన్నారు.

శీతల్ ముఖం చిన్నబుచ్చుకొని మూతి ముప్పై ఎవంకర్లు తిప్పింది.

"అమ్మాయిలూ! బస్సు వచ్చింది. లైన్‌గా పదండి" గీత టీచర్ తలుపు దగ్గరకి వచ్చి లోపలికి చూస్తూ అరిచింది.

శిరీషా వాళ్ళంతా వాళ్ళ సరంజామాతో గబగబ బస్సెక్కారు.

బస్సంతా కోలాహలంగా వుంది.

గైడ్స్ మెడలలోని స్కార్ఫ్‌లను. యన్.సి.సి. స్టూడెంట్ల క్యాప్‌లపైనా బెల్టులపైనా వున్న ఇత్తడి బిళ్ళల తళతళలను వారి యూనిఫాంల ఫెళఫెళలను ఆశ్చర్యంగా గమనిస్తూ కూర్చున్నారు శిరీష బృందం

"మనం కూడా వాళ్ళతో జాయిన్ అవుతే బావుంటుందికదా?" అరవింద మెల్లిగా అంది అందర్నీ చూస్తూ.

"అవును. రోజూ పెరేడ్ అయ్యాక వాళ్ళకి కేక్స్ పెడతారంట. అప్పుడప్పుడు క్యాంపులకి తీసుకెళ్తారంట. భలే ఎంజాయ్ చేస్తారంట తెలుసా?" దివ్య అంది.

"నీకెలా తెలుసు?" బిందు ఆసక్తిగా అడిగింది.

"మా అన్నయ్య చెప్పాడు. యన్.సి.సి.లో వున్నాడుగా!మనం కూడా ఓ రెండు మూడు సంవత్సరాలయితే చేరచ్చుట!" అంది దివ్య.

"అయితే, నేను తప్పకుండా చేర్తాను" శీతల్ ధృఢంగా అంది.

"ఏం తల్లీ. ఈసారి చీఫ్‌మినిష్టర్‌తోనో, గవర్నరుతోనో ఓ ఫోటో దిగి మాకు అప్పుడప్పుడు ఫ్లాష్‌బ్యాక్‌లో ఓ ఝలక్ చూపిస్తూవుండొచ్చనా? ఇక మమ్మల్ని వాడే రక్షించాలి!" చేతులు రెండు పైకెత్తి తమాషాగా అంది కీర్తి.

"అదేం కాదులేవే! కేక్స్ సంగతి తెలిసిందిగా! అందుకే అయివుంటుంది. అంతేకదూ శీతల్?" సైరా శీతల్‌వైపు చూస్తూ అంది.

అందరూ ఫక్కుమన్నారు.

"గర్ల్స్! కీప్ క్వయిట్!" గీత టీచర్ గద్దిమించింది.

ఇంతలో బస్సు స్టేడియంలోకి ప్రవేశించింది.

పిల్లలు ఎవరి ఇన్‌ఛార్జి టీచర్‌తో వాళ్ళు కిందకు దిగిపోయారు.

విశాలమైన స్టేడియం దగ్గరికి వచ్చి ఆగడంతో కోలాహలం పెరుగుతోంది. రకరకాల దుస్తులతో, మేకప్‌లతో వున్న పిల్లలు బిలబిలలాడుతూ ఆ మైదానంలో అటూ ఇటూ తిరుగుతున్నారు. వారి టీచర్ల అరుపులతో వాలంటీర్ల విజిళ్ళతో సందడి మరింత పెరుగుతోంది.

గీతా టీచర్‌ముందే సున్నంతో గీసివున్న లైన్లపై వీళ్ళను నిలబెట్టింది.

శిరీషకి ఎదురుగా దారికి అటువైపున నిల్చుంది బిందు.

వీరికి కొద్దిగా ముందుగా మిగిలినవారు దారికి అటూ ఇటూ నిల్చున్నారు.

గీతా టీచర్ మరోసారి వారికి ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చి వారికి వెనగ్గా నిల్చుంది. మిగిలిన టీచర్లు కూడా ఒక్కొక్కరే గీత దగ్గరికి వస్తున్నారు.

"హలో గీతా! ఏమిటీ ఈసారి మీ ప్రోగ్రాం ఇదేనా?" మామూలు వైట్ స్కర్ట్స్‌లలో వున్న శిరీష వాళ్ళను చూపిస్తూ అందో కళ్ళజోడావిడ.

"హలో! అ... ఇంతకంటే ఎక్కువెందుకులే అని. ఇది కూడా మా హెచ్.ఎమ్.. ఆర్డరు వేసిందని ప్లాన్ చేశాను" చిన్నగా అంది గీత.

"అయితే మాత్రం మరీ ఇంత సింపుల్ ప్రోగ్రామా? మీ హెచ్.ఎమ్. అంతగా పట్టించుకోనట్లుగా వుందే! మా హెచ్.యమ్. ఇవ్వాళ పొద్దున కూడా స్వయంగా రిహార్సల్స్ చేయించింది. పిల్లలతో కలిసి అందరం అయిదుగంటలకల్లా స్టేడియంకి వచ్చేశాం తెలుసా?" కళ్ళజోడావిడ మిగిలిన టీచర్లని కనుచివర్లనుండి గమనిస్తూ అంది.

"ఇంతకీ ఏం ప్రోగ్రాం ఏమిటి మీది?" ఆసక్తిగా అడిగింది గీత.

"అదుగో అక్కడ వున్నారే నెహ్రూలా, గాంధీలా, భారతమాతలా, తామరపూలలా, తుమ్మెదల్లా పిల్లలు! వాళ్ళతోనే మా ప్రోగ్రాం! ఏం చేయబోతున్నామో మీరే స్వయంగా చూడండి" అంది ఆవిడ అందరి ఆసక్తిని మరింత పెంచుతూ.

"ఏమిటీ? మరీ అంత చిన్నపిల్లలతోనా కె.జి. పిల్లల్లాగా వున్నారే! ఈ ఎండలో ఎంతసేపని వుండగలరు? మధ్యలో ఏడ్చి వెళ్ళిపోతే" గీత వారినే చూస్తూ అంది.

"నా ట్రైనింగ్ తీసుకొన్న పిల్లలు ఏడవడం అనేది వుండదు. ఏడుపులు, తుడుపులు, పనిష్‌మెంట్‌లు అన్నీ రిహార్సల్‌లోనే అయిపోయాయి. ఇక ఎండ సంగతంటావా? మాస్కూలు ఇక్కడికి దగ్గరేగా! ఓ నెలరోజుల్నించీ రోజూ మధ్యాహ్నం తీసుకొచ్చి, ప్రాక్టీసు చేయించేదాన్ని. ఎంతైనా ఇది మా స్కూలు ప్రిస్టేజి విషయం కదా?" ఆవిడ తన కళ్ళజోడును చేతిలోకి తీసుకొని కర్చీఫ్‌తో అద్దాలను తుడుస్తూ అంది.

"అయితే మాత్రం! మరీ అంత చిన్నపిల్లలతో మండుటెండలో ప్రాక్టీసా? వాళ్ళ పేరెంట్స్‌కి ఈ విషయం తెలుసా?" గీత అడిగింది.

"ఆ... పేరెంట్స్‌ది ఏముందోయ్? మనమెంత చెపితే అంతేగా! వాళ్ళకు వాళ్ళ పిల్లలు స్టేడియంలో మినిష్టరుగారి ముందు ప్రోగ్రాం ఇస్తున్నారని తెలుస్తుంది. కానీ ఈ ప్రాక్టీసు గొడవలేం తెలుస్తాయి? వారికి ఓ ఫోటో పంపిస్తే సరి! అందరికీ గొప్పగా చూపించుకొంటూవుంటారు. పైపెచ్చు. ప్రతి ప్రోగ్రాంకి కాస్ట్యూమ్స్‌కనీ, మేకప్‌కనీ వారి దగ్గర నుండే డబ్బులు వసూలు చేయిస్తుంది మా హెచ్.ఎమ్! మీకో విషయం తెలుసా?" ఆవిడ కళ్ళజోడును మళ్ళీ పెట్టుకొంటూ అంది.

"ఏమిటీ?" గీత కుతూహలంగా అడిగింది.

"మా హెచ్.ఎమ్. ఈ ప్రోగ్రాంని ఓ అడ్వర్‌టైజ్‌మెంట్‌లా వాడుకొంటుంది తెలుసా! పోయినసారి మా బటర్‌ఫ్లై డాన్స్‌కి ఫస్ట్‌ప్రైజ్ వచ్చిందికదా! వరుసగా ఓ నెలరోజులు న్యూస్ పేపర్లలో ఫోటోలతోసహా ఊదరకొట్టించింది. నాకూ ఓ ఇంక్రిమెంటు ఇచ్చిందిలే. కానీ స్కూలు డొనేషన్ ఓ అయిదువందలు పెంచింది. పేరెంట్స్

కూడా అలాగే ఎగబడుతున్నారు. మా స్కూలు సాంస్కృతిక కార్యక్రమాల్ని బాగా ప్రోత్సహిస్తుందంటూ! ఏం చేస్తాం? అంతా వ్యాపారమైపోయింది" నిట్టూర్చిందావిడ.

గీత ఏం మాట్లాడకుండా వింటూ వుండిపోయింది.

"స్కూలు యానివర్సరీలు కూడా అంతే! ఈమధ్య మన ఊళ్ళో స్కూల్ యానివర్సరీలు ఎంత గ్రాండ్‌గా చేస్తున్నారో గమనించావా గీతా?" అడిగింది ఆవిడ.

"అవునవును! దాదాపు అన్ని స్కూల్స్‌లో పాపులర్ సినిమా యాక్టర్లను పిలుస్తున్నారు. అర్థరాత్రి ఒంటిగంటదాకా ప్రోగ్రామ్స్ పెట్టి హడావుడి చేస్తున్నారు. ఈ సినిమాయాక్టర్లు పిల్లలకు స్ఫూర్తికానీ, ఆదర్శంకానీ ఎలా అవుతారో నాకర్థంకాదు. మీరు చెపుతున్నట్లుగా, పిల్లల కళాభిరుచిని కొద్దిమంది స్వార్థపరులు వ్యాపారంగా మార్చుతున్నట్లేకదా!" ఆలోచిస్తూ అంది గీత.

"ఖచ్చితంగా! ఇందులో సందేహం దేనికి? అదుగో మా మేడం వస్తున్నట్లున్నారు. ప్రోగ్రాం అయ్యాక మళ్లీ కలుస్తాను గీతా. బై... " అంటూ ఆవిడ తమ స్కూలు పిల్లలు వున్న వైపు వడివడిగా వెళ్ళిపోయింది.

"బిందూ! టైం ఎంతయింది?" శిరీష అడిగింది.

"ఎనిమిదిన్నర" అంది బిందు.

"నాకు బాగా ఆకలిగా వుందే! గీతా టీచర్‌కి చెప్పి ఏదైనా తినివద్దామా?" శిరీష అడిగింది.

"మినిష్టర్ రాకముందు ఇక్కడ్నించి కదిలామా! టీచర్ చంపేస్తుంది. అదుగో హెచ్.ఎమ్. కూడా మనవైపే వస్తోంది" కనుచివరలనుండి హెచ్.ఎమ్.ని చూస్తూ అంది బిందు.

"అదికాదే! నాకెందుకో పిచ్చిపిచ్చిగా వుందే! వళ్ళంతా చెమట్లు పట్టినట్లు అన్పిస్తోంది!" మెల్లిగా అంది శిరీష.

"ఆ మరే! మాకందరికేమో చలేస్తోంది" పక్కనే నేవున్న కీర్తి అంది, తలపైకెత్తి కళ్ళకు చెయ్యి అడ్డం పెట్టుకుని సూర్యుణ్ణి చూస్తూ. అందరూ నవ్వడంతో శిరీష మౌనంగా స్కర్ట్ జేబులోంచి కర్చీఫ్ తీసి ముఖం తుడుచుకుంది.

ఇంతలో హెచ్.ఎమ్. వీరి దగ్గరికి వచ్చింది.

"పిల్లలకి అస్సలు డిసిప్లిన్ లేకుండా పోతోంది. ఏమిటా నవ్వులు? కాస్సేపు కదలకుండా నిల్చోలేరా? అంటూ విరుచుకుపడింది హెచ్.ఎమ్.

హెచ్.ఎమ్‌ని గమనించగానే గీత పిల్లల దగ్గరకి ఒక్క పరుగున వచ్చినిల్చుంది.

"అసలు టీచర్లకి డిసిప్లిన్ ఉంటేగా పిల్లలకి ఉండడానికి. మీ మాటల్లో మీరు మునిగిపోతే ఎలా? మీరు కంట్రోలు చేయలేకపోతే వీరికి వేరే టీచర్‌ని ఇన్‌ఛార్జిగా ఇచ్చేవాళ్ళంగా! మిగిలిన స్కూలు పిల్లల్ని చూడండి. ఎంత కామ్‌గా వున్నారో! ఐ డోంట్‌లైక్ ఆల్‌దిస్ టు రిపీట్ ఎగైన్!" గీతా టీచర్ని ఆయాసపడుతూ అరిచింది హెచ్.ఎమ్.

గిరుక్కున వెనక్కు తిరిగి, చేతిలో పట్టుకొని వున్న కూలింగ్ గ్లాసెస్ గభాల్నా ముఖానికి తగిలించుకొని విసవిసా నడుస్తూ, మిగిలిన స్కూల్స్ హెచ్.ఎమ్స్ వున్న దగ్గరకి వెళ్ళిపోయింది.

గీత టీచర్ పిల్లలందరిని ఓసారి సీరియస్‌గా చూసింది.

అప్పటికే బిత్తరపోయిన పిల్లలు మౌనంగా తలదించుకొన్నారు.

గీత టీచర్‌తో ఏదో చెప్పబోయిన శిరీష కూడా నోరు విప్పలేకపోయింది.

హెచ్.ఎమ్. కనుమరుగవడంతో, గీత మళ్ళీ తన ఫ్రెండ్స్ దగ్గరకి వెళ్ళి నిలబడింది.

* * *

ఓ పక్కగా నిల్చున్న హైస్కూలు పిల్లల దగ్గర ఏదో కోలాహలం విన్పించడంతో అందరి దృష్టి అటుపడింది.

అప్పటిదాకా అక్కడే నిల్చుని వున్న తెలుగు టీచర్ కాంతమ్మగారు చెమట్లు అద్దుకొంటూ, ఉస్సూరంటూ గీతావాళ్ళ దగ్గరకి వచ్చింది.

కాంతమ్మగారు వాళ్ళతో మెల్లిగా చెపుతోంది. "ఆ అమ్మాయి ఎవరో పీరియడ్స్ మొదటిరోజట! వాళ్లు అయిదున్నరకే స్టేడియంకి వచ్చారట! గంటలు తరబడి నిల్చోవడంతో కాళ్ళు పీకాయట! కళ్ళు తిరగడంతో కిందపడిపోయేసరికి హడావుడిచేసి ఇంటికి పంపించారు. పాపం బ్లీడింగ్ బాగా అయినట్లుంది! చిన్నపిల్లగదా, కంగారుపడి ఏడుస్తోంది"

"అందుకే ఈ హైస్కూలు పిల్లలతో ప్రోగ్రాం పెట్టుకోకూడదు బాబూ!" అంతా విని హిందీ టీచర్ అంది.

" ఆ అమ్మాయి తప్పేం వుందండీ! రెండు, మూడు గంటల క్రితం అవ్వాల్సిన కార్యక్రమం ఇంకా మొదలవ్వనే లేదు. ఇక పూర్తయ్యేసరికి ఏ టైమవుతుందో? అయినా ఆ మాడ్రన్‌స్కూలు వాళ్ళను చూశారా? ఎంత చిన్నపిల్లల్ని తీసుకొచ్చారో!" గీత వాళ్ళను చూపిస్తూ అంది.

"ఏవిటో, ఎందుకు చేస్తున్నామో అర్థం కాకుండా వున్నాయి ఈ కార్యక్రమాలు. ఆ మినిస్టరుగారు ఇంకో గంటలో ఐనా వస్తే బావుణ్ణు" వాచ్‌వంక చూస్తూ అంది కాంతమ్మగారు.

"ఆ, పోయినసారి చిల్డ్రన్స్‌డేనాడు ఆయన ఒంటిగంటకువచ్చారుకదా! ఈరోజు పదకొండుగంటలకంతా వస్తాడంటారా? అప్పుడే పదిదాటుతోంది" అనుమానంగా అడిగింది హిందీ టీచర్.

"నాకూ అదే డౌట్ వచ్చింది. అందులోనూ మన వూరివాడయ్యే! అందర్నీ ఆమాత్రమైనా వెయిట్ చేయించలేకపోతే ఎలా?" కాంతమ్మగారు నిరసనగా అంది.

'మీకు మినిస్టర్ తెలుసా ఏమిటి?" గీత ఆసక్తిగా అడిగింది.

"ఆ... టెన్త్‌క్లాసు తప్పినప్పుడు నా దగ్గర ప్రైవేటు చెప్పించుకొనేవాడు. చివరికి మాతృభాషలో కూడా పాసుమార్కుల కోసం దేబిరించిన పెద్దమనిషి ఇప్పుడు విద్యాశాఖను ఏలుతున్నాడు!" ఆవిడ ముఖానికి పట్టిన చెమట్లను తుడుచుకొంటూ అంది.

"నమస్కారంకాంతమ్మగారు! మీరందరూ ఇక్కడే వున్నారా?" అంటూ వారిని సమీపించాడు శ్రీనథ్.

"బాగున్నారా మేస్టారూ? ఇప్పుడు ఏ స్కూలులో వున్నారు?" గీత పలకరించింది.

"ఊళ్ళో స్కూళ్ళన్నీ దాదాపు అయిపోయాయండి. ఇక మీ స్కూలే మిగిలింది. మీ హెచ్.ఎమ్. నన్ను మీ స్కూల్లో ఏమైనా చేర్చుకొంటారంటారా?" నవ్వుతూ అడిగాడు.

"ఏమిటీ! కాంతమ్మగారు ఏదో బాధపడుతున్నట్లున్నారు!"

"ఏముందీ! మినిస్టరుగారు ఇంకా రాలేదని అనుకొంటున్నాం" హిందీటీచర్ అంది.

"పూర్వకాలంలో రాజులు వందిమాగధులను పోషించి, వారి పొగడ్తలతో తమ అహాన్ని తృప్తిపరచుకొనేవారుట! అధికార దర్పంకోసం, అహంకార ప్రదర్శనకోసం కాసులు గుమ్మరించి అడుగులకు మడుగులు వత్తించుకొనేవారుట! మరి ఇప్పటి మకుటంలేని మహరాజులకోసం చేస్తున్న స్వాగతసన్నాహాలు, ఆడంబర సంబరాలు చూస్తుంటే, మనం నిరసించిన రాజరిక సంస్కృతిని మరో రూపంలో పోషిస్తున్నట్లుగా లేదూ?" అందర్నీ పరీక్షగా చూస్తూ అన్నాడు శ్రీనాథ్.

అందరూ అవునన్నట్లుగా తలలూపారు.

"అంతేకాదు, ఎప్పుడు మన సంస్కృతిని ప్రదర్శించాలన్నా స్కూలు ఎగ్గొట్టిచ్చి, పిల్లలకి లంబాడివేషాలు వేయించి ఆడించి చూపుతున్నాం. తరుచూ ఇలా చేస్తూపోతే, వాళ్ళకి పాఠాలమీద శ్రద్ధ ఎలా వుంటుంది?" అన్నాడు శ్రీనాథ్.

"క్లాస్ అటెండ్ కాకపోయినా అటెండెన్స్ వుటుందికదా మాస్టారు. ఇక పరీక్షల ముందు ఇంపార్టెంట్ క్వొశ్చన్లతో ఇంటెన్సివ్ కోచింగ్ ఎలాగూ వుంటుంది. ఏమైనా ఇంతమందిని ఇబ్బంది పెట్టే, ఈ కార్యక్రమాల్లో మార్పు రాదంటారా మాస్టారు?" గీత అడిగింది.

"ఇంతమంది పిల్లలు వారి ఇష్టాఇష్టాలతో ప్రమేయం లేకుండా, ఆ కొద్దిమంది పెద్దల అహాన్ని తృప్తిపరచడానికి నియంత్రించబడితే, మీలాంటి టీచర్లు ఒక వ్యక్తిని గౌరవించడం అంటే అతని అడుగులకింద పూలరేకులు పరచడం అనే సంస్కృతికి ప్రాణం పోస్తుంటే, ఇలాంటి కార్యక్రమాల్ని స్కూలు పెద్దలు వ్యాపార దృక్పథంతో పోషిస్తుంటే, మార్పు ఎలా వస్తుందంటావు గీతా?" శ్రీనాథ్ వెల్లువలా వున్న పిల్లల్ని చూపిస్తూ సూటిగా అడిగాడు.

గీత ఆలోచనలోపడి, మౌనంగా మాస్టారి మాటల్ని వింటోంది.

"అంతదాకా ఎందుకు? ఈరోజు వీళ్ళనిలా నిలువుకాళ్ళమీద నిలబెట్టి, తలను కడుపును మాడుస్తూ, వారి ప్రాథమిక స్వేచ్ఛకు క్రమశిక్షణ పేరుతో పరిధులు నిర్ణయించి, మనం సంతోషంతో... సంబరంతో... బాలల దినోత్సవం జరుపుకోవడం హాస్యాస్పదంగా లేదూ? నా మట్టుకు నాకయితే ఈ కార్యక్రమాలు అందమైన పేరుపెట్టి, ఈ చిన్నారులచేత చేయించే వెట్టిచాకిరీలాగా అన్పిస్తాయి" అందర్నీ గమనిస్తూ అన్నాడు శ్రీనాథ్.

"ఆ... అయినా ఏం బాలలదినోత్సవాల్లెండి. ఈ పిల్లల్ని చూస్తుంటే కడుపు తరుక్కుపోతోంది. తాగడానికి మంచినీళ్ళు లేవు. టాయిలెట్ సౌకర్యం లేదు. ఏ క్షణాన ఊడిపడతాడో తెలియని మినిస్టర్ కోసం పడిగాపులు! పిల్లల ముఖాలు చూడండి ఎలా వాడిపోయాయో! మీరన్నట్లుగా పిల్లలకోసం ప్రత్యేకంగా శ్రద్ధ వహించాల్సిన రోజున వారి ప్రాథమిక స్వేచ్ఛకు మన మూర్ఖత్వంతో పెట్టే తద్దినంలా వుందండీ ఈరోజు పరిస్థితి!" ముఖాలు వేలాడేసిన పిల్లల్ని చూస్తూ అంది కాంతమ్మ.

"అదేంటండీ! మరీ అలా అనేస్తున్నారు? పిల్లలు ఏవో ఓ సాంస్కృతిక కార్యక్రమాల్లో పాల్గొనకపోతే ఎలా?" హిందీ టీచర్ అడిగింది.

"స్కూల్లోని సాంస్కృతిక కార్యక్రమాలంటే పిల్లల్లో నిక్షిప్తమైవున్న కల్పనాచాతుర్యాన్ని వెలికితీయగలిగేలా వుండాలి. వారి సృజనాత్మకతకు రూపం ఇచ్చి ప్రదర్శించగలిగేలా వుండాలి. వారి అల్లిబిల్లి ఆలోచనలకు నిర్దిష్టత చేకూర్చగలిగేలా వుండాలి. వారిలో నిద్రాణంగా వున్న భావరమణీయతకు నవచైతన్యం ఇవ్వగలిగేలా వుండాలి. మనం టీచర్లుగా వారితో గడిపే సమయం ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ వారి వ్యక్తిత్వం రూపుదిద్దుకోవడానికి ఉపయోగపడుతున్నప్పుడు, మనం చిత్తశుద్ధితో శ్రద్ధ వహించాల్సి ఉంటుంది" అన్నాడు శ్రీనాథ్.

"ఆ... అవన్నీ సాధ్యమయ్యేవి కాదులే మాస్టారూ! నిజానికి ప్రతి స్టూడెంట్‌ని మనం జాగ్రత్తగా గమనించి, గుర్తించి, వారిని ప్రోత్సహించాలంటే మనకు రోజుకి ఇరవైనాలుగ్గంటలూ సరిపోవు" హిందీ టీచర్ మధ్యలో కల్పించుకుంటూ అంది.

"అదీ నిజమే! అయినా మన ప్రయత్నం మనం చేయాలిగా!" శ్రీనాథ్ అన్నాడు.

"ఆ... సమ్‌థింగ్ ఈజ్ బెటర్ దెన్ నథింగ్" గీత అందించింది.

"నాసర్వీసులో అలాంటి టీచర్లు అరుదు. ఏ టీచర్ అయినా పరీక్షల దృష్టితో పాఠాలు వల్లించడం తగ్గించి, ప్రాపంచిక విషయాల గురించి శ్రద్ధ తీసుకోవడం మొదలెట్టారంటే, స్కూలు నుంచి బయటకు నడవాల్సిందే!" అప్పటిదాకా అందరి మాటలు వింటోన్న కాంతమ్మగారు అంది.

"అంటే... నాలాగానా?" శ్రీనాథ్ నవ్వుతూ అడిగాడు.

టీచర్లంతా కబుర్లలలో మునగడం గమనించి శిరీష బిందుతో అంది.

"బిందూ, నేనింటికి వెళ్ళిపోతానే పొద్దున ఇంజెక్షన్ తీసుకొని, టిఫిన్ చేయకుండా వచ్చాను. మమ్మీ ఎంత చెప్పినా విన్లేదు! ప్లీజ్ కొంచెం నువ్వు గీతటీచర్‌కి చెప్పవే!"

"అమ్మో! నేను చెప్పను. కావాలంటే నువ్వే అడుగు" బిందు చేతిని గుండెమీద వేసుకొంటూ అంది.

"ప్లీజ్ బిందూ... ఈ ఒక్కసారికీనే" శిరీష బతిమిలాడుతూ మళ్ళీ అంది.

"ష్... హెచ్.ఎమ్. ఇటే వస్తుంది. నువ్వే పర్మిషన్ అడిగి వెళ్ళిపోరాదూ?" అంది బిందు హెచ్.ఎమ్. వస్తున్నవైపు చూస్తూ.

హెచ్.ఎమ్. వీరినోసారి చూసి టీచర్ల దగ్గరకెళ్ళి వారి కబుర్ల ప్రవాహంలో కలిసిపోయింది. ఆవిడ చూపు మాత్రం పిల్లలవైపే వుంది.

శిరీష గీతా టీచర్ తనవైపు చూస్తుందేమోనని గమనిస్తూ నిల్చుంది.

ఆవిడ ఎంతసేపటికి వెనక్కు తిరగలేదు.

శిరీష చెవులలో స్టేడియంలోని కోలాహలం ప్రతిధ్వనిస్తోంది.

ఇంతలో మైక్‌లో అనౌన్స్‌మెంట్ రావడంతో ఎక్కడి వాళ్ళక్కడికి వెళ్ళారు.

అంతటి కలకలం అకస్మాత్తుగా నిశ్శబ్దమైంది.

అందరూ వారి, వారి స్థలాలలో నిల్చుని రాబోయే అతిథులకోసం గేటువైపే చూస్తున్నారు.

అయినా, ఇప్పటికీ శిరీష చెవులలో ఇందాకటి శబ్దాలే ప్రతిధ్వనిస్తున్నాయి.

కళ్లు బైర్లు కమ్ముతున్నాయి.

శిరీష పంటిబిగువున కళ్లు తెరిచి చుట్టూ చూసింది.

కాళ్లు తేలిపోతున్నట్లయింది.

చెవులలోని ప్రతిధ్వని శబ్దాలు నెమ్మదిగా మాయమయ్యాయి.

బిందుని పిలుద్దామని ప్రయత్నించింది. పిలుపు శిరీష గొంతుదాటిరాలేదు.

బిందు శిరీషవైపు చూడలేదు.

ఆ మండుటెండలో శిరీష వంటిని చల్లబరుస్తున్నట్లుగా చెమటలు ధారాపాతంగా కారుతున్నాయి. శిరీష ఎదురుగా వున్న బిందు చందమామ కథల్లో మాంత్రికుడు మంత్రం వేసిన రాకుమారిలా హఠాత్తుగా మాయమైంది.

కాళ్లు నిలదొక్కుకుని, కళ్లు చికిలించి చూడడానికి ప్రయత్నించింది శిరీష.

ఆధారంకోసం చేతిలోని గులాబీల గుత్తిని గట్టిగా పట్టుకొంది.

ఇంతలో "రయ్ మంటూ కార్లు స్టేడియంలోకి ప్రవేశించాయి. టీచర్లు గలగబ ఎదురెళ్ళారు. దారి అంతా గులాబీరేకులతో నిండిపోతోంది! బిందు చేతిలోని పూలగుత్తిని పొదివి పట్టుకొని, వస్తున్న వారివైపే కుతూహలంగా చూస్తోంది.

శిరీష కడుపులో ఒక్కసారిగా దేవినట్లయింది.

క్రమశిక్షణ పేరుతో అంతసేపు కదలకుండా నిలబెట్టబడిన పిల్లల్ని గమనిస్తోన్న పైన ఆకాశం, కింది ఇసుక కోపంతో మండిపడుతున్నట్లున్నాయి.

శిరీష మోకాళ్లు... నడుము... భుజాలు... తల ఒకదాని తరువాత ఒకటి ఆ మండుతోన్న ఇసుకపైకి చేరాయి.

చెమట్లు కారుతోన్న శిరీష తల ఇసుకను చల్లబరుస్తూ పక్కకి వాలింది. అప్పటికే వడలిన ఎర్రగులాబీల రేకులు శిరీష తలవైపున చెల్లాచెదురుగా పడ్డాయి. గట్టిగా బిగించివున్న గుప్పెటలోకి ముదురు గులాబీముళ్ళు నిర్దాక్షిణ్యంగా గుచ్చుకుపోయి ఎర్రటి నెత్తుటి చుక్క ఇసుకలోకి ఇంకిపోతోంది.

బిందు గబుక్కున శిరీష వైపు తిరిగింది. చేతిలోని గులాబీగుత్తిని విసిరివేసి, ఒక్క ఉదుటున శిరీష దగ్గరకి చేరింది.

తరలివస్తున్న మంత్రిగారు ఆ గులాబిగుత్తి మీదుగానే మెత్తగా నడుస్తూ స్టేజీని చేరారు.

స్టేడియంపైన ఆకాశంలోకి శాంతిపావురాలు ఎగిరాయి.

మైక్‌లో చిన్ని కంఠాలు ఒక్కసారిగా గొంతెత్తాయి.

"చిరంజీవి మన నెహ్రూ... చరితార్థుడు మన నెహ్రూ..."

"చిరంజీవి మన..."

"శిరీషా!" అన్న పిలుపు శిరీష భుజాల్ని పట్టి కుదుపుతున్న గీతా టీచర్ హృదయంలోంచి దూసుకువచ్చింది.

# ఆంతర్యం

సిద్ధవరం సంధ్యాలక్ష్మి

"సార్! డి.యంగారు పిలుస్తున్నారు" అంటూ వచ్చిన బంట్రోతు అప్పన్న పిలుపువిని, ప్రక్కనే బాంబ్ పేలినట్లు ఉలిక్కిపడ్డాడు సుధాకర్. డి.యం.గారిని తలుచుకోగానే ముచ్చెమటలు పోసాయి అతనికి. తన భయాన్ని పైకి కనబడనీయకుండా వ్యర్థ ప్రయత్నం చేస్తూ "సరే నువ్వు వెళ్ళు" అన్నాడు. ఆఫీసరు రూమ్‌లోకి వెళ్ళేసరికి అక్కడో అందమైన అమ్మాయి కూర్చుని వుంది. ఓ క్షణం పాటు మైమరిచినట్లు ఆమెను చూసాడు. "చూడు సుధాకర్! ఈవిడపేరు భారతి. విశాఖ నుండి ట్రాన్స్‌ఫర్‌అయి మన ఆఫీసుకు వచ్చారు. ఈవిడ సీట్ చూపించి, వర్క్ అప్పగించండి" అన్నారు. పరస్పర పరిచయాలు అయిన తరువాత, ఆమెకు తన ప్రక్కనే ఉన్న సీట్ చూపించి, ఆమె చేయాల్సిన పని అప్పగించాడు. ఆమెనారోజు వద్దంటున్నా వినకుండా క్యాంటీన్‌కు తీసుకువెళ్ళి కాఫీ, టిఫిన్ ఇప్పించాడు.

"మీరు నాకోసం అనవసరంగా శ్రమపడుతున్నారు" మొహమాటపడుతూ అంది భారతి. "అబ్బే... అలాగంటే బాగోలేదండి. నాకిది ఎంతో సంతోషంగా వుంది. ఈ ఊరు మీకు కొత్తేమో? మొహమాట పడకుండా మీకే సహాయం కావల్సినా నన్ను అడగండి" అన్నాడు సుధాకర్.

"మీరు చాలా మంచివాళ్ళు లాగున్నారు. ఈరోజుల్లో కొత్త ముఖాలు కనిపిస్తే చాలు మోసం చేయాలని చూస్తారు చాలామంది" అంది భారతి స్నేహపూర్వకంగా అతన్ని అభినందిస్తూ.

"మీరు నాదగ్గర ఎలాంటి సంకోచాలు పెట్టుకోవద్దు. మీకు ఎలాంటి సహాయం కావాలన్నా చిటికలో చేసి పెట్టేస్తాను" అన్నాడు సంతోషంగా.

"చాలా థాంక్సండీ! మీకు తెలిసిన చోట ఎక్కడైనా నాకు ఒక్క రెండు గదుల ఇల్లుంటె అద్దెకు చూసిపెట్టండి."

"ఎంతలో కావాలి? ఎంతమంది ఉంటారు? వగైరా .... వగైరా వివరాలు చెబితే రేపీపాటికి మీకు కొత్త ఇంట్లో ఉంటారు" అన్నాడు నవ్వుతూ. "నేను, ఆరేళ్ళ మా అబ్బాయి ఉంటాం. అద్దె ఐదు వందలకు మించితే కష్టం. అయితే ఓ కండీషన్. ఫామిలీస్ వుండే మంచి చోటు, నీళ్ళకు కష్టంగా లేనిచోట మరో వంద ఎక్కువైనా ఫరవాలేదు."

"మీకు .... ఆరేళ్ళ అబ్బాయి ఉన్నాడా? మీరలా కన్పించరే? మరి మీ వారు ...." అర్థోక్తితో ఆగిపోయాడు సందేహంగా.

"భగవంతుడికి ఆయన మీద ప్రేమ ఎక్కువై తన దగ్గరికి పిలుచుకున్నాడు." నీళ్ళు నిండిన కళ్ళను ఒత్తుకుంటూ అంది.

"సారీ! మిమ్మల్ని బాధపెట్టాను. ఈ రోజుల్లో అద్దెకు ఇల్లు సంపాదించాలంటే మన వివరాలన్నీ వాళ్ళకు తెలియచేయాలి!" అన్నాడు సంజాయిషీగా. "ఫరవాలేదు" అంది.

సుధాకర్ తనుండే వీధికి ప్రక్కవీధిలో రెండు గదుల పోర్షన్ మాట్లాడి అడ్వాన్స్‌కూడా కట్టేశాడు. ఇల్లు సర్దుకోవటానికి, షాపింగ్‌కు వెళ్ళడానికి, భారతి కొడుకును స్కూల్లో జాయిన్ చేయడానికి అటు ఆఫీసులో అన్నివిధాల సహాయం చేయసాగాడు. సుధాకర్ సహకారంతో కొత్త చోటుకు వచ్చిన భయాన్ని ఇట్టే మరచిపోయింది భారతి.

ఆరోజు భారతి కొడుకు కిషోర్ స్కూల్లో ఫంక్షన్. "మమ్మీ! మా ఫ్రెండ్స్ అందరూ వాళ్ళ పేరెంట్స్‌ని తీసుకొస్తున్నారు. మరి నాతో నువ్వురావా?" అని అడిగాడు.

"తప్పకుండా వస్తాను బాబూ. రేపు ఆఫీసునుండి ఓగంట పర్మిషన్ తీసుకుని ముందుగానే వస్తాను" అంది అన్నంపెడుతూ.

"మమ్మీ! మరి మా ఫ్రెండ్స్ అందరూ వాళ్ళ డాడీలని తీసుకొస్తారు. మరి మనం ఎవరిని తీసుకువెడదాం?" అన్నాడు అమాయకంగా.

"తప్పు నాన్నా! అలా అనకూడదు. మీ నాన్న దేవుడి దగ్గరికి వెళ్ళారు. నేనొస్తాగా" అనునయంగా అంది.

"డాడీ దేవుడి దగ్గరికి వెడితే ఇంకోడాడీని తీసుకువెడదాం!"

"వెధవా! అర్థంలేని వాగుడు నువ్వూనూ!" అంటూ చెంపచెళ్ళుమనిపించింది కోపంతో.

"బాబును అలా అస్తమానం కొట్టకండి. వాడింకా మొండికేస్తాడు. కిషోర్‌ను దగ్గరికి తీసుకుంటూ అన్నాడు అప్పుడే అక్కడికి వచ్చిన సుధాకర్.

"వీడికి మధ్య జవాబులు చెప్పటం చాలా కష్టం అయిపోతోందండీ" కన్నీళ్ళు తుడుచుకుంటూ అంది.

"నేటి బాలురే రేపటి పౌరులు. మనం వాళ్ళని ఎలా పెంచితే రేపు వాళ్ళు అలా తయారౌతారు. ఉన్నదానికి, లేనిదానికి మీరు చివాట్లు వేసి కొడుతూ వుంటే రేపతని బంగారు భవిష్యత్తు నాశనం చేసిన వాళ్ళు అవుతారు. బాబును తీసుకుని అలా బయటకు వెడదాం తయారవండి" అన్నాడు.

"ఔను! నేనూ అదే అనుకుంటున్నాను. రేపటి ఫంక్షనుకు వేసుకోవటానికి వాడికో మంచి డ్రెస్సు కొనాలి. అప్పుడే ఏడుదాటింది పదండి వెళదాం" అంది చెప్పులు వేసుకుంటూ.

"మీరు మరోలా అనుకోకపోతే మంచి చీరకట్టుకుని అందంగా తయారవండి" అన్నాడు ఆమె వైపు తదేకంగా చూస్తూ.

'నాకు ఎంత సింపుల్‌గా వుంటే అంత హాయిగా ఉంటుంది పదండి" అంది అతని చూపులు, మాటలు గమనించకుండా.

ఎంత వారించినా వినకుండా సుధాకర్ రెండు వందలు పెట్టి కిషోర్‌కు మంచి డ్రెస్సు కొన్నాడు.

* * *

ఆ రోజు సాయంత్రం చీకటి పడుతుంటే - "భారతిగారూ!" అంటూ హడావుడిగా వచ్చాడు సుధాకర్. అతని భుజం పై రక్తంకారుతూ, మట్టి కొట్టుకు పోయి కిషోర్ ఉన్నాడు. కిషోర్‌ను ఆస్థితిలో చూసేసరికి బాధతో విలవిలలాడి పోయింది ఆమె మనస్సు. సుధాకర్ దగ్గర నుండి కొడుకును తీసుకుని ఒళ్ళంతా కడిగి, గీరుకు పోయిన చోట ఆయింటిమెంట్ పూసి పడుకోపెట్టింది. "అమ్మా! ఈ ఇవాళ ఈ నాన్నను మనింట్లో ఉండమను" అన్నాడు. కొడుకు మాటలకు షాక్ తిన్నట్టె సుధాకర్‌వైపు అనుమానంగా చూసింది.

"ఏం మాట్లాడవద్దని" కళ్ళతోనే సూచించాడు అతను.

రోజు రోజుకు కిషోర్ తండ్రి కోసం చేసే గోల వింతగా అనిపించసాగింది భారతికి. తండ్రి కోసం ఇది వరకెన్నడూ లేని ఆరాటం, ఇప్పుడు రోజు రోజుకూ పెరిగి పోవటానికి గల కారణం ఎంత ఆలోచించినా బోధపడలేదు ఆమెకు. మరో సంవత్సరం గడిచింది. భారతికి ఆఫీసులో, ఇంట్లో అన్ని విధాల సహాయం చేసేవాడు.

* * *

ఆరోజు రాత్రి ఎనిమిది గంటలకు బుట్టనిండా పళ్ళు తీసుకుని వచ్చాడు సుధాకర్. కిషోర్ అన్నం తినేసి నిద్రపోతున్నాడు. భారతి కుర్చీలో కూర్చుని భగవద్గీత చదువుకుంటున్నది. ఆమె చేతిలో ఆ పుస్తకం చూసి ఎంతో అసంతృప్తిగా ముఖం పెట్టాడు.

"ఈ వేళప్పుడు భగవద్గీత చదువుతున్నారే?" అంటూ ఆమెకు ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"భగవద్గీత చదువు కోవడానికి నాకు ఇంతకంటే మంచి సమయం దొరకదండీ. ప్రొద్దున ఆఫీసు హడావుడిలో ఉంటాను. సాయంత్రం కిషోర్‌కు హోమ్ వర్క్ చేయించాలి. అందుకని రాత్రి పూట చదువుకుంటాను. నాకు చిన్నప్పటి నుండి భగవద్గీత చదవటం అలవాటు. అది చదవని రోజు మనస్సుకు ఏదో చికాకు, వెలితిగా అనిపిస్తుంది."

"మీమనస్సును మీరు ఏవిధంగా మార్చటానికి ప్రయత్నిస్తే ఆవిధంగా మారుతుంది."

"మన మనసు మనకంట్రోల్‌లో ఉన్నప్పుడు. అంతకంటే ప్రశాంతమైన జీవితం ఏం ఉంటుంది చెప్పండి" ఎంతో తృప్తిగా అన్నది.

నిజమేననుకోండి. కాని .... మీరు మరోలా అనుకోకపోతే, మీరు మళ్ళీ పెళ్ళి ఎందుకు చేసుకోగూడదు? ఓవైపు మీ కోరికలు కంట్రోల్ చేసుకోవటానికి మీ మనసును ఆధ్యాత్మిక చింతనవైపు మరలించటానికి ప్రయత్నం చేస్తూ, మరోవైపు నాన్న కావాలని అల్లాడిపోతున్న పసివాడిని ఊరడించలేక మభ్యపెడుతూ, హాయిగా అన్నీ అనుభవించాల్సిన వయసులో, పైగా ఈ రాకెట్ యుగంలో పాతచింతకాయ పచ్చడిలాంటి సెంటిమెంట్స్‌తో ఒంటరిగా జీవితంలో నెగ్గుకురాగలననే అనుకుంటున్నారా?" ఆమెను మాట్లాడనీయకుండా ఉపన్యాసధోరణిలో చెబుతూనే ఉన్నాడు. "అసలు మగవాడికి భార్య బ్రతికి ఉండగానే రెండో పెళ్ళికి ఒప్పుకునే మనవాళ్లు, మన సాంప్రదాయాలు భర్త చనిపోయిన స్త్రీకి మళ్ళీపెళ్ళి చేసుకోవటానికి ఎందుకు అనుమతించరో?" అన్నాడు ఆవేశంగా. అతని మాటలకు చిన్నగా నవ్వుతూ -

"నా మనస్సును కంట్రోల్ చేసుకోవటానికి నేను భగవద్గీత చదువు తున్నానని ఎందుకు అనుకుంటున్నారు? నాకు చిన్నప్పటి నుండి ఆ గ్రంథం చదవటం చాలా ఇష్టం. మళ్ళీ పెళ్ళి అంటారా? అలా ద్వితీయ వివాహం అనే విషయానికి నేను వ్యతిరేకిని కానుగాని, నేను - నాభర్తను ఆయన నాకు పంచిన మమతానురాగాల్ని మరవగల్గిన నాడే కదా మరొకర్ని వివాహం చేసుకునేది. ఆయనతో పంచుకున్నది ఐదేళ్ళ జీవితమే అయినా అది నాకు ఎన్నో జన్మల బంధంగా పెనవేసుకు పోయింది. ఈ మూడేళ్ళ ఒంటరి జీవితంలో కూడా అనుక్షణం ఆయన మాటలు, చేతలు నన్ను వెన్నంటే ఉన్నాయి. ఆ మధుర స్మృతులు, ఆ ప్రేమానురాగాలు నిత్యనూతనాలు. జీవితంలో ఒంటరిగా నెగ్గుకు రాగలనా? అంటే మీలాంటి సహృదయులైన మంచి మిత్రుల అండ ఉండగా నేను ఒంటరి దాన్ని ఎలా అవుతాను? ఈ ఉద్యోగం సక్రమంగా చేస్తూ, ఇదో ఈ పసివాణ్ణి పెంచి, పెద్దచేసి, మంచి పౌరుడిగా తీర్చిదిద్దితే నా జీవితం ధన్యం అయినట్లే".

"............."

"ఇకపోతే కోరికలతో బుసలు కొట్టే వయస్సు, అందం వృథా కాకూడదను అనుకునేవాళ్ళు, లేదా ఓతోడూనీడ అవసరం అనుకున్నవాళ్ళు, తనతో కలిసి జీవించటానికి సరియైన వ్యక్తి దొరికినప్పుడు పునర్వివాహం చేసుకుని జీవితం సక్రమమైన మార్గంలో నడపడం ఎంతో శ్రేయస్కరం. సంఘానికి భయపడి తెరచాటున తప్పు పనులు చేసే బదులు, ఆ సంఘాన్ని ఎదిరించి పునర్వివాహం చేసుకుని ఆనందదాయకమైన జీవితాన్ని క్రమ పద్ధతిలో జీవించటమే హర్షించదగిన విషయం" అంది భారతి.

"మీరు నన్ను తప్పుగా అనుకోవద్దు. ఒక్కోసారి మిమ్మల్ని చూస్తే నాకెంతో బాధగా ఉంటుంది. ఇంకా ముప్పై ఏళ్ళు అయినా నిండని మీరు ఇలా గతస్మృతులలో బ్రతుకు వెళ్ళబుచ్చుతున్నారంటే మనసు పిండేసినట్లు ఉంటుంది. ఈ రోజుల్లో మీ వయస్సు ఆడపిల్లలకు ఎంతో మందికి పెళ్ళిళ్ళు కావటం లేదు. అపురూప సౌందర్యాన్ని ఇచ్చి తలవ్రాత ఇలా వ్రాసిన భగవంతుణ్ణి తలుచు కుంటే ఎంతో కసిగా అనిపిస్తుంది.

జీవితం అనుభవించటానికే గాని, భ్రమల్లో, కలల్లో, జ్ఞాపకాల్లో గడపటానికి కాదు. నేటి మనిషికి కావల్సింది ప్రాక్టికల్‌లైఫ్ గాని, ఊహాజీవితం ఎంత మాత్రం కాదు" ఆమె మౌనం చూసి ఇంకాస్త ధైర్యం తెచ్చుకున్నాడు.

"మీరు ఔనంటే, మీ కిషోర్‌కు తండ్రిలా, మీ భావాలు అర్థం చేసుకుని, మిమ్మల్ని పువ్వుల్లో పెట్టి పూజించే వ్యక్తిని నేను చూపిస్తాను" అని ఓ కాగితం మడతను ఆమెకు అందించి, వాకిటి తలుపులు తెరుచుకుని వెళ్ళిపోయాడు సుధాకర్. భారతి ఆశ్చర్యం నుండి తేరుకుని, 'తన వివాహం గురించి అతనికి ఎందుకంత శ్రద్ధనో' అనుకుని, ఆ కాగితాన్ని విప్పి చదివింది.

భారతిగారికి!

మీరు ఇది చదివిన తరువాత అపార్థం చేసుకుని నా మీద కోపం తెచ్చుకోవద్దు. మిమ్మల్ని చూసిన మొదటి క్షణంలోనే మీరు నన్ను ఆకర్షించారు. నాకు చిన్నప్పటి నుండి ఏపని చేసినా ఆదర్శవంతంగా ఉండాలని అనుకుంటాను. అలా చేస్తాను కూడా. వివాహం అంటూ చేసుకుంటే ఆదర్శ వివాహం చేసుకోవాలనే ఉద్దేశ్యంతో నేను ఇన్ని రోజులు వివాహం చేసుకోలేదు. మీరు ఔనంటే నేను మిమ్మల్ని మన స్నేహితుల సమక్షంలో వివాహం చేసుకుని, మీకు కిషోర్‌కు ఎలాంటి కష్టం కలగకుండా కంటిరెప్పలా చూసుకుంటాను. మీకు నా గురించి చెప్పనక్కరలేదు. ఈ రెండేళ్ళలో మీరు నన్ను అర్థం చేసుకునే ఉంటారు. ఒకవేళ మీరు అంగీకరించ లేకపోయినా కోపంతో నానుండి దూరంగా వెళ్ళద్దు. మనం మంచి స్నేహితులుగా మిగిలిపోదాం. నాకు ఎప్పటికైనా ఆదర్శ వివాహం చేసుకోవాలని ఉంది. అది మీతోనే ఎందుకు కాకూడదు? అని నా అభిప్రాయం. ఏమంటారు? నేను పదిహేనురోజుల శెలవు మీద మా ఊరు వెడుతున్నాను. ఈ క్రింది అడ్రసుకు మీరు జవాబు వ్రాస్తే నేను రెక్కలు గట్టుకుని మీ ముందు వాలుతాను. మీరు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రండి. ఆ పసివాడి మనోవేదన అర్థం చేసుకోండి. మీ దగ్గర నుండి తప్పకుండా అంగీకారం వస్తుందని వేయికళ్ళతో ఎదురు చూస్తుంటాను.

ఇట్లు
మీ మనిషి కావాలనుకుంటున్న
సుధాకర్

ఆ ఉత్తరం చదివిన భారతికి కాసేపు ఏమీ తోచలేదు. మెదడు ఆలోచించే శక్తిని కోల్పోయినట్లు అచేతనమై పోయింది. అనుకోని పరిణామానికి ఆశ్చర్యపోయింది. అతనికి తనమీద అలాంటి అభిప్రాయం ఉన్నట్లు ఎప్పుడూ గమనించలేదు.

* * *

భారతి దగ్గర నుండి జవాబు కోసం ఎదురు చూస్తున్న సుధాకర్ నిరీక్షణ పదిరోజులకు ఫలించింది. ఎంతో ఆతృతగా ఉత్తరం విప్పి చదువుకున్నాడు.

సుధాకర్‌గారికి!

మీకు నామీద ఉన్న అభిమానానికి, స్నేహభావానికి కృతజ్ఞురాలను. నిజంగా మీలాంటి స్నేహితుణ్ణి పొందటం నా పూర్వజన్మ సుకృతం. మీరు ఇది నా బలహీనత

అంటారో మూఢాచారం అంటారో. ఛాందసం అంటారో లేక ఇంకేమైనా పేరు పెడతారో నాకు తెలియదుగాని, నేను నాభర్తను. ఆయన నాకు పంచిన ప్రేమానురాగాలు మరిచిపోలేక పోతున్నాను. నేను మిమ్మల్ని ఎప్పుడు ఓ మంచి స్నేహితునిగానే భావించాను. ఆ స్థానంలోకి మరో వ్యక్తిని ఆహ్వానించలేకపోతున్నాను. మనం మంచి స్నేహితులుగానే మిగిలిపోదాం. మీరు అన్యదా భావించకపోతే నాదొక అభ్యర్థన మన్నిస్తారనే అనుకుంటాను. మా వదిన స్నేహితురాలు ఒకామె ఉంది. పెద్ద అందగత్తె కాకపోయినా కురూపి మాత్రం కాదు. మమారుగా ఉంటుంది. ఇంటర్ పాసయింది. వాళ్ళ నాన్నగారు మూడేళ్ళ క్రితం ఓ సాంప్రదాయ కుటుంబంలోని అబ్బాయికిచ్చి పెళ్ళిచేశారు. కాని కాపురానికి వెళ్ళిన నెలరోజులకే కట్నం తక్కువైందని నానా హింసలు పెట్టి, కట్నం డబ్బులు పూర్తిగా చెల్లించనిదే మళ్ళీ గడపతొక్కరాదని పంపించారుట. ఆ పరిణామానికి వాళ్ళ నాన్నగారు గుండెపోటుతో మరణించారు. అన్నలెవరూ పట్టించుకోవటం లేదు. తను చాటుగా భర్తకు ఎన్నోవిధాల వేడుకుంటూ ఉత్తరాలు వ్రాసిందట. అయినా ఆకఠినాత్ముడు కరగలేదు. ఇప్పుడు తను, తన కాళ్ళమీద నిలబడాలని టీచర్ ట్రైనింగ్‌కు ఈ ఊరువచ్చి పదిరోజులుగా మాఇంట్లోనే ఉంది. ఎప్పటికైనా మంచివ్యక్తి దొరికితే పునర్వివాహం చేసుకోవాలని అనుకుంటున్నది. ఆ అమ్మాయికి తప్పకుండా మీరే మంచి వరుడు అనిపించింది. కొన్ని ఏళ్ళు సంసార జీవితం గడిపి, ఒక బాబుకు తల్లినై, భర్తను మరిచిపోలేని నాకన్నా, జీవితంలో ఆనందం అంటే ఏమిటో తెలియని అమాయకురాలైన ఆ అమ్మాయి మీకు సరియైన జంటగా అనిపించింది. ఆ అమ్మాయికి మంచి వ్యక్తిత్వం వుంది. తప్పకుండా ఆ అమ్మాయితో మీరు సుఖపడగలరని హామీ ఇస్తున్నాను. రేపటి ఆదివారం మీరు మా ఇంటికి వస్తే ఆమెను మీకు పరిచయం చేస్తాను.

ఇట్లు
మీ స్నేహితురాలు
భారతి

* * *

ఆదివారం సాయంత్రం భారతి ఇంటికి వెళ్ళాడు సుధాకర్. తలుపులు వేసి ఉన్నాయి. బెల్ నొక్కాడు. తలుపు తీసిన వ్యక్తిని చూడగానే షాక్‌తిన్నట్లు అయిపోయాడు సుధాకర్. శరీరం చల్లబడి ముచ్చెమటలు పోసాయి. భూమి, పరిసరాలు గిర్రున తిరిగనట్లు అయిపోయింది. ఒక్షణం క్రింద పడిపోతాననుకున్నాడు. కాని ఎలాగో నిలదొక్కుకున్నాడు. ఒక్క నిమిషం అతని మెదడు తీవ్రంగా పనిచేసింది. తలుపుతీసి గుమ్మానికి అడ్డంగా నిలిచిన ఆమె సుధాకర్‌ను చూసి అవాక్కయి, ఓ క్షణం అతని వైపు తేరిపార చూసి, ఒక్కడుగు వెనక్కి వేసింది. అతను లోపలికి చూసి చుట్టు ఎవరూ లేరని నిర్ధారించుకుని ఆమె రెండు చేతులూ పట్టుకోబోయాడు. "భారతిగారికి నేనే నీభర్తనని చెప్పలేదుకదూ! దయచేసి చెప్పవద్దు. ఇది వరకు నావలన జరిగిన పొరపాటును క్షమించు. మనం ఏమి జరగనట్లే వివాహం చేసుకుందాం. హాయిగా కాపురం చేద్దాం" అన్నాడు అతి మెల్లగా.

అంతసేపు అతని మాటలు మౌనంగా విన్న సుజాత ఒక్కసారి రుద్రకాళిలా అయింది. "ఛీ! నీచుడా! నీముఖం చూడటానికే నాకు పరమ అసహ్యంగా వుంది. ఇంకా నీతో కాపురం కూడానా? నేను వివాహం చేసుకోవాలంటే లోకంలో సహృదయులైన యువకులు ఎంతో మంది ఉన్నారు. ఈ జీవితంలో ఒంటరిగా ఎన్ని కష్టాలైనా అనుభవిస్తానుగాని, నీ నీడను కూడా భరించలేను. నీ ఇంట్లో ఉన్న నెలరోజుల్లో మీవాళ్ళందరికీ సేవకురాలిలా ఇంటెడు చాకిరీ చేయించి, ఆ మాడిపోయిన మెతుకులు కూడా కడుపునిండా పెట్టలేదు. ఏదో ఒక నెపంతో నన్ను గొడ్డును బాదినట్లు బాదేవాడివి నువ్వు. నేనిప్పుడు ఆనాటి సుజాతను కాదు. నాకిప్పుడు ఆత్మవిశ్వాసం, చదువు, ఆర్థిక స్తోమత ఉన్నాయి. నన్నెవరూ ఏమీ చేయలేరు. ఇంకో క్షణం నా ఎదురుగా ఉంటే పోలీసులను పిలవాల్సి ఉంటుంది. గెట్ అవుట్ ఫ్రమ్ హియర్!" ఆవేశంతో ఊగిపోతూ అన్నది సుజాత.

భద్రకాళిలా వున్న భార్య ఎదుట నిలబడలేక తలవంచుకుని వెళ్ళిపోయాడు సుధాకర్. లోపలి నుండి వారిద్దరి సంభాషణ విన్న భారతికి అతని అసలు ఆంతర్యం ఏమిటో అవగతమయింది.

# మా కొంచెం నమ్మకమివ్వండి

వి. ప్రతిమ

" వదినా నా పింక్ కాటన్ చీర ఐరన్ చేయమన్నాను చేసి పెట్టావా ?" బాత్‌రూమ్‌లో నుండే కేకేసింది సరోజ.

" నిన్న కరెంటు లేదు -- ఉదయం నుంచీ చూస్తున్నావుగా, చెయ్యి తీరిక లేదు". ఇడ్లీలు తీసి గిన్నెలూ సర్దుతూ చెప్పింది భారతి. మనసు కన్నీళ్ళు కారుస్తోన్నా ఆమె పెదవులు మాత్రం నవ్వుతూనే వున్నాయి.

" ఇప్పుడు నేను ఎలా వెళ్ళాలి కాలేజికి " మరో కేక.

" రాత్రి కరెంటు లేకపోడమేంటి ? పదింటికి వచ్చిందిగా ... చేసి పెట్టి పడుకోకూడదూ... ఉదయం నుండీ ఏదో చాకిరీ చేసేస్తున్నట్లుగా పెద్ద ఫోజు" సాధిస్తున్నట్లుగా అంది అత్తగారు. అప్పుడే వంటగది గుమ్మంలోకి వచ్చిన భర్తను చూసింది భారతి. ఆమె కళ్ళు అతడి సానుభూతి కోసం ఎదురుచూస్తున్నట్లుగా వున్నాయి.

కానీ అతడిదేమీ పట్టనట్లుగా ఆమెమీద చిరాకుపడ్డాడు.

" యింకా ఏం చేస్తున్నావు ? ఏమిటింత ఆలస్యం? త్వరగా చేయడం చేతకాకపోతే ఓ గంట ముందు లేవడం అలవాటు చేసుకోవాలి... ఛీ! ఎప్పుడో పాతరాతి యుగంలో పుట్టాల్సిన దానివి. కొంచెంకూడ స్పీడులేదు" విసుక్కున్నాడు. దెబ్బతిన్న ఆమె హృదయం మెదడుకు సంకేతం పంపి కళ్ళను అతడి వంక తిరగేలా చేసింది.

"ఉదయం నుండీ కరెంటు లేకపోవడంతో చెట్నీ చేత్తో రుబ్బుకొచ్చానండీ" అంటూ చెప్పలేదామె... " రాత్రిళ్ళు మీరు ఒంటిగంటకు కాకుండా కాస్తముందు రావటానికి ప్రయత్నిస్తే నేను త్వరగా పడుకుని యింకా కొంచెం ముందు లేవడం నేర్చుకుంటానండీ " అంటూ నిష్ఠురపడలేదామె. అయితే భారతి లోపల వున్న భారతి మాత్రం 'భారతి' తెగ కోప్పడుతోంది... మరీ అంత సహనంగా వున్నందుకు.

చివరికి భారతే గెల్చింది. మౌనంగా భర్తకి యిడ్లీ వడ్డిస్తోందామె. లోపలి భారతి ముడుచుకు పోయింది... సాధారణంగా ఈ లోపలి భారతి విప్లవాత్మకంగా భారతితో పోట్లాడినా ప్రతీసారి తానే ఓడిపోయి ముడుచుకు పోతూంటుంది. హద్దులు లేని భారతి సహనాన్ని తిట్టుకుంటూ వుంటుంది.

" అమ్మాయ్ భారతీ ! వడ్డించేస్తావా పదయిపోయింది " మామగారి హడావుడి.

" ఆ అప్పుడే మీకు వడ్డించి వుంచింది. మీరు రావడమే తరువాయి " ముందరింట్లో కాళ్ళు బార్ల జాపుకుని. ఆవేళ్టి పేపరు తిరగేస్తూ అత్తగారు ఓ విసురు విసిరింది. " ఆమె అలా తీరి కూర్చుని పేపరు చూడకపోతే కనీసం భర్తకి వడ్డన కార్యక్రమం చూడొచ్చు కదా" మళ్ళీ లోపలి భారతి నిద్ర లేచింది.

ఆవిడ నోరు నొక్కి - "ఒక్క క్షణం మామయ్యా... అయిపోయింది వచ్చేస్తున్నాను" హడావిడిగా భర్తకి మంచి నీళ్ళందిస్తూ జవాబిచ్చింది భారతి.

"ఏవి టొక్క క్షణం... నేను షాపు ఓనర్ని కాదమ్మా... గుమాస్తాని. ఇంకా ఆలస్యంగా వెళితే నన్నక్కడ మాలవేసి ఆహ్వానించరు. అయినా త్వరత్వరగా వంట చేయడం రాకపోతే ఎలా ?" విసురుగా బయటికెళ్ళి పోయాడతడు భోజనం చేయకుండా. అత్తగారు తన వేపే కోపంగా చూస్తోంది.

హతాశురాలైంది భారతి.

" వెళ్తే వెళ్ళాడులే ఒక్కరోజు కడుపు మాడిందంటే రెండోరోజిలా విసుగ్గావెళ్ళడు" లోపలి భారతి ఉవాచ.

వీరరాఘవులు ఓ బట్టల కొట్లో గుమాస్తాగా పనిచేస్తున్నాడు. తాను ఇంటా, బయటా ఎక్కడా ఎవరి మీదా చూపించలేని అధికారాన్నీ, అజమాయిషీనీ కొడుకు మీదా ప్రదర్శిస్తూ వుంటాడు. భార్య అతడిని ఎప్పుడూ లెక్కచేయదు. ఆ అసహనమే కోడలి మీద చిరాకుగా మారుతుంటుంది అతడిలో

" అమ్మా నా క్యారేజీ సర్దేశావా?" ఆరేళ్ళ కొడుకు పిలుపులాటి అరుపు.

" ఇదిగో నాన్నా అయిపోయింది" అప్పుడు కూడా సహనాన్ని కోల్పోలేదామె.

" అమ్మా నువ్వెప్పుడూ లేటే... స్కూలుకి ఒక్కరోజు కూడా నేను టైముకి వెళ్ళడం లేదు."

అప్రతిభురాలై కొడుకుని చూసినా మరుక్షణంలో నవ్వేసిందామె.

అరవై ఏళ్ళవాళ్ళే ఆమె పని ఒత్తిడినీ, రణరంగంలాంటి ఆ వంటగదినీ, ఏ మాత్రం సైనిక సహాయం లేకుండా ప్రపంచ యుద్ధాన్ని ఎదుర్కొంటున్నట్లుగా వున్న తన స్థితినీ అర్థంచేసుకోలేనప్పుడు ఆఫ్టరాల్ ఆరేళ్ళ పిల్లవాడు.. వాడు తనని అర్థం చేసుకోలేదని వాపోవడంలో అర్థం లేదన్పించింది భారతికి. అందుకే ఆమె నవ్వింది.

అమ్మ నవ్వులోనుండి ముత్యాలు రాలిపడ్డట్టుగా అన్పించింది అశోక్‌కి.

అమ్మ చాలా అరుదుగా నవ్వుతుంది. కారణాలు తెలుసుకుని విశ్లేషించే వయసు లేకపోయినా అమ్మ నవ్వంటే వాడికిష్టం. అందుకే తృప్తిగా వెళ్ళిపోయాడు!

" వదినా ఈ రోజు నేనూ రాను మధ్యాహ్నాం. ప్రొద్దుటే చెప్పానుకదా నాకూ క్యారేజీ సర్దలేదా " రెండు ప్లేట్లలో తనకి, తల్లికీ యిడ్లీ పెట్టుకుంటూ ప్రశ్నించింది సరోజ.

" ఏం తల్లీ వండి వార్చి పెట్టాక క్యారేజీ సర్దుకోవడం కడ బద్ధకమేనా ?" లోపలి భారతికి మళ్ళీ మెలకువ వచ్చింది.

" నేను విన్లేదమ్మా సరోజా ఎప్పుడు చెప్పావు ?" తను చీర యిస్త్రీ చేయనందుకు శిక్షగా మొన్న పండక్కి అమ్మ పంపిన కొత్త చీన మాట వరసకయినా తనకి చెప్పకుండా కట్టేసుకున్న మరదలినే చూస్తూ ప్రశ్నించింది భారతి.

'ఇప్పుడు చెప్పాగా సర్దకుండా ఆ ప్రశ్నలేవిటి '

" నువ్వు టిఫిను తినేలోగా పెట్టేస్తానమ్మా "

" మామగారిని అభోజనంగా పంపించింది. నువ్వా క్యారేజీ తీసుకోకుండా వెళ్ళిపోయినట్లయితే దానికేవిటమ్మా బాధ. నా కడుపు రగులుకు పోతుంది కానీ " కూతురి తల నిమురుతూ భర్త మీద అపారమైన ప్రేమను ప్రదర్శించింది అత్తగారు.

" నువ్వసలు మనిషివేనా " సిగ్గుందా అసల్నీకు ?" లోపల్నుండి భారతి మళ్ళీ పైకి లేచింది ఆడనాగులా.

మౌనంగా క్యారేజీ సర్ది సరోజను పంపించింది భారతి.

* * *

" అబ్బాయి అయ్యప్ప స్వామి మాలవేసుకుంటున్నాడు ... ఇంట్లో శుచిగానూ, మడిగానూ వుండాలి... నీకు బయటుండే సమయమేమొ. మాత్రలూ అవీ ఏవో వుంటాయటగా... తెప్పించుకుని వేసుకో. మళ్ళీ చెప్పలేదనుకునేవ్ ?" మీదపడి కొడుతున్నట్లుగా వున్నాయా మాటలు. మృదువుగా మాట్లాడ్డం అత్తగారికి అలవాటే లేదు.

భారతి మనసు బాధతో మూలిగింది.

ఆయన అయ్యప్పస్వామి మాల వేసుకుంటున్నారా ? ఒక్కమాట తనతో చెప్పొచ్చుకదా... తన భర్త మాల వేసుకుంటున్నట్లుగా మూడో వ్యక్తి ద్వారా వనడం మనసుచివుక్కుమంది.

అయితే ఇప్పటి ఆమె సమస్య పెద్దగీత ముందు చిన్నగీతగా భర్త తనని చేసిన నిర్లక్ష్యాన్ని చెరిపేసింది. భారతికి నెలసరి వచ్చి నెలమీద పది రోజులు అయింది. నెల తప్పిందేమోనని అనుమానంగా వుందామెకు. భారతికి ఆడపిల్లలంటే చాల యిష్టం

స్త్రీగా జన్మించినందుకు " ఆడదైపుట్టడం కన్నా అడవిలో మానై పుట్టడం మేలు " అన్న సామెతను తన జీవితం ఋజువు చేసినా చిత్రంగా భారతికి మళ్ళీ ఆడపిల్లే కావాలని వుంది. అందుకే నెలమీద నాలుగు రోజులు గడిచినప్పటి నుంచీ బుల్లి పట్టులంగా జాకెట్టూ వేసుకుని బుడి బుడి నడకలతో తన వైపు వచ్చే చిన్ని పాప ఆలోచనలతో ఆమె మనసు మూలుగుతోంది తియ్య తియ్యగా.

ఇప్పుడు తను నెల తప్పినట్లా ? లేనట్లా ?

అత్తగారు చెప్పినట్లుగా మాత్రలు వేసుకోవడమా, వేసుకోకపోవడమా ? ఆలోచించి మాని వేయడాన్నే సమర్థించిందామె మనసు.

అయితే భారతి సహనాన్ని, జీవితాన్ని సవాలు చేస్తున్నట్లుగా ఆ తరువాత నాలుగు రోజులకే బయటుంది భారతి. ఆమె గుండె పగిలి పోయింది. ఆడపిల్ల పుట్టినందుకు కాదు. భర్త మాల వేసుకుని వుండగా బయటున్నందుకు... భయంతో వణికి పోయిందామె.

" ఆ మాటంటే ఎంత నిర్లక్ష్యమే నీకు ?" గద్దించింది అత్తగారు.

" ఇందులో నా తప్పేముందత్తయ్యా ? నేను మాత్రమేంచేయగలను చెప్పండి " అమాయకంగా ప్రశ్నించింది భారతి.

" అవునే ! ఇందులో నీతప్పేమీ లేదు. అంతా నా తప్పే నేను నీకు ముందే చెప్పలేదూ మాత్రలూ, గట్రా వాడుకోమని. నామాట పెడచెవిని పెట్టింది చాలక 'ఇందులో నా తప్పేముందత్తయ్యా' అంటూ ప్రశ్నిస్తున్నావా నంగనాచిలా... ఎంత ధైర్యమే నీకు ?" ఉగ్రురాలై పోయిందావిడ.

" అత్తయ్యా! మీరు చెప్పి నాలుగైదు రోజులే కదా అయింది. అప్పట్నుండీ వాడినా ప్రయోజనం లేకపోయ్యింది. నాకు ఆయన ముందే చెప్పి వున్నట్లయితే బావుండేది మాల వేసుకుంటున్నట్లుగా" అబద్ధమే అయినా 'ప్రాణ, మాన... బొంకవచ్చు నధిపా' అన్న నానుడిని జ్ఞాపకం చేసుకుంటూ ధైర్యంగానే చెప్పింది భారతి.

" ఏవిటీ ! వాడు నీకు ముందే చెప్పివుండాల్సిందా ? అవునూ నువ్వు మహారాణివి కదా. నీ అనుమతి లేందే మాల వేసుకోడం తప్పేమరి... అందుకని కావాలనే ఈ పనిచేస్తావా ? నీ నిర్లక్ష్యం రోజు రోజుకీ మితిమీరు పోతోంది. అయ్యప్పస్వామి యింట్లో వుంటే నామాట పెడచెవిని బెట్టి నవు బయట చేరుతావా ? పై పెచ్చు నేను మాత్రలు వాడానూ అంటూ అబద్ధమాడుతావా ? నువ్వు బుద్ధిలేక చెప్పినా నేను నమ్మొద్దూ. "

రోజంతా ఆమె సాధింపు కొనసాగుతూనే ఉంది. అదేదో పెద్ద నేరం చేసినట్లు తనమీద ఉన్నవీ లేనివీ కల్పించిఇరుగుపొరుగు వారికి చెప్తూనే ఉందామె. భారతికి అర్ధమయింది, అదేదో ప్రళయంగా మారేట్లుందని.

" నన్ను క్షమించదత్తయ్యా " భారతి ఈ ఆంధ్రదేశపు ఆడపడుచు. తన తప్పేమీ లేని చోటయినా క్షమాపణ కోరడానికి ఏ మాత్రం వెనుకాడని స్త్రీ మూర్తి సర్దుకుపోవడమే జీవిత పరమావధిగా నమ్మి బ్రతుకుతోన్న ఉత్తమ యిల్లాలు. అప్పటికే మావయ్య మండి పడుతున్నాడు.

" ఇందులో క్షమించడానికేమీ లేదు. నువు వెంటనే ఇల్లు విడిచి వెళ్ళు. భర్త పూజ కోసం ఏ మాత్రం సహకరించని దానివి నువు కాపురమేం చేయగలవు ? వెళ్ళు... వెళ్ళిపో... ఎక్కడికెళతావో నీ యిష్టం. ఎవరితో వెళ్ళి చెప్పుకుంటావో చెప్పుకో ఇక నువు రానవసరం లేదు ఎప్పటికీ " మామగారు తాను ఆయింటి యజమానినని హఠాత్తుగా గుర్తుచేసుకున్నట్లుగా వున్నారు. అధికారాన్ని ప్రదర్శించారు.

అప్రతిభురాలై పోయింది భారతి. తాను చేయని తప్పుకు యింత పెద్ద శిక్షా ? ప్రళయం ఒక్కసారిగా ముంచుకు వచ్చి తనను భూమిలోనికి నెట్టి వేస్తున్నట్లుగా తోచింది భారతికి. హఠాత్తుగా ఆమెకు గుర్తుకొచ్చింది. మామగారిలో పెళ్ళినాడే కనిపించిన కట్నకానుకల ఆశ. కట్న కానుకల విషయంలో దాక్షసుడతను - కొడుకుకి రెండో పెళ్ళి

చేస్తే కట్నం కానుకలు మళ్లీ వస్తాయన్న ఆశ ఆతనికుంది. చాలా సేపటి తర్వాత నోరు విప్పిందామె.

" మామయ్యా మీరు కూడానా ! ఇందులో నా తప్పేమీ లేదని తెలిసినా నన్ను వెళ్ళి పొమ్మంటున్నారా ? ఇప్పుడు మీరు చెప్పినట్లుగానే వెళ్ళిపోతాను. ఇక్కడుండి స్వామి మడికి భంగం రానివ్వను. కానీ.. కానీ స్వామి కొండకి వెళ్ళిన తర్వాత వస్తాను మామయ్యా " ప్రాధేయ పడింది భారతి.

" ఆ ! అదండీ సంగతి. స్వామి యింట్లో వుంటే బోలెడంత పని వుంటుంది కదా... తెల్లవారు ఝామునే లేచి స్నానం చేయడం, స్వామి పూజలూ, స్వామికి వేరేగా వంటా యిదంతా బోలెడంత పని కదా అందుకని ఈ వేషం వేసింది. ఆ పని ఎగ్గొట్టడం కోసం యిలా పుట్టింటికి వెళ్తోంది. సిగ్గులేకపోతే సరి... పైగా స్వామి వెళ్ళాకవస్తుందట " అబాంధం వేసింది అత్తగారు.

" అత్తయ్యా ! కాదత్తయ్య ! పని కోసం కాదిలా" బాధగా చెప్పింది భారతి.

" ఇంక మాటలనవసరం వెంటనే బయల్దేరి వెళ్ళు బయటికి" లోపల్నుంచి భారతి సూట్‌కేస్ తెచ్చి బయటికి విసురుతూ చెప్పాడు వీరరాఘవులు.

" ఇక నువు రావటనికి వీల్లేదు" శాసించింది అత్తగారు "ఇప్పటికయినా మా యింటికి పట్టిన పీడ విరగడవుతూంది ! అంతే చాలు మాకు"

మాల వేసుకున్న స్వామి యింట్లోనే వుండి గంట నుండీ జరుగుతోన్న వాద సంవాదాల్ని వింటూనే వున్నాడు. తండ్రి ఆమెను ఇల్లు వదిలి వెళ్ళిపోమ్మనడం కూడా తెలుస్తూనే వుంది. అయినా స్వామి పెదవి విప్పలేదు. మాల వేసుకున్నపుడు స్వామి కోపం తెచ్చుకోకూడదు కదా అందుకని. కోపాన్ని అణచుకోవడం కోసం సిగరెట్టు కాలుస్తూ పెరట్లోనికి వెళ్ళి పోయాడు "స్వామి"

అంత రాత్రి వేళ ఆడదాన్ని, అందునా ఏకవస్త్రని, యింటి నుండి తరమివేస్తేనే గానీ అయ్యప్పస్వామి మీద భక్తి నిరూపింప బడలేదా యింట్లో.

ఆ అర్ధరాత్రి నిద్రపోతున్న కొడుకుని లేపాలన్న ఆలోచన కూడ లేకుండా రుద్రవీణలు విషాదగీతాలాలపిస్తోన్న వేళ భయంకరంగా వున్న చిక్కటి చీకటిలో భయమన్న పదాన్నే మర్చిపోయి నిరామయంగా, మూగ ప్రేక్షకురాలిలా వెళ్ళిపోతోన్న భారితిని చూసి భరత మాత సిగ్గుతో తల వంచుకుంది.

* * *

హఠాత్తుగా అంత తెల్లవారు ఝామున వచ్చిన భారతిని చూసి మొదటి ఆశ్చర్యపోయినా తరువాత సంతోషపడ్డారు కుటుంబ సభ్యులంతా.

" ఏమిటమ్మా భారతీ ! ఆయన మాలకూడ వేసుకున్నాడేమో కదా. ఇప్పుడు నిన్ను రానిచ్చారా ?" ఆతృతగా ప్రశ్నించింది పార్వతమ్మ.

" నేను బయటున్నానమ్మా ! స్వామి యింట్లో వున్నాడు కదా... అందుకని " చెప్పింది భారతి ఉబికి వస్తోన్న కన్నీళ్ళనాపుకుంటూ.

భారంగా నిట్టూర్చాడు ఆనందరావు.

ఆయన స్టేట్ బ్యాంకులో క్లర్కుగా పనిచేస్తున్నారు. పెద్దలు సంపాదించిన ఆస్తిపాస్థులేమీ లేకపోయినా తన సంపాదనలోనే ఎంతో కష్టపడి ఇద్దరి కూతుళ్ళకి పెళ్ళిళ్ళయినా యన్పించాడు.

మూడు నెలలుగా చిన్నకూతురు ప్రసవించి యింట్లోనే వుంది.

హఠాత్తుగా యిలా పెద్ద కూతురు ఊడి పడడంతో అతడి హృదయం వణికింది. ఏమైందోనని... మధ్య తరగతి జీవితావేశంతో ఏమీ లేదని తెల్సుకుని భారంగా వూపిరి పీల్చుకున్నాడాయన.

" పెద్దమ్మా" పరిగెత్తుకుంటూ వచ్చి కావలించుకుంది కస్తూరి పెద్ద కూతురు శ్రావ్య... "అప్పుడే నిద్రలేచావురా" అంటూ ఆత్మీయంగా పైకెత్తుకుంది భారతి.

హఠాత్తుగా అశోక్ ఆలోచనలు గొంతు కడ్డం పడ్డట్లుగా అన్పించాయామెకు.

"అశోకన్నయ్య రాలేదూ ?" ముద్దు ముద్దుగా ప్రశ్నించింది శ్రావ్య.

"స్కూలుంది కదూ అందుకని రాలేదు" చెప్పింది.

భారతి మెడ చుట్టూ చేతులు వేసి బుగ్గమీద గట్టిగా ముద్దు పెట్టుకుందా పాప. పెదతల్లి కన్పించిన ఆనందాన్ని దాచుకోవాలన్న ప్రయత్నమేమీ చేయలేదా పసి హృదయం.

భారతి మనసుకి ఎంతో వూరట కలిగి నట్లయింది. హఠాత్తుగా ఆమె హృదయం గాలిలో తేలిపోతున్నట్లుగా అన్పించింది.

"ఏవిటీ పెద్దమ్మను లోపలికి రానివ్వవేమే?" కూతుర్ని కోప్పడింది కస్తూరి.

" ఏం కస్తూరీ ఆరోగ్యం బావుందా?"

"బాగానే వుందే" కస్తూరి ముఖంలో నీలి నీడలు క్షణకాలం భారతిని కదలించాయి.

"పెద్దమ్మా! అమ్మకి చెల్లి పుట్టింది తెలుసా" ఇంటి లోపలి మరో వ్యక్తి ఉనికిని గుర్తు చేసింది శ్రావ్య.

అంతా ఫక్కుమన్నారు.

"చెల్లి పుట్టింది నీకు శ్రావ్యా" సవరించింది భారతి.

"పుట్టింది అమ్మకే కదా" ఆ చిన్ని బుర్రలో లా పాయింటు.

టిఫిన్లూ, కాఫీలూ అయి తండ్రి బ్యాంక్‌కి వెళ్ళింతర్వాత తల్లి వంట చేస్తూండగా చెల్లి కళ్ళల్లోకి చూస్తూ ప్రశ్నించింది భారతి.

"కస్తూరీ పాప పుట్టి మూడు నెలలయింది కదూ! నువ్వెప్పుడు వెళ్తున్నావు అయన దగ్గరికి"

మౌనమే సమాధానమైంది.

"కస్తూరీ! మీ ఆయన రాలేదా?"

కళ్ళల్లో నీళ్ళు తిరుగుతుండగా తల వంచుకుంది కస్తూరి.

"ఏమైంది చెల్లాయ్!" చెల్లిలి భుజంమీద చేతులు వేసి ప్రేమగా ప్రశ్నించింది మళ్ళీ.

"అక్కా పాప పుట్టడం నా తప్పా? కొడుకు పుట్టేనే కానీ రావద్దని ముందే చెప్పిపంపారు. శ్రావ్య పుట్టినప్పుడే గొడవైంది. నాన్న వెళ్ళి కాళ్ళా వేళ్ళా పడ్డంతో అప్పుడేదో మొదటి సారి కాబట్టి నా తప్పు క్షమించేశారు. ఇప్పుడు ముందే చెప్పేశారు ఈ సారి కూతురైతే తిరిగి రావొద్దని. పాప అని తెలిగానే నాకు స్పృహ తప్పినంత పనైంది. అమ్మా, నాన్నా యిద్దరూ సరేసరి కృంగిపోయారు. నాన్న వెళ్ళి ఎంతో చెప్పి చూశారు. ఆఖరికి ఆ రెండో పాపని మేము వుంచుకుంటామని కూడా ప్రాధేయపడ్డారు నాన్న"

"ఏమన్నారు?"

"ఏవంటారక్కా తెలిసిన వాళ్ళకైతే తెలియజెప్పొచ్చు. అసలే ఏమీ తెలీక పోయినా తెలియ జెప్పొచ్చు... తెలిసీ తెలీని మూర్ఖులకి ఎవరు మాత్రం ఏం చెప్పగలరు? మూర్ఖంగా నాన్నను గెంటివేశారు. 'ఈసారి ముత్రం మీ అమ్మాయి కొడుకుని కంటుందని నమ్మకమేంటి? నాకొద్దు విడాకుల కాగితాల్లు పంపిస్తాను సంతకంచేసి పంపండి' అన్నారట. మా అత్తగారు కూడా ఆయనకు తోడైంది. మామగారు చెప్పినా వీళ్ళు వినరు. అక్కడ్నుండి వచ్చాక నాన్న మరీ కృంగిపోయారు. నాక్కూడా ఏదో తప్పుచేశానన్న భావం... ఒక్కోసారి చచ్చిపోదామని కూడా అన్పిస్తొందక్కా" అక్క ఒడిలో తలదాచుకుని బావురు మంది కస్తూరి. చెల్లి తల మీద చేతులు వేసి నిమురుతూ నేత్రాంచలాలలో ముత్యాల్లా నిలచిన కన్నీటి బొట్లని కొనగోటితో చెరిపేసుకుని నిటారుగా అయింది భారితి.

చెల్లెలిని ఓదార్చే ప్రయత్నమేమీ చేయలేదామె. ఏడవనివ్వడమే మంచిదన్పించింది భారతికి.

జోగి జోగి రాసుకుంటే బూడిద రాలి నట్లుగా వుంది భారితికి. ఇప్పుడు యిలాంటి పరిస్థితుల్లో తన విషయం తల్లి దండ్రులకు తొందరపడి చెప్పకూడదని నిర్ధారించుకున్నదామె. భారతి యిక తిరిగి వెళ్ళదని తెలిస్తే ఆత్మహత్య తప్ప మరో మార్గం లేదనుకుంటారు వారిరువురూ.

"అక్కా నువ్వు చెప్పు ఇందులో నా తప్పేమైనా వుందా?" ఏడుస్తూ ఏడుస్తూ సగంలో ఆపి మౌనంగా చూస్తూ ప్రశ్నించింది కస్తూరి.

"ఛ.. ఛ లేదు కస్తూరీ... ఇందులో నీ తప్పేమీ లేదు. తప్పంటూ ఏదైనా వుంటే ఈ పురుషాధిక్య ప్రపంచానిది... తప్పంటూ ఏదైనా వుంటే పూర్తిగా నీ భర్తది" ఖచ్చితంగా జవాబిచ్చింది.

ఆశ్చర్యంగా అక్కవైపు చూసింది కస్తూరి.

"అవును కస్తూరీ! ఏదానా తప్పంటూ వుంటే అది పూర్తిగా మీ ఆయినదే అంటే మగాడిది. అవును. పురుష బీజకణంలో వున్న 'వై' క్రోమోజోముది."

"అంటేఏంటక్కా?"

"స్త్రీ అండంలో కేవలం 'ఎక్స్' క్రోమోజోము మాత్రమే వుంటుంది. పురుషుడిలో అలా కాకుండా కొన్ని వీర్యకణాల్లో 'వై' వుంటుంది. స్త్రీ పురుష సంయోగంలో పురుషుడి తాలూకూ 'ఎక్స్' క్రోమోజాము వున్న వీర్యకణం స్త్రీని చేరుకుంటే స్త్రీలో వున్న 'ఎక్స్'తో కలిసి 'ఎక్స్ ఎక్స్' అవుతుంది. అప్పుడా దంపతులకి ఆడపిల్ల పుడుతుంది. అలా

కాకుండా పురుషుడి లోని 'వై' వున్న వీర్యకణం స్త్రీని చేరుకుంటే ఆమెలో వున్న 'ఎక్స్'తో కలిసి 'ఎక్స్ వై' అవుతుంది అప్పుడు మగపిల్లవాడు పుడతాడు... మీ ఆయనలోని 'వై' క్రోమోజోము కాకుండా తన'ఎక్స్' క్రోమోజోమ్ మాత్రమే నిన్ను చేరుకుని వుంటుంది... ఇందులో నీ బాధ్యతేముంది? అందుకే అన్నాను ఏదైనా తప్పంటూ వుంటే మీ ఆయనదేనని" చిరునవ్వుని మొహం మీదికి తెచ్చుకుంటూ వివరించింది భారతి.

ఆమె కాలేజీ చదువు చదవలేదు. జెనెటిక్స్ నేర్చుకోలేదు. అయినా చిన్ననాటి నుండీ ఆమెతో పాటే నడిచి వచ్చిన సాహిత్యాభిలాష ఆమెచేత ఎన్నో ఎన్నెన్నో పుస్తకాలు చదివించింది. ఆ పుస్తకాల్లో జీవితాన్ని చదువుకుంది. అందుకే అంతటి సహనం. ఎంతటి బాధనైనా నిబ్బరంగా ఎదుర్కొనే గుండెధైర్యం.

ఆరాధనగా భారతినే చూస్తోంది కస్తూరి.

"అక్కా ఆ తప్పు నాది కాదంటే వాళ్ళు ఒప్పుకుంటారా"

జాలిగా చెల్లెల్నే చూస్తూ నవ్వింది భారతి.

"పిచ్చి కస్తూరి ! యమ్.ఎస్సీ. చదివి కాలేజిలో లెక్చరరుగా వుద్యోగం చేస్తోన్న అతడికీ చిన్నవిషయం తెలీదంటావా? ఇది పురుషాధిక్య ప్రపంచం. మగాడు ఏం చేసినా, ఏం చెప్పినా ఆడది తలవంచి వుండాల్సిందే. బాధగా అన్నది భారిత.

"ఏం చేస్తున్నారే యిద్దరూనూ. పాప అలాగుక్క పట్టి ఏడుస్తూంటే" పార్వతమ్మ వంట గదిలోనుండి కేకపెట్టడంతో యిద్దరూ ఈ లోకంలోకి వచ్చారు.

* * *

వారం రోజు తరువాత -

"అమ్మా భారతీ, ఇంకేమ్మా అబ్బాయి ఇబ్బంది పడ్తుంటాడేమో మాలకూడ వేసుకున్నాడేమో కదా. నువ్వు ఇక్కడ వుండడం మాకేమీ భారం కాదు. అంతగా కావాలనుకుంటే ఆయన కొండకి వెళ్ళిక వచ్చి వుందువుగాని" అనునయిస్తూ అన్నాడు ఆనందరావు.

ఒక్క క్షణం తట పటాయించినా "నేను వెళ్ళడం లేదు నాన్నా" ఖచ్చితంగా తన నిర్ణయాన్ని తెలిపింది భారతి.

"అదేం మాటమ్మా?"

"నాన్నా! మీరు నిబ్బరం తెచ్చుకోవాలి" అంటూ జరిగిందంతా చెప్పుకొచ్చింది భారతి.

"చూడు భారతీ! ఏదో ఆవేశంలో నిన్నలా వెళ్ళిపొమ్మన్నాడేమో కానీ అబ్బాయి కొండనుండి తిరిగి వచ్చాక తప్పకుండా నీకోసం వస్తాడమ్మా. నాకా నమ్మకముంది అనవసరంగా తొందరపడి నిర్ణయాలు చేయకు. "అల్లుణ్ణి సమర్థిస్తూ కూతుర్ని మందలించింది పార్వతమ్మ.

"అమ్మా! అతడు రావొచ్చుకానీ నేనే వెళ్ళనమ్మా! వెళ్ళకూడదని నిర్ణయించుకున్నాను."

"వెళ్ళొద్దే యిద్దరూ వెళ్ళకండి... అవమానంతో మేం లోకం ముందు తలొంచుకునేలా చేయండి... ఇక రేపట్నుండి 'ఇద్దరూ యింట్లోనే వున్నారా?' అంటూ అడిగే వాళ్ళకి నేనేమని సమాధానం చెప్పను" కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ అన్నది పార్వతమ్మఅసహాయతతో.

"తొందర పడకు భారతీ" అంటూ అనునయించాడు ఆనందరావు.

"నాన్నా! మీరెప్పుడూ అనేవారు నేను చాలా సహనవంతురాలినని. నిజమే నాన్నా! మీరిచ్చిన ఆ సహనంతోనే యిన్నాళ్ళూ జీవితంతో రాజీ పడ్డాను. ఆ యింటిలోని ప్రతి ఒక్కరి తోనూ. ఆఖరిని నేను కన్న నా కొడుకుతో కూడా సర్దుకు పోవాలనే చూశానాన్నా. కానీ నేను చేయని తప్పుకి... ప్రకృతి సిద్ధంగా వచ్చే నెలసరికి నన్ను భాధ్యురాలని చేసి యింటి నుండి వెళ్ళ గొడ్తూంటే'ఇదేమిటీ?' అంటూ తల్లి దండ్రుల్ని ప్రశ్నించలేని వ్యక్తి దగ్గర నాకు రక్షణ ఎక్కడిది నాన్నా? ఆ తప్పు నాది కాదంటే వినకుండా ఘోరంగా తన్ని తగిలేశారు వాళ్ళు. అలాటి యింట్లో నేను మళ్ళీ వెళ్ళి ఎలా కాపురం చేయగలను?"

"భారతీ నామాట వినమ్మా" ప్రాధేయపడింది పార్వతమ్మ.

"వద్దమ్మా! నాకు యిక మీరేమీ చెప్పకండి... నేను ఓపెన్ యూనివర్సిటీలో బి.ఎ.కి అప్లై చేశాను. చదువుకుంటాను. టైపూ, షార్ట్‌హేండూ నేర్చుకుని ఏదైనా ఉద్యోగం చూసుకుంటాను. నేనూ, నా సంసారం నాయిల్లూ అనే సంక్లిష్టత నుండి నా ఆలోచనలను కొంచెం విస్తృతం చేసుకోనివ్వండి. నాన్నా!ప్లీజ్! నాక్కొంచం నమ్మకమివ్వండి. తండ్రికి అర్థమయ్యేలా చెప్పాలని చూసింది భారతి.

ఎక్కడో మనసు పొరల్లో దాగివున్న లోపలి భారతి ఆత్మాభిమానంతో తలెత్తుకుని లేచి ఒళ్ళు విరుచుకుంది. ఈసారి లోపలి భారతి గెలిచి విజయగర్వంతో భారతిని వెన్నుతట్టి నడిపించ సాగింది.

* * *

రెండు నెలలు గడిచిపోయాయి.

భారతి అత్తింటికి వెళ్ళకుండా వుండిపోయినందుకు పార్వతమ్మ అప్పుడప్పుడూ సాధిస్తూనే వుంది. ఇదేమీ పట్టించుకోకుండా భారతి కష్టపడి చదువును కొనసాగిస్తోంది జీవిత ధ్యేయంగా భావించి.

కొండ నుండి తిరిగి వచ్చిన తర్వాత చంద్ర శేఖరం కబురు చేశాడు భారతిని రమ్మన మని. రానని చెప్పి పంపింది. అతడే తరలి వచ్చాడు భారతిని వెటపెట్టుకుని తీసికెళ్ళడానికి. తల్లి దండ్రులిద్దరూ కూతురుకి ఎంతగానో నచ్చ చెప్పడానికి ప్రయత్నించారు.

ఉహూ! భారతి నిర్ణయంలో ఇసుమంతయినా మార్పు లేదు.

నిరాశతోనూ కొంచెం కోపంగానూ తిరిగి వెళ్ళిపోయాడు చంద్రశేఖరం

కావ్యకి ఇప్పుడు అయిదో నెల వచ్చింది.

కస్తూరి ఈ మధ్యన బాగా డీలాపడి కన్పిస్తోంది. తల్లి విసుర్లు కూడా అప్పుడప్పుడూ ఆమెను బాధిస్తూ వున్నాయి.

ఆ రోజు సాయంత్రం ఆనందరావుతో పాటు గార్డెన్‌లో వెళ్ళి కూర్చుంది భారతి.

"ఏమ్మా చదువుకోలాదా?" కూతుళ్ళిద్దరూ యిలా వచ్చి వుండి పోవడం ఆయనకి ఎంతో బాధగానే వున్నా ఎన్నడూ వాళ్ళను బాధించేలా మాట్లాడడాయన... అందునా భారతికి మొదట్నుంచీ తండ్రి వద్ద చనువెక్కువ.

"నాన్నా! కస్తూరికి ఒక మిషను కొని పెడదాం నాన్నా! ఏదో ఒక వ్యాపకం లేనిదే అది నిస్పృహతో మరోలా ఆలోచించవచ్చు"

"ఏం తల్లీ! దాన్ని కూడా కాపరానికి వెళ్ళనివ్వవా? మిషను కొనిపెడ్తుందట మిషను కాఫీ పట్టుకొస్తూ విసురు విసిరింది పార్వతమ్మ. కూతుళ్ళిద్దరూ కాపురాలు లేకండా యిలా పుట్టింటికి చేరడంతో అవమానమూ, బాధా ఆమెను కమ్ముకుంటున్నాయి.

తల్లిని చూసి మృదువుగా నవ్వింది భారతి. ఆమె బాధ తను అర్థం చేసుకోగలదు."అమ్మా! కూర్చోమ్మా నీతో మాట్లాడాలి"

అయిష్టంగానే కూర్చుంది పార్వతమ్మ.

"అమ్మా! కస్తూరి వచ్చిన తరువాత అతడొక్కసారి కూడ రానేలేదు. పోని నువ్వు చెప్పు కస్తూరి ఆడపిల్లను కనడం దానితప్పా? మగ పిల్లాణ్ణి కనడం దాని చేతుల్లోని పనేమీ కాదుగా? ఇంత చిన్న విషయం ఏ మాత్రం శాస్త్రజ్ఞానం వున్న వారికైనా అర్థమవుతుంది. అలాంటిది అంత చదువు చదివిన ఆ మనిషి నేరాన్ని కస్తూరి మీదికి నెట్టి దాని ముఖం చూడ్డం మానేశాడు. అయినా ప్రయత్నలోపమేమీ లేకుండా నాన్న వెళ్ళి అతడికి ఎంతో నచ్చ చెప్పాలనీ చూశాడు. అయినా అతడు వినలేదు. ఇంకా బలవంతం చేసి కస్తూరిని తీసికెళ్ళి అతడి వద్ద వదిలి వస్తే పరిస్థితేమిటో బాగా ఆలోచించమ్మా? అతడు మరింత పెట్రేగిపోతూ దాన్ని బానిసలా చూస్తోంటే మనం యిక్కడ మనశ్శాంతిగా బ్రతగ్గలమా?" తల్లికి నచ్చజెప్పాలని చూస్తోన్న కూతురివైపు ఆరాధనగా చూస్తున్నాడు ఆనందరావు. తన కూతురు తన కళ్ళముందే ఎంతో ఎదిగిపోయినట్లుగా తోచిందతడికి.

"నువ్వెన్నన్నా చెప్పు భారతి! అది ఎలా బ్రతికినా ఫర్వాలేదు. అసలంటూ అతడు తీసికెళ్ళితే చాలు 'ఇద్దరు కూతుళ్ళు యింటికి వచ్చేశారా పార్వతమ్మా?' అంటూ ఈ ప్రపంచమతా వేలెత్తి చూపుతోంటే నేను సిగ్గుతో చితికిపోతున్నాను భారతీ?" దాదాపుగా ఏడ్చేస్తోంది పార్వతమ్మ.

పార్వతమ్మ అవస్థ చూసి భారతి మనసు జాలితో మూలిగింది.

"అమ్మా!... అదేనమ్మా ఈ మధ్యతరగతి తల్లిదండ్రులకున్న లోపం, కూతురు అక్కడ బానిసలా చూలబడ్డా, ఆఖరికి కిరోసిన్ పోసి చంపబడినా ఫర్వాలేదు. పుట్టింట్లో వుండిపోవడాన్ని మాత్రం సహించరు. ఈ సమాజానికి భయపడి కూతుర్ని చంపుకోవడానికి కూడా వెనుకాడరు"

"భారతీ! ఏమిటీ యిదంతా? నువ్వేంచెప్తున్నావు" పార్వతమ్మ దీనంగా ఏడుస్తోంది.

"అమ్మా! ప్లీజ్ ఏడవకమ్మా... మీలాంటి తల్లిదండ్రులు కాకూడనే అమ్మ నేనింత దూరం చెప్పింది. తల వంచుతూ పోతే యింగా యింకా మొట్టాలనే చూస్తుంది సమాజం... ధైర్యంతో ఎదురు నిలిస్తే భయపడి పారిపోతుంది... మధ్య తరగతి తల్లిదండ్రులు చాలా మారాల్సి వుందమ్మా... గుండె ధైర్యాన్ని మించిన ఆయుధం ఈ ప్రపంచంలో మరేమీ లేదమ్మా.. నా మాట వినండి. కస్తూరిని బలవంతంగా అతడి వద్దకు పంపి మరో కిరోసిన్ చావును పేపర్లో చూసేలా చేయకండి"

"అయితే ఇప్పుడేమంటావే?"

తల్లిలోని ఆ స్వల్పమైన మార్పే భారతిలో గొప్ప ఉత్సాహాన్ని నింపింది.

"దానికెలాగూ చదువబ్బలేదుకాబట్టి టైలరింగ్ నేర్పిద్దాం. మెల్లగా ఓ మిషను కొనిద్దాం... దానికో వ్యాపకం ఏర్పడ్డట్టుంటుంది... మనసుకి మంచి డైవర్షన్ కూడాను.. కొన్నాళ్ళు యిలా గడవనివ్వండి... అతడిలో పరివర్తన కలిగి అతడంతట అతను కస్తూరిని పంపమని అడిగినట్లయితే తప్పక పంపేద్దాం.

"అమ్మా! మాక్కొంచెం నమ్మకమివ్వండమ్మా... మాక్కొంచెం చేయూతనివ్వండి. ఆత్మ గౌరవం దెబ్బతిని పుట్టింటికి వచ్చిన ఆడపల్లల్ని బలవంతంగా తిప్పి పంపించేయాలని చూడకండి... ఆత్మ విశ్వాసాన్ని నింపండి... నిల దొక్కుకునేలా ధైర్యాన్నివ్వండి. ఈ సమాజానికి భయపడి నీతిపాఠాలు వల్లించకండి - బానిసల్లా బ్రతికే ఈ దుస్థితినుండీ, ఈ పురుషాధిక్య వ్యవస్థ విషపు కోరల్నుండీ మమ్మల్ని కాపాడండి.. మాక్కొంచెంచేయూతనివ్వండి" చేతులెత్తి దణ్ణం పెడుతూ ప్రాధేయ పడింది భారతి.

పార్వతమ్మ ఆవాక్కయి కూతుర్నే చూడసాగింది.

"నువ్వు ఎంతో ఎత్తుకు ఎదిగిపోయావమ్మా భారతీ!... ఈ వ్యవస్థకి భయపడి అణిచి పెట్టబడ్డ ఆశయాలన్నింటినీ పుణికి పుచ్చుకున్నావు. నేను గర్విస్తున్నానమ్మా... నిన్ను కన్నందుకు నేనెంతో గర్విస్తున్నాను... జన్మభూమి మీద అభిమానంతో ఆనాడు నేను 'భారతి' అని పేరు పెట్టుకున్నందుకు భరతమాత గుండె ధైర్యాన్ని సంతరించుకున్నావు... నాకళ్ళు తెరిపించావు" ఆప్యాయంగా ఆనందంతో వర్షిస్తోన్న కళ్ళని తుడుచుకున్నాడు ఆనందరావు.

భారతి లోపల ఉన్న భారతి ఉప్పొంగిన గోదావరే అయింది.

(భర్త మాల వేసుకున్నపుడు బయటున్నందుకు యింటి నుండి తరిమివేయబడిన ఓ స్త్రీని చూసి స్పందించి - రచయిత్రి)

# దిగైడ్

శాంతాదత్

" గుడ్ మార్నింగ్ ఎవిరిబడీ...
శ్రీనివాసా ట్రావెల్స్
వెల్‌కమ్స్‌యూ..."

గైడ్‌కి కావలసిన లక్షణాలు స్ఫురద్రూపం, ఆకర్షణీయమైన కంఠం, దృష్టిని ఆకర్షించే డ్రెస్ ఇవన్నీ వున్న వెంకటేశ్ మర్యాదపూర్వకంగా వంగి అందరినీ ఆహ్వానించాడు.

ఎనిమిది గంటలకు బయలుదేరవలసిన బస్ ఎనిమిదిన్నర అయినా బయలుదేరకపోయేసరికి ఓపిక నశించి విసుక్కుంటూ సీట్లకు జారగిలబడి కూర్చున్న టూరిస్టులు ఒక్కసారి గా నిటారుగా కూర్చున్నారు.

" ఐయామ్ వెంకటేష్... ఈ చరిత్రప్రసిద్ధి చెందిన భాగ్యనగరాన్ని ! ఐమీన్ హైదరాబాద్ ను మీకు చుట్టిచూపిస్తూ ఈ నగర విశేషాలను వివరించే అవకాశం నాకు కలిగినందుకు చాలా సంతోషం. జీవితపయనంలో తొలి అడుగు పాతకాలకదా! ఇప్పుడు ఈ యాత్రలో మొదటగా ఉస్మానియా యూనివర్శిటీకి పోతున్నాం "

వివిధ భాషలు మాట్లాడేవారు, వేర్వేరు ప్రాంతాలకు, మతాలకు, జాతులకు చెందినవారు బస్‌లో ఉండడంవల్ల వెంకటేష్ చేసే వర్ణన చక్కని ఇంగ్లీషులో సాగుతుండగా...

ఆ సిటీ సైట్‌సీయింగ్ డీలక్స్ బస్ స్టార్టు అయింది. నీటుగా విశాలంగా వున్న యూనివర్శిటీ రోడ్డుపై బస్ హాయిగా తేలిపోతోంది.

పెళ్ళికి వెళ్తున్నట్లుగా పట్టుబట్టలు, బంగారం, వజ్రాలతో కూర్చున్న అలమేలు మనసులో మంచుతెర కమ్మినట్లు ఒక గందర గోళం... మసకమసకగా ఊహలు...

' ఈ గైడ్‌ని ఎక్కడో చూసినట్లుగా... ఒకవేళ అతనిలాగా... లాగా ఏమిటి ? అతనే కావచ్చు... పేరు కూడా వెంకటేశే... ఛ... ఇతను అతను కాదు... ఈ వెంకటేశ్ అన్న పేరు చాలా మామూలు... వీధికి పదిమంది వెంకటేశులు !'

" త్వరగా దిగి చూసిరండి పదిహేను నిమిషాలు టైం " వెంకటేశ్ చెప్తుండగా బస్ యూనివర్శిటీముందు ఆగింది.

" నేను రావడంలేదు. మీరు చూసిరండి "

" ఏమిటిది అలమేలూ... స్టార్టింగ్‌లోనే ఇంటరెస్టు లేకుండా... " గోవిందాచారి విసుక్కున్నాడు.

" యూనివర్శిటీలో నేను చూసేది ఏముంటుంది ? నాకేం అర్థం అవుతుంది ? మీరు వెళ్లిరండి "

బస్ ఇంచుమించు ఖాళీ అయిపోయింది. అలమేలు మనసు ఆలోచనలతో నిండిపోయింది.

' ఇతను ఆ వెంకటేష్ కాదు. అతని కెక్కడిది ఇంతటి హోదా ! ఇదేం పెద్ద ఉద్యోగం కాకపోవచ్చు. కాని దీనికీ ఒక చదువు కావాలిగా. మా ఇల్లు వదిలి వెళ్లంగానే ఆ వంటమనిషి ఇతన్ని ఇంతగా చదివించి ఉంటుందా ?

కొద్ది సేపట్లో బస్ తిరిగి బయలుదేరింది. నిలువెత్తుగా నిల్చున్న వెంకటేశ్వరస్వామి దర్శనం చేసుకుని బిర్లామందిర్ బయట ప్రాకారంనుంచి కింద బొమ్మలాగా కనిపిస్తున్న 'ట్విన్‌సిటీస్' ను. వాటిమధ్యన ఉన్న హుసేన్ సాగర్‌మీద కట్టిన ట్యాంక్‌బండ్‌ని ఆసక్తితో చూస్తోంది అలమేలు.

" గుడి చాలా అందంగా ఉందికదూ... అవును. ఈ గైడ్ ఆ కుర్రాడు వెంకటేశేనేమో అని అనిపిస్తోంది. పన్నెండు సంవత్సరాలు గడిచిపోయాయి కాబట్టి అనుమానంగా ఉంది. నీకేమి అనిపిస్తోంది అలమేలూ " చటుక్కున భర్తవేపు చూసింది.

" ఈయనకు కూడానా ?. ఇద్దరికీ అదే జ్ఞాపకం వచ్చిందంటే అది ఖాయంగా నిజమే అయ్యుండాలి "

ఆమె పైకి ఏమీ అనలేదు. మౌనంగా ఇద్దరూ కిందికి దిగారు. ఇద్దరి మనసుల్లోనూ ఆలోచనలు... ఆలోచనలు.

" ఇప్పుడు మనం చరిత్రప్రసిద్ధి చెందిన గోల్కొండ కోటవైపు వెళ్తున్నాం. కాలక్రమంలో ఇది శిథిలమైపోతున్నా కూడా దాని ప్రశస్తిమాత్రం కాలానికి అణగివుండేదికాదు. ఈ గోల్కొండ..."

తానే కట్టినంతటి సంతోషంతో ఒక గైడ్‌కి ఉండవలసిన వాక్చాతుర్యంతో కోట గొప్పతనం గురించి ఘనంగా చెప్తున్నాడు వెంకటేశ్.

పదకొండు కిలోమీటర్ల దూరంలో వున్న గోల్కొండ కోటను చేరుకోడానికి నగరాన్ని వెనక్కి నెట్టుకుంటూ బస్ ముందుకి సాగుతోంది.

పదిగంటలు అవుతోంది. గోల్కొండ చేరడమే ఆలస్యం. కొబ్బరిబోండాలవాళ్లు, సోడాల వాళ్లు, లాటరీ టిక్కెట్లు అమ్మేవాళ్లు చుట్టుముట్టారు.

" సోలాఫోటో పాంచ్‌రూపయా... బడాసైజ్ దస్ రూపయా..." గోల్కొండ, చార్‌మినార్, సాలార్‌జంగ్ మ్యూజియం, నెహ్రూ జూలాజికల్ పార్క్, మక్కామసీదు, బిర్లామందిర్, బిర్లాప్లానిటోరియం మొదలైన ఫోటోల సెట్‌ని కొన్నాడు గోవిందాచారు.

" భద్రంగా పెట్టుకో... పద్మ చూస్తే చాలా సంతోషపడ్తుంది "

మిగిలినవారందరూ కోటపైకి ఎక్కడం మొదలు పెట్టారు. వాళ్లకి ముందుగా వెంకటేశ్.

' ఇతనికి కాళ్లు నొప్పులు ఉండవా ?'

తల పైకెత్తి చూసిన అలమేలుకి ' ఇంత పైకి ఎలా ఎక్కుతాం ' అని భయంవేసినా కూడా చూడాలనే ఆకాంక్షతో ఒక కొబ్బరిబొండాం తాగి భర్త చేయి పట్టుకుని ఎక్కసాగింది.

" ఇప్పుడు మనం గండిపేట అనే ఉస్మాన్ సాగర్ వెళ్తున్నాం. హైద్రాబాద్‌కి ఇక్కడినుంచే వాటర్ సప్లయ్ జరుగుతుంది "

ఇలా వెయ్యిసార్లు పైనేనా చెప్పివుంటాడు. అయినా కూడా విసుగులేకుండా అప్పుడే తాజాగా చెప్తున్నట్లు ఒక తాదాత్మ్యంతో నిండిన మృదువైన గొంతుతో...

గండిపేట చల్లగా అందంగా ఉన్నా కూడా బృందావన్ గార్డెన్స్, సాత్‌నూర్‌డాంవంటి వాటిని చూసి ఉన్నందువల్ల ఇదేమీ అంత గొప్పగా అనిపించలేదు. త్వరత్వరగా ఒక చుట్టు చుట్టి పచ్చికమీద హాయిగా కూర్చున్నారు అలమేలు, గోవిందాచారి.

" పల్లీ... పల్లీ... గరంపల్లీ... టైంపాస్... ఛోటాపాకెట్ ఏక్ రూపయా... బడావాలా దోరూపయా... ఏ ఆఠ్ ఆణా..."

ఒక రెండు రూపాయల పాకెట్ తీసి అలమేలుకి అందించాడు.

" తెలుగుప్రాంతం అయినా కూడా హిందీ డామినేషన్ చాలా ఎక్కువగా ఉంది చూశావా ?"

"హిందీ ఒక్కటేనా? అరవ్వాళ్ల డామినేషన్ కూడాను "

అలమేలు చూపు దూరంగా ఒక అమెరికన్ జంటకు ఏదో వివరిస్తున్న వెంకటేశ్‌మీద పడగా...

" నువ్వు ఇంకా వాడిని మరిచిపోలేదా ?"

" మీరు మరిచినట్లు !"

" ఈ బస్‌లోనే వీడూ గైడ్‌గా రావాలా ? దేన్నీ మనస్ఫూర్తిగా అనుభవించకుండా... నువ్వు గమనించావా అలమేలూ ? మనల్ని గుర్తుపట్టినట్లు వాడు ప్రవర్తించలేదే !"

" దరిద్రవెధవ. వీడి కడుపుమంట మూలంగానే మూడోనాడే మన పద్మ... పాపిష్ఠి... శాపం ఇచ్చి ఉంటాడు "

" ఇంక వదిలేయి. మనం చేసింది చిన్న తప్పయినా, దేవుడు మనకు పెద్ద శిక్షనే వేశాడు "

' వకీలును ఆయన భార్యను అనుకోకుండా ఈ రోజు బస్‌లో చూసిన విషయం అమ్మకి చెప్పాలి ' అన్నంతోపాటు ఆలోచనలు కూడా నెమరువేస్తున్నాడు వెంకటేశ్.

ఆరోజుల్లో ఈ వకీలు ఇంటివాళ్లు తననూ, తన అమ్మనీ ఎంత చిన్నచూపు చూశారు ! తండ్రి లేని బిడ్డకు చదువు, సౌకర్యాలకు లోటు రాకూడదని తన శక్తికి మించి వకీలుగారి మూడో అమ్మాయి పద్మ చదివే స్కూల్లోనే, అమ్మ తనని చేర్పించగా, పద్మ ఎనిమిదోక్లాసులోనూ, తను తొమ్మిదోక్లాసులోనూ ఉండేటప్పుడు స్కూలు పిల్లల్ని హైదరాబాద్ ఎక్స్‌కర్షన్‌కి తీసుకుపోవాలని నిశ్చయించినప్పుడు పద్మ పేరియ్యగా తను కూడా ఆశపడ్డాడు. ఎంత కన్సెషన్ ఇచ్చినా రెండు వందలేనా పైన అవుతుందికదా ! తన పేదతల్లి వకీలుని అడిగినప్పుడు...

ఇయ్యాడానికి మనసు లేకపోతే 'లేదు' అని ఒక్క మాట అని ఊర్కోవచ్చు. కాని ఆయన విసిరిన బాణాలవంటి మాటలు ! తన ఎదుటనే.

" ఓహో ! వంట మనిషి కొడుకుకు ఎస్కర్షన్ కూడానా ! దేన్నో చూసి ఏదో వాత వేసుకున్న కథట ! పద్మ వెళ్లేది చూసి నీకు ఆశ వచ్చిందా ! మేము ఉన్నవాళ్లం ఎక్కడికేనా పోగలం. ఒక్కపూట తిండికి గతిలేని వాళ్లు ఊళ్లు తిరగాలని ఆశపడవచ్చా ? దేనికైనా ఒక యోగ్యత ఉండాలి. పనిచూసుకో పోరా... "

కాలుమీద కాలు వేసుకుని వకీలు కోపంగా అరిచేసరికి వెంకటేశ్ నివ్వెరపోయి నిల్చుండి పోయాడు. రెండువందలు కావాలని అదికూడా ఉచితంగా కాకుండా చేసే పనికి అడ్వాన్స్‌గా అడిగిందానికి ఇంతటి రాద్ధాంతం ! మానవత్వం లేకుండా మనసుకి బాణాలులాగా గుచ్చే ఇంతటి మాటలా !

ఆ పదమూడేళ్ల లేత మనసు అగ్ని గుండంలాగా ఉడికేసరికి మాటలతో ఏమీ చెప్పకుండా, " ఛీ... నువ్వు కాడా ఒక మనిషివేనా ?" అన్న భావంతో ఆయనవంక చూసి అమ్మ చేయి పట్టుకుని ఆ ఇల్లు విడిచి బయటకు వచ్చేశాడు.

ఆ తర్వాత ఎన్నెన్నో కష్టాలుపడి పైకొచ్చి ఈనాడు ఈ గైడ్‌పని చేస్తూ...

ఇదంతా జరిగిపోయిన కథ...

" పాన్ తీసుకోండి సార్... మీఠాపాన్... ఇక్కడిది చాలా బాగుంటుంది. మీల్స్ నచ్చాయా ?"

వెండిరేకుల్లో చుట్టిన రెండు పాన్‌లను వకీలుకి అందించాడు వెంకటేశ్.

" థాంక్యూ వెంకటేశ్. మీల్స్ బ్రహ్మాండంగా ఉంది. అవును... అమ్మ ఎలా వుంది!" గోవిందాచారి సూటిగా అడిగాడు.

" ఆమెకేం... ఏ కొరతా లేకుండా హాయిగా ఉంది. ఇప్పుడు నాకు మటుకే వంట చేస్తోంది. మనం ఇలా హైదరాబాద్‌లో కలుస్తామని అనుకోలేదు కదా !" అని బదులుగా అన్నాడు వెంకటేశ్.

'హైద్రాబాద్ అని గట్టిగా నొక్కి చెప్తున్నాడు. జరిగిపోయిన దానిని మరవనేలేదా? దేన్నీ మనసులో పెట్టుకోకుండా తెలిగ్గా మాట్లాడుతూ !'

అలమేలు భర్తవంక నిశితంగా చూసింది. ఆ తర్వాత ప్రపంచంలో రెండవ పెద్దదైన సాలార్‌జంగ్ మ్యూజియంలోని బ్రహ్మాండమైన ముప్ఫయిరెండు గదుల్లో వున్న సూమారు ముప్ఫదిరెండువేల కళాఖండాల గురించి గబగబా క్లుప్తంగా టూరిస్టులాగా చెప్పేందుకు, నెహ్రూ జూలాజికల్ పార్క్ కం జూను చుట్టి చూపించేందుకూ వెంకటేశ్ టైం సరిపోయింది.

పొద్దుటినుంచి తిరిగి తిరిగి అలిసిపోయిన టూరిస్టులు విశ్రాంతికోసం చిన్న చిన్న గుంపులుగా బెంచీలపైనా చెట్లకిందా పచ్చికమీదా కూర్చున్నారు.

మూడు కోన్ ఐస్‌క్రీములతో వచ్చాడు వెంకటేశ్.

" ఐస్‌క్రీం తినడానికి మేమేం చిన్నపిల్లలమా వెంకటేశ్. పైగా ఇది ఐస్‌క్రీం తినే సీజనా ?"

" పర్వాలేదు సార్... అందరూ చలికాలం అని తినడం మానేస్తే పాపం ఐస్‌క్రీం అమ్ముకునేవాడికి గడిచేదెట్లా ? మీకు మటుకు లోపల ఐస్‌క్రీం తినాలనిలేదా ? ఆశ అనేది వయసు, కాలం, అంతస్థు అన్నీ బేధాలకూ మించిన భావనకదా ! బైదిబై... పద్మ ఎలా ఉంది ? పెళ్లయిందా ? ఏమీ చెప్పలేదే మీరు ?"

' పద్మ... ఆమెను గురించి ఇతని దగ్గర ఎందుకు చెప్పాలి ? ఇతనివల్లనే... ఇతని శాపమే...

మనసులో అనుకుంటూ కూడా నోరు చటుక్కున మాట్లాడుతోంది.

" ఆమెను గురించి సంతోషంగా చెప్పుకునేందుకు ఏంలేదు బాబూ ! ఆమె జీవితం వీల్‌ఛైర్‌లోనే అణిగిపోయింది. ఒక యాక్సిడెంట్‌లో రెండు కాళ్లూ..." ఆపైన మాట్లాడలేక ముఖానికి చేతులు అడ్డుపెట్టుకుని ఏడవసాగింది అలమేలు.

' మైగాడ్. ఏమిటిది ? నమ్మశక్యం కాకుండా...' నిర్ఘాంతపోయాడు వెంకటేశ్.

' ఉన్నవాళ్లం... ఎక్కడికైనా వెళ్లవచ్చు... లోకమంతా చుట్టిరావచ్చు...' డబ్బున్నవాళ్లం అనే గర్వంతో, అహంకారంతో ఆరోజు వాళ్లు డంబంగా పలికింది!... ఇప్పుడు ఆ పద్మ కేవలం ఇల్లు వదిలి బైటకు రావడానికి కూడా వీలులేకుండా...'

బస్ హారన్ ఆలోచనల గతి మార్చేసరికి మనను సంబాళించుకుని లేచాడు.

" ఐయామ్ వెరీ సారీ సార్... నివేందుకే చాలా బాధగా ఉంది " వకీలుకి పరామర్శలు చెప్పి బస్‌వైపు వెళ్లాడు.

చార్‌మినార్ పక్కగా వుండే తళతళ మెరిసే రాళ్లగాజుల దుకాణాలు కుప్పతెప్పలుగా నిండిన చుడీబజార్లో టూరిస్టులు వెళ్లి భాష తెలియని కారణం వల్ల బేరమాడ్డం చేతకాక దిక్కులు చూస్తూ నిలబడ్డప్పుడు వెంకటేశ్ వాళ్లకి సహాయంగా వెళ్లాడు.

అలమేలు చాలా గాజులు తీసుకుంది.

" తెల్లని పద్మ చేతులకి చాలా అందంగా ఉంటుంది. వీటిని తీసుకోండి" ముదురునీ లంరాళ్లు పొదిగిన గాజుల్ని చూపించాడు వెంకటేశ్.

భార్యాభర్తల ఇద్దరి చూపులు ఒక్కక్షణం కలిశాయి.

ఒక నిర్ణయాన్ని ఒకే సమయంలో ఒక్క నిమిషానికి తక్కువైన సమయంలో రెండు మనసులు చటుక్కున తీసుకున్న భావం ఆ చూపులు తెలిపాయి.

మక్కామసీదుముందు ప్రాంగణంలో రెండురాళ్ల బెంచీలమీద టూరిస్టులను కొంచెం సేపైనా తప్పక కూర్చోమని చెప్పాడు వెంకటేశ్.

" ఈ బెంచీలమీద కూర్చుంటే మళ్లీ హైద్రాబాద్ వచ్చే అవకాశం తప్పక కలుగుతుంది "

పిల్లలతో సహా వచ్చినట్లుగా అందరికంటె ముందు ఆ దంపతులు బెంచీమీద కూర్చున్నారు.

" మనం ఇంకోసారి హైదరాబాద్ రావాలి అలమేలూ. పద్మ కాపరాన్ని చూడవద్దా?" మెల్లిగా హాస్యంగా భార్యకు చెప్పాడు గోవిందాచారి.

చీకటి అలుముకుంటోంది. నౌబత్‌పహాడ్ నుండి చూసినప్పుడు నగరం ఎంతో సుందరంగా కనిపించింది. నక్షత్రపుష్పాల్ని పారజల్లినట్లు దీపాలు - చిన్నచిన్న ఆటబొమ్మల్లాగా బస్‌లు, కార్లు, భవనాలు, మనుష్యులు... ఎదురుగా చేయిచాచి అందుకునేటట్లుగా అనిపిస్తున్న దీపాల వెలుగులో జలకాలాడుతున్న బిర్లామందిర్ దూరంగా కళ్లు మిటకరింపజేసే టి.వి. టవర్... టూరిస్టులు ఆ ట్రిప్‌లోని చివరిఅంశంలో పారవశ్యం చెందుతున్నారు.

" వెంకటేశ్... ఏమీ అనుకోనంటే ఒక మాట. ఈ గైడ్ ఉద్యోగం వదిలి మద్రాసు వచ్చేయి. నాకా కావలసినంత ఆస్తి ఉంది. నువ్వు ఈ అంటే రాజాలాగా బతకచ్చు... మా పద్మని పెళ్లిచేసుకుంటే..."

ఎలాగో ధైర్యం తెచ్చుకుని మొదలు పెట్టాడేకాని ఆయనకి భయంగానే ఉంది.

తన కోరిక న్యాయమైనదేనా ?

అలమేలు పరితాపంతో అతనివంక చూస్తోంది.

నా కూతురికి బ్రతుకు ఇస్తావా అనే దీనాలాపన ఆ కళ్లల్లో...

ఈ ప్రశ్నని, కోరికను వారి దగ్గరనుంచి అతను ఎదురుచూడనేలేదు. అతనికి పెద్ద షాక్ అయింది. ఆనాడు తన పరిస్థితి వాళ్ల కంటే ఎన్నోరెట్లు దిగువన ఉన్నప్పుడు ధనగర్వంతో అలా ప్రవర్తించారు. ఇప్పుడు, ఇంతటి ఘాతుకం జరిగాక కూడా, తనని అవమానపరచిన విషయం కూడా మరచిపోయి, నేను ఇప్పుడు మంచి స్థితిలో

ఉండేసరికి పెళ్లివంటి జీవితపయనంలో ముఖ్యమైన అధ్యాయం విషయంలో ఇలా అడుగుతున్నారంటే, ఇప్పటికీ వారి ధనగర్వం పోలేదన్నమాట.

వాళ్లు వెంకటేశ్ ముఖంవంకే చూస్తున్నారు.

దీనికి సమాధానం చెప్పేందుకు తటపటాయించవలసిన అవరసం ఏముంది ?

" నా కోరికలు, అవసరాలు, ఆశలు తీర్చుకునేందుకు ఇంకొకరి దయకోసం ఎదురుచూసే దయనీయ పరిస్థితిలో 'ఇప్పుడు' నేను లేను. ఇప్పుడు నేను రాజాలాగానే ఉన్నాను. కాని ఏదో అనుకొని ఒకదానికొకటి ముడి పెట్టుకుని బాధపడకండి. దానికీ దీనికీ ఏ సంబంధంలేదు. మీమీద నాకేం కోపం లేదు. ఎవరి జీవితంమీద అధికారం వారికే ఉంటుందికదా ! నేనూ మామూలు మనిషినే. నాకూ కొన్ని ఆశలు ఉన్నాయి. సో ఐయామ్ సారీ టు సే సారీ ! మీ కోరికను నెరవేర్చకపోయినా ఈ సామాన్య గైడ్‌ని మన్నించండి. వెళ్లివస్తా... పద్మని అడిగానని చెప్పండి "

చిరునవ్వుతో చేతులు జోడించి చకచకా నౌబత్‌పహాడ్ గుట్టను దిగుతూ బస్‌వైపు వెళ్లాడు.

(విపుల, మార్చి 1995)

# ముత్యం - పగడం

యస్. రాజ్యలక్ష్మి

ఆ రోజు దుర్గాష్టమి. ఉదయం ఎనిమిది గంటల వేళ పరంధామయ్య గారు సంధ్యవార్చి నీరెండలో మండువాలో పాతకాలపు పడక్కుర్చీలో కూర్చుని భార్యతో మాట్లాడుతున్నారు. పిల్లలు బంతి పూలూ మామిడాకులూ కలిపి తోరణాలు సిద్ధంచేస్తున్నారు.

కృష్ణమూర్తి పరంధామయ్యగారి చిన్నకొడుకు. హైదరాబాదులో టీచరు. చాలాకాలంనుండీ చిన్నకొడుకు దగ్గర ఉండాలని ముచ్చట పడి పరంధామయ్యగారు భార్యాసమేతంగా ఈ మధ్యనే హైదరాబాదు వచ్చారు. ఎప్పటికప్పుడే వాళ్ళ తిరిగి పెద్దకొడుకు వద్దకు పోవాలనుకుంటూ, మనమడూ మనమరాలూ మారాంచేస్తే కాదనలేక పండుగకు ఉండిపోయారు.

కృష్ణమూర్తి భార్య లలిత స్కూలు ఫైనలు పాసైంది. పెద్ద చదువులు లేక పోయినా సంస్కార సంపన్నురాలు. ఇల్లు దిద్దుకోవడంలోనూ పిల్లల పెంపకంలోనూ నేర్పరి. అత్తగారి దగ్గరకొచ్చి, "అత్తయ్యా, పూజ సామగ్రి తోమి పువ్వులూ అవీ సిద్ధం చేశాను. మీ అబ్బాయి రావడం తోటే పూజమొదలు పెట్టవచ్చు" అంది.

" మీ అత్తయ్య పక్షపాతమ్మా లలితా. దాని ప్రాణం ఎప్పుడూ వాల్తేరు లోనే ఉంటుందమ్మా. పెద్దకోడలు సత్యవతి పండుగ సవ్యంగా చేస్తోందోలేదోనని ఆమె గారి బెంగ " అన్నారు పరంధామయ్యగారు నవ్వుతూ.

" అది కాదే లలితా, దానికి ఏటేటా కాన్పా, ఉన్న ఏడుగురు పిల్లల్లో చేతికి అందిన ఆడపిల్లన్నా లేదాయె ! నువ్వు దానికన్నా కాస్త ఓపిగ్గా పనిచేసుకోగలవుగాని అది అక్కడ ఒక్కర్తే ఎలా దేవుళ్లాడుతోందోనన్నాను. ఇప్పుడు దానికి మళ్ళీ నెలలు నిండుతున్నయ్యి " అంటూ అత్త సావిత్రమ్మగారు చెప్పుకుపోతోంది.

ఈలోగా పక్కవాటాలోని పార్వతమ్మగారి కంచు గొంతు వినపడింది.

ఓ పెద్దదయ్యమా, ఎక్కడ చచ్చావే ? నీకు బొత్తిగా ఒళ్లు ఒంగడంలేదీమధ్య. నేనొక్కర్తినీ ఇంటెడు చాకిరీ చేస్తుంటే నువ్వుపెత్తనాలకు తగులడు. పండుగనాడైనా ఇవతల చెంబు తీసి అవతల పెట్టవుకదా !"

పరంధామయ్యగారి మనుమలతో తోరణాలు కడుతున్న దుర్గ, తల్లి గొంతు వినడం తోటే పరుగుపరుగున వాళ్ల వాటాలోకి వెళ్లిపోయింది. పార్వతమ్మగొంతు ఇంకా తారస్థాయికి పోయింది.

" ఏమే పన్నెండేళ్లొచ్చినై. ఎందుకూ పొయ్యిలో పొయ్యనా ? ఈ చంటి వెధవని కాస్త తీసుకుపోయి ఆడించకపోతే, ఆవంట ఎట్లా వల్లకాడవుతుందే ?" అంటూ ఆ చంటి వాడి వీపు విమానం మోత మోగించింది. వాడు రాగం లంకించుకున్నాడు. వాడ్ని ఎత్తుకుని సముదాయించుకొంటూ దుర్గ బయటికొచ్చింది.

ఈలోగా పరంధామయ్యగారు భార్యతో " అబ్బ, పండగపూటా ఏం తిట్లు తిట్టిందే కడుపున కన్న పిల్లల్ని ?" అన్నారు బాధపడిపోతూ.

"ఆ, మీకేం, చెపుతారు. ఆ పార్వతమ్మకు మన సత్యవతిలాగానే ఏటేటా కాన్పు. కళ్లల్లో ప్రాణాలు పెట్టుకుని ఎనిమిది మంది పిల్లలకూ భర్తకూ చాకిరిచెయ్యలేక ఏసుక్కుంటోంది. పైగా పిల్లలంతా మరీ చిన్నవాళ్లు. ఇంకానయం ఆదుర్గ తొల్చూలు కాబట్టి పన్నెండేళ్లది చేతికందింది. ఆ తండ్రికి మాత్రం ఏం సుఖం ? పాపం గుమాస్తాగిరీ చేసి అలిసి ఇంటికైనారాడు. అక్కడా అక్కడా దుకాణాల్లో లెక్కలు రాసి, మరికాస్త సంపాదిస్తాడుట. ఈ కరువు రోజుల్లో ఇందమందికీ తిండీ బట్టా సమకూర్చాలంటేనే కష్టం. ఇంకా నౌకర్లను పెట్టుకునే స్తోమత ఎక్కడనుండి వస్తుందీ ? ఇక చెయ్యలేకా, చెయ్యకపోతే తప్పకా అలా నోరుపారేసుకుంటూ ఉంటుందావిడ " అంది సావిత్రమ్మ.

" అవునూ, మన లలిత ఎక్కువ మాట్లాడనే మాట్లాడదు కదా, ఇన్ని విషయాలూ వివరాలూ నీకేవరు చెప్పారే ?"

" సరిపోయె, ఆ అమ్మాయి, పార్వతమ్మే మనింటికి వచ్చి రోజూ కాసేపు కూర్చుని వెళ్తుంది. ఆ పిల్లలు ఆవిడ్ని కూర్చోనిస్తేనా, ఒకడు మంచినీళ్లంటాడు, మరొకడు నిద్దరంటాడు.

ఈలోగా కృష్ణమూర్తి వచ్చాడు. చేతులో రెండు సంచులతో కూరలూ, పళ్లూ పట్టుకుని

" రారా, అబ్బాయ్. నీదే ఆలస్యం. నువ్వు కూడావస్తే అందరం కలిసి పూజచేసుకోవచ్చని ఎదురు చూస్తున్నాం " అన్నారు తండ్రి.

" నాన్నా నేను 'శుక్లాంబరధరం విష్ణుం' అంటూ పూజ చేస్తాను " అన్నాడు ఆరేళ్లరవి.

" ఇవ్వాళ సరస్వతికి పూజ చెయ్యాలిరా, " సరస్వతి నమస్తుభ్యం " అనే శ్లోకం చదువు " అంది ఎనిమిదేళ్ల రమ.

" ముందు విఘ్నేశ్వర స్తుతి. తరువాతే సరస్వతీ పూజ " అన్నారు తాతగారు. ఇద్దరి వంకా చూసి.

"సరే గాని పాపా, ఆ తోరణాలు ఇటుతెండి, గుమ్మాలకు కట్టేస్తా " అని లలిత పిల్లల సాయంతో గుమ్మాల నలంకరించింది.

అంతా పూజగదిలో చేరారు. పరంధామయ్య గారు పురోహితుడి విధిని నెరవేర్చడానికుపక్రమించారు.

" లలితా, నువ్వు కూడా రావే " అని వంటింట్లో ఉన్న కోడల్ని కేకెసింది సావిత్రమ్మ.

"వస్తున్నానత్తయ్యా, వంటకాలమీద మూతలు పెట్టి నైవేద్యానికి పిండి వంటలు తేస్తున్నా" అంది లలిత.

"నైవేద్యానికి తొందరేంలేదు, నలుగురితో పాటు నువ్వు కూడారా. అందరం కలిసే మొదలెడదాం పూజ " అన్నాడు కృష్ణమూర్తి భార్యతో.

" ఆ పెద్దాడికి ఎప్పుడూ చిరాకూ విసుగూనూరా. ఎప్పుడూ సత్యవతి మీద ఎగిరి పడుతూ ఉంటాడు. కృష్ణా, నిన్ను చూస్తే ముచ్చటనిపిస్తోందిరా. లలితని ఆపేక్షగా చూసుకుంటూ ఎప్పుడూ ప్రశాంతంగా ఉంటావు ." అంది సావిత్రమ్మ పరాయి వాడితో అన్నట్టు.

ఆవిడ ఎప్పుడూ పెద్దకొడుకుతోటే ఉండడం మూలాన అతడి సంసారమే తనదైనట్టు అలవాటై, చిన్న కొడుకూ కోడలూ ఏదో సుఖపడి పోతున్నారనీ, ఆ సుఖం పెద్దకొడుకు సంసారానికి లేదని ఆవిడు బాధ.

కృష్ణమూర్తి లలితవంక చిరునవ్వుతో చూసి, " నాదే ముందమ్మా, నాకు విసుగు కలగకుండా అన్నీ అమర్చిపెడుతుంది నీకోడలు. నేనింటి కొచ్చే సరికి పిల్లలకు కావలసినవన్నీ చూసి, వాళ్లదారిన వాళ్లు తృప్తిగా ఆడుకునేందుకు వదుల్తుంది. దాన్ని నేనేమైనా అనే అవకాశం ఎప్పుడూ ఇవ్వదు. అన్నకున్నట్టే నాకూ ఉంది బోలెడు విసుగూ చిరాకూ. అప్పుడప్పుడు ప్రదర్శిస్తూనేఉంటా. మీరు మాతో ఎప్పుడూ ఉంటే తెలిసేది. కాని మీరు చుట్టాలొచ్చినట్టొచ్చి, బెట్టుబెట్టుగా నాలుగురోజులుండి పోతామంటూరుమీరు " అన్నాడు.

లలితా ప్రేమగా భర్తవైపుచూసి, 'పూజ మొదలెట్టండి' అంది.

సావిత్రమ్మ, " అన్నీ బాగానే ఉన్నాయిరా, మరీ ఒక్కగానొక్క ఆడపిల్లా, ఒక్కడే కొడుకూ కాబట్టి లలితకైనా చిరాకూ పరాకూలేవు. అయినా మరోఇద్దరు బయల్దేరితే మీరు కూడా అలాగే తయారవుతారో ఏమో " అంది.

" ఈ ఉన్నవాళ్లు చాలమ్మా మాకు, ఒక ముత్యం, ఒక పగడం " అన్నాడు కృష్ణమూర్తి లలితను క్రీగంట చూస్తూ.

" ఒద్దంటే మానడానికీ, కావాలంటే కలగడానికీ, మన చేతుల్లో ఏమిందిరా నాయనా, ఆ భగవంతుడి దయ అంతేనేమో, వీళ్లిద్దరికీ తోడు మరో ఇద్దరు లేకపాయె, ఏం చేస్తాం " అని సానుభూతిగా సావిత్రమ్మ అంది.

" నీ చాదస్తం అంతులేకుండా ఉందే, అసలువాళ్లు చాలని తృప్తిపడితే, నీకెందుకే? ఇవ్వాళ్ల పూజ చేసుకుని కోరుకో ఆ పెద్దాడికున్నంత సంతానాన్ని ఈ

చిన్నాడిక్కూడా ప్రసాదించమని. పూజకు ఇంకా ఆలస్యం దేనికి ?" అంటూ పూజకు పక్రమించారు పరంధామయ్యగారు.

రమా, రవీ " శోక్లాంబరధరం" సరస్వతీ నమస్తుభ్యం"తో పూజ ప్రారంభించారు.

పరంధామయ్యగారు సంకల్పం చేసి, ఆవల కలశ పూజ, గణాధిపతిపూజ, ప్రాణప్రతిష్ఠ చేయించి సరస్వతీ పూజ యధావిధిగా చేయించారు.

పూజానంతరం కృష్ణమూర్తి " లలితా రెండు కృతులు పాడు అమ్మా నాన్నా కూడా వింటారు " అన్నాడు.

" శ్రీ సరస్వతీహితే శివాచ్చిదానందే " అనే కృతితో ప్రారంభించి కమ్మని కంఠంతో లక్ష్మి దుర్గలపైన కూడా మరో రెండు కృతులు పాడింది లలిత.

" అమ్మాయ్, ఇదివరకెన్నడూ నువ్వు పాట పాడగలవని కూడా నేనెరగనే, ఇంత శాస్త్రయుక్తంగా పాడావు. నీకు ఎవరు నేర్పారమ్మా ?" అడిగారు పరంధామయ్యగారు.

" సంగీతపు కాలేజీకి మూడేళ్లనుండీ వెళ్తోంది నాన్నా. మీరొచ్చినప్పటి నుండీ సిగ్గుపడి సాధన మానేసింది. రోజూ ఉదయం నాలుగింటినుండీ ఆరు గంటల దాకా శ్రద్ధగా పాడుకుంటుంది. " అన్నాడు కృష్ణమూర్తి.

" అవునే లలితా, నాకు చెప్పనే లేదు ఒక్కసారైనా ?" అంది అత్తగారు ఆపేక్షగా. లలిత సిగ్గుపడుతూ భర్తవంక చూసి, మాట్లాడలేదు.

పూజా భోజనాలూ అయ్యాక, అత్తగారికి కోడలూ తండ్రికి కొడుకూ కొత్త బట్టలిచ్చి పాదాభివందనం చేశారు. రమా రవీ కూడా ఎవరో చెప్పినట్టు బామ్మా తాతగార్ల కాళ్లకు దండాలు పెట్టారు. పరంధామయ్యగారు సర్వశ్రేయస్సమృద్ధిరస్తూ " అని దీవిస్తే సావిత్రమ్మగారు"వంశాభివృద్ధిరస్తూ" అని దీవించారు. అంతా కాసేపు నడుంవాల్చారు తరువాత. లలితా మాత్రం కుట్టు మిషను దగ్గిర కూర్చొని తనకు జాకెట్టొకటీ అత్తగారికోరవికా కుట్టేసింది.

అత్తగారు నిద్రలేచే సరికి రెండు గంటలైంది. నిద్ర లేస్తూనే కోడలు కుట్టిపెట్టిన బట్టలు చూసి ముచ్చట పడి పోయింది. " లలితా పొద్దున్న తొమ్మిది గంటల్లోగానే పిండి వంటలతోసహా వంటముగిస్తివీ, పూజా భోజనాలూ ముగిశాక కాసేపన్నా విశ్రాంతి లేకుండా ఇవి కుట్టుకుంటూ కూర్చున్నావా ? నా రవికకేం తొందరొచ్చిందమ్మా, వాళ్తేరు వెళ్లాక మిషను వాడిని కుట్టమందును కదామ్మా?" అంది ఆపేక్షగా.

ఎందుకత్తయ్యా, అనవసరంగా మిషనువాడికివ్వడం ? నాకేం కష్టం లేదు. పిల్లల బట్టలూ నావీ ఎప్పుడూ నేనే కుట్టుకుంటా. మీ రవిక ఒక్కటే నాకు పెద్దపనికాదు, అంది లలిత.

" అవునులే, కాన్పుకాస్త ఎడమైతే తీరిక దొరికి ఇలాంటి పనులు చేసుకోవచ్చు. అయినా ఈ తెలివిమాత్రం అందరికీ ఉండద్దూ ", అని తనలో అనుకున్నట్టే అంది.

అప్పుడే ఎదురింటి మాస్టారి భార్య, తులసీ, చూసి పోవడానికొచ్చింది. లలితా తులసీ స్నేహితురాళ్లు. ఇద్దరూ కుట్టుసెంటరుకెళ్లి కుట్టునేర్చుకోవడం. సాయంకాలం సంగీతపుకాలేజీకి కలిసి వెళ్లడంతో వారిస్నేహం మరికాస్త పెరిగి పెద్దదైంది. లలిత సలహా

ప్రకారమే రామ్మూర్తి, తులసీ తమ కుటుంబాన్ని పరిమితం చేసుకున్నారు. వారికి రమా రవీ ఈడు వారు మగపిల్లలిద్దరు - ఆడపిల్లకోసం ఎదురు చూస్తున్నారు కాని మరో నాలుగేళ్లదాకా పిల్లలు వద్దనుకున్నారు.

" రా తులసీ, నీకు పండుగ పూడా ఇంత తీరిక ఎలా కలిగిందీ ?" అని అత్తగారితో " ఈమె మన ఎదురింటి రామ్మూర్తి మేష్టారి భార్య. మిమ్మల్ని చూసిపోవాలని మొన్నవస్తే మీరప్పుడే పడుకున్నారని లేపలేదు " అంది లలిత.

" నమస్కారమండీ. మీరొస్తారని లలిత చెప్పింది. నేనీమధ్య మా అమ్మగారింటికెళ్లి వచ్చాను పది రోజులపాటు. పొద్దున రవి " మా బామ్మా తాతగారూ పండుగవెళ్లాక వెళ్లిపోతార"ని అన్నాడు. ఒకసారి చూసి పోవాలని వచ్చాను. అంది తులసి..

" మావాడూ మీ ఆయనా ఒకే బళ్లో పనిచేస్తున్నారామ్మా ?"

" అవునండీ, వారిద్దరూ మంచి స్నేహితులుకూడాను "

"సరిపాయె. పిల్లలెంత మందెమ్మా ?"

" ఇద్దరండీ. "

" మీకూ ఇద్దరేనా ?" అంది సావిత్రమ్మ నవ్వుతూ.

" ఈ రోజుల్లో, ఇద్దర్ని పెంచడమే ఇంతకష్టంగా ఉంది పిన్నిగారూ. ఎంతజీతం వచ్చినా తిండికీ బట్టకీ పోను ఇక దేనికీ మిగిలేట్టులేదు. కాస్తో కూస్తో పెద్దలిచ్చినది ఉంటే పిల్లల పై చదువులకో పెళ్లిళ్లకో సరిపోతుంది. " అంది తులసి.

సరి సరి. ఇద్దరే ఎక్కువంటావు. మాకాలంలో 'పిల్లలు ఇంతమందేచాలు, ఇంతకుమించితేఎక్కువ' అనే మాట ఎరగమమ్మా. పోనీలే, కావాలంటే మన చేతుల్లో ఉందా, వద్దంటే మనచేతుల్లో ఉందా, అంతా ఆ భగవంతునిదయ " అని సావిత్రమ్మ.

అప్పుడే పక్కవాటాలోని పార్వతమ్మ చంకలో ఏడాది పిల్లాడితోటీ కుడిచేతిలో ఒక గిన్నెతోటీ ప్రవేశించింది.

" పిన్నిగారూ మీ వైపున చేసుకునే పాకం బూరెలు చేశానండీ తిని రుచి చూడండి " అని, " తులసీ ఎంత తీరికగా వచ్చావమ్మా పండుగ నాడు కూడా. అయినా నువ్వూ లలితా అదృష్టవంతుల్లే. ఇద్దరంటే ఇద్దర్నికని హాయిగా తీరికగా కూర్చున్నారు. నాఅదృష్టం పగవారికి కూడా వద్దమ్మా. ఏరోజుకారోజు చాకిరి చెయ్యలేకా మానడానికి వీలులేకా సతమతమవుతున్నాననుకోండి. మా అమ్మ జబ్బుపడింది. మరో అయిదారునెలల్లో కోలుకోక పోతే నాకీసారి కాన్పు ఎలా గడుస్తుందో ఆ భగవంతుడికే తెలియాలి. మా చంటాడు పుట్టినప్పుడు మా అత్తగార్ని రమ్మనిరాస్తే ఆమె " పరిదులు కన్నట్టు ఏటేటా కంటుంది, మా సంసారాలు మాకులేకా చీటికీ మాటికీ వచ్చి అక్కడ కూర్చోడానికి " అని తిరిగి కబురు పెట్టారండీ పిన్నిగారూ ? పెద్దావిడ అలా అన్నారని వారం రోజులు నిద్రలేకుండా బాధపడ్డానండీ పిన్నిగారూ. పాడు పిల్లలు ఇంతా అంతా ఎప్పటికి ఎదుగుతారో ఏమో, అప్పటిదాకా నాప్రాణం నిలవాలి కదా " అంటూ గుడ్లనీళ్లు కుక్కుకుందిపార్వతమ్మ.

లలిత రెండు ప్లేట్లలో పిండి వంటలుపెట్టి, తులసికీ పార్వతమ్మకీ తెచ్చిపెట్టింది. పార్వతి పళ్లెంలో చెయ్యి పెట్టిందో లేదో మూడేళ్లూ, నాలుగేళ్లూ వయసు కొడుకులిద్దరు ఎప్పుడొచ్చారో పళ్లెంలోంచి తినుబండారాలు రెండు చేతుల్లోనూ గద్దలు తన్నుకు పోయినట్టు, పట్టుకు పారిపోయారు.

" ఇదీ వరస పిన్నిగారూ - పూజకొద్దీ పురుషుడు, దానం కొద్దీ పిల్లలూ అంటారు. ఏరోజూ ఏదోఒకటి చేసి పెడుతూనే ఉంటానా, అయినా ఎవరింటికైనా వెళ్తే ఇలాగే నా పరువుపీకి బజారుకేస్తారు ఈ పాపిష్టికళ్లు " అంది పార్వతి.

" దానికేంలేమ్మా, పిల్లలన్నాక తినుబండారాలకు ఎగబడడం సహజం. మా పెద్దబ్బాయి ప్రసాదరావు వాల్తేరులో ఉన్నాదమ్మా మా పెద్దకోడలు నీలాగే అవస్థపడుతూ ఉంటుంది. వాళ్ల పిల్లలు కూడా ఇలాగే సతాయిస్తూ ఉంటారు. పెద్ద వాళ్లయ్యాక వీళ్లంతా ఆసరా అవుతారుమరి. ఇప్పుడే కష్టపడి పెంచాలి. " అంది సావిత్రమ్మ.

" ఏమో పిన్నిగారూ, వాళ్లు నన్ను సుఖపెట్టడం ఏమో గాని నాప్రాణం విసుగెత్తుతోందంటేనమ్మండీ ".

తులసి ఈ సంభాషణవిని ఊరుకోలేక, " పార్వతిగారూ కాన్పుల విషయంలో మీరు జాగ్రత్త తీసుకోవలసింది. మీ ఆరోగ్యం అసలే దెబ్బతిని ఉంది. ఇప్పుడైనా జాగ్రత్తపడితే మంచిది. ఇక ముందు ముందు మీకు మరీ కష్టమనకుండా చూసుకోండి " అంది.

లలిత ఆసంభాషణకి పొడిగించ వద్దన్నట్టుగా సంజ్ఞచేసింది తులసికి.

"ఈ విషయం ఒకసారి మాలేడీ డాక్టరే చెప్పిందమ్మా. కాని దాన్లో ఉన్న సాధక బాధకాలు ఆలోచించాలిగా. మా దూరపుబంధువు ఒకామె, అయిదుగురు సంతానం ఉన్నారు కదా అని ఆపరేషను చేయించుకుందిట. తరువాత ఏదో జబ్బుచేసి ఒక్కొక్కరే అయిదుగురూ పోయారుట. పిల్లలకోసం ఆయన మళ్లీ పెళ్లి చేసుకున్నాడుట ! ఇక ఆవిడ ఏడుపు అంతా ఇంతా కాదనుకోండి " అంది పార్వతి.

లలితా తులసీ ఒకళ్ల ముఖాలొకళ్లు చూసుకున్నారు. లలిత ముఖం కొంచెం వివర్ణమైంది.

" పార్వతిగారూ, ఎవళ్ల అదృష్టం వాళ్లదండీ. అందరికీ ఆదురదృష్టం ఎందుకు కలుగుతుందీ ? ఆచారపు అచ్చమ్మలూ చాదస్తపు చెల్లమ్మలూ మనకు పిరికిమందు పోస్తూనే ఉంటారు. పదిమందిని కంటే మాత్రం అలాజరగదని పూచీ ఏదీ ? అయినా అయిదుగురు పిల్లల్ని పోగొట్టుకుని ఆమె భర్త మళ్లీ పెళ్లికొడుకెలాగయ్యాడండీ. ఆడదాన్ని ఉసురుపెడితే ఆరుతరాలు అరిష్టం అంటారు. ఎంత అన్యాయమండీ ! గాలిలో దీపం పెట్టి 'దేముడా నీ మహిమ' అని అన్నీవదిలేసేకంటే, అధమం పిల్లకీ పిల్లకీ నాలుగేళ్ల ఎడం ఉండేట్టుగా నన్నా చూసుకో వచ్చుగా ?" అంది తులసి భరించలేని జుగుప్సతో.

సావిత్రమ్మ లలిత వైపు అర్థవంతంగా చూసిన చూపును లలిత తట్టుకోలేక అక్కడి నుండి ప్రక్క గదిలోకెళ్లి వచ్చింది.

పార్వతి పిల్లలంతా ఒక్కరొక్కరే అక్కడికి చేరడంతో వాళ్ల అల్లరి భరించలేక " వెళ్లొస్తా పిన్నిగారూ" అంటూ లలిత బొట్టుపెడితే పెట్టించుకుని వెళ్లి పోయింది.

తులసి " లలితా మన పక్కింటి శేషాద్రిగారింట్లో బొమ్మలకొలువుకు పిలిచారు కదా, నువ్వొస్తావా వెళ్లొద్దాం " అంది.

" నేనివ్వాళ రానులే, ఇంకా ఉంటుందిగా కొలువు, మరో రోజు వెళ్లొస్తా " అంది లలిత, తులసికి కూడా బొట్టుపెట్టి పంపేస్తూ.

ఆ మర్నాడు ఉదయమే పార్వతమ్మ భర్త నలుగురూ వినాలనే ధోరణిలో గొంతు చించుకొని, తమ వాటాలో నుండే ఒక చిన్న ఉపన్యాసమిచ్చాడు. " ఇరుగూ పొరుగూనా సంసార బాధ్యతల్ని మోస్తున్నట్టు ఉచిత సలహాలు తగలెయ్యక పోతే వాళ్ల ఏడ్పు వాళ్లేడ్చుకోరాదూ " అంటూ

పరంధామయ్యగారి పెద్దకోడలు సత్యవతి ఎనిమిదవ కాన్పు కష్టమై కాలంచేసింది. ఆమెకన్న చింటిది కూడా కన్నుమూసింది. ఆ ఇంటిని ఒక దారికి తేవాల్సిన బాధ్యత సావిత్రమ్మగారిదైంది. ఆఖరు పిల్లలిద్దర్నీ చిన్నకోడలు లలిత తీసుకెళ్లింది ఈ ఇద్దరిలో శ్రీదేవి రవికన్న మూడేళ్లు చిన్నది. రఘు రవికన్న నాలుగేళ్లు చిన్నవాడు.

కాలగమనంలో పదిహేనేళ్లు ఇట్టే కలిసిపోయినై. సావిత్రమ్మగారి పెత్తనంలో ప్రసాదరావు కుటుంబం ఒక కొలిక్కి వచ్చింది. పెద్దకొడుకు శేషగిరికి ప్రసాదరావు పెళ్లి చేశాడు. అతని తరువాత ఆడపిల్లలిద్దరికీ కూడా ముందే పెళ్లిళ్లై కాపురాలకెళ్లారు. ఈ ఆడపిల్లల తరువాత పుట్టిన మగ పిల్లలిద్దరూ ఏవో చిన్న ఉద్యోగాల్లో చేరారు. ఇల్లు దిద్దుకో గలిగిన కోడలొచ్చాక ప్రసాదరావుగారికి సమస్యలు తీరినై. ఇక పరంధామయ్యగారు భార్యాసమేతంగా చిన్నకొడుకు దగ్గిరికి విశ్రాంతికి వెళ్లారు.

కృష్ణమూర్తిగారి ఉద్యోగ హోదా పెరిగింది. విద్యాశాఖలో ఆఫీసరయ్యారు. లలిత సంగీతపు కళాశాలలో అధ్యాపకురాలుగా ఉద్యోగం చేస్తోంది. రమ ఉన్నత విద్య ముగించి యూనివర్సిటీలో అధ్యాపకురాలైంది. రవి ఇంజనీరుగా ఉద్యోగంలో చేరి సంవత్సరమైంది. శ్రీదేవి ఎమ్మేలో చేరి శ్రద్ధగా చదువుతోంది. రఘు కూడా ఇంజనీరింగు కోర్సులో చేరి బాగా చదువుతున్నాడు.

ప్రసాదరావు మాత్రం తమ్ముడు పడ్డ జాగ్రత్త తనకు లేకనే కదా, భార్యను రక్షించుకోలేక పోవడం, అని తరచూ బాధపడతాడు - కాని అల్లుళ్లకు తనలాగా తెలివి తక్కువగా ఉండద్దని పరోక్షంగా అడపా తడపా నూరి పోసేవాడు. అందుకేనేమో ఆకూతుళ్లిద్దరికీ, ఒక్క ఆడపిల్లా ఒక్క మగ పిల్లాడూ మాత్రమే ఉన్నారు. ఇక శేషగిరి ముందే అన్నాడు " నాకు ఆడపిల్లైనా మగపిల్లాడైనా ఒక్కరు మాత్రమే చాలు" అని తన పెళ్లిలోనే ఎవరో ఆశీర్వదించిన సందర్భంలో

దాదాపు పదిహేనేళ్లనాడు దుర్గాష్టమి నాడు సావిత్రమ్మ తన చిన్నకోడలు లలిత విషయంలో చాలా అసంతృప్తిపడి, భర్తతో " ఈ రోజుల్లో పిల్లలు తల్లీ తండ్రీ ప్రమేయం లేకుండానే ఏ పనైనా చేసేస్తున్నారు. ఈ పిల్ల ఆపరేషను చేయించుకుందేమోనని నా

అనుమానం " అంది ఆనాడు ఒకటే మథన పడిపోయిన ఆమె ఈనాడు లలితను పొగడని క్షణంలేదు.

అప్పుడే ఆఫీసునుండి వచ్చిన కృష్ణమూర్తి కూడా ఒక యువకుడిని తీసుకొచ్చాడు. " అమ్మా లలిత కాలేజీకి వెళ్లిందా ?" అని అడిగాడు.

" లేదురా, ఇవ్వాళ దానికి పొద్దున్న ఒక్క పూటేట. ఇంట్లోనే ఉంది.

" లలితా, ఎవరొచ్చారో చూడూ " అంటూ లోపలికెళ్లాడు కృష్ణమూర్తి లోపల్నుంచి రెండు కప్పుల్లో కాఫీ తెచ్చిన లలిత నాకు గుర్తురావడం లేదండీ, ముఖం ఎక్కడో చూచినట్లుంది" అని కాఫీ అందించింది.

" నేను వాసుని, పార్వతమ్మగారి నాలుగో పిల్లాడినండీ " అన్నాడా అబ్బాయి.

" ఓహో, ఎంత పెద్దవాడి వయ్యావోయ్ నేను గుర్తుపట్టలేక పోయాను " అని ఆపేక్షగా అని. " అత్తయ్యా, మన పక్కవాటాలో పార్వతమ్మగారని ఉండేవారు గుర్తున్నారా ? వాళ్ల నాలుగో పిల్లాడు " అంది లలిత.

సావిత్రమ్మగారు పట్టుమని పదిహేనురోజులైనా ఉండకపోయినా వాళ్ల తీరువులేని సంసారం బాగా గుర్తుంది. " అమ్మా, నాన్నగారూ ఎక్కడున్నారోయ్ అని అడిగారు"

" నాన్నగారు క్షయవ్యాధితోనూ అమ్మరక్తపుపోటుతోనూ ఒక ఏడాది క్రితమే పోయారండీ ".

" అయ్యోపాపం ! మీ అక్కకూ అన్నలకూ పెళ్లిళ్లు ఉండాలి.

" మా అక్కకు పెళ్లైందండీ. అన్నలకు కాలేదు - ఒక చెల్లెలికి కూడా పెళ్లికాలేదింకా " అన్నాడు. ఆ పిల్లవాడికి కృష్ణమూర్తి ఏవేవో సలహాలిచ్చి పంపేశాడు.

" నీ తోటెలా వచ్చాడ్రా ఈ పిల్లాడు ?" అని సావిత్రమ్మ కొడుకునడిగింది -

" ఇవ్వాళ్ల ఉద్యోగాలకు ఇంటర్వ్యూలైనయ్యమ్మా. ఈ పిల్లవాడు కూడా గుమాస్తా ఉద్యోగానికి ఎంపికయ్యాడు. తరువాత నన్ను కలిసి ఫలనా అని చెప్పాడు. వాళ్ల కుటుంబ వివరాలడిగితే చెప్పాడు. పుట్టిన తొమ్మిది మందిలో నలుగురు పిల్లలు చనిపోయారుట - పెద్దవాడు చిన్నచదువు చదివి ఎక్కడో చిన్న ఉద్యోగం చేస్తున్నాట్ట - రెండోవాడు సినిమా పిచ్చితో ఇల్లు వదలి వెళ్లి ఇంకా వేషాలకోసం ఎక్కడో తంటాలు పడుతున్నాట్ట. మూడోవాడు చిన్న చితకా మొత్తాలు ఇంట్లోంచి దొంగిలించి చెడు తోవన పడ్డాడుట - ఇక వీడొక్కడూ కాస్త కుదురుగా కనుపిస్తున్నాడు. ఆ అక్క దుర్గ సంసారం అచ్చం పార్వతమ్మ సంసారం లాగే ఉందిట. వీడిని నేనే ఇంటికి రమ్మని తీసుకొచ్చా.

" ఒరే కృష్ణా అప్పుడు నీతో పనిచేసే రామ్మూర్తిగారు ఎక్కడూన్నార్రా ? అంది సావిత్రమ్మ.

" నీకు బాగా జ్ఞాపకం ఉన్నారే వారంతా. ఆయన పైచదువుకు వెళ్లి ఢిల్లీలో పెద్ద ఉద్యోగంలో ఉన్నారు. వాళ్లకు ఇద్దరు మగపిల్లల తరవాత ఒక కూతురుంది. ఇవ్వాళే ఆయన దగ్గిర్నుండి ఉత్తరం వచ్చింది. మన రమకు పెళ్లి కుదిరాక వాళ్ల పెద్దబ్బాయికి మన శ్రీదేవినిమ్మని రాశారు. లలితకిప్పుడే ఇచ్చానా ఉత్తరం "

" వాళ్లమ్మాయి పుట్టిందాకా తులసిగారు కూడా ఉద్యోగం చేశారత్తయ్యా. ఇప్పుడు కొడుకులిద్దరూ ఇంజనీర్లుగా స్థిరపడ్డారు. మీరు కూడా చదవండీ ఉత్తరం " అని లలిత అత్తగారికా ఉత్తరం ఇచ్చింది.

సావిత్రమ్మ అన్నీ ఆశ్చర్యంతో విని, " అన్నీ భగవంతుడే చూస్తాడనుకునేదాన్నిరా, నత్తగుల్లల్లా ఇంతెడు మందిని కని వాళ్లను పెంచడం చాతకాక జీవితం పై విరక్తి తో బ్రతికేకంటే, రత్నాల్లాంటి పిల్లలిద్దరు చాలురా. ఆ పెద్దాడి సంసారాన్ని నువ్వూ లలితా ఆదుకోకపోతే ఆ పార్వతమ్మ సంసారం లాగే అయిపోను - ఆదుకునే వారున్నా ఇంగిత జ్ఞానంతో సంసారాన్ని పరిమితం చేసుకుంటున్నారీ రోజుల్లో - ఏది ఎలాగున్నా నీకూ లలితకూ పదికోట్ల ఆశీర్వచనాలు. మన రమా రవీ ఒక ముత్యం ఒక పగడంలా ఉన్నారురా". అన్నారు.

# పెండ్లి పల్లకి

డా. శరత్‌జ్యోత్స్నా రాణి

జ్యోతికి పెళ్ళట...

" ఏమండోయ్ ! ఇది విన్నారా ? మన ఇంటి ప్రక్క కామాక్షమ్మ గారి జ్యోతి లేదుటండీ... ఆ అమ్మాయికి పెళ్ళట" - ఇలా ఆ వీధిలో ఏనోట విన్నా ఇదే మాట వినబడుతుంద. ఆ వీధిలో అనేక కుటుంబాలు. జ్యోతికి పెళ్లంటే అది తమ కూతురి పెళ్ళిగానే భావించి సంతోషపడుతున్నారు. మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలే అయిపోయిన ప్రస్తుత ఈ సమాజంలో మానవత్వం ఇంకా చావలేదనే ఒక నగ్నసత్యానికి ఈ మాటలన్నీ ఉదాహరణలు. ఇంతమంది చేత ఇన్ని కుటుంబాల చేత ఆశీర్వదించ బడుతున్న జ్యోతి ఎవరని పాఠకులడగ వచ్చు. ఏమిటా ఈవిడ కథని దూరదర్శినిలో సీరియల్సులా సాగదీస్తుందని విసుక్కుంటుండొచ్చు. కాని జ్యోతిని గూర్చి అలా ఆలస్యంగా వివరించాల్సే ఉంది. అందరి కథలాంటి రస వత్తర కథకాదు. కులకట్టుబాట్లను మత సంప్రదాయాలను విసర్జించి అట్టడుగు వర్గ యువకుడితో వివాహం కుదుర్చుకునే ఆదర్శమహిళ, అందని ఊహాలోకాల కథ కాదిది. జ్యోతిది భూమ్మీద నడిచే కథ. అల్ప జీవితాన్ని గురించి చెప్పె అల్ప కథ.

జ్యోతి బాగా చదువుకున్న పిల్ల. చాలా మంచి అమ్మాయి. ఆ వీధిలో ఉన్న అన్ని కుటుంబాల ఆడవాళ్ళని, పెద్దవాళ్ళని, పిల్లల్నీ, వృద్ధుల్నీ ఆప్యాయమైన వరసలు కలిపి పిలుస్తూ అందరితో కలివిడిగా ఉంటుంది. జ్యోతికి పెళ్ళికుదిరిన విషయం ఆ వీధిలో ఉన్న వారందరికి ఆనందముతో పాటు ఆశ్చర్యాన్ని కూడా కలిగించింది. ఆ ఆశ్చర్యానికి కారణం లేక పోలేదు. జ్యోతికి పెళ్ళి కుదురుతుందని ఊహించనే ఊహించలేదు. అయితే ఎవరి ఊహల్తో, ఎవరి ఆలోచనల్తో ప్రమేయం లేకుండానే జ్యోతికి పెళ్ళి కుదిరిపోయింది. ఊహలు, ఆలోచనలు, పెళ్ళికుదరటాలు ఏమిటా అని

విసుక్కోకుండి. అవయువాలన్నీ సక్రమంగా ఉండి లకారాలని తక్కెట్లో పోసినా ఆడపిల్లకి పెళ్ళికాని రోజులివి. ఆడ పిల్లలు పుట్టినందుకు తల్లిదండ్రులు ఆత్మహత్యలు చేసికొంటున్న రోజులివి. కట్నాల బాధకు తాళలేక ఆడపిలల్నీ అరబ్బు దేశాలకి అమ్ముకుంటున్న ఖర్మదేశమిది. అట్లాంటి ఈ సమాజంలో లకారాలు నెత్తిన పోయకుండా జ్యోతికి పెళ్ళికుదిరింది ఇంకా చెప్పాలంటే జ్యోతి అంగవికలురాలు.

ఆపీసు నుంచప్పుడే వచ్చాడు రామారావు. అలా వచ్చాడో లేదో. సుభద్ర " ఏమండోయ్ ఈ మాట విన్నారా ! పిన్నిగారి కూతురు జ్యోతికి పెళ్ళికుదిరింది. నాకైతే చాలా సంతోషంగా ఉంది. మరి మీకో..." అంటూ దీర్ఘం తీసింది.

" చూడు సుభద్ర ! జ్యోతి మంచి పిల్ల. ఆ అమ్మాయిది వెన్నపూసలాంటి మనసు. ఎవరు ఏ సహాయం అడిగినా చిరునవ్వుతో చేసి పెట్టే జ్యోతికి దేవుడే సహాయం చేయడం ఆపి అవిటికాలు ప్రసాదించాడు. అందుకే జ్యోతికి తాను చేసిన అన్యాయాన్ని తెలుసుకుని నిష్కృతి చేసుకొనే నిమిత్తం ఈ పెళ్ళి కుదర్చటం. అయినా దేవుడి నిమిత్తం లేకుండా ఏం జరుగుతుంది సుభద్రా ! అని అంటూ బాత్రూం వైపు వెళుతున్న రామారావు మాటలకు సుభద్ర ఎంతో సంతోషించింది.

రామారావుకి జ్యోతి మేనకోడలు. కుందనపు బొమ్మలా ఉండే జ్యోతికి. చదువులో అందరి కంటే మిన్నగా ఉండే జ్యోతికి అయిదు సంవత్సరాల వయసులో పోలియో వలన కుడికాలు కురచయింది. కొంచెం ఎత్తి వేస్తేనే కాని నడవడం కుదరదు.

అయినా జ్యోతి పట్టుదలగల అమ్మాయనే చెప్పాలి. స్కూల్లోనూ, కాలేజీలోనూ ఫస్టక్లాస్‌లో పాసయింది. టైపులోయర్ హాయర్ కూడా పాసైంది. తనకింకా పెండ్లికాలేదని. వేసవిలో మండే కూరగాయల ధరల్లాంటి కట్నాలతో పెళ్ళికొడుకుని కొనలేక పోయామని దుఃఖించే అమ్మా నాన్నల్ని ఓదార్చే ధైర్యం లేక ఒక్కతే కుమిలి పోయేది జ్యోతి. వాళ్ళు తనకోసం తన బాగోగులు చూడటం కోసం మరిక బిడ్డలే వద్దని కోరుకుని ఆచరించిన విధం జ్యోతికి ఏదో తెలియని భావం కలిగించేది. హాయిగా తోడుగా. ఆనందం దుఃఖం పంచుకోవడానికి ఒక చెల్లో తమ్ముడో ఉంటే ఎంత బాగుండునోనని వాపోని రోజుండేది కాదు జ్యోతికి.

పెళ్ళి వయసొచ్చాక తన నుంచి తాను పరాయీకరణ గురికావడం తెలుస్తూనే ఉంది. పెళ్ళి చూపుల పేరిట ఎవరో రావడం అమ్మాయి చాలా బాగుందనడం. దాంతో పాటే కట్నం ఇంకా బాగుందనడం. అయిపోయాక జ్యోతి అవిటికాలు గమనించి. మొహాల్ని జీరోక్యాండిల్ బల్బులా మాడ్చుకునే వాళ్ళు సోఫా మీద అసహనంగా కదిలే వాళ్ళు పెట్టినవి బాగా మెక్కేసి మత్తుగా వెళ్తూ. వెళ్ళాక ఉత్తరం వ్రాస్తామనే వాళ్ళు. వాళ్ళు

ఇళ్ళకు వెళ్ళడం మాటేమోకాని, ఉత్తరాలు మాత్రం జ్యోతి వాళ్ళింటికి చేరేవి కావు. జ్యోతికూడా పోస్టల్ డిపార్ట్‌మెంట్ మీద ఏరోజూ నమ్మకం పెట్టుకోలేదు సరికదా పెళ్ళి కబురు ఉత్తరాల కోసం ఎదురుచూడలేదు కూడా.

అయితే ఏదో బాధ, తెలియని దిగులు. తన గురించె అస్తమాను ఆలోచించె తల్లిదండ్రుల మీద, వాళ్ళ మానసిక బలహీనత మీద.

ఓ రోజు...

ఒంటరిగా తన గదిలో కూర్చున్న జ్యోతిని చూసి, వాళ్ళ నాన్న పరంధామయ్య గారు జ్యోతిని సమీపించి సంభాషణ కొన సాగించాడు.

" జ్యోతీ....."

ఏంటి నాన్న..."

' ఏమి లేదమ్మా నువ్వింత చదువు చదువుకున్నావ్. పెళ్ళి తంతుకోసమే నువ్విలా బంధీలా ఇంట్లో పడి ఉండటం నాకిష్టం లేదు. నువ్వేదైనా ఉద్యోగం చేస్తానంటే నేను ప్రయత్నిస్తానమ్మా..." అన్నాడు.

ఆడ పిల్లల్ని పెళ్ళిపేరిట నాలుగ్గోడల మధ్య పిల్లుల్ని చేసే అలాంటి స్థితిని కూలదోయటాన్నే ఆలోచనగా పెట్టుకున్నట్లుగా జ్యోతి వాళ్ళ నాన్నకేసి ఆశగా చూసింది. అందుకే వెంటనే, నాన్నా! నాకూ ఏదన్నా జాబ్ చేయాలని ఉంది. కాని మీతో అంటే ఏమన్నా అంటారేమోనని...." సందేహిస్తూనే, వినమ్రంగా మాటలాడేసింది. పరంధామయ్యగారు కొద్ది నిముషాల మౌనం తర్వాత ధీర్ఘనిట్టూర్పు విడిచి, జ్యోతికేసి చిరునవ్వుతో చూశాడు.

' జ్యోతి, నువ్వేం వర్రీ కాకమ్మ ! ప్రయత్నాలెప్పుడూ వృధాకావు. చూద్దాం. మనం ఆలోచించినట్టు అన్నీ జరగవు కదా ! అంటూ వెళ్ళిపోయాడు.

అందం, డబ్బు, గుణం అన్నీ ఉండి కూడా అనేకమందికి భర్తలు దొరక్కపోవచ్చేమో కాని అన్ని అర్హతలున్నా ఉద్యోగం ఇవ్వకుండా ఉండే సంస్థలు లేవన్నట్టుగా జ్యోతికోసం వాళ్ల నాన్న చేసిన ప్రయత్నాలు వృథా కాలేదు.

టెన్త్, ఇంటర్, డిగ్రీ ఫస్ట్‌క్లాస్ -

టైపులోయర్, హయ్యర్ ఫస్ట్‌క్లాస్ -

పైగా తను ఫిజికల్లి హేండీక్యాప్డ్ కూడా. ఇంకా ఎన్నీ అర్హతలు కావాలి. అందుకే జ్యోతికి సెక్రటేరియట్‌లో టైపిస్ట్‌గా ఆఫరొచ్చింది. ఇంటర్వ్యూ కొచ్చిన నిరుద్యోగ జాబితాలోని వందమందిలో జ్యోతి నెగ్గుకొచ్చింది. అందుకే ఆ ఉద్యోగం జ్యోతినే వరించింది. కొన్ని రోజుల ముసురు తర్వాత బాలభానుడు ప్రత్యక్షమయినట్టు జ్యోతి వాళ్ళ ఇంట్లో ఒక నూతన ఉదయం వెల్లివిరిసింది. జ్యోతి ఆనందానికైతే హద్దులే లేవు.

అంతేకాదు ఆనందం తో పాటు ఆ ఉద్యోగం జ్యోతి జీవితానికి ఎంతో ఊరట కలిగించింది కూడా. ఆఫీసులో తనపని ముచ్చటగా చేసుకుంటూ ఒక్క ఏడాదిలోనే జ్యోతి అందరి మన్ననలకు పాత్రురాలయింది.

ఆఫీసులో

జ్యోతి డెస్కుకు ఎదురుగా ఉండే ఆ క్లర్క్ టేబుల్ సుధీర్‌ది. సుధీర్ పేరుకు తగ్గట్టుగా చాలా మంచివాడు. అయితే ధీరత్వమే అన్నీ వేళలా ఆయన్లో కన్పించదు. జ్యోతికంటే ఒక్క సంవత్సరం ముందు జాయిన్ అయ్యాడు. బుద్ధిమంతుడు. తన పని తాను చక చకా చేసుకుపోవడం అలవాటు. అలాంటిది అప్పుడప్పుడు ఫైళ్ళ అక్షరాల్లో నుంచి ఎదురుగా టైప్ శబ్దాన్ని ఆలాపన చేస్తున్నాడు. నడిచేటప్పుడు కాలు ఎత్తివేస్తూ. చూడటానికి ఎచ్చెట్టుగా అన్పించె జ్యోతి తన సీట్లో కూర్చున్నాక గంధర్వలోకం లోంచి ఏకాఎకి దిగివచ్చిన యక్షకన్యలా ఉండేది. వెడల్పాటి కళ్ళతో నీడలు కనబడే కపోలాల నునువుదనం తో ఏ మేకప్‌లేని స్వచ్ఛమైన ముఖంతో ప్రసన్నవదనమై ఉండే జ్యోతిని టేబుల్‌పై పేర్చిన కట్టల్లోంచి దొంగతనంగా చూసేవాడు సుధీర్. అలా చూడ్డం తప్పనిపించినా అవివాహితుడు కావడం మూలానా. అందునా జ్యోతిని గూర్చే ఎక్కువగా ఆలోచిస్తూండటం మూలానా అలా చూడ్డం అలవడింది సూధీర్‌కి. ఇంకా చెప్పాలంటే వాళ్ళ అమ్మా నాన్నలతో చెప్పి జ్యోతిని పెళ్ళిచూపులు చూడ్డానికి కూడా నిశ్చయించేసుకున్నాడు. అయితే చూడ్డం. నిశ్చయించుకోవడం అంతా అతని వంతే అయింది. జ్యోతితో తాను ఎన్నడూ మాట్లాడనే లేదు. అసలు ఆమె కెదురుగ్గా నిలబడిందీ లేదు. అట్లాంటి సుధీర్ ఏకంగా పెళ్ళికే నిశ్చయించుకున్నాడు. అందుకే ఒక రోజు ధైర్యాన్ని మూటగట్టుకుని ఆఫీస్‌లో ఎవరూలేని లంచ్ సమయాన అడుగుల్ని పేర్చుకుంటూ టైప్ మిషన్‌ని సమీపించి విపరీత ప్రయత్నంతో గొంతు విప్పాడు.

జ్యోతిగారూ ! మీతో ఒక ముఖ్య విషయం చెప్పాలి. మీరేమీ అనుకోనంటే - భయంతో ఆగిపోయాడు. సుధీర్‌కి మాట రావడం లేదు. జ్యోతి ముందు ఆశ్చర్యపడినా. మెల్లగా నవ్వడం ప్రారంభించింది. సెక్షన్ ఆఫీసర్ ముందుకూడా భయపడని సుధీర్ పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టు మాట్లాడ లేక పోవడం ఆమెకు నవ్వు తెప్పించాయి. వెంటనే సర్దుకుని. సూధీర్‌గారూ ! ఏం చెప్పాలనుకుంటున్నారు ! చెప్పండి. నా దగ్గర మీకు భయమెందుకండీ !... అంది సంవత్సరం పాటు తను గమనించిన సుధీరేగదా ! అన్న ధీమాతో.

సుధీర్ " ఏం లేదండీ మీరు ఏమీ అనుకోనూ అంటే క్యాంటిన్‌కి రండి. ఒక పదినిముషాలు మీతో మాట్లాడాలి " అనేసి వెళ్ళిపోయాడు. అతనలా వెళ్ళిపోయాక జ్యోతి ఏభావం వ్యక్తంకాని మౌనంతో అలా కుర్చీలో కూర్చుండిపోయింది. ఆమె ఆలోచనకి ఏ భావం అందట్లేదు. కాని క్రమేపి సూధీర్ పట్ల ఉన్న గౌరవభావం ఆమె మనసుకు ఆక్రమించేసింది. అందుకే క్యాంటిన్ వైపు బయలుదేరింది.

క్యాంటిన్.

మధ్యతరగతి జీవుల మెదళ్ళకు ముసిరే ఆలోచనల్లా ఈగలు ముసిరే క్యాంటిన్. ఎన్ని సార్లు చెప్పినా టెండరర్ శ్రద్ధ తీసుకోని క్యాంటిన్. అందులో జనం పల్చబడ్డారు. ఒక మూలగా ఉన్న టేబుల్‌కి చెరోవైపున కూర్చున్నారు జ్యోతీ, సూధీర్‌లు. ఎప్పుడూ వాళ్ళనలా చూడని కొంతమంది ప్రశ్నార్థకానికి వ్రేలాడదీసి ఏవో ఆలోచనల్తో వెళ్ళిపోయారు. కొద్ది నిముషాల మౌనం తర్వాత కాఫీ సేవనంలో కలగలిపి సుధీర్ అతి ప్రయత్నంగా, గొంతు పెగిల్చి చెప్పడం ప్రారంభించాడు. ఒక స్థిర నిశ్చయాని కొచ్చినట్టుగా జ్యోతిగారూ !... నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. ఈ విషయం మా అమ్మా నాన్నలకు కూడా చెప్పాను. వాళ్ళు కూడా నేనిష్టపడ్డ అమ్మాయిని పెళ్ళి చేసోకోవటానికి ఒప్పుకున్నారు."

ప్రశ్నార్థకంగా చూసింది జ్యోతి. సుధీర్ తిరిగి, అయితే ఇక ఒప్పుకోవాల్సింది ఆ అమ్మాయే. ఆ అమ్మాయిని మీరే ఒప్పించాల్సి ఉంటుంది అన్నాడు. అతని మాటలకు జ్యోతి ఉత్సాహం కనబరచింది. ఆ వెంటనే ఎవరై ఉంటారా ! అనికూడా ఆలోచించింది. తన మనసులో ఉన్న కొద్ది ఆశలు కావాలని కూలదోసుకుంటూ అడిగేసింది. "ఎవరండీ ఆమె" అని. సమాధానంగా సుధీర్ మీరేమీ అనుకోనంటే చెప్తాను. అదీ... అదీ.... జ్యోతిగారు నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మీ కంగీకారమైతే పెళ్ళికూడా చేసుకొంటాను. మా అమ్మా నాన్నలకు కూడా చెప్పేశాను. ఇక మిగిలింది మీ అభిప్రాయమే. ఐదో తరగతి పిల్లవాడు పందొమ్మిదో ఎక్కం అప్పజెప్పి నట్టు గడగడా చెప్పి తలదించు కున్నాడు సుధీర్.

మౌనం...

దాదాపు ఒక ఇరవై నిముషాల సేపు... మనుమల్నీ కవుల్నీ.....రచయితల్నీ, కళాకారుల్నీ, ఋషుల్నీ చేసే మౌనం రాజ్యమేలింది. ఆ తర్వాత జ్యోతి చిన్నగా దగ్గింది తలెత్తి చూసిన సుధీర్ కళ్ళలోకి కళ్ళు పెట్టి చూసింది. కలసిన వాళ్ళ చూపుల్లో స్వచ్ఛమైన ప్రేమ ప్రవహించింది. ఒక దీర్ఘ నిట్టూర్పు విడిచిన అనంతరం జ్యోతి, సూధీర గారూ ! మీరు నన్ను ప్రేమించడం తప్పుకాదు. ఆపై నేను మిమ్మల్ని పెళ్ళిచేసోకోవడం కూడా నాకు ఇష్టమే. అయితే ఈ విషయం మా నాన్నగారితో కూడా మాట్లాడతాను. నా వరకు నాకు ఇష్టమే. ఆ తరువాత పెద్దల ఆశీర్వాదం, పై వాడి కరుణ.... ఊపిరి బిగపట్టి తింటున్న సుధీర్ పెదాలు క్రమేపి విచ్చుకుంటున్నాయి. నవ్వు... ఒక చిన్నపాటి మందహాసం చేశాడు. ప్రతిగా జ్యోతి కూడా నవ్వింది.

అయితే కులాలు వేరు కాకపోవడం మూలాన పెద్దలు వెంటనే ఏకాభిప్రాయానికి వచ్చేశారు. పెళ్ళి ముహూర్తం కూడా నిశ్చయించుకొన్నారు. అంగ వికలురాలై సమాజంలో కుంటిది, ఆటుపోట్లు, సూటిపోటి మాటలు ఎదుర్కొన్న జ్యోతి వైకల్యం

చెందిన తన అంగాల పరిస్థితిని కూలదోసి పెళ్ళికూతురైంది. అంగవైకల్యం శాపంగా భావించలేదామె. భయపళ్ళేదు కూడా. సూటి పోటి మాటల్లోంచి సూదిమొనలా తేలింది. జీవితాన్ని తన కనుకూలంగా మరల్చుకుంది. తత్ఫలితమే సుధీర్‌తో పెళ్ళి.

ఆ వీధిలో ఎవరినోట విన్నా అదేమాట. ఏమండోయ్ ! ఇదివిన్నారా ! మన ఇంటి ప్రక్క కామాక్షమ్మగారి జ్యోతి లేదుటండీ ! ఆ అమ్మాయికి పెళ్ళిట.

ఇందరి ఆశీర్వచనాల ఫలితమేమో జ్యోతి జీవితం సాఫీగా నడుస్తుంది. అందుకే జ్యోతి అంగ వికలుర సంక్షేమ సంఘంలో సభ్యురాలై అడపాదడపా సహాయం కూడా చేస్తూ ఉంది.

# కాన్వాస్ చిత్రం !

- శారదాఅశోకవర్ధన్

లండన్ మహానగరంలో స్ట్రీట్‌నెంబర్ ఏడు, హౌస్ నెంబర్ పదిలో అందంగా అమర్చబడిన ఆధునాతనమైన అద్దాల బంగ్లా రెండో అంతస్థులో తన గదిలోని కిటికీకి దగ్గరగా కూర్చునుంది తార. అక్కడ కుర్చీవేసుకుని కూర్చుంటే, దూర దూరంగా వున్నా అక్కడా అక్కడా కనిపించే ఇళ్ళలోని జనం, ఏవో పనులమీద అటూ ఇటూ తిరిగే జనం, ప్రతీ ఇంటి ముందూ అందంగా అమర్చుకున్న ముచ్చటైన రకరకాల రంగురంగుల పూలకుండీలూ, చిన్నలానూ, చిలుకపచ్చరంగులాను మీద తెలవారు ఝామున పడే తుషార బిందువుల నిగనిగలూ నీరెండలో మరీ కొత్తగా కనిపించే వింతఅందాలను చూస్తూ ఉదయం ఎనిమిదికావస్తున్నా ఎక్కడా అలికిడిలేని ఆమహాపట్టణంలో, ఎందరికో ఎన్నో వ్యాపకాలుండగా, ఏంచెయ్యాలో తోచని తనని చూస్తే తనకే జాలేసింది తారకి!

కొన్నాళ్ళు ఆ చెట్లనీ, పువ్వుల్నీ చూస్తూ వాటితో మాట్లాడుతూన్న అనుభూతిని పొందుతూ, ఆనందించేది. ఎప్పుడో కాస్త కనిపించే సూర్యకిరణాలని చూసి పరవశించిపోయి, ఎండ వున్నంతసేపూ అక్కడే నుంచుని ప్రకృతిలో లీనమైపోయేది. భూతల స్వర్గం అంటే ఇదేననీ, సప్తసముద్రాలు దాటొచ్చిన తనూ ఎంతో అదృష్టవంతురాలిననీ పొంగిపోయింది.

రానురాను ఆపువ్వులూ మంచూ అందమైన భవంతులూ తీర్చి దిద్దినట్టున్న రహదారులూ అన్నీ బోర్ కొట్టడం మొదలెట్టాయి. తన ఊళ్లో రోడ్డు పక్కన కాస్త ఖాళీ స్థలం వుంటే చాలు పూచే గడ్డిపూలూ, గుట్టలుగా పెరిగే పిచ్చిచెట్లూ ఇక్కడి నుంచి ఊహించుకుంటే, ఎంతో అందంగానూ, ఆకర్షణీయంగానూ అనిపించసాగాయి. సూర్యుడు రాకమునుపే ఎంతచైతన్యం! ఇక్కడ అన్నీ వున్నా ఏదో కొంత ఉప్పులేని కూరలా పప్పులేని పెళ్ళిలా కొట్టొచ్చినట్లు కనబడడం మొదలెట్టింది. ఒకవారం రోజులు అంతా కొత్తగా తమాషాగా ఏదో ప్రదర్శనశాలలో అమర్చిన వస్తువుల ప్రదర్శన

చూస్తున్నట్టుగా అనిపించింది. మరో వారం అంతా ఏదో సర్దుబాటుగా అనిపించింది. మూడో వారంలో కొచ్చేసరికి ఇమడలేని మూడ్‌లో పడిపోయింది తార. డెబ్బైఏళ్ల జీవితం సినిమారీలులా కళ్లముందు కదిలింది. తనుకూర్చున్న కిటికీ అద్దం సినిమా తెరలా, తన మెదడు సినిమా రీళ్లలా అనిపించింది. పదిహేను రోజులనుంచీ ప్రతిరోజూ ఎన్నో గంటలసేపు ఆకిటికీదగ్గరే మనవడు కిరీటితోటి ఆడుకుంటూ కూర్చున్నా, ఈరోజు ఒంటరిగా ఆకిటికీ దగ్గర కూర్చుని తన అంతరంగాన్ని ఆవిష్కరించుకుంటూ వుంటే అమితానందం కలిగి ఆకిటికీ మీద ప్రత్యేకమైన అభిమానం కలిగింది తారకి!

ఆరోజుల్లో అది పల్లెటూరనే చెప్పాలి.

అదే అమలాపురం! పక్షుల కిలకిలారావంతో ఆ పల్లెలేచేది! పడవవాళ్ళు పడవని నీళ్లలో శుభ్రంగా కడిగి, పడవకి దణ్ణంపెట్టి ఈ గట్టుమీంచి ఆ గట్టుమీదకీ ఆగట్టుమీంచి ఈ గట్టుమీదకీ వెళ్లే జనాలని దింపడానికి డ్యూటీలోకి దిగేవాళ్లు. గంపలనిండుగా అరటికాయలూ, అరటి ఆకులూ, అరటిదూట, కొబ్బరికాయలు అమ్మేవాళ్లు బల్లకట్టు లాంచి మీదుగా అంగడికి వెళుతూ వుంటే ఆ దృశ్యం ఎంత అందంగా వుండేదో చెప్పలేం. అరటిచెట్లు, కొబ్బరిచెట్లు అలా వెళుతూన్న వాళ్లని చూసి, మానవజాతికి తామెంత ఉపయోగపడుతున్నామో చూసి తృప్తిగా తలలూపుతూన్నట్లు ఆడుతూకనిపించేవి. జాలరులు వారివారి వలల చిక్కువిప్పుకుంటూ, కాలవగట్టున కూర్చుని వలవేసే వారు. గిలగిలమంటూ ఆవలలో పడ్డచేపలు చూడముచ్చటగా అనిపించేవి. జాలరుల మొహం సంబరంతో చాటంతయ్యేది. కన్నెపిల్లలందరూ కళ్ళాపిజల్లి పెద్ద పెద్ద ముగ్గులుపెట్టి ఆ ముగ్గుల్లో మురిపాలు వెదజల్లుతూ ముచ్చటపడి పోయేవారు. మగపిల్లలు కూడా హడావుడిగా బడికి వెళ్లడానికి తయారయ్యేవారు. ఆరోజుల్లో ఆడపిల్లలు పెద్దగా బడికి వెళ్ళడం లేదుగా! ఆడపిల్లల బడివున్నా ఒకరోజు వెళితే నాలుగు రోజులు, అమ్మకి వంటసాయం చెయ్యడం కోసమో, తమ్ముళ్లకో చెల్లెళ్లకో ఒంట్లో బాగులేదనో ఇంట్లోవుండిపోయేవారు. తమది మరీ పెద్ద కుటుంబం అవడం వల్ల తనే అందరికంటే పెద్దదవడం వల్ల ఆరుగురు తమ్ముళ్లనీ, నలుగురు చెల్లెళ్లనీ చూసుకోవడానికి, ఒకరోజు బడికెళితే నాలుగు రోజులు ఏదో కారణంవల్ల ఇంట్లోనే వుండిపోయేది. కానీ చదువువంటే వల్లమాలిన అభిమానం శ్రద్ధా వుండడం వల్ల తమ్ముళ్ళు చదివే పుస్తకాలన్నీ తను చదివేది. వాళ్లు హోంవర్కు చేస్తుంటే తనూ దగ్గరుండి చూసి నేర్చుకునేది. తను ఒక్క రోజు బడికెళ్ళినా ఆవారంలో చెప్పినవన్నీ వెంటనే నేర్చుకుని ఇతరపిల్లలతో సమానంగా మార్కులుతెచ్చుకునేది.

తనకి సంగీతం నేర్చుకోవాలని, డాన్సు నేర్చుకోవాలనీ పక్కింటి కమలా, జానకీ వాళ్లలాగా ఎంతో సరదాగా వుండేది. కానీ అంతమంది పిల్లలతో అమ్మతనని బడికే సరిగ్గా వెళ్ళనిచ్చేదికాదు. అలాంటిది ఇక సంగీతానికెక్కడ వెళుతుంది? అయితే కమల నేర్చుకుంటున్నప్పుడల్లా తమ్ముళ్ళనెత్తుకుని ఆడిపించడానికి అక్కడికెళ్లేది. కమలపాడుతూంటే విని ఆపాటలు ఇంటికొచ్చి పాడేది, చెల్లెళ్లని బజ్జోపెడుతూ.

జానకికి భరతనాట్యం నేర్పించేవాళ్లు. వాళ్ల అమ్మానాన్నా అదేదో అదేదో మహాఅపరాధ మయినట్లు మాట్లాడేది అమ్మ. ఎప్పుడైనా ఎవ్వరూ చూడకుండానో, లేదా బాత్‌రూంలో స్నానం చెయ్యడానికి వెళ్లినప్పుడో జానకి వేసే అడుగులూ, అముద్రలూ తనూ చేసి చూసి తృప్తిపడేది.

ఎదిరింటి అత్తయ్యగారి కోడలు కామాక్షి క్రోషాతో లేసులు అల్లి రకరకాలుగా అమర్చేది. ఊలుతో చక్కగా స్వెట్టర్లు అల్లేది. అవీ నేర్చుకోవాలనీ ఎంతో సరదా పడ్డా, అమ్మ ఒద్దనేది. ఎంతసేపూ అమ్మకి పనిలో సహాయం చెయ్యడం, తమ్ముళ్లకీ చెల్లెళ్ళకీ ఏంకావాలో చూసుకోవడం, దీనితోటే సంవత్సరాలు దాటి పోయాయి. అయినా కమల పాడుతూంటే విన్న పాటలతో ఎక్కడికెళ్లినా పాడడం, కామాక్షిఅల్లే లేసులూ స్వెట్టర్లూ మెల్లగా కబుర్లు చెబుతూ ఎలా అల్లాలో నేర్చుకోవడంతో తనకి అన్నింటిలోనూ ప్రవేశం కలిగింది ప్రావీణ్యం లేకపోయినా! ఒక్కొక్కసారి ఎంతో బాధపడేది. అయితే ఆబాధని కమ్మని కలలుగా, తియ్యని ఆశలుగా మలుచుకోవడం తనకి తెలిసినంతగా ఎవరికీ తెలీలేదేమో!

అందుకే, తనకి మంచి మొగుడు రావాలనీ, చిన్న కుటుంబంతో తన ఇల్లు చిన్న పొదరిల్లులా వుండాలనీ కమ్మని ఊహలతో కలలుకంటూ ఎన్నో ఆశలు పెంచుకుంది. తనదైన చిన్నపొదరింట్లో భర్త అనుమతితో తను సంగీతం నేర్చుకుంటుంది. కోయిలలా పాడుతుంది. తన భర్త తన్మయత్వంతో తన సంగీతం వింటాడు. "పాటకి తగ్గట్టు డాన్సుకూడా నేర్చుకుంటే?" అడుగుతుంది తను."అలాగే నీఇష్టం" అంటాడతను. పరవశించి పాడుతూ తను నాట్యం చేస్తూవుంటే అతడు పారవశ్యంతో పులకించి పోతూ తిలకిస్తాడు. పాడీ ఆడీ అలసిపోయాక, అతనిసేవలో ఇంటిపనులలో నిమగ్నమైపోతుంది. కంటిపాపల్లా ఇద్దరే పిల్లలుంటారు. ఒక ఆడపిల్లా, ఒక మగపిల్లాడు. వాళ్లకోసం కామాక్షిలా బోలెడు స్వెటర్లు అల్లుతుంది. లేసులల్లి గౌన్లకి కుడుతుంది. ఎంత కమ్మటి ఊహ! ఈ ఊహాచిత్రం ఆవయస్సులో హృదయమనే కాన్వాసుమీద, మనస్సనే కుంచెతో కుదురుగా చిత్రించుకున్న రేఖాచిత్రం! తనకి బాధ కలిగినప్పుడల్లా మనోనేత్రంతో ఈ చిత్రాన్ని చూసి ఉల్లాసంతో కాలం గడిపేసే పదహారేళ్ల వయస్సది!

అయితే, తన పిన్ని కూతురు కళావతి పెళ్లిలో ఇంచుమించు తనపెళ్లి కుదిరిపోయింది. తనని చూడగానే తన బాబాయిఫ్రెండు చలపతిగారు కానీ కట్నం లేకుండా తనని కోడల్ని చేసుకుంటానన్నారు. కారణం సహజంగా కన్నా తను కాస్త అందగత్తె కావడం, అన్ని విద్యల్లోనూ కాస్తోకూస్తో ప్రవేశం వుండడం, అన్నింటికన్నా ముఖ్యంగా తను తన తమ్ముళ్లనీ చెల్లెళ్ళనీ పెంచడంలో తల్లికి తోడ్పడ్డ విధానం! చలపతిగారి భార్యకి గుండెజబ్బు. ఎప్పుడూ ఒచ్చే ప్రాణం పోయే ప్రాణం. ఆమెకి ముగ్గురు కొడుకులూ, ముగ్గురు కూతుర్లూ! పెద్దవాడు అరవింద్ ఉద్యోగం చేస్తున్నాడు. చిన్నవాడు గోవిందే ఉద్యోగం కోసం అన్వేషిస్తున్నాడు. బుచ్చివాడు ఆనంద్ కాలేజీ చదువులో వున్నాడు. పెద్దమ్మాయి శివానికి పెళ్లయింది. భవానికి పెళ్లి కుదిరింది. కాత్యాయిని స్కూల్లో చదువుకుంటోంది.

కట్నంలేని పెళ్లి! కోరి వచ్చిన సంబంధం. సరేనన్నారు తల్లిదండ్రులు. అలా పెద్ద కుటుంబంలోనే, పెద్దబాధ్యతతోటే కాపురానికొచ్చింది. అరవింద్‌కి ఆఫీసుపని తప్ప ఇంటి గొడవలు పట్టవు. తగినసమయమూ లేదు. ఎవరికేం కావాలన్నా అందరి నోళ్లలోనూ పలికేది ఒకే ఒక్కపేరు తార! తార హృదయం మీద గీయబడిన కమ్మని ఊహాచిత్రం ఇంకా అలాగే వుండిపోయింది. అరవింద్‌కి పాటలంటే ఇష్టమే. రేడియో వింటాడు. క్యాసెట్లు వింటాడు. తనెప్పుడయినా పాడితే 'బాగుందా' అని అడిగితే బాగుందంటాడు. లేకపోతేలేదు. ఇక మిగిలిన వాటికి తీరికేదీ? అప్పుడు అమ్మ ఇల్లు, తమ్ముళ్లూ చెల్లెళ్ళూ! ఇప్పుడు అత్త ఇల్లు, మెదుడూ, అత్తమామలూ, మరుదులూ, ఆడపడుచులూ, వచ్చేవాళ్లు వెళ్లేవాళ్లూ. అంతా ఒక్కటే! కాకపోతే ఇళ్ళే వేరు వేరు.

కాకపోతే తను నిరాశపడ లేదు. తనకి తీరని కోరికలు తనపిల్లలకి నేర్పించి తృప్తి పడాలనుకుంది. చూస్తుండగానే పెళ్లయి ఆరు వసంతాలు దాటడం, తను పాండవులలాంటి అయిదుగురు మగపిల్లలకి తల్లికావడం అంతా జరిగిపోయింది. రెండుకళ్లలాంటి చిన్నారులిద్దరూ అనుకున్నది. ప్రతిసారీ మగపిల్లాడే పుట్టడంతో ఇంటికి ఒక లక్ష్మి లేకపోతే ఎలా? అన్న అత్తగారి మాటలకి అరవింద్ చేష్టలకీ, పంచపుత్రులకు తల్లయింది తను. అయినా తనలోని కోరికలూ పెంచుకున్న ఆశలూ పూర్తిగా చావలేదు. పెద్దవాడు ధర్మేంద్రకి సంగీతం నేర్పించింది మంగళంపల్లి బాలమురళీకృష్ణ దగ్గర. రెండవవాడు అర్జున్‌కి వెంపటి సత్యం గారి దగ్గర కూచిపూడి నాట్యం నేర్పించింది. నరేన్ మూడోవాడికి అల్లికలూ కుట్టు నేర్పించింది. నాలుగోవాడు భరత్‌కి చిత్రకళ నేర్పించింది. అయిదోవాడు నితిన్‌కి కరాటే, యోగా నేర్పించింది.

ఆయా విద్యల్లో వాళ్లు ప్రావీణ్యత సంపాదించి అనేక పోటీలలో నెగ్గినప్పుడల్లా వాళ్లలో తనని చూసుకుని మురిసిపోయేది. క్రమేణా హృదయం మీద గీసుకున్న కాన్వాస్ చిత్రం మసకబడి మసిపోయింది. ఆస్థానంలో సంగీత విద్వాన్–ధర్మేంద్ర, నాట్య శిఖామణి అర్జున్, హస్తకళల నిపుణుడు నరేన్, సుప్రసిద్ధ చిత్రకళాకారుడు భరత్, కరాటే బ్లాక్‌బెల్ట్ మాస్టర్ నితిన్‌లు చోటు చేసుకున్నారు.

అంతటితో ఊరుకో లేదు తను. వాళ్లకి తగ్గ కోడళ్లని కూడా ఎంచిపెట్టి, ఒకరికి మరొకరుతోడై, వారి వారి ఖ్యాతిని రెండింతలు చేసుకునేలా చేసింది.

ఈ ప్రయత్నాలలో అద్దంలో కనబడ్డ తెల్లవెంట్రుకలు చూసుకునే దాకా తనకి అయిదు పదులు దాటిపోయాయని కూడా తెలుసుకోలేదు. అరవింద్ తన ప్రయత్నాలు దేనికీ అడ్డు చెప్పక పోవడం, తన పట్టుదలా కలిసి తన కోరికలను ఇంచుమించు తీర్చాయి.

అయితే రెక్కలొచ్చిన పిట్టలు గూటిలో ఆగుతాయా? అమ్మతెచ్చే ఆహారం కోసం కాక, తమ గింజలను తామే వెతుక్కుంటూ ఎంత సుదీర్ఘప్రయాణాలనైనా చేస్తాయి. అమెరికాలో ధర్మేంద్ర, ఆస్ట్రేలియాలో అర్జున్, లండన్‌లో నరేన్, సింగపూర్‌లో భరత్,

ఆఫ్రికాలో నితిన్ వాళ్ళ వాళ్ళ భార్యల అభిరుచులనుబట్టి, వారి వారి కోర్కెలను బట్టి, వారి వారి పిల్లల భవిష్యత్తునుబట్టి గువ్వల్లా ఎగిరిపోయారు.

రెక్కలు ముక్కలు చేసుకుని చేస్తున్న ఉద్యోగం రెండున్నర దశాబ్దాల తరవాత ఇంక తగనని ప్రభుత్వం వాళ్లు రిటైర్‌మెంట్ ఇచ్చాక ఇంట్లో కూర్చున్నాడు అరవింద్.

అప్పుడనుకుంది తను పోనీ ఇప్పుడు తను సంగీతం నేర్చుకుంటే? సంగీతం కచ్చేరీల కోసమే కాదుకదా! ఆత్మానందం కోసం! అలాగే ఏకళ అయినా! ముందు ఏకళయినా కళాకారునిలో స్పందననీ, సంతృప్తినీ కలగజెయ్యాలి. ఆతరవాతే అది ఇతరులకి ఆనందాన్నిస్తుంది. అంతేకానీ ఎవరికోసమో, ఏదో చేస్తున్నాననుకునేవాళ్ళూ, లేదా తద్వారా ధనార్జన చెయ్యడానికి అదొక వృత్తిగా మాత్రమే స్వీకరించే వాళ్ళూ, సిసలైన కళాకారులు కారని తన ఉద్దేశం.'నవ్విపోదురుగాక నాకేటిసిగ్గ'ని దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి కవితలోలాగా.'ఎవరేమనుకుంటేనేమి? నా కోరిక తీర్చుకుంటాను' అని తననుకునే లోపలే, ధర్మేంద్ర వాళ్ళు ఇండియాకి రావడం పిల్లల్నొదిలి పెట్టి వాళ్ల ఇండియా పర్యటనల కెళ్ళడం, అర్జున్ భార్య కాన్పుకోసం ఇండియాకి రావడం, తల్లి అస్వస్థత వలన తనే పురుడు పొయ్యడం, ఇలా ఏదో ఒకటి అడ్డుతగులుతూనే వచ్చింది. చిన్నప్పటి ధైర్యం ఇప్పుడు లేదు. ఎప్పుడో ఒకప్పుడు అనుకున్నవి సాధించలేకపోతానా అన్న తియ్యని ఆశలూ కమ్మని కోర్కెలూ ఇప్పుడు లేవు! పెద్దపెద్ద ఉద్యోగాలు చేస్తున్న తమ్ముళ్లూ, చెల్లెళ్లూ తనకన్నా వాళ్లేదో ప్రతాపవంతులయ్యారని తనని చిన్నచూపుచూసినప్పుడు, తనేమిటో తనకుతానుగా గీసుకున్న కాన్వాస్‌చిత్రం, ఏకలవ్యునికి విద్యనేర్పినట్లు, తనలో ఎలా ఆశలుపోసి బతికించి, ఇంత దానిని చేసిందో చెప్పాలని అనిపించినా, వినే ఓపిక వాళ్లలో లేనప్పుడు అది కూడా వృధా ప్రయత్నమే ననిపించింది.

ఇప్పుడు తన మనోభావాలూ, తన ఆదర్శాలూ, తన అనుభవాలూ ఎవ్వరికీ అఖ్కర్లేదు. తనుకన్న పిల్లలకి కూడా! ఎంత శ్రద్ధతో ఎంత శ్రమకోర్చి తమని ఆయా విద్యల్లో ఆమె వాళ్ళని ప్రవీణులని చేసిందో కూడా వాళ్లకఖ్కరలేదు. ప్రతి చిన్న పనికీ అత్తింట్లో అందరూ తన మీద ఆధారపడ్డ వాళ్లకి ఈనాడు తన అవసరం లేదు.

అందరికీ కావలసింది ఒక్కటే! ఆమె ఇంకా అందరికీ చాకిరీ చేసి పెట్టాలి! అత్తింటికీ, పుట్టింటికీ నడుమ తనయిల్లు వెలియడంతో, ఆ రెండిళ్లూ ఆ హక్కును పోగొట్టుకున్నా, తనింట్లో వాళ్లకి మాత్రం ఆ హక్కు మిగిలింది. అయితే అది అయిదుముక్కలవ్వాలి.ఒక్కొక్కరికిఒక్కొక్కముక్కేమిగిలుతుంది.అంటేసంవత్సరంలోరెండు నెలల పదిరోజులు మాత్రమే! మిగిలిన తొమ్మిది నెలల ఇరవైరోజులూ తను వాళ్లకి ఏరకంగానూ ఉపయోగపడడం లేదని ఎవరికి వారికే కోపం! బాధ! దాంతో ఎవరికి వారే నిష్ఠూరాలాడడం! రిటైరయ్యాక కనీసం ఇంటి కాపలాకైనా పనికొస్తుందని అరవింద్‌ని కూడా కొందరు పిలవడం, దాంతో అరవింద్ అమెరికా వెళితే, తనుమరో కొడుకు దగ్గరకి ఆస్ట్రేలియాకి, అరవింద్ ఆఫ్రికా వెళితే తను సింగపూర్‌కీ, ఇలా తలా ఒక దగ్గరకి పంచుకోవడం జరుగుతోంది.

చూస్తూచూస్తూ డెభ్భయ్యోపడిలో పడింది తను. ఎనభయ్యోపడిలో పడ్డాడు అరవింద్! కాలంలో కూడా అనేక మార్పులు. మనవలకీ మనవరాళ్లకీ కూర్చుని కథలు చెప్పే అవసరం లేదు. వాళ్ళు రోజూ చూసే టి.వీల ద్వారా, ఆధునాతనమైన ప్రపంచం, నూతన నాగరికతవల్లా ఎన్నో విషయాలు వాళ్లకి తెలిసినవి తనకి తెలీవు. తనుచెప్పే రాముడూ రావణాసురుడి కథలు వాళ్లకి నచ్చవు. గవ్వలాటా, చింతపిక్కలాటా ఎవ్వరూ ఆడరు. అన్నీ కంప్యూటర్ గేమ్సే! ఎంత తేడా!

సడన్‌గా ఒంటరితనం! సహజంగా వయస్సుతో కలిగే భయం! తనకి అందరూ కావాలనిపిస్తుంది. అది సాధ్యం కానిపని. తను అందరికీ కావాలి! అదీ సాధ్యం కానిపనే! ఆలోచిస్తే మళ్లీ అదే అసంతృప్తి! అదే ఆందోళన! అవే తీరని కోరికలు! అయితే చిన్నతనంలో వాటిని ఆశలలో నింపొంచ్చు. అబద్ధాలలో దాచుకోవచ్చు. ఎదురు చూడొచ్చు. కానీ, ఇప్పుడో? ... మనసు ఒప్పుకోదు! గడచిన సంవత్సరాలలోని వాస్తవం ఊహాలను నమ్మదు! అందుకే నిర్లిప్తత! లేదా వైరాగ్యం!

ఉన్నట్టుండి మంచు కమ్ముకొచ్చింది! లండన్‌లో ఇదే గొడవ. పడితే టపటపవాన! వెంటనే వానవెలిసిపోయి ఎండలాంటి వెలుగూ ఆతరువాత ముసుగులాంటి మంచుతెర. ఇంగ్లీషువాళ్ళు 'ఫాగ్' అంటారు. తన ఆలోచనలకీ ముసుగు పడింది. కిటికీలోంచి చెట్లూ, చేమలూ ఏమీ కనబడడం లేదు. పచ్చనిలాన్ కూడా మంచుతో కప్పబడిపోయింది. కిటికీలోంచి చల్లనిగాలి తన్నుకొచ్చింది.

ఆలోచనలను నెట్టేసి వాస్తవంలో కొచ్చినతార తననేస్తమయిన కిటికీకి వీడ్కోలు చెప్పి తలుపులు మూసేసింది! హృదయంలోని కాన్వాస్‌కి కూడా మంచుముసుగు పడిందేమో, ఏబొమ్మా కనబడడంలేదు తారకి!

'తార'! తనపేరు తనకే గమ్మత్తుగా తోచింది. తార అంటే నక్షత్రం కదా! నక్షత్రాల మిణుకు తళుకులు ఇతరులకి ఆనందాన్నిస్తాయి కానీ, వాటికేం తెలుసు వాటి మెరుపూ, అందం? అలాగే తన ఆశలూ, కోరికలూ తన పిల్లలు పంచుకున్నారు. పెంచుకున్నారు! ప్రఖ్యాతి గడించారు. కానీ తను మాత్రం అలాగే తారలా వుండి పోయింది. ఆసంగతి ఎవరికి తెలుసు తనకి తప్ప. తన తల్లిదండ్రులు ముందే ఊహించారేమో ఈస్థితికి? అందుకేనేమో తనకి ఇతరులకు ఆనందాన్ని కలిగించే'తార' అని పేరుపెట్టారు అనుకుంది. తన ఊహ తనకే నవ్వు తెప్పించింది. పెదవులు పువ్వుల్లా విచ్చుకున్నాయి. కొత్త ఊహాలు గుండె నిండుకున్నాయి.

"ఆనవ్వే ఆశ"!

ఆనవ్వే జీవం!

ఆనవ్వే జీవితం!

ఇది అమలాపురమైనా అమెరికాఅయినా లండనయినా

హైదరాబాదయినా ఒకటే!

మనిషి ఆలోచనల ప్రతి రూపమే సంతోషం, దుఃఖం లేదా సంతృప్తి, చైతన్యం! ఆమని అంధాలు అనేక రూపాలు! ఒక్కొక్క కోణంలో ఒక్కొక్కలా కనిపిస్తుంది. అనుకుంది.

మనస్సు ఏదో భారం తగ్గినట్టు దూదిపింజల్లా ఎగిరిపోతోంది!

కిటికీ వైపు చూసింది!

అందమైన రంగు రంగుల పువ్వులు తనని పలకరిస్తున్నట్టనిపించింది. ఆకుపచ్చని గడ్డి, తనని ఆహ్వానిస్తున్న పచ్చని తివాసీలా అనిపించింది.

తుషార బిందువులు గడ్డిని గట్టిగా చుంబిస్తూన్నట్టనిపించింది.!

ప్రకృతి అందంలో ఎంత ఆకర్షణ!

ఎంత రమణీయత!

మనసు కొత్తకుంచె అందుకుంది. రకరకాల చిత్రాలు గీస్తోంది!

తారమనసు మహా హుషారుగా వుంది!

కొత్త ఆలోచనలు చైతన్యానికి నాంది!

కిటికీ పక్కనున్న పెద్ద నీలిరంగు పూలచెట్టు కనిపించింది.

దాని పక్కనే దాని వేరులోంచి పుట్టి పెరిగి విరగబూసిన అదే చెట్టు వుంది. దాని వేర్లలోంచి ఎన్నో మెలకలు! రోజూ చూస్తున్న చెట్లే అయినా, ఆరోజు ఆచెట్లు జీవితానికి భాష్యం చెప్పినట్టనిపించింది.

తనకి తెలీకుండానే మనస్సు పాటపాడింది. సంగీతంలో రాగం సంసారంలో అనురాగం ఎప్పటికప్పుడు శృతితప్పకుండా చూసుకోవాలి. ఎవరో జ్ఞానబోధ చేసినట్టయింది. తార వయస్సు కనీసం అయిదు పదులు వెనక్కెళ్ళుంటుంది. మనసు ఆనందంతో పరవళ్లు తొక్కుతూ, కొత్త చిత్రాలు గీస్తోంది! ఎన్నో ...! ఎన్నెన్నో ...!

# అందమైన అబద్ధం

వేదుల శకుంతల

ఆరోజు ఆఫీసులో కొత్తగా జాయిన్ అయింది ఆవిడ. చూడగానే 'అందంగా ఉంది సుమా' అనిపించింది. మంచి రంగు, కట్టు, బొట్టు, తీరు చక్కగా వున్నాయి. అన్నిటికన్నా ఆమె చిరునవ్వు మరీ బాగుంది. మొదటి చూపులోనే అందర్నీ ఆ చిరునవ్వుతో ఆకట్టుకుంది. చనువుగా పలకరించింది.

ఆమె పేరు సుహాసిని అని చెప్పినప్పుడు -

'పేరు చక్కగా అమిరింది' - అనుకోకుండా ఉండలేకపోయాను. వారం రోజుల్లో సుహాసిని ఆఫీసు స్టాఫ్ అందరితో బాగా కలిసి పోయింది అనే కంటే ఆఫీసు స్టాఫ్ అంతా సుహాసిని అంటే బాగా అభిమానం చూపిస్తున్నారంటే సమంజసంగా ఉంటుంది.

ఇంతకు ముందుండే టైపిస్టు మూర్తి బద్ధకస్తుడే గాక, తల బిరుసు మనిషి కూడాను. నేను టైపు చేయవలసిన కాగితాలు తీసుకుని అతని దగ్గరకు వెళ్లవలసి వచ్చేది. పైగా

"అర్జెంటు! త్వరగా చేసియిస్తారా?" అని కోరినా

"చెప్పారుగా! అక్కడ పెట్టి వెళ్లండి!

ఇలాంటి అర్జెంటులు చాలానే వుంటాయి. ఇది గవర్నమెంటు ఆఫీసని మర్చిపోతున్నారు. మేడమ్! ఇక్కడ పనిచేసే వారందరికీ "ఓటీ ఫర్ రోటీ, శాలరీ ఫర్ సేవింగ్" అన్న సూత్రం వుందిగా అంటూ ఖారా కిళ్లీ తినే గార పళ్లు ప్రదర్శిస్తూ ఇకిలించేవాడు.

అలాంటి మూర్తి మారి ఆ కార్నర్ సీటులోకి సుహాసిని రావటం, నా ఎదురుగా కనిపించేలాగ కూర్చోటం ఒక ఎత్తు! నేను కదలక్కర్లేకుండా కనుసైగతో తనే వచ్చి తీసుకుని వెళ్ళటం మరొక ఎత్తు, అంతకు మించి మరొక సంతోషం ఏమంటే ఏ రోజు చేయాల్సినవి ఆరోజే చేసి ఇచ్చేసేది, సుహాసిని!

పెండింగ్ అన్న మాటేలేదు. ప్రాణం ఎంత హాయిగా వుందో? నాకే కాదు. సెక్షన్‌లో అందరు అలాగే ఫీలయ్యారు. "సుహాసిని గారూ మీవి వేళ్ళా - కరెంట్ వైర్లా?" అనేవారు. చక్కని చిరునవ్వు విసిరేది.

రెండు నెలల్లో నా వర్క్‌లో చాలా మార్పు వచ్చింది.

సీటు మీద ఫైల్సు పేరుకోటం లేదు. ఆఫీసర్‌గారి మందలింపులు తగ్గాయి. పైగా నేను రాసి ఇచ్చిన దాంట్లో ఏవైనా తప్పులు దొర్లితే ఇంతకు ముందు మూర్తి యధాతథంగా కొట్టేసేవాడు. బాస్ చివాట్లకి ముఖం చాటు చేసుకోవలసి వచ్చేది. కాని ఇప్పుడు సుహాసిని. చిన్న చిన్న పొరపాట్లని తనే సరిదిద్ది 'మేడమ్ ఇక్కడ ఈ వర్డ్ కాదు ఇది రాయాలి'. అని చెప్తుంటే నా సీనియారిటీ ముందు ఆమె సిన్సియారిటీ నిలువెత్తున నిలబడినట్టుండేది!

మనసులో 'థాంక్స్' చెప్తూ పైకి మాత్రం 'తొందరలో అలా రాసినట్టున్నాను' అని తప్పించుకునేదాన్ని.

"సుహాసినీ! ఇంతకు ముందు మీరెక్కడ వర్క్ చేసేవారు" అని ఒక రోజు అడిగాను. ఆమె వ్యక్తిత్వ పరిపూర్ణతకి పునాది రాయి ఎక్కడుందా అన్న ఉత్సుకతతో!

"చెప్పనా? నిజానికి నేను జాబు చేయాల్సిన పనిలేదు. కానీ నాకు చేయాలని ఇష్టం! అందుకని ముందు ఒక టెంపరరీ వేకన్సీలో సరదాగా మూడు నెలలు చేసేను. అది ఒక ప్రైవేటు కంపెనీలెండి! తర్వాత ఊరికే కూర్చోలేక లేడీబాస్ దగ్గర పర్సనల్ సెక్రటరీగా ఒక సంవత్సరం పనిచేసాను."

"లేడీ బాసా?" నాకు ఆశ్చర్యం అనిపించింది.

"అదీ చెప్తా! ఆమె ఒక సినీ ఆర్టిస్టు. ఇంట్లో ఆమెదే పెత్తనం అందుకని ఆమె బాసే కదా? ఆమెకి కావల్సిన సలహాలు - సహాయం అన్నీ నేనే చేసేదాన్ని. అప్పుడప్పుడు ఆమె అలసిపోయి వస్తే ఇంటర్వ్యూ కోసం వచ్చిన వాళ్ళకి ఆమె తరపున నేనే అన్నీ చెప్పేదాన్ని. వంటింట్లో వంటల దగ్గర్నుంచీ ఇంటి ముందు పూతోట పెంపకం వరకు తాను స్వయంగా చేస్తున్నట్టు ఆమె మాటల్లో నేను వాళ్ళకి వివరణ ఇచ్చేదాన్ని! తరువాత ఆమె లేచాక రకరకాల భంగిమల్లో ఫోటోలు తీసుకుని వాళ్ళు వెళ్ళిపోయేవారు. అదంతా చేయటానికే ఆమె నాకు జీతం ఇచ్చేది.

భలే ఇంట్రెస్టింగ్ జాబండీ! ఇంతకీ ఎవరావిడ?

"నో! నో! మరి అంత పర్టిక్యులర్స్ అడగరాదు మేడమ్. అదీగాక ఆవిడ ఇప్పుడు ఇక్కడ లేరు బొంబాయి వెళ్ళిపోయింది." "సరేలెండి ఎవరైతే ఏమిటి మీరు మాత్రం తమాషాగా చేసేరు. ఇంకా ఏమేమి చేసేరు"

"ఎక్కడ వీలుంటే అక్కడ చేసేను. కొన్నాళ్ళు సెన్సెస్ డిపార్టుమెంట్‌లో, కొన్నాళ్ళు ప్రైమరీస్కూల్లో ఇదిగో ఇప్పుడు ఇక్కడ" అంటూ నవ్వింది సుహాసిని.

మరో రెండు రోజుల తర్వాత ఒక సందర్భంలో సుహాసిని మరింత ఎత్తుగా కనిపించింది. అది ఆ వారంలోనే జరగబోతున్న మా ఆఫీసర్‌గారి కొడుకు పెళ్ళి సందర్భంగా!

ఆఫీసు స్టాఫ్ అంతా కలసి ఏదైనా మంచి ప్రెజెంటేషన్ కొనాలా లేక మా సెక్షన్ లేడీస్ అంతా కలసి కొందామా అని చర్చించుకుంటున్నప్పుడు సుహాసినీ తన వంతు వందరూపాయలు ఇస్తానంది. అదిగో అప్పుడు నాకు సుహాసినిని తక్కువ అంచనా వేయకూడదేమో అనిపించింది. మేమంతా యాభైరూపాయలు వేయాలనుకున్నాం! మరి తను మా అంచనా కంటే ఎదిగిపోతోంది. ఇంకా మొదటి నెల జీతం తీసుకోలేదు!

ఏమైనా సుహాసిని నిజంగా సరదాగా ఉద్యోగం చేస్తున్నదే! అనుకుని అదృష్టవంతురాలు! జీతం కోసం కాక జీవితం కోసం వెంపర్లాడుతున్న మనిషిగా తలుచుకుని సంతోషించాను.

నెలాఖరు ఇంకా రెండు రోజులే వుంది.

హమ్మయ్య! నెల్లాళ్ళ కష్టానికి ఫలితం! అందరికీ ఫస్టుతారీఖునాటికి ఎన్నో ప్రణాళికలు పేరుకుంటాయి!

ముందు రోజు మధ్యాహ్నం, టైపు కాగితాలు టేబుల్‌మీద పెడుతూ 'విజయగారు ఓ చిన్న విన్నపం!' అంది సుహాసిని.

'ఏమిటి? మళ్ళీ తప్పులు వెతికి పట్టుకున్నారా?' అన్నాను కొంచం గిల్టీగా ఫీలవుతూ -

"అబ్బెబ్బే! అదికాదండీ - ఆఫీసు విషయం కాదు. ఆర్థికమైన అర్జీ!" అంది చిరునవ్వు చెరగకుండా.

"ఏమిటో అర్థమయేలా వుండాలిగదా అప్లికేషన్? వివరించండి" అన్నాను.

సుహాసిని నీళ్ళు నముల్తున్నట్టుగా సందేహిస్తూనే టూ హండ్రెడ్ రూపీస్ కావాలండీ! ఎల్లుండి శాలరీ రాగానే ఇస్తాను. సర్దుబాటు చేయగలరా?" అన్నది.

వెంటనే బ్యాగ్ తీసి చూసేను. "ఐ విల్ సీ వాట్ ఐ కెన్ డు! సీ మి ఆఫ్టర్ లంచ్ అవర్" అన్నాను.

లంచవర్‌లో నేను పై అంతస్తులో వున్న మా ఫ్రెండ్ దగ్గరకి వెళ్ళి ఓ వందరూపాయలు తీసుకుని నా దగ్గర వున్న నూరు రూపాయలు కలిపి మొత్తం రొఖ్ఖం సుహాసినికిచ్చాను. "మెనీ మెనీ థాంక్స్! అడిగేనని అనుకోవద్దు. చెప్పకుండా దాస్తున్నాననుకోవద్దు. అవసరాలంటేనే రహస్యం! రహస్యమంటేనే చెప్పక పోవటం"అంటూ రాగయుక్తంగా చెప్తుంటే అబ్బురంగా చూసేను.

"సుహాసిని గొంతు బాగుంది! సినిమా ట్యూన్స్ సందర్భానుసారంగా ఉపయోగించగలదన్నమాట! తమాషా మనిషి. పోనీలే అవసరానికి ఆదుకున్నాను. నాకు ఎంతో ఉపకారం చేస్తోంది!" అని తృప్తిగా ఫీలయ్యాను.

ఫస్టు తారీఖు నాకు ఇంట్లో తొందర పని ఉండి జీతం తీసుకోగానే ఇంటికి వచ్చేసేను. ఆ మర్నాడు ఆదివారం.

సోమవారం నేను ఆఫీసుకెళ్ళాను. ఆ రోజు సుహాసిని రాలేదు. ఇంత వరకు సుహాసిని ఆఫీసుకి రాకుండా లేదు. ఆ రోజు అందరం అన్‌ఈజీగా ఏమిటో వెలితిగా వుందనుకున్నాము.

వరుసగా నాల్గు రోజులు సుహాసిని రాలేదు. నా కాగితాలు పేరుకుపోతున్నాయి. బాస్ దగ్గర్నుంచి పిలుపు వచ్చింది.

ఏం చెప్పను? మా సెక్షన్ టైపిస్టు రాకపోతే ప్రక్కనున్న టైపిస్టు రాజు దగ్గరకి వెళ్ళి పని పూర్తి చేయించాలి. కానీ నాకు అది నచ్చదు. రాజు తన వర్క్ అంతా అయ్యాక చేస్తానంటాడు. చాలా నిక్కచ్చి మనిషి! అలా అని బాస్ దగ్గర ఎలా చెప్తాను? స్టాఫ్ అంతా కోపరేట్ చేసుకోపోతే ఎలా అని చీవాట్లు పెట్టాడు. నన్నే!

అందుకని - ఏం చెప్పాలా అనుకుంటూ వెళ్ళేను.

"చూడండి విజయగారూ? సుహాసిని రిజైన్ చేసేరు! మరొక టైపిస్టు రేపు వస్తారు. జాగ్రత్తగా టైపు చేయించండి. ఈ లోపులో అర్జెంటు కాగితాలు రాజుని చెయ్యమనండి" అన్నారు.

నాకు మొదటి మాట ఒకటే వినబడింది. మిగతావి వినిపించలేదు. వెంటనే మా సెక్షన్‌కి వచ్చి ఆ వార్త చెప్పేదాక నాకు బి.పి. తగ్గలేదు. 'ఇదేమిటి ఇలా చేసింది? అయ్యో! అదేమిటి?' అనుకుంటు ఆ పూట ఎవరూ ఏ పనీ చేయలేక పోయారు.

అంత వరకు బాగానే వుంది.

నా డబ్బు మాటో? అనవసరంగా మా ఫ్రెండ్‌ని అడిగి ఇచ్చానే?

ముందు ఆ వందా ఇచ్చేయాలి అనుకున్నాను.

మరొక గంటకి అటెండర్ యాదగిరి వచ్చాడు.

"మేడమ్! సుహాసినీ మానేసినాది? మీకేమైనా చెప్పిందా? నాకాడ వందరూపాయలు తీసుకున్నది. తనఖా రాంగనే ఇస్తానన్నది. ఇదేంది ఇట్ల చేసింది? గామె ఇల్లు కూడా ఎరకలేదు. మీకు తెల్సా?" అనడిగేడు.

ఏం చెప్పను? చెవుల్లో హోరు మొదలైంది!

సాయంత్రం బస్సు స్టాపులో నిల్చున్నప్పుడు మారిసెప్షనిష్టు ఉష చెప్పింది."సుహాసిని గారు రిజైన్ ఇచ్చారటగదా? నా దగ్గర ఆవిడ ముప్ఫైరూపాయలు తీసుకుంది. ఇవ్వడం మర్చిపోయింది. పోనీలెండి!"

"ఏం చెప్పను కళ్ళు తిరిగినట్లవుతుంటే ఉషనే పట్టుకుని నిలబడ్డాను. సుహాసినిని గురించి ఇంకా ఎందరు ఏం చెప్తారో వినే ఓపిక ఉంటుందా? అనుకున్నాను.

ఎవరి దగ్గర ఎంతెంత తీసుకుందో చెప్పుకుని అందరు విడివిడిగాను, మూకుమ్మడిగాను తిట్టుకుని సుహాసినిని కాస్త తెరచాటుకి తొయ్యటానికి వారం రోజులు పట్టింది. ఈ లోపులో కొత్త టైపిస్టు రావటం మామూలు రొటీన్‌లో పడిపోవటం జరిగింది.

ప్రతిరోజు ఆఫీసుకు వెళుతున్నా వస్తున్నా సుహాసిని చిరునవ్వు ఆ మనిషి ఆ మోసం.... నన్ను ప్రశాంతంగా ఉండనియ్యటం లేదు. బుర్రనిండా మర్రి తొర్రలా తొలిచేస్తున్నాయి ఆ జ్ఞాపకాలు!

ఆ తొర్రని పూడ్చటానికా అన్నట్టు ఓ రోజు బస్సు ఎక్కుతుండగా ముందు బస్సులో డ్రైవర్ వెనక నిల్చున్న సుహాసిని కనిపించింది! తక్కున ఈ బస్సు దిగిపోయేను.

తీరా దిగగానే ఆమె బస్సు కదిలింది. వెంటనే అక్కడున్న ఆటో ఎక్కి సనత్‌నగర్ పోనీయమన్నాడు.

ఏ బస్సు స్టాప్‌లో సుహాసిని దిగుతుందో గమనిస్తూ ఆమె దిగగానే ఆటో ఆపమన్నాను. వాడు నానా తిట్లు తిడ్తున్నా దారి పొడుగునా బస్సు వెనుక ఆపమన్నందుకు విసుక్కున్నా భరించి అదనంగా పది రూపాయలు సమర్పించుకుని మొత్తానికి సుహాసినిని వెంబడిస్తూ ఆమె దూరిన ఇల్లు సమీపించాను.

అరడజనుమంది కాపురాలున్న ఆ ఉమ్మడి వాటాల్లో ఓ పక్క చిన్న టిక్కీలాంటి గదీ. దానికి ఆనుకుని చిన్న వరండా ఉన్న వాటా ముందు నిలబడి తలుపు తట్టబోతూండగా వినిపించాయి. లోపల్నించి మాటలు సుహాసిని గొంతుతో.

"ఒరే! వాసు నేనింక బ్రతకలేనురా! మీ నాన్న పెద్ద ఆఫీసరైవుండి మరోదాన్ని కట్టుకుని ముగ్గురు పిల్లలతో నన్ను ఇలా వదిలేసి మనోవృత్తి కింద ఐదు వందలు ఇస్తే నల్గురు ఎలా బ్రతకాలి? ఎన్ని రకాల ఉద్యోగాలు చేసిఎంత మందిని వంచిస్తూ - ఎన్ని అవతారాలు ఎత్తనురా? ఎక్కడ పదిరూపాయలు ఎక్కువ దొరుకుతాయంటే అక్కడ ఆ ఉద్యోగం చేస్తున్నాను. కొన్నాళ్ళకి ఇళ్ళు మార్చేస్తున్నాం"! వాసూ నువ్వు కాలేజి మానేసేయ్ ఏదైనా పనిచెయ్యి! పరువు కోసం బురఖా వేసుకుని బ్రతకటం కష్టంరా! ఇంక ఈ నాటకం మానేసి స్టేజి దిగిపోదాం!"

అది సుహాసిని గొంతే! సన్నని జీర! దుఃఖం! ఆవేదన! అవమానం! అన్నీ నిండి ఉన్న అసహాయురాలి గొంతు!!

నీ బాధ నాకుతెలుసమ్మా! నిజాయితీకి విలువలేదమ్మా! ఒక్క సంవత్సరం ఓపిక పట్టమ్మా! నేను డిగ్రీ పూర్తి చేసి తప్పకుండా ఉద్యోగం సాధిస్తాను.

కొడుకు ఓదార్పు వినబడుతోంది!సత్యవాక్కులవి

నా చెయ్యి తలుపు మీద పడకుండా ఆగిపోయింది.

వెనుదిరిగి గేటువైపు మళ్ళీ వెనక్కి ఆ వాటా వైపు చూసేను.

ఆ చిన్ని వాటాలో ఓ అందమైన అబద్ధాల జీవితం ఒదిగి నుంచుని ఉన్నట్టు కనిపించింది! తలుపు తెరచి బట్ట బయలు చేయటానికి నా మనస్సు ఒప్పుకోలేదు.

అబద్ధమైనదైనా, అందమయిన సుహాసిని చిరునవ్వు అలాగే ఉండాలని కోరుకుని వెనక్కి తిరిగి వచ్చేశాను.

**(గీతాంజలి, నవంబర్, 1995)**

# సౌరంగం

తురగా జానకీరాణి

నన్ను సీతారాంపురానికి బదిలీ చేశారు. ఏ ఊరైతేనేం, వెళ్ళిపోవలసిందేగా ! ఆరేళ్ళ సర్వీసు నాకిప్పటికి ఈ డిపార్ట్‌మెంటులో కొండకానీ, వాగుకానీ, గుట్టకానీ భయపడలేదు. బస్సు దిగి మూడు కిలోమీటర్లు నడవాలన్నారు ఈ గ్రామానికి. ఫర్వాలేదు. ఉత్తమ సేవికగా బహుమతి కూడా తెచ్చుకున్నాను. ఇంటికి వెళ్ళి, నాకిల్లా ట్రాన్స్‌ఫర్ అయిందని చెప్పి, నాలుగు బట్టలు, బ్యాగు తీసుకుని బస్సు ఎక్కాను. రోడ్డు మీది ఆ బస్సు దిగి, బోర్డు పరిశీలించాను.'సీతారాంపురం' తెల్లబోర్డు మీద నల్ల అక్షరాలు. పంతులమ్మ అన్నట్లు నన్ను కొందరు చూశారు చిన్న హోటలు దగ్గర ఉన్నవాళ్ళు. పొద్దున్న పదిగంటల ఎండ వేడిగా మాడ్చేస్తోంది. గొడుగు వేసుకుని, సంచీ భుజాన తగిలించుకుని వేగమైన నడక సాగించాను. అర కిలోమీటరు వరకు నడిచాక వెనుక నుంచి చప్పట్లు వినిపించాయి. తిరిగి చూస్తే 'కచ్చరం' బండి మనిషి పిలుస్తున్నాడు. కాస్త ఆయాసం కూడా వచ్చిందేమో, నిలబడ్డాను. కచ్చరం వచ్చినా పక్కన ఆగింది. అందులోంచి ఒకావిడకు ముప్పై ఏళ్ళు ఉండవచ్చును - నన్ను పిలిచింది.

"సీతారాంపురం పోతున్నారా? రాండ్రి" అని అహ్వానించింది. చిన్న బండి కానీ, ఇద్దరు, ముగ్గురు బాగానే కూర్చోవచ్చును. ఎక్కాను. " నమస్తే అమ్మా! కొత్తగా బదిలీ అయి వస్తున్నా, మనూరి సేవికను. శారదాంబ నా పేరు" అని పరిచయం చేసుకున్నాను. ఆమె చిన్నగా నవ్వి, "అట్లనా! శారద అని చెప్పరాదూ?" అన్నది. నన్ను కాసేపు పరిశీలించాక "ఊర్లనే ఉంటవ, దినమూ పోయొస్తవ?" అన్నది మళ్ళీ.

"ఉంటా. పోయిరాను చేతకాదు" అన్నాను. అలా ప్రారంభమైంది సుగుణమ్మ గారితో నా పరిచయం. గది ఇచ్చారు. సుగుణమ్మ ఎనిమిది చదివింది. ఆమె భర్త రామారావు ఏనాడో ఇంటర్ పాసై విద్యావంతుడైన పెద్ద రైతుగా వ్యవసాయం

చేస్తున్నాడు. వారికి ఇద్దరు పిల్లలు. మంజుల తొమ్మిదో తరగతి, అబ్బాయి సురేష్ ఎనిమిదో తరగతి. ఇద్దరూ ఊరికి ఒక కిలోమీటరున్న జిల్లా పరిషత్తు స్కూలుకి పోయి వస్తున్నారు.

నేను ఆదివారంనాడు వెళ్ళి సామాను తెచ్చుకున్నాను. వంట మొదలు పెట్టుకుని నా గ్రామాల సంచారం పనిలో పడ్డాను. సుగుణమ్మగారు చనువుగానే ఉండేది కానీ, మరీ స్నేహంగా మసలేది కాదు. నా గది తలుపు వేసుకుని నేను ఉంటే, వచ్చి పిలవడంగానీ, ఇంట్లో వండినవి ఇవ్వడంగానీ చేసేది కాదు.

ఒక రోజు వాళ్ళ ఇంట్లో ఏదో గొడవైంది. నాకు అర్థం కాలేదు అది ఎందుకైందీ. కానీ, ఒక గంట తర్వాత బావి దగ్గర నీళ్ళు తోడుకుందామని వెళ్ళేటప్పటికి అక్కడ సురేష్ ఏడుస్తూ కనపడ్డాడు. నేను బక్కెట్టు వదిలేసి "ఏం సురేష్! ఏమైంది?" అని భుజం మీద చేయి వేశాను. ఆ అబ్బాయి చెంపలు వాచిపోయి ఉన్నాయి. ఎంతో బాధగా కళ్ళు తుడుచుకుని "ఏం లే" అన్నాడు. కానీ, ఏడుపు ఉబికి వస్తోంది. "నాతో చెప్పవా? నేను నీకు దోస్తును కదా" అన్నాను. వచ్చే ఏడుపు ఆపుకుంటూ, "అమ్మ కొట్టింది" అన్నాడు. నేను ఆశ్చర్యపోయాను.

"ఎందుకు?" అన్నాను. "స్కూలు దగ్గర దుకాణంలో 'చాయ్' తాగినానని కొట్టింది. నాతాన పైసలు లేకుండె. మనూరి పిల్లగాని దగ్గర తీస్కొని తాగిన" అన్నాడు. "పోని ఆమె వద్దంటే ఎందుకు తాగుతావు? ఇంటికి పోయినాక తాగితే ఏం పోయే?" అన్నాను. సురేష్ తల వంచుకున్నాడు. "ఇంట్ల నాకు చాయ్ ఇవ్వరు" అన్నాడు. "నేను ఇస్తాలేగానీ ఏడ్వకు" అని ఓదార్చాను.

హైస్కూలులో ఉన్న ఆ పిల్లవాడికి టీ ఇవ్వరు. డబ్బులు ఇవ్వరు. పతంగీ కొనాలన్నా సరే సరిపడే చిల్లర ఇచ్చి, మిగిలినవి లెక్కపెట్టి తీసుకుంటారు. చొక్కాలు చిన్నవైనాగానీ అవే కుట్లు విప్పి వేసుకోవాలి. ఆడపిల్ల మంజులకీ అంతే. స్కూల్లో అందరూ రకరకాల గాజులు, రిబ్బన్లు వేసుకొస్తారు. ఆమెకి మాత్రం ఉన్న గాజులు పగిలిపోతేనే కొత్తవి. నాకు ఈ పద్ధతి అసలు అర్థమయ్యేది కాదు. రెండు మూడు రోజులకొకసారైనా స్వతంత్రించి ఏదో చేసినందుకు మంజుల మీద కేకలు, సురేష్‌కి ప్రత్యక్షంగా దెబ్బలు. ఈ గోలంతా నాకు తెలుస్తూనే ఉండేది.

ఒకనాడు పనిగట్టుకుని పిల్లలు లేని సమయంలో సుగుణమ్మగారింట్లోకి వెళ్ళాను అద్దె ఇవ్వడానికి. ఎప్పుడైనా చేసిన మంచి ఫలహారం ఇవ్వడానికి మాత్రమే వెళ్ళేదాన్ని. అందువల్ల అంత చొరవగా వెళ్ళి కూర్చోడమూ తక్కువే. ఏవో కుశలప్రశ్నలైనాక -

"సుగుణమ్మగారూ! మీరు చదువుకున్నవారు. పిల్లలంటే ఎంతో ప్రేమ. చక్కగా అమ్మాయిని కూడా చదివిస్తున్నారు. కానీ, ఒక్కమాట అడిగితే మీకు కోపం రాదు కదా!" అన్నాను. ఆమె తల ఊపింది.

" పిల్లలకి కొంత వయస్సు వచ్చాక వాళ్ళని స్నేహితులలాగా చూడాలండీ. వాళ్ళకి చిన్న సరదాలుంటాయి. మీకు డబ్బున్నది కదా! వాళ్ళు అడిగినవి కొని ఇవ్వాలి. లేకపోతే వాళ్ళకి తోటి పిల్లల మధ్య చిన్నతనంగా ఉంటుంది" అన్నాను.

ఆమె కొంచెం ముఖం చిట్లించింది. "ఇప్పుడు నేను ఆళ్ళకి ఇయ్యనిదేంటి? మీతో చెప్పినా? ముప్పొద్దులా తింటున్రు. పండగ పండగకి బట్టలాయె! ఏం తక్కువైంది శారదమ్మా? నీకాడికి వచ్చి ఏడ్చిన్రా ఏంది?" అన్నది.

నాకు ఎదురుదెబ్బ తగిలినట్టైంది. ఎలా చెబుతాను? - టీ నీళ్ళు తాగినందుకు కొట్టారు. గాజులు అడిగినందుకు తిట్టారు అని ప్రశ్న వేస్తే ఆ పిల్లల మీద విరుచుకుపడుతుందేమో!

"అట్లా కాదమ్మా! మీ బిడ్డలకి మీరు ఇవ్వరని ఎట్లా అంటాగానీ, వాళ్ళు సంతోషంగా ఉండేందుకు నాలుగు పైసలు ఎక్కువ ఖర్చు పెట్టినాగానీ ఏం కాదు. నేను తప్పుమాట అంటే ఏమీ అనుకోకండి" అన్నాను. "బాగా సదివిందానవు. సర్కారు ఆఫీసరువి. నీవు తప్పు మాట ఎందుకంటవులేగానీ, పిల్లలను అదుపులో ఉంచాల. ఇయ్యాల కష్టపడితే, రేపు సుకపడతరు. తాతలనాడు మనోల్లు బాగాకూడబెడితే, ఇప్పటికీ ఈ బురుజు నిలిసింది. నాకంటె, ఆల్ల నాయన కంటె బాగా పిల్లలు సదవాల్ననే మేమూ ఆశపడుతున్నాం. ఎరికెనా?" అన్నదామె. నా నోటికి తాళం పడింది.

మరో ఏడాదికి మంజుల పది పాసైంది. ఆమెను ఇంటి దగ్గరే ఉంచి కుట్లూ అల్లికలూ నేర్పించారు. అందంగా, ఆకర్షణీయంగా తయారైంది ఆ పిల్ల. నేను నా హద్దుల్లో ఉంటూ, వారు చెప్పినదానికంటే మరో ఐదు రూపాయలు అద్దె ఎక్కువిస్తున్నందువల్లనో ఏమో గానీ - భార్యాభర్తలు నాతో మంచిగానే ఉండేవారు. మంజుల నా వాటాలోకి వచ్చి కాసేపు రేడియో వింటూ, వారపత్రికలూ అవీ చదువుతూ ఉండేది.

"మంజులా! మీ వాళ్ళు నిన్ను కాలేజీకి పంపిస్తారా?" అన్నాను. మొదట్లో కళ్ళు పెద్దవి చేసి 'కాలేజీయే?" అన్నది కానీ, ఆ తర్వాత తనూ ఆలోచించడం మొదలు పెట్టింది. ఒక రోజు శుభవార్త చెప్పనే చెప్పింది. సురేష్‌కి కూడా ఈ ఏడాది పది పూర్తి కాగానే ఇద్దర్నీ పట్నంలో పెట్టి చదివిస్తారుట. ఈ ఊరివాళ్ళు కొందరు అలా చదువుతున్నారు. నాకు చాలా సంతోషం అనిపించింది.

ఆ ఊరు వచ్చి మూడేళ్ళు దాటుతుండగా, నాకు మళ్ళీ ట్రాన్స్‌ఫర్ అయింది. నేను వెళ్ళిపోతున్నానంటే సుగుణమ్మ చాలా బాధపడింది. పిల్లలు నన్ను వదలలేక కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు. నా కిది మామూలే, ఆమె దగ్గర సెలవు తీసుకుంటూ- 'నేను మీతో ఏదైనా కాని మాట అని ఉంటే ఏమీ అనుకోవద్దు - ఒక మాట. వాళ్ళు కాలేజీకి వెళ్ళే పిల్లలు కదా! అవసరమైనవన్నీ ఇవ్వండి. చిన్నపిల్లలు కొత్త ఊళ్ళో ఇబ్బంది పడవద్దు కదా!' అన్నాను.

రామారావు నవ్వాడు. "ఏంది శారదమ్మా! మళ్ళ ఈపాలి నువ్వొచ్చేతలికి నా బిడ్డలు ఎట్ల ఉంటరోసూడు. ఈ ఊర్లనయితే ఎట్లైన నడిసిందిగానీ, పట్నంలో స్టయిలుగా ఉంచాల కద!" అన్నాడు. నేనూ నవ్వాను ఆ మాటల్లోని గర్వానికి.

నేను మరో ఊళ్ళో ఉంటూ ఒక రోజు పట్నం వెళ్ళాను ఆఫీసు పనిమీద. పొద్దున్న ఏదో కొంచెం తిని బయలుదేరానేమో ఆకలనిపించి, దగ్గర్లోని హోటలుకి

వెళ్ళాను. టిఫిను తింటోంటే 'మేడమ్!' అంటూ నా పక్కన వచ్చి నిలబడింది ఆ అమ్మాయి - మంజుల. ఆమె వేషం, గలగలా నవ్వు కొత్తగా ఉంది. వెనుకనే సురేష్ వచ్చాడు. ఎంతో ఆధునికంగా ప్యాంటు, లోపల షర్టు. చేతిలో విలాసంగా నల్ల కళ్ళజోడు. పక్కన ఇంకా ఇద్దరు అబ్బాయిలు. వాళ్ళు మునుపటి వారు కాదు. ఆ చిన్నపల్లెలోని సుగుణమ్మ పిల్లలేనా వీరు అనిపించింది.

గబగబా తినడం ముగించి, కాఫీ వద్దని చెప్పి, వాళ్ళతో కలసి బయటకు వచ్చాను. ఒక గది తీసుకుని హోటల్ కారియరు తెప్పించుకుని తింటున్నారుట.

"ఏంటి మేడమ్! అలా చూస్తున్నారు? ఇది వరకులాగ లేమా మేము?" అన్నది మంజుల. "ఔనుఅక్కా!కురచ లాగూ, చొక్కా వేసుకోలేదుగా నేను!" అన్నాడు సురేష్. నాకెందుకో సురేష్‌ని చూస్తే సంతోషం పొంగుకుని రాలేదు. తెలివిగా, చురుకుగా ఉన్న విద్యార్థి లక్షణం స్ఫుటంగా లేదు. మధ్య మధ్య సిగరెట్లు కాలుస్తూ, పౌడర్లు, క్రీములు బాగా పట్టిస్తూ, క్రాపు నలిగితే ప్రమాదం అన్నట్లుగా - విపరీతమైన నాగరికతలో ఉన్నాడు.

"మంజూ! డబ్బుకి ఏమీ ఇబ్బంది లేదు కదా!" అన్నాను 'మీ అమ్మ, నాన్న పిసినారితనం మర్చిపోయారా?' అని అడగడానికి బదులుగా.

"లేనే లేదు మేడం! వద్దంటే డబ్బు అన్నట్లుంది. మీరు ఊరు రండి. అమ్మ మిమ్మల్ని ఎప్పటికీ యాద్ చేస్తూనే ఉంటుంది" అన్నది మంజుల. మరి కాస్సేపు బయట నిలబడే మాట్లాడుకున్నాము. వేసవి సెలవుల్లో ఒక వారం సెలవు పెట్టి వచ్చేటట్లు మాట ఇచ్చాను. వారు ఒకవేపు, నేను మరోవేపు వెడుతోంటే, హోటల్లోంచి వచ్చిన మగపిల్లలు కలవడం చూశాను. నాకు వారు వెనక్కి తిరిగి మళ్ళీ చేయిఊపుతోంటే నేనొక విలేజి లెవెల్ వర్కరునే వారి దృష్టిలో అని చివుక్కుమనే ఆలోచన కలిగింది.

వేసవికాలంలో నాకు ఆఫీసులో ఏదో చికాకు వచ్చింది. అక్కడ ఉండ బుద్ధి కాలేదు. సుగుణమ్మ గారి ఊరు వెడితేనో అనుకున్నాను. అక్కడ బాగా ఉంటే నాలుగు రోజులు ఉందాం, లేకపోతే తిరుగు బస్సులో వద్దాం అని నిశ్చయించుకుని బయలుదేరాను.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు చేరుకున్నాను. సుగుణమ్మగారు ముందు సావిట్లోనే ఉంది. పలుకరించి మంచినీళ్ళు ఇచ్చింది. "ఏం శారదమ్మా! ఎక్కడికెల్లి వచ్చినారు?" అన్నది. నేను నా ప్రయాణాల గురించి చెప్పాను.

"మంజుల, సురేష్ లేరా?" అన్నాను. గదివేపు చూపించి " ఆమె ఉంది. సురేష్ నిన్నను పట్నం పోయిండు. ఇంకా రాలే" అన్నది.

వంట సావిట్లోకి వెడుతూ, "భోంచేద్దువు రా" అన్నది. కానీ, నేను ఆమెను అనుసరించి వెళ్ళకుండా రూము తలుపు తీసి లోపలకు వెళ్ళాను. మంజుల మంచం మీద పడుకుని ఏదో చదువుకుంటోంది. మంచం మీద ఉన్న పత్రికలు, మామూలుగా నాకు కంపరమెత్తించే బొమ్మలు, కథలతో నిండి ఉండే రకానివి. అల్లాంటివే నవలలు కూడా పడేసి ఉన్నాయి.

ఆమె లేచి కూర్చుంది. "శారదా మేడం! నేను పిలిసినానని వచ్చేసినారు!" అన్నది. మీ రిజల్ట్సు వచ్చాయిగా, ఇంక ఏం చేద్దామనుకుంటున్నావు?" అన్నాను. మంజుల తలవంచుకుంది. "పరీక్షలు పోయినాయి" అన్నది.

"ఎందుకు? ఎందుకెందుకు?" అన్నాను.

"పేపర్లు చాలా హార్డు. చాలామంది ఫెయిలైనారు" అన్నది. చాలామంది ఫెయిలయితే అది వాళ్ళ కర్మం - కానీ, మీరెందుకు చదువుకోలేదు అని గట్టిగా కేకలేయాలని నాకు అనిపించింది. "ఇద్దరూనా" అన్నాను. ఆమె తల ఊపింది.

"సురేష్ పట్నం ఎందుకెళ్ళాడు?" అన్నాను. ఏమో అన్నట్లు భుజాలెగరేసి, పెదవి కదిపింది. మంచం మీద పుస్తకాలన్నీ చేత్తో ఒకపక్కకు తోసి "మంజూ, ఇవన్నీ ఎందుకు చదువుతున్నావు?" అన్నాను. "బోర్ కొడుతోంటే ఏం చేయాల?" అన్నది. మరో ప్రశ్న నేను వేస్తే నీకెందుకు అని విసుక్కోవచ్చును.

భోజనం చేస్తూ అడిగాను, "సుగుణమ్మ గారూ! పిల్లలు ఇద్దరికీ పరీక్షలు ఎందుకు పోయినాయి?" అని.

ఆమె కళ్ళార్పకుండా, పెరట్లోని చెట్లవంక అర్థం లేనట్లు చూస్తోంది. "సదవనిదే ఎట్ల పాసైతరు? నువ్వు సెప్పినవు కదా పైసలు మస్తు ఇవ్వాలని ! ఇచ్చినం. అడిగిన బట్టలు, డ్రెస్సులు, ఫీజులు అన్నీ ఇచ్చినం. గడియారాలు, కళ్ళద్దాలు, బెల్టులు, బూట్లు, చిన్న రేడియో అన్నీ వాళ్ళ నాయన కొని పెట్టిండు. ఇరవై ఆరువేలు కర్సు అయినయి. ఇద్దరికీ సదువు మాత్రం రాలే!" అన్నది సుగుణమ్మ.

అది అమాయకంగా అంటున్న మాట కాదు. లోపల రగులుతోంటే పైకివచ్చిన సెగలు.

"మళ్ళీ ఇప్పుడు పరీక్షకు చదువుతారా?" అన్నాను నేను చాలా మెల్లిగా. నాకు ధైర్యం చాలడం లేదు. నువ్వే గద ఇమ్మన్నావు పైసలు అని నిలదీస్తోంది.

"ఇంక చదువు బంద్! మంజులకి పెళ్ళి చేస్తాం" అన్నది. భోజనం ముగించాక నాకింక నిజంగా వెళ్ళిపోవాలనిపిస్తోంది. "సురేష్‌ని చూసి పోదామనుకుంటున్నా సుగుణమ్మా!" అన్నాను.

"ఆయన వస్తేకదా. నువ్వు చూసేది!" అన్నది. నా గుండె గబగబ కొట్టుకుంది. అసలు ఏం జరిగిందో పగలబడి చెప్పదేం?

"రాక ఎక్కడికి పోతాడు? పట్నంలో ట్యూషన్ చదువుతున్నాడా" అన్నాను. అప్పుడు సుగుణమ్మ నా వంక చూసిన చూపు, నంగనాచిలా ఏమిటి అడుగుతున్నావు అనే ఈసడింపుగా ఉందా? - మా బతుకు నవ్వులపాలు చేసింది నువ్వేగా అని సాధిస్తున్నట్లుగా ఉందా?- అర్థం కాలేదు కానీ, నేను ఇరుకులో పడిపోతున్నాను.

"శారదమ్మా! సదువు లేకపోయినా, ఆ పిల్లగాడికింత బుద్ధయిన ఉంటుండె. ఇరవై ఆరువేలు కరుసు పెట్టి ఆయన, ఆమె ఎన్నో కొనుక్కున్నరు శారదమ్మా! సప్పుడు సేయక

మంజులకు పెండ్లిచేసి తోలిస్తున్నాం. సురేషు సంగతి..."అని పైకి చూపింది - ఆ పరమాత్మునికే ఎరుక అన్నట్లు.

రామారావుగారు వచ్చారు బయటనుంచి. "సురేష్ రాలే?" అని మొదట ప్రశ్న అడిగి, ఆ తరువాతనే నన్ను పలుకరించారు. నేను కూడా ఊరి విషయాలు ఏవో అడిగాను. వాళ్ళు చెప్పారు. మంజుల గదిలోంచి ఇవతలకు రాలేదు. నేనే ఆమె రుములోకి మళ్ళీ వెళ్ళాను. కిటికీ దగ్గర కాస్త వెలుతురు మినహా మిగతా అంతా చీకటిగానే ఉంది. లైటు వేశాను.

"నేను భోంచేస్తోంటే నువ్వొచ్చి నా పక్కన కూచుంటావనుకున్నాను, మంజులా!" అన్నాను.

"ఈ కథ పూర్తి చేసినాక వద్దామని - అప్పుడే అయిపోయిందా భోజనం" అన్నది. నేను మంచం మీద కూర్చున్నాను. నీకు పెళ్ళి చేస్తారుట కదా అని అడగాలని ఉంది. కానీ, ఆమె తాబేలు లాగ తల లోపలకు దాచుకుంటున్నట్లు ఉన్నది. తన విషయంగానీ, సురేష్ విషయంగానీ మాట్లాడ్డం కష్టంగా ఉంటుందేమో అనుకుని, అర్థంలేని మాటలు ఏవో ఆరంభించాను. చీరలు, డ్రెస్సులు, సినిమాల గురించి.

ఆ తర్వాత బయలుదేరి నేను ఊళ్ళోకి వెళ్ళాను. గుమ్మం వరకు వచ్చింది సుగుణమ్మ. "రాత్రి సీకట్లో పోమాకు శారదాంబా! పొద్దున్న పోదువు" అన్నది నాతో. అప్పటికి మంజుల కూడా కాస్త సర్దుకుంది. "శారదమ్మ ఐదు రోజులు ఉంటానని చెప్పింది. జాకెట్టు కత్తిరింపులు నేర్పాలి. స్వెట్టరు పూర్తి చేయాలి. ఆమె ఇయ్యాల ఏడ పోతది?" అన్నది. కులాసాగా నవ్వి బయటకు నడిచాను.

ఊళ్ళో నాకున్న మిత్రులతో మాట్లాడినప్పుడు అసలు సంగతి తెలిసింది. డబ్బు పుష్కలంగా అందుకున్న అక్క, తమ్ముడు పాడు అలవాట్లు చాలా నేర్చుకున్నారు. మంజుల ప్రేమలో పడింది. సురేష్ సిగరెట్లతో పాటు ఇతర మందులు కూడా అలవర్చుకున్నాడు. ఎంత డబ్బూ చాలలేదు. ఈ విషయాలు తల్లిదండ్రులు గ్రహించేసరికి ఆ పిల్లలిద్దరి చదువులు సర్వనాశనమైనాయి.

సురేష్ పూర్తిగా చేయిదాటిపోయాడు. రామారావు చాలా కోపదారి మనిషి. సుగుణమ్మ కూడా కరుకు మనిషే. ఆడపిల్ల అని గారాబం చేయక, మంజులని చావగొట్టి చెవులు మెలేసి తీసుకొచ్చారు. నాలుగు లక్షల కట్నం బేరమాడి, బొంబాయిలో ఉన్న దూరం చుట్టాలబ్బాయితో పెళ్ళి కుదురుస్తున్నారు. సురేష్ మొండిబారిపోయాడు. ఎక్కడి డబ్బూచాలడం లేదు.

ఇవన్నీ విని నా బుర్ర తిరిగి పోయింది. మనసులో భగభగమనే పశ్చాత్తాపం. స్వేచ్ఛ ఇస్తే పిల్లలు ఇలా పాడైపోతారా? డబ్బులు పంపడమే కానీ, వాళ్ళేం చేస్తున్నారో, ఎవరి సావాసంలో ఉన్నారో గమనించవద్దా పెద్దవాళ్ళు? పరిస్థితి మించిపోయేదాకా ఎందుకు ఊరుకున్నారు? ఇప్పుడైనా ఆ పిల్లవాడిని దారిలో పెట్టేందుకు సరైన పద్ధతి ఏమిటో ఎందుకు ఆలోచించడం లేదు?

ఎవరో టీ ఇవ్వబోతే కూడా వద్దని వచ్చేశాను. ఈ కబుర్లన్నీ నాకు చెప్పిన వాళ్ళు మంచి సినిమా కథలాగ వర్ణించి వర్ణించి మరీ చెప్పారు. వినగానే నాకు జ్వరమంత ఆవేశం కలిగింది.

కాళ్ళీడ్చుకుంటూ చీకటిపడే సమయానికి సుగుణమ్మ ఇంటికి చేరాను. దీపాలన్నీ వెలుగుతున్నాయి. ఎనిమిది వరకు పెరట్లో కోసిన పువ్వులు మాలలు కడుతూ మంజుల అడిగిన జాకెట్లు కత్తిరించి ఇచ్చాను.

నేను, మంజుల అన్నం తిని రూములోకి వెళ్ళాం. సుగుణమ్మ వాళ్లాయన వచ్చేవరకు ఉంటానంది. సురేష్ గురించి ఎవ్వరూ ఏమీ అనడం లేదు. పదకొండు వరకు కుట్టుపనులు జరుగుతూనే ఉన్నాయి. ఆ పనిలో పూర్తిగా మునిగి పోయింది మంజుల. కాబోయే పెళ్ళికొడుకు నీకిష్టమేనా అని అడగాలన్నా భయమే. నాకు ఎప్పటికీ నిద్రపట్టలేదు. ఎప్పటికో కాస్త కునుకు పట్టినట్లుంది. అంతే, కాస్సేపటికే మెలకువ వచ్చింది. రామారావు అరుస్తున్నాడు. సుగుణమ్మ అరుస్తోంది. పెద్ద బర్రెగొడ్డు అరిచిన శబ్దం కాదు-- అది... అది - సురేష్ ఏడుపు. నేను లేచాను. మంజుల లేచింది. కంగారుగా నాచేయి పట్టుకొని, "వద్దు - శారదా - వద్దు - తమ్ముడు" అన్నది. భయంతో ఆమె వణకుతోంది. సావిట్లోంచి అరుపులు ఇంకా ఎక్కువైనాయి. నేను ఆమెను వదిలించుకుని వెళ్ళాను.

సావిట్లో నేను చూసిన దృశ్యం - చొక్కాలేని సురేష్ - బెల్టుతో బాదుతున్న రామారావు. అతను ఏడుపు - ఇతను అరుపులు. సుగుణమ్మ అయినా పిల్లవాడిని కొట్టవద్దని భర్తకు అడ్డురావడం లేదు. ఆమే అరుస్తోంది. నేను కొత్త మనిషిని. పరాయిదాన్ని. సంసారం గుట్టు నాకళ్ళ ఎదుట పడిపోయింది. భ్రష్టమైపోయిన కొడుకు కథ నాకు తెలిసిపోయింది.

అయినా, వాళ్ళు ఆగలేదు. మరో దెబ్బ. మరో దెబ్బ ఛామ్మని వేస్తున్నాడు. వాతలు తేలుతున్నాయి. నేను రాక్షసినైనాను. వెళ్ళి ఆయన చేయి పట్టుకున్నాను. "ఏమిటండీ! ఏమిటి? ఆ అబ్బాయిని చంపేస్తారా?" అన్నాను.

రామారావు అలసిపోయి కూలబడ్డాడు. సుగుణమ్మ నా వంక చాలా అసహ్యంగా చూసింది. సురేష్ సొమ్మసిల్లిపోయాడు. దెబ్బలు తిన్నాడేగాని పారిపోవడం లేదు. కుర్చీనానుకుని నిలబడ్డాడు. కొట్టు ఇంకా కొట్టు, చంపేయి అన్నట్లుంది ఆ అబ్బాయి వైఖరి.

"చంపేస్తా. వీడు - వీడు - డబ్బులు ఎత్తుకుపోయాడు. డబ్బులు ఇమ్మన్నావుగా ఇచ్చాం. అవి వానికి ఏం సరిపోతయి? దొంగతనం సేసిండు. బంగారం ఎత్తుకపోయాడు. తాగి పట్నంలో పడిపోయిండు. సైకిలు, రేడియో, ఉంగరం, గడియారం అన్నీ అమ్ముకున్నాడు. అప్పులు చేస్తడు. సూదులు తీసుకుంటున్నడు. మందు తింటున్నడు. ఆడి దోస్తులందరికీ తినిబెడతడు. ఇసుంటోడు సస్తే ఏంది? నాకు కొడుకు లేడనుకొంట. స్కూల్ కాడ చాయ్ తాగిండని ఒక్క దెబ్బ ఏసినందుకు ఎంత కత సదివినవు? ఇప్పుడేం

సదువుతవో సదువు" అన్నది సుగుణమ్మ ఊడిపోయిన ఆమె సిగ, చెమటలు కారిపోతున్న ఒళ్ళు, చెరిగిపోతున్న బొట్టు కింత పెద్దవైపోయి ఆక్రోశాన్ని నిప్పులుగా కురుస్తున్న ఆమె కళ్ళు!

ఏం జవాబివ్వను? సురేష్ దగ్గరగా వెళ్ళాను. పొతుగైపోయినాడు. బలమైన ఆ ఒళ్ళు వంగిపోతోంది. "బాబూ" అని భుజం మీద చేయి వేశాను. నొప్పితో కదిలాడు. నావంక చూశాడు. హలో అన్నాడు.

పద, మందు రాస్తాను అనాలనుకున్నాను.

ఎన్నాళ్ళు రాస్తాను? నేనెవరినని ఆ తల్లి, తండ్రి ఇస్తున్న దండనని ఖండిస్తాము? ఏమీ చెప్పలేక, తడి బట్టతో అయినా అతని ఒళ్ళు తుడవలేక, మంజులైనా కదలనందుకు బాధ కూడా పడలేక చూస్తున్నాను.

ఇది కుటుంబ వ్యవహారం. నేను తలదూర్చి లాభం లేదు. అయినా, మనసొప్పక మంజుల చేయి పట్టుకున్నాను. "మందు రాసి. తడిబట్టతో తుడు" అన్నాను చాలా అస్పష్టంగా. గదిలోకి వెళ్ళి, నేలమీద గోడనానుకుని కూలబడ్డాను.

సురేష్ ఒక రోగి. ప్రేమతో, ఓర్పుతో దారిలోకి తీసుకురావాలని చెప్పాలి. ఇటువంటివారికి ఆస్పత్రులున్నాయనీ, అతను చెడ్డవాడు కాడు, బలహీనుడనీ వారికి అర్థమయ్యేట్లు చెప్పాలి. నా శక్తి చాలుతుందా? తెల్లవారగానే మరో ఊరు చక్కాపోయేదాన్ని నేను ఏం చేస్తాను? నేనెంత నా విజ్ఞానం ఎంత, నా ఆర్థికస్థితి ఏమిటి? పట్నవాసంలో నా పలుకుబడి ఏముంది? ఏదో చెయ్యవచ్చు అని తెలుసుగానీ - విషపురుగు కాటు రోజూ తింటున్న ఆ అబ్బాయిని రక్షించగలనా నేను?

గడియారం రెండు, మూడు గంటలు కొట్టింది. సావిట్లో ఏమీ అలికిడి లేదు. మంజుల వచ్చి మంచం మీద పడుకుని ఏడుస్తోంది.

మాగన్నుగా నిద్ర పట్టింది. గొడవ, గోల, అరుపులు, ఏడుపులు - లేచాను. సావిట్లో ఎవరో పరుగెడుతున్నారు. నేనూ అటే వెళ్ళాను బావి దగ్గర - బావి లోపల - నిచ్చెనలు, తాళ్ళు, సురేష్ పైకి వచ్చాడు.

అందరూ చెప్పేస్తున్నారు అసలు జరిగిందేమిటో. ఏదో మందు మింగాడు. మందుసీసా అక్కడే ఉంది. బావిలో దూకాడు. ఈత వచ్చినాగానీ ఈదలేదు. బతికేందుకు వీలున్నా గానీ బతకలేదు.

లోకంలో ఉండి ఏం చేయాలో తెలియక, ఎటుచూసినా మూసుకున్న సొరంగం చీకటిలో దిక్కుతడుముకోవడం రాక - బహుశా నా బోటి మనిషి అతనికి జరిగిన ఘోర అవమానాన్ని చూసినందుకు సహించలేక తనకు తోచిన మార్గంలో వెళ్ళిపోయాడు.

సుగుణమ్మ పిచ్చిది - ఇంకా పిచ్చిదైంది. 'నా కొడుకో! నా బిడ్డో!' అని ఏడుస్తోంది.

నా వృత్తి సంఘసేవ, కానీ, ఆమె నన్ను తిడుతుందని భయపడుతున్నాను.